*Great Learning opportunity....*

*Training on new generation*

# CAD/CAM/CAE Technologies - CATIA V5

## OBJECTIVE:

In this course you will learn state of the art, cutting edge leading technologies in CAD/CAE - CATIA V5. At the end of the course you will be in a great demand to start your career in automotive, Aerospace & other MNCs.

## PARTICIPANT PROFILE:

Engineering / Polytechnic students and professionals with Mechanical, Civil & Electrical backgrounds.

## COURSE CONTENTS:

1. CATIA Basics & Tools
2. Sketcher
3. Part Design basics & advanced (Solid)
4. Shape Design basics & advanced (Surface)
5. Generative & Interactive Drafting
6. Structural Design
7. Sheetmetal Design
8. Knowledgeware
9. FEM & Kinematic Analysis

## SALIENT FEATURES:

- Well-qualified experienced engineers trained by IBM Consultants.
- Visiting faculty from leading Auto & Aerospace Multi national companies.
- Latest workstations with Pentium 4, 256MB RAM, 32MB V RAM, 17" Color Monitor etc.
- Flexi lab timings.
- Exposure to live and practical projects.
- Placement Assistance.

Gama Solutions Inc. is a subsidiary of Guru Information Solutions USA, formed with an aim to provide world class services in CAD/PDM areas to both domestic and international customers.

*: For further details please contact :*

**GAMA SOLUTIONS INC.**

**Plot No – 9, Krishna Priya Apartments, Flat No. 201**
**Hare Krishna Road, TIRUPATHI.**

# శ్రీ సర్వోత్తమ జీవితము



మాదల వీరభద్రరావు

# శ్రీ సర్వోత్తమ జీవితము

కర్త
మాదల వీరభద్రరావు

ప్రకాశకులు
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము
విజయవాడ - 6
1965



వందేమాతర మనగనె
వచ్చితీరు యెవనిపేరు ?

వయోజనుల విద్యనగనె
వచ్చితీరు యెవనిపేరు ?

గ్రామ గ్రామమున వెలసెడి
గ్రంథాలయ మెవనికి గుడి ?

అరగని తరగని వాడవని
అక్షర దానం బెవనిది ?

అరవదేండ్లు ప్రజల కొరకు
అరిగిన కాయం బెవనిది ?

తన బరువును మోయలేని
తనువును చాలించెనెవడు ?

తరతరాలు యెవని మేలు
తరలుచు పొరలుచు నుండును ?

అందరి కెవనితో పొత్తు ?
అఖిలాంధ్రం బెవని సొత్తు ?

ఏ స్థాన కవిని నేనో
ఆస్థానాధీశు డెవడు ?

వయో వృద్ధుడగు యువకుడు
వాస్తవ జీవిత మతనిది

హరిసర్వోత్తము డాతడు
ఆంధ్రుల పాలిటి దేవుడు.

— కాళోజీ నారాయణరావు

ఈ గ్రంథ ముద్రణమునకై

అయాచితముగ అభిమానముతో

రు 2000/లు విరాళమిచ్చిన వదాన్యులు

ధార్మికరత్న

శ్రీ కారుమంచి వెంకటసుబ్బయ్య చౌదరి

# కృతజ్ఞత

ఈ పుస్తక రచనకు సమాచార సేకరణకై గ్రంథకర్త స్వయముగ కలుసుకొన్న వ్యక్తులు :—

మదరాసులో

శ్రీ కె. యస్. రామస్వామిశాస్త్రి, శ్రీ దర్శి చెంచయ్య, డాక్టరు శర్మ (ఛిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు ప్రిన్సిపాలు, మైలాపూర్), శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల పార్థసారధి, శ్రీమతి ద్వారకాబాయి పార్థసారధి.

విజయవాడలో

శ్రీ నీలంరాజు వెంకటశేషయ్య, శ్రీ పాతూరి నాగ భూషణం, శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య, శ్రీ దిగవల్లి వెంకట శివరావు, శ్రీ గూడూరి నమశ్శివాయ, డా॥ టి. వి. యస్. చలపతిరావు, ఎం. ఎల్. ఏ.

అమలాపురంలో

శ్రీ గుమ్మడిదల వెంకట సుబ్బారావు.

హైదరాబాదులో

డా॥ జి.వి. సీతాపతి, శ్రీ కందుల ఓబులరెడ్డి, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, ఎం. ఎల్. ఏ., శ్రీ కోదాటి నారాయణరావు, శ్రీ ఓ. నరసింహమూర్తి (మేనేజరు, తెలుగు భాషాసమితి), శ్రీ స్వామి నారాయణానంద, శ్రీ చెరుకువాడ వెంకట నరసింహం (తణుకు), శ్రీ ఆత్మ

కూరి గోవిందాచార్యులు, శ్రీ కోడి నరసింహం (నంద్యాల), ఆంధ్ర పితామహ డా॥ మాడపాటి హనుమంత రావు, శ్రీ కల్లూరు సుబ్బారావు (హిందూపురం), శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ (తిరుపతి), ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య.

గుంటూరులో

శ్రీ జి. వి. పున్నయ్యశాస్త్రి

నరసరావుపేటలో

శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు

చీరాలలో

శ్రీ పింగళి పరశురామయ్య

వేటపాలెంలో

శ్రీ హరి ఆదిశేషువు (గుంటూరు), శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు

జాబులు వ్రాసినవారు :

శ్రీ జానమద్ది హనుమంతరావు, కోడూరు, కడపజిల్లా

శ్రీ ఓగిరాల వెంకట సుబ్బారావు, రాజమండ్రి

శ్రీ సోమరాజుపల్లి చెంచయ్య (పాట), కందుకూరు, నెల్లూరుజిల్లా

శ్రీ బత్తుల వెంకట రామిరెడ్డి, బేతాపల్లి, అనంతపురంజిల్లా

వీరందరికీ గ్రంథకర్త మిగుల కృతజ్ఞుడు.

# ప్రకాశకుల విజ్ఞప్తి

మహాపురుషుల జీవితములు ఉత్తేజ పూరితములు. అందును దేశభక్తుల కథలు జాతి వికాసానికి దోహదకరములు. ఇరువదియవ శతాబ్దపు ఆంధ్ర మహా పురుషులలో ప్రముఖులును, ఉత్తమ దేశభక్తులును, బహుముఖ ప్రజ్ఞావంతులును, అర్థశతాబ్దికిపైగా తన జీవితమును ఏకధాటిగా దేశసేవలో గడపిన త్యాగశీలియు, గ్రంథాలయోద్యమము, వయోజన విద్యల వ్యాప్తికై ఎనలేని కృషిసల్పిన విజ్ఞానఖనియునగు గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి జీవిత చరిత్ర మన యువకులకు ప్రబోధకరముగ నుండుననను నిండు విశ్వాసముతో దీని ప్రచురణకు మేము పూనుకొన్నాము. మిత్రులు మాదల వీరభద్రరావుగారు మేము కోరినంతనే దీని రచన కంగీకరించి, యీ పనిని త్వరలోనే ముగించి మాకు సాయపడినారు. ముద్రణ విషయమై ఆలోచించుచుండగా తలవనితలంపుగా ఒకనాడు విజయవాడలోని శ్రీ వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయ సర్వసభ్యసభలో ధార్మికరత్న శ్రీ కాకుమంచి వెంకట సుబ్బయ్యచౌదరిగారిని కలియుట తటస్థించినది. అప్పటికొక నెల ముందే వారు మా సంఘమునకు రు 1000/- చెల్లించి సంఘ ప్రధాన పోషకులుగా చేరినారు. మా మాటలలో ఈ గ్రంథ ముద్రణ ప్రస్తావన వచ్చినది దీనికెంత యగునని వారు ప్రశ్నించిరి. సుమారు రెండువే లగునని నేను

చెప్పితిని ఒక్కక్షణమాలోచించి, "అయిన నేను రు 1000/-ల నిత్తును. మిగతా వెయ్యి యెవరి ద్వారానైన సంపాదించ వలసిన"దని చెప్పి మూడవ రోజునే పైకము స్వయముగా తెచ్చి యిచ్చిపోయిరి. తర్వాత కొలదికాలమునకు సంఘ స్వర్ణోత్సవముల ప్రారంభ సమావేశము సర్వోత్తమ భవనమున జరిగినది. ఈ సందర్భమున మేము మా దాతలను సన్మానించితిమి. అప్పుడు శ్రీ కారుమంచి వెంకటసుబ్బయ్య చౌదరి గారు, యీ పుస్తక ముద్రణకు కావలసిన తక్కిన పైకమునకు అంతవరకు మాకు మరొక దాత లభించని సంగతిని గ్రహించి, తామే దానినికూడ యిత్తుమని చెప్పి, ఈ మొత్తమును గూడ కొలది దినములలోనే మాకు చెల్లించిరి. ఇంతటితో వారూరుకొనలేదు దీని ఆవిష్కరణ కార్యక్రమమునకగు మొత్తం ఖర్చును తామే భరింతుమని నాటి సభలో ప్రకటించిరి. ఈ విధముగ దీని ప్రచురణలో మాకు ప్రధానముగ తోడుపడిన శ్రీ వెంకట సుబ్బయ్య చౌదరిగారి సాయము మా కెన్నటికిని మరువరానిది.

గ్రంథకర్తకు, దాతకు పిమ్మట మేము కృతజ్ఞత చెప్పుకోవలసినవారు మరికొంద రున్నారు. వీరిలో ముద్రాపకులగు సర్వోదయ ప్రెస్ వారు, దీనిలో చేర్చుట కుపయోగించిన ఫోటోలను కొన్నిటిని సరఫరా చేసిన శ్రీ సర్వోత్తమరావు గారి పుత్రిక శ్రీమతి నల్లాన్ చక్రవర్తుల పార్థసారధిగారి సతీమణి ద్వారకాబాయి, శ్రీ సర్వోత్తమరావుగారు పట్టభద్రులుగ నున్నప్పుడు తీసిన ఫోటోను సరఫరా చేసిన పశ్చిమ గోదావరి జిల్లా కుముదవల్లిలోని శ్రీ వీరేశలింగ కవి సమాజ

గ్రంథాలయమువారు, అట్టపై ముఖచిత్రమును తీర్చిదిద్దిన చిత్రకారులు శ్రీయుతులు సంజీవి, శంకర్‌లు బ్లాకులను తయారుచేసిన స్వతంత్ర ఎంటర్ ప్రైజెస్ (విజయవాడ)వారు ముఖ్యులు. ఇంకను పలురకములుగా దీని ప్రచురణ కార్యక్రమంలో తోడ్పడిన వారిని గ్రంథకర్త తమ తొలిపలుకులో పేర్కొని యున్నారు. పుస్తకం మొదట్లోని కృతజ్ఞత శీర్షిక క్రింద కూడ మరికొన్ని పేర్లున్నవి వారందరికి మేము మిగుల కృతజ్ఞులము.

ఈ గ్రంథం బాగా ప్రచారంలోకివచ్చి, హెచ్చుమంది నాకర్షించి ప్రజోపయోగం పొందిననాడు గ్రంథకర్త కృషి ఫలించగలదు. దాతకు సంతోషము, మాకు సంతృప్తి లభించ గలవు. ఈ పనులు జరుగుటకు సోదర గ్రంథాలయ సేవకులు గట్టిగ కృషిచేయగలరని ఆశించుచు వారికి కూడ ముందుగా మా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము.

పాతూరి నాగభూషణం,
కార్యదర్శి
ఆం. ప్ర. గ్రం. సంఘము

శ్రీ సర్వోత్తమ భవనము,
విజయవాడ .. 6. 25—7—'65

# పీ ఠి క

శ్రీ హరిసర్వోత్తమరావుగారిని, వారికి సన్నిహితంగా వుండే మేము "మాస్టరుగారు" అని పిలిచే అలవాటు. ఆ విధంగా పిలిస్తేగాని మాకు తృప్తి వుండేదికాదు. వారిని గురించి ప్రసంగించాలన్నా, వ్రాయాలన్నా మాస్టరుగారు అని సంబోధిస్తేతప్ప ముందుకుసాగటానికి మనస్కరించదు.

మాస్టరుగారిని, వారి ఆత్మకథ వ్రాయవలసిందిగా 1946 నుండి మిత్రులు శ్రీ పాతూరి నాగభూషణంగారూ, నేనూ ప్రాథేయపడుతూ వచ్చాము. మిత్రుడు శ్రీ కొమర్రాజు సత్యనారాయణరావును ఈపని నిమిత్తం వారి వెంట కొంతకాలం వుంచాముకూడా. అయినా ఆపని జరుగలేదు. 1954 ఆగష్టులో ఒకనాడు సర్వోత్తమ భవనంలో వుండగా నాగభూషణంగారు పట్టుబట్టి మాస్టరుగారి ఆత్మకథను సంబంధించిన జీవితపు తొలిరోజుల విషయాలు రెండు అధ్యాయాలు చెప్పించి స్వయంగా వ్రాశారు. అది అంతటితో ఆగిపోయింది. మాస్టరుగారు తర్వాత దివంగతులైన కారణంగా వారి స్వీయచరిత్రను ఆంధ్రలోకానికి సమర్పించుకోవలెననే ఆకాంక్ష మాలో తీరని కోరికగానే నిలిచిపోయింది.

వారు స్వర్గీయులైన తరువాత వారి జీవిత చరిత్రనైన లోకానికి అర్పించుకోవలెనని నాగభూషణంగారూ, నేనూ చాలా తహతహ పడ్డాము. వారి జీవితానికి సంబంధించిన కొంత భోగట్టాను నాగభూషణంగారు సేకరించారు. కాని ఆయనగాని నేనుగాని వారి జీవిత చరిత్రను వ్రాయటము వంటి బృహత్కార్యానికి పూనుకోలేక పోయినాము. అందుకు ఏకాగ్రత, శ్రద్ధ, పరిశీలనాశక్తి మొదలైన లక్షణాలూ, వానితోపాటు కొంత తీరికా అవసరం. జీవితపు ఉత్తర దశలో ఒక వృత్తిని ఆరంభించి దానిలో సతమతమవుతూవుండటంవల్లనూ, సహజంగాగల అతివ్యాప్తి, ఏకాగ్రతా రాహిత్యము మొదలైన కారణాలచేతనూ నేను ఈ మహాకృషికి అర్హతను

కోల్పోయినాననుకున్నాను. గ్రంథాలయోద్యమ కార్యక్రమంలో విశ్రాంతియే లేక పోవటంవల్ల నాగభూషణంగారున్నూ ఈపనికి పూనుకోలేక పోయి నారు. ఒకనాడు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘ సమావేశంలో ఈ ప్రస్తావన రాగా మిత్రులు శ్రీ మాదల వీరభద్రరావుగారు తమకై తామే మాస్టరు గారి జీవిత చరిత్రను వ్రాయటానికి తమ సంసిద్ధతను తెలియజేశారు. మాస్టరుగారి జీవిత చరిత్రను వ్రాయటానికి కావలసిన అన్ని అర్హతలు వీరభద్రరావుగారిలో పుష్కలమని గ్రహించి వారికి ఈ మహాకార్యాన్ని సంతోషంగా అప్పగించటం జరిగింది.

శ్రీ మాదల వీరభద్రరావుగారు దేశసేవకులుగానే కాక రచయితగా కూడా ఆంధ్రలోకానికి సుపరిచితులు. దేశాభ్యుదయకరమైన అనేక విషయాలపై ఎన్నో వ్యాసాలు వివిధ పత్రికలలో వ్రాశారు. వ్రాస్తున్నారు. అట్టి వీరభద్రరావుగారు తమకై తాము ఈ పనికి పూనుకొనుట మాకెంతో హర్షాన్ని, విశ్వాసాన్ని కలిగించింది. బాధ్యతను స్వీకరించిన అనతికాలం లోనే వారీ పనిని చక్కగా నిర్వహించారు. వీరభద్రరావుగారూ, వారితో పాటు మేమూ ఆంధ్ర లోకానికి మాస్టరుగారి జీవిత చరిత్రను సమర్పించ గలిగినందులకు ఎంతో సంతోషిస్తున్నాము ఒక విధంగా ధన్యులమైనామను కుంటున్నాము.

ఇక రచనను గురించి ఏదైనా చెప్పటం కేవలం లాంఛనప్రాయం. శ్రీ వీరభద్రరావుగారు ఈ బాధ్యతను స్వీకరించేనాడు ఎలా వున్నారో చెప్పలేనుగాని బాధ్యతను నెరవేర్చిన నాటినుండీ మాస్టరుగారికి మా అందరి కన్నా ఎక్కువ భక్తులైనారు. మాస్టరుగారిపేరు చెప్పితేనే చాలు వీరభద్ర రావుగారు ఆవేశంతో, భక్తితో పులకాంకితులౌతారు. అంతటి సహానుభూతి మాస్టరుగారి జీవితంతో వారికి కలిగింది. కాగా భక్తి ఆవేశాలు, వినమ్రతా వీరి రచనలో తొణికిస లాడుతూ పుస్తకాన్ని ఆమూలాగ్రంగా చదవవలెననే కాంక్షను చదువ మొదలుపెట్టగానే రేకెత్తిస్తున్నవి. సాహిత్య వేత్తలు ఏమంటారో కాని నావంటి సామాన్యుని దృష్టిలో ఈ గ్రంథము ఎంతో రసవంతమైనది. పుస్తకం చదువుతూవుంటే అడుగడుగునా మాస్టరు

గారి జీవితాన్ని వ్రాయటంలో వీరభద్రరావుగారు కృతార్థులైనారని నా దృఢ విశ్వాసము.

అసలు మాస్టరుగారి జీవితమే, ఏ మాత్రం తెలిసినవారినైనా వారి పట్ల భక్తి పరవశులను చేస్తుంది. ఆయన 60 సంవత్సరాలకు పైగా ఒక తాత్త్విక చింతననూ, దాని అనుష్ఠానాన్నీ పరిణతిపొందించుకొని పరిపక్వము గావించుకొన్నారు. దానికి నిష్కామకర్మ అనిగాని, అనాసక్తి యోగమని గాని పేరు పెట్టితే పెట్టవచ్చును కాని దాని నిర్వచనము ఆయన జీవితానికి సమగ్రమైన భాష్యం కాజాలదేమోనని నా సందేహము. గీతాతత్వాన్ని జీర్ణించుకొని నరనరాలలో ఎక్కించుకొని అది బోధించిన లక్షణానికి ఆయన లక్ష్యమైనారు. ఆయన తన మాటలలో "కలిమియు లేమియు కష్టము సుఖమును నిలుకడనొందక కలుగును అడగును. ఇవి ఎల్లను జడభవ మగు గుణములు, వీనిని సమతను వీక్షింపంగల జీవికి నిజమగు విరగతి అమరున్" అని వ్రాశారు గీతాతత్వాన్ని గురించి.

మాస్టరుగారు తమ జీవితంలో ఈ గీతోపదేశాన్ని అక్షరాలా ఆచరించారు. కలిమికై వీరు తాపత్రయ పడలేదు. లేమికి అణుమాత్రం విచారించనూలేదు. దేశానికి సేవజేస్తామని చిరుతప్రాయంలోనే మాస్టరుగారూ, మరి ఇద్దరు వారి మిత్రులూ శపథం చేశారు రక్తాక్షరాలతో. దేశసేవకులను సృష్టించడానికి అధ్యాపక వృత్తిని ఎన్నుకున్నారు మాస్టరుగారు. ఉత్తమశ్రేణి దేశారాధక బృందాన్ని సిద్ధపరచే అధ్యాపకున కుండవలసిన పరిజ్ఞానాన్నంతా ఎంతో శ్రమపడి అలవరచుకున్నారు, చివరకు ఎల్. టి. చదవడానికి బోధనాభ్యసన కళాశాలకు రాజమహేంద్రివరం వచ్చారు. అంతవరకు తిన్నగా నడిచిన మాస్టరుగారి జీవితం అక్కడ మలుపు తిరిగింది. అది మొదలు తుదిక్షణంవరకు ఆ జీవితం ఎన్ని మలుపులు తిరిగిందో చెప్పలేము. అయినప్పటికీ ప్రతిజ్ఞాపాలనమువట్ల ఏమరుపాటు ఎన్నడూ వారికి కలుగలేదు. వారనుకున్నట్టు ఒక విద్యాలయాన్ని ఫర్గూసన్ కళాశాలవలె నెలకొల్పలేక పోయియుండవచ్చును. కాని ఆయన జీవితమే వాస్తవమగు ఒక విశ్వవిద్యాలయము. అంతేకాదు. పొట్టబోసుకొనుటకు పటభద్రులను సృష్టించు యూనివర్సిటీలవలెగాక మహదాశయ పూరితు

లైన దేశారాధకులను అగణితమైన సంఖ్యలో సృష్టించింది వారి జీవిత విద్యాలయం. ఎంతమంది ఈ సజీవ విశ్వవిద్యాలయంలో సుస్నాతకు లైనారో చెప్పలేము. వారి నిరంతర పరిశోధన ఏ ఒక రంగంలోనో పరిమితం కాలేదు. మానవ జీవితాన్ని సమగ్ర దృష్టితో పరిశీలించిన మాస్టరుగారి జీవితము ఏ రంగాన్నీ పరిశోధించక వదలలేదు. వారి జీవితపు ప్రతి అంశంలోనూ వారి అధ్యాపక చిత్తవృత్తి సూక్ష్మంగా చూస్తే గోచరిస్తుంది. ఆయన బహిరంగ సభలో ఉపన్యసిస్తుంటే ఒక పెద్ద క్లాసుకు పాఠం చెప్పుతున్నట్టుండేది. వయోజన విద్యా మహాసభలలో బ్లాకు బోర్డులు పెట్టి ఉపన్యాసం చెప్పటం నే నెరుగుదును. క్లాసులో విద్యార్థుల వలె కార్యకర్తలను ప్రశ్నలువేసి పరీక్ష చేసేవారు. సింగరేణి కాలరీస్‌లో జరిగిన 25 వ ఆంధ్రదేశ గ్రంధాలయ మహాసభ సందర్భంలో ఒకనాడు కార్యకర్తలము కొంతమందిమి వారి చుట్టూ కూర్చున్నాము. మాస్టరుగారు ఒక ప్రశ్నవేశారు కార్యకర్తలను వావిళ్ళవారి భారతం సైజు పుస్తకాన్ని 500 పుటలుగల దానిని విషయాన్ని అర్థం చేసుకొని వర్గీకరణ చేయవలె నంటే యెంత సేపట్లో చదువుతా రన్నారు ఒకరు వారం రోజులని, ఒకరు ఐదు రోజులని, ఒకరు పదిరోజులని తలా ఒకరీతిగా చెప్పినారు. నావంతు వచ్చింది. "నాకు నెమ్మదిగా చదివే అలవాటు. అందుకని 50 నిమిషాలు పడుతుంది. నాకంటే త్వరితంగా చదివేవాళ్ళకు 40 లేక 45 నిమిషాలు చాలును" అన్నాను. అప్పుడు చెప్పారు గ్రంధాలయంలో పనిచేసిన కార్యకర్తకు, చేయనివారికి తేడా ఇదియేనని. ఈ విధమైన అధ్యాపక చిత్తవృత్తి వారిలో వుండటం కారణంగానే ఎన్నో శిక్షణ తరగతులను నిర్వహించినారు. ఎన్నిరకాల శిక్షణ శిబిరాలకు కులపతియైనారో చెప్పలేము. వారు పుస్తకాలు వ్రాసినా, పత్రికలలో వ్యాసాలు వ్రాసినా ప్రజలకు విజ్ఞానవికాసాలను కలిగించాలనే తీవ్రకాంక్ష వారిలో ద్యోతకమవుతూ వుండేది. వోటర్లకు వోటువిలువ తెలియజెప్పి యెటువంటి ప్రలోభానికీ, వ్యామోహానికీ గురికాకుండా చిత్తశుద్ధితో వోటుచేసేటట్లు ప్రచారం చేశారు వారి ఎన్నికల ప్రచారం ప్రజాసామాన్యానికి రాజకీయ విద్యాలయం వంటిది ఏ పార్టీకి వోటువేస్తారనేది వారికి ప్రధానంకాదు, కాని చిత్తశుద్ధితో తమ

విశ్వాసాని కనుగుణ్యంగా ఓటు వేశాడా లేదా అనేదే వారికి ప్రధానం. అందుకనే వోటును గురించి వారెంతయో ప్రచార ప్రబోధాలు చేశారు. దేశానికి యజమానులైన ప్రజలు అజ్ఞానాంధకారంలో మగ్గుతున్నాళ్ల దేశానికి ఉజ్జ్వల యశస్సు కలుగదని వారి వయోజనవిద్యా ప్రచార సందర్భంలో పదేపదేచెప్పేవారు. ఇంతటి ఆదర్శప్రాయమైన ప్రజాస్వామ్యతకు వారి అధ్యాపక వృత్తితోడై "పసిడికిని తావియబ్బినభాతి" అయినది. ఈ అధ్యాపక చిత్తవృత్తియే వారిని పదవీ వ్యామోహానికీ, దానికి సంబంధించిన రాజకీయాలకూ గురికాకుండా చేసిందేమో ? 1937 వ సంవత్సరంలో కూడా ఆయన కాంగ్రెసులో ఏదో ఒక పదవిలో వున్నట్టే ఈ చరిత్ర చదివితే తెలుస్తుంది. కాంగ్రెస్ రాజ్యాన్ని చేపట్టినందుకు హర్షిస్తూ గేయాన్ని వ్రాశారు. కాంగ్రెసు సంస్థ ఇచ్చిన ప్రతి కార్యక్రమాన్ని వారు చిత్త శుద్ధితో నెరవేర్చారు. కాంగ్రెస్ నాయకత్వంతో ఏ సమస్యపట్లనైనా అభిప్రాయ భేదంవస్తే తమ అభిప్రాయాన్ని ఖచ్చితంగా నాయకులకు తెలిపేవారు. ఆ తరువాత భేదాభిప్రాయంగల కార్యక్రమాన్ని వదలి మిగతా కార్యక్రమాన్ని నెరవేర్చేవారు. క్రమశిక్షణ నిమిత్తం హైకమాండుఆజ్ఞను పాటించవలసి వచ్చినప్పుడు ఇష్టం లేకపోయినా అక్షరాలా పాటించేవారు. ఇదియే ఆయన జీవితంలో మనకు కనిపించే సత్యం. ఒకానొక చోట ఇలా సెలవిచ్చారు: "దేశభక్తుడు ఎంతటి వాడైనను ఒక ధర్మమును అనుసరించక తప్పదు. తాను నాయకత్వమును వహించుటకు వీలులేనప్పుడు తన శాయశక్తులా నాయకత్వం వహించిన వారికి తోడ్పడుట పురోగమనానికి అత్యవసరం." ఇది మాస్టరుగారి నిగ్రహశక్తి ! పురోగామిక దృక్పథం. ఎంతమంది నాయకులున్నారు మాస్టరుగారి లాంటివారు ? ఆంధ్ర నాయకులలో సహజమైన ఈర్ష్యాసూయలకు, గర్భశైత్యానికి విపరీతంగా గురియైనవారు మాస్టరుగారే అని చెప్పవచ్చు. ఎట్టి పదవికీ తాపత్రియపడక కేవలం సేవాభావంతో జీవితాన్ని గడపిన స్వర్గీయ ఉన్నవ లక్ష్మీనారాయణ, చెరుకువాడ వెంకట నరసింహం పంతులు గార్లవంటి దేశ సేవకులున్నా, లేకపోలేదు ఆంధ్రలోకంలో. కాని మాస్టరు గారివలె ప్రజలు ఎన్నుకుంటామన్నా, ప్రతిపక్షాలు వద్దవలేకపోయినా పార్టీ టిక్కెట్లు ఇవ్వకుండా, విధి

లేక పార్టీ టిక్కెట్టు ఇచ్చినా - ఏదిగన్న పార్టీనుండి ఇవ్వకుండా ఆంధ్ర రాజకీయ నాయకత్వం అనాడు వారిని పరీక్షచేసింది. అయినా పరీక్షలో బ్రహ్మాండంగా ఉత్తీర్ణత గడించారు మాస్టరుగారు. ఇంత చేసినా ఏ పదవికీ వారిని వరించకపోయినా కాంగ్రెసును వారు వీడనలేదు. పైగా శక్తి వంచనలేకుండా ప్రచారం చేశారు ప్రతి క్షణంలోను. అయితే కాంగ్రెసు పేరుతో ప్రజాస్వామ్య వ్యతిరేకచర్యలు జరిగినప్పుడు వారు వాటిని తీవ్రంగా విమర్శించక వదలలేదు. ఆ విమర్శ కూడా సంస్థ మంచికై చేసే నిర్మాణాత్మక విమర్శమాత్రమే. మాస్టరుగారి స్వభావం చాలా విచిత్రమైనది. తాను విశ్వసించినదానిపట్ల వారు ఎంతగట్టిగా నిలిచేవారో తమది తప్పని తెలియవచ్చినప్పుడు అంత త్వరగా పశ్చాత్తాపపడేవారు. ఇలాంటి సన్నివేశాలు అయిదారు జరుగుట స్వీయానుభవము.

ప్రజలలో విద్యావికాసాలు కలిగించాలనే తీవ్రమయిన వారి ఆకాంక్షకు, అధ్యాపక చిత్తవృత్తికి, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమూ, వయోజన విద్యాఉద్యమమూ బంగారమునకు వెలిగారమువలె సరిపోయినవి. అందుకనే 25 సంవత్సరాలకు పైగా అవిచ్ఛిన్నంగా ఈఉద్యమాలకు వారు నాయకత్వం వహించారు. వారు ఈ భూమిని విడిచి వెళ్ళేవరకు ఉద్యమాలు వారిని వీడలేదు. ఇంతటి దీర్ఘకాలం వారు నాయకత్వం వహించిన ఉద్యమమునాని, వారి నాయకత్వాన్ని అంగీకరించి అనుసరించిన సార్వజనిక సేవారంగంగాని మరొకటిలేదు. వారు దశలవారీగా పరిణతి పొందింపచేసుకుంటూ వచ్చిన తాత్త్వికచింతన, అనుష్ఠానము ఈ ఉద్యమరంగంలో పరిపక్వమైనవి. మాస్టరుగారిపట్ల భక్తిగలవారందరూ, వారి ఆత్మకు సదా శాంతికలుగవలెనని ఆకాంక్షించే వారందరూ గ్రంథాలయోద్యమాన్ని ప్రవర్ధమానంగా చేయడమే ధ్యేయంగా పెట్టుకోవలె. వయోజన విద్యద్వారా, దేశపు యజమానులగు ప్రజలు అంధకారంలో ఉండకుండా వారికి విజ్ఞాన వికాసాలు కలుగజేయడానికి ప్రయత్నించవలె.

ఎందుకు వీరందరి జీవిత చరిత్రలు ? అనేవారున్నా లేకపోలేదు. పరిస్థితులు, విలువలు మారినప్పుడు ఒక వ్యక్తిని అతడెంత గొప్పవాడైనా ప్రజలు మరచిపోవడం సహజం. ఆ పరిస్థితులు, ఆ విలువలు లేనప్పుడు

ఆ పరిస్థితులలో పెరిగి పెద్దవాడై గొప్పవా డనిపించుకొన్నా, మారిన పరిస్థితులలో అతని జీవితంవల్ల ఏమి నేర్చుకోగలుగుతారు ప్రజలు అనేది ఒక తర్కం. లోతుగా ఆలోచిస్తే ఈ వాదం పునాదిలేని గోడ అనిపిస్తుంది. పరిస్థితులు, విలువలు నిరంతరం మారుతూ వున్నప్పటికీ, చిరకాలం వరకు అనుసరణీయమైన అనేక గుణపాఠాలు మహా పురుషుల జీవితాలను పరిశీలిస్తే మనకు లభ్యంకాగలవు. అయితే అట్టి మహనీయుల గంభీరజీవన సాగరంలో మునిగి ఆ మణులను వెదికి తీయవలెను. పైగా పరిస్థితులకు విలువలకు మదింపు వేయడం వ్యక్తిగతమైన బుద్ధిబలంపైన, ఆలోచనా మార్గంపైన మాత్రమే ఆధారపడి వుంటుంది. యెంతో తీవ్రబుద్ధిగల మనీషులు వేసిన మదింపులే, ఉజ్జాయింపులే తల్లక్రిందులై తప్పులు తడకగా ఋజువు కావడం చూస్తున్నాము. ఇక సామాన్య మానవుడి సంగతి చెప్పవలెనా? ఏ జాతి తన చరిత్రను తనలో జనించిన మహాపురుషుల జీవితాలను విస్మరిస్తుందో ఆ జాతికి ఉజ్జ్వలమైన వర్తమానంగాని, భవిష్యత్తుగాని లేదని చెప్పవచ్చును. అందుకనే ఒకజాతిని జాగృత మొనర్చదలచిన ఆ జాతి పూర్వ యశస్సును, ఆ జాతిలో జన్మించిన మహాపురుషుల గుణగణాలను స్తుతించడం జరుగుతుంది.

19 వ శతాబ్దం తుదిపాదమునుండి భారత దేశమంతటితోపాటు ఆంధ్రదేశంలో కూడా పునరుజ్జీవనోద్యమం ప్రారంభమయింది. 20 వ శతాబ్దపు మధ్య భాగంవరకు దాదాపు ఒక శతాబ్దం భారతదేశపు చరిత్రలోను, ఆంధ్రుల జాతీయ జీవనంలోను, ఉజ్జ్వల ఘట్టమని చెప్పవచ్చును. ఈ కాలంలో అనేకమంది మహనీయులు జన్మించారు, దేశానికై, జాతికై అనేక విధాల జీవితాలను ధారవోశారు. రాజకీయ స్వాతంత్ర్యానికే కాకుండా సమాజాభివృద్ధికి అనేక విధములుగా పాటుపడ్డారు. అనేక అవరోధాలను ఎదుర్కొన్నారు. కష్టాలలో ఈది గట్టెక్కారు. గంభీరమైన వీరి జీవితాలలో సాంఘికంగానూ, వ్యక్తిగతంగానూ నేర్చుకోవలసిన గుణపాఠాలు ఎన్నోవున్నవి. అయితే దురదృష్టవశాత్తు అనేకమంది మహనీయుల చరిత్రలు ఇప్పటికప్పుడే మనకు లభ్యంకాకుండా పోయినవి. పోల్చిచూస్తే ఎంతటి జాతీయ సంపదయైనా దీనికి తక్కువే. కొండా వెంకటప్పయ్య

పంతులు, ప్రకాశం, పట్టాభి, హరిసర్వోత్తమరావు సాంబమూర్తి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణగార్లవంటి ప్రజాసామాన్య మంతటికీ తెలిసిన రాజకీయ నాయకుల చరిత్రలుకూడా భావితరాలవారికి తెలియక పోవచ్చును. ఒక రాజకీయరంగం మాత్రేకాదు. సాంఘిక, సాహిత్యాది రంగాలలోకూడా ఇంతే. వ్రేళ్ళపై లెక్కపెట్టతగినన్ని ఆత్మకథలుకూడా తెలుగులోలేవు. సమగ్రమైన జీవిత చరిత్రల పరిస్థితి కూడా అంతే. ఈ పరిస్థితులలో భావితరపు యువకులకు తమ జాతిపట్లను, జాతీయ మహాపురుషులపట్లను అభిమానం వుండమంటే ఎట్లా వుంటుంది? విప్లవానంతరం సోవియట్ రష్యాలో తెగనాడిన "పీటర్ ది గ్రేట్" వంటి వానిని రెండవ ప్రపంచయుద్ధం నాటికి పొగడవలసి వచ్చింది రష్యనులను కర్తవ్యోన్ముఖులను చేయుటకు. ఏ దౌష్ట్యము నెరుగని త్యాగధనులైన మన మహాపురుషుల జీవితములను ఇప్పటికి దొరికినంతమట్టుకైనా సంపాదింపచేసి ప్రకటింపజేయటం ప్రజలకూ, ప్రభుత్వానికీ విధి అని మనవి చేస్తున్నాను. అట్లే ఆంధ్ర దేశంలోని అనేక సముద్యమాల చరిత్రకూడా తయారు చేయించి ప్రచురించవలసి యున్నది.

ఒకానొక సన్నివేశం ఒక వ్యక్తి జీవితాన్ని, ఒకజాతి మనుగడనే సంపూర్ణంగా మార్చివేయగల శక్తివంతమై వుంటుంది. హరిశ్చంద్ర నాటకము, దాది చెప్పిన రామనామ మహాత్మ్యము తల్లికిజేసిన ప్రతిజ్ఞ మొదలైన చిన్నచిన్న ఘట్టాలే గాంధీజీని మహాత్ముని జేసినవి. ఆఫ్రికాలో భారతీయులకు జరిగే అవమానము, దేశ సేవకు ప్రతిఫలంగా ఆయనకు జరిగిన శాస్తి, భారతీయులకు గాంధీ మహాత్ముని నాయకత్వాన్ని లభింపజేసినవి. ఇట్టి సన్నివేశాలు మహనీయుల జీవితాలలో అనేకాలు మనకు దొరుకగలవు. వారి జీవిత విధానాలు అనేక విధాలుగా యువకులకు గుణపాఠాలు కాగలవు. దీనివలన స్ఫూర్తిని పొందిన యువకులు, సుశిక్షితులైన దేశారాధకులుగా తయారవుతారు. స్వాతంత్ర్య సమరములోవలె సర్వస్వాన్ని వదలి వేయవలసిన ఆవశ్యకత నేడు లేకపోవచ్చును. కాని తానున్న స్థానంలో చిత్తశుద్ధితో, దేశాభివృద్ధికై ప్రతి యువకుడు పాటుపడవలసిన అవసరం ఇప్పుడుకూడా వున్నది, ముందునూ వుండగలదు. ఈ విష

యాన్ని ప్రభుత్వము, ప్రజలు ముఖ్యంగా విద్యాశాఖ, విద్యా సంస్థలు జాగ్రత్తగా గమనించటం అవసరం.

మహాపురుషుల సాంగత్యమూ, శుశ్రూషా, వారిబోధనలూ, హెచ్చరికలూ జాతిజీవనంపైన ఎంతో ప్రభావాన్ని కలిగించగలవు. స్వీయానుభవంలో తారసిల్లిన సన్నివేశాలను ఉదాహరణగా ఒకటి రెండింటిని పేర్కొంటాను. నేను దీర్ఘకాలం ఖమ్మంమెట్టులో సేవచేసిన తరువాత కొన్ని కారణాలవల్ల ఆ పట్టణాన్ని వదలివేయవలసి వచ్చింది. అక్కడ నిర్మించిన అనేక కార్య ప్రణాళికలు ఒక దారికి రాకుండానే వదలివేసి వచ్చినందుకు వాటిని గురించిన బెంగ నన్ను చాలా బాధించేది. అదిగమనించియే అన్నారో లేక యాదృచ్ఛికంగా చెప్పారో తెలియదుగాని [illegible] మాస్టరుగారన్నారు : "తాను కష్టపడి చెమటోడ్చి నిర్మించిన సౌధము బీటలువారి పగిలి పటాపంచలై పడిపోతున్నప్పుడు చూచి పకపక నవ్వగలిగినవాడే నిజమైన ప్రజాసేవకుడు" అని వారు సెలవిచ్చిన ఈ వాక్యము నాకు ఎంతో ఊరట కలుగజేసింది. అంతే కాదు, జీవిత దృక్పథాన్నే మార్చివేసింది. ఒకానొకసారి హైద్రాబాదు స్టేటు కాంగ్రెసుకు కార్యదర్శి పదవికై అన్ని అభిప్రాయాలవారు నన్ను ఎన్నుకోవటం జరిగింది. అయితే నా అర్హత సరిపోదని నేననుకొని స్వర్గీయులైన శ్రీ బాడపాటి రామచంద్రరావుగారిని ఒప్పించి అందరిచేత వారిని ఏకగ్రీవంగా అంగీకరింపజేశాను. ఇది జరిగిన ఒకటి రెండు రోజులకు మాస్టరుగారు హైదరాబాదు వచ్చారు. "నీవు భగవదాదేశాన్ని పాటించలేదని నా యభిప్రాయము. అయాచితంగా అందరూ నిన్ను కావాలన్నప్పుడు ఆ పదవిని అంగీకరించి అందుకు తగిన అర్హతను, లేకుంటే సంపాదించుకోవలసి యుండెను. అట్లు గాక దానిని నిరాకరించి మరొకరికి ఆ పనిని అంటగట్టుటవలన నీవు కోరిన శ్రేయస్సు చేకూరుతుందనుకోను; అది నిజమైన త్యాగము కాజాలదు, అది నీలో నున్న ఒకవిధమైన పిరికితనము" అన్నాడు. ఇది నా జీవితంలో ఎంతో సత్య మనిపించింది. అట్లే పట్టాభిగారు ఒకసారి సెలవిచ్చారు "ఏ ఉద్యమంలో నీవు పనిజేసినా చేయిజాచి ఎవరిని అడుగబోకు. సంస్థనుండిగాని, వ్యక్తులనుండిగాని చిల్లిగవ్వ పుచ్చుకోకుండా నీ సంపాదన మార్గాన్ని వేరే చూచుకో.

దైన్యంతో చేయిజాచితివా కొండంత తపస్సును గుడ్డి గవ్వకు కొనివేస్తారు. ఒక్కొక్కసారి ఆ గవ్వను చేతి కివ్వకుండానే చూపించే కొనివేస్తారు. జాగ్రత !" ఈ హెచ్చరిక నాకు చిర స్మరణీయంగా వుంటుంది, ఇట్టి అనేక నీతిరత్నాలు పెద్దల శుశ్రూషవల్ల నావంటి పిన్నవా రనేకమంది నేర్చుకొన్నారు. కాలక్రమంగా ఆ నాయకులు, ఆ నాయకులలోని మహా లక్షణాలు నానాటికి స్మృతిపథాలను వీడటం సహజం. ఇప్పటికి లభ్యమైనంతమట్టుకన్నా వివిధ ఉద్యమాల చరిత్రలను, వివిధ ఉద్యమాలద్వారా సేవచేసిన మహనీయుల జీవితచరిత్రలను సేకరించటం మంచిది. ఇప్పటికింకను మన మధ్యనున్న వివిధ రంగాలలోని పూర్వతరపు మహానాయకుల చేత స్వీయ చరిత్రలుగాని, జ్ఞాపికలుగాని వ్రాయించవలసిన అవశ్యకత వున్నది. ఇందుకు ఏదైనా ఒకసంస్థ ఏర్పడి ప్రభుత్వపు తోడ్పాటును పొందవచ్చును.

ఈ పీఠికను ముగించటానికి ముందు ఒక కఠోర సత్యమును ఆంధ్ర మహాజనుల దృష్టికి తేవటం ఉచిత మనుకుంటున్నాను. తమ దేశానికీ, జాతికీ, భాషకూ నిరంతరం సేవచేసినవారిపట్ల ఆంధ్ర లోకం ముఖ్యంగా నాయకులు తమ కృతజ్ఞతా ధర్మాన్ని నిర్వర్తించలేదు. ఆంధ్రప్రదేశ్‌కు నూతనంగా విధానమండలి ఏర్పడినప్పుడు అధికార పదవిలో నున్న ఒక నాయకుని దృష్టికి మాస్టరుగారిని, స్వర్గీయ ఉన్నవ లక్ష్మీనారాయణగారిని నామినేటు చేయవలసిందిగా తేగా, ఆయన "లోకం వారిని మరిచిపోయింది. తిరిగి వారిని జ్ఞాపకంచేయకండి" అన్నారు. ఈ నాటికిన్నీ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు అలంకారం కాగల మహనీయు లెంతోమంది వున్నారు. కాని వారిని చూచేదెవరు? నేడు శాసనసభకు, పార్లమెంటుకు, పార్టీ టిక్కెట్‌కు గిటురాయిగా ఎన్నివేల డబ్బు ఖర్చుపెడతారు? అని చూడడం జరుగుతున్నది. డబ్బుకై అధికారం, అధికారానికై డబ్బు విషవలయంగా ఏర్పడ్డప్పుడు ఎంతమంది కామరాజులైనా ఏమిచేయగలరు? జబ్బుకు, మందుకు సంబంధంలేని వైద్యం ఇది. ఈ విషవలయంనుండి ముందుతరంవారినైనా తప్పించి క్రమపంథాన పెట్టగల మహోద్యమం ఏదైనా వస్తేనే దేశానికి నిజమైన ప్రజాస్వామ్యం లభిస్తుంది. లేకుంటే మన ప్రజాస్వామ్యం, మనం

చెప్పే ధర్మపన్నాలు "మేడిపండు చూడ మేలిమైయుండును" అన్నట్లే వుండగలవు. ఈ పరిస్థితులే ఏదో యొక నియంతృత్వ పరిపాలనకు దారి తీసినా ఆశ్చర్యపడవలసిందిలేదు.

ఈ చరిత్ర రచనను గురించి ఒక మాట. వీరభద్రరావుగారు మాష్టరుగారి జీవితాన్ని ఉద్యమాల వారీగా వ్రాశారు. నిజానికి ప్రజాసేవయే జీవిత సర్వస్వంగా ఎన్నుకొన్న మాష్టరుగారి జీవితంలో ప్రజాసేవకన్న చెప్పవలసిం దేముంటుంది కనుక! వివిధ ఉద్యమాల ద్వారా మాష్టరుగారు జేసిన సేవనూ, వివిధ ఉద్యమాలలో వారు నిర్వహించిన పాత్రనూ, వివిధ ఉద్యమాలలో ప్రతిబింబిస్తున్న వారి వ్యక్తిత్వాన్నీ చక్కగా ప్రస్ఫుటం చేశారు రచయిత. సాధ్యమైనన్నిచోట్ల – ముఖ్యంగా వివాదగ్రస్తాలు కాదగినచోట్ల మాష్టరుగారి నోటనే పలికిస్తే సరిపోతుందని వారి మాటలనే ఉదహరించారు. ఈ పద్ధతిని అవలంబించటంవల్ల వీరభద్రరావుగారు మాష్టరుగారి అభిప్రాయాలను అధికార పూర్వకంగా వెల్లడించిన వారైనారు.

సాహిత్య రంగంలో మాష్టరుగారి వ్యక్తిత్వాన్ని ఈ రచన సరిగా వ్యక్తం చేయజాలలేదనే అభిప్రాయానికి ఆస్కారం లేకపోలేదు. అయితే లభించిన భోగట్టా ఆధారంగా చేయదగినంతా చేశారు గ్రంథకర్త. ఇంకా యేమైనా భోగట్టా లభిస్తే ఆ లోపాన్ని పూరించటానికి రచయిత, ప్రకాశకులు సర్వదా సంసిద్ధులు. అయినా నా దృష్టిలో ఈ లోపం పూరించటానికి ఇతోధికంగా హరిసర్వోత్తమరావుగారిని అర్థం చేసుకోటానికీ వారి అముద్రిత రచనలను, రేడియో ప్రసంగాలను ప్రకటించవలసి యుంటుంది. వాటిని ఎడిట్ చేసి ప్రకటిస్తే గొప్ప సారస్వత సేవ అవుతుందనటానికి సందేహంలేదు.

"రామాయణం వ్రాసి రాముని చిరంజీవిగాచేసి తాను చిరంజీవి యైనారు వాల్మీకి. అట్లే వేదవ్యాసుడు తన మహాకావ్యములోని పాత్రలను శాశ్వతముచేసి తాను శాశ్వత యశస్సు నార్జించాడు" అని ఎక్కడో చది విన జ్ఞాపకమున్నది. సర్వోత్తముని చరిత్రనువ్రాసి భావితరాల వారి హృదయాలలో ఆయనకు స్థిరమైన స్థానాన్ని కలుగచేశారు మిత్రులు వీరభద్రరావుగారు. మాష్టరుగారి జీవిత చరిత్ర రచించిన కారణంగా వీరభద్రరావు

గారున్నూ చిరకాలం ప్రజాహృదయాలలో మెలుగుతూ వుండవలెనని నా ఆకాంక్ష.

రచయితతోపాటు రచనకు ప్రత్యక్షంగా, పరోక్షంగా సహాయపడ్డ అనేక మంది పెద్దలకు మా సంఘ పక్షాన సమోవాకాలు. సర్వోత్తముని చరిత్ర ప్రచురణకు అయాచితంగా రెండు వేల రూపాయలు విరాళంగా నిచ్చిన దానవీరులు శ్రీ కారుమంచి వెంకట సుబ్బయ్యాచౌదరిగారికి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు. ఆంధ్రలోకం మా ఈ ఉద్యమానికి హృదయపూర్వకమైన ప్రోత్సాహం ఇవ్వగలదనీ, త్వరలోనే మరొక ముద్రణ చేయించవలసిన అవసరం రాగలదనీ ఆశిస్తున్నాము. ఇందులో పెట్టవలసిన మెరుగులు, చేయవలసిన కూర్పులు, మార్పులు తెలుపవలసినదిగా పాఠకలోకాన్ని అర్థిస్తున్నాము. అట్టి సూచనలను పరిశీలించి వీలైనంత మట్టుకు రాబోవు ముద్రణలో అనుసరింప ప్రయత్నించగలమని రచయిత పక్షాన, గ్రంథాలయ సంఘం పక్షాన విన్నవించుకొంటున్నాము.

ఇట్లు,

కోదాటి నారాయణరావు

అధ్యక్షుడు

ఆం. ప్ర. గ్రంథాలయ సంఘము

వినయకుటీరము

చిక్కడపల్లి

హైదరాబాదు

# తొలిపలుకు

1958 లో హరిసర్వోత్తమరావుగారి లాంటి ఆంధ్ర నాయకుల అనుభవాలను వ్రాద్దామనే తలంపు నాకు కలిగింది. "ఇంటర్వ్యూ" కోసం మద్రాసు వ్రాశాను. శ్రీ హరిసర్వోత్తమరావు రావుగారికి అప్పటికే సుస్తీచేసినట్లు తెలిసింది. తర్వాత కొంత కాలానికి వారు దివంగతులైనారు.

1963 లో ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ సమావేశం జరుగుతుండగా, నేనీ విషయం ప్రస్తావించాను. అప్పటికే ఈ సత్ప్రయత్నంలో నున్న అధ్యక్ష కార్యదర్శులు ప్రేమ పూర్వకంగా నా కోర్కెను అంగీకరించారు. "శ్రీ సర్వోత్తమ చరిత్ర"ను వ్రాసే బాధ్యత నా కప్పగించారు. ఒక పక్షం రోజులు సంఘము కార్యాలయంలోనే వుండి రావుగారు భద్రపరచిన సారస్వత సంపుటిను, వారి రచనలను పరిశీలించాను. మహాసముద్రములో ఈదుతున్నట్లనిపించింది. మద్రాసు వెళ్ళి రావుగారి కుమార్తె శ్రీమతి ద్వారకాబాయి, అల్లుడు పార్థసారధిగార్లతో మాట్లాడి కుటుంబ విశేషాలు తెలుసుకొన్నాను. మద్రాసు, విజయవాడ, హైదరాబాద్ పట్టణాలలో పలువురు ప్రముఖులను కలుసుకొని చర్చించి, కొంత విషయసేకరణ చేశాను. పత్రికా ప్రకటనపై వచ్చిన సమాధానాలు ఐదుమాత్రమే. ఇవన్నీ ఈ చరిత్ర రచన కుపకరించినవి. వారందరికీ హృదయపూర్వక ధన్యవాదా లర్పిస్తున్నాను.

ఈ కారణాన్ని పురస్కరించుకొని, శ్రీయులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, గిడుగు సీతాపతి, కోలవెన్ను రామకోటేశ్వర

రావు, చెరుకువాడ నరసింహం, ఆత్మకూరి గోవిందాచార్యులు డాక్టరు వి. యస్. శర్మ (మదరాసు) గార్లను కలుసుకొన్నప్పుడు, నేడున్న రాజకీయ, సామాజిక, సాంస్కృతిక పరిస్థితులనుగూర్చి వా రెంతగా వ్యధపడుతున్నారో మా సంభాషణల్లో అర్థంచేసుకోగలిగాను. వాటి పరిష్కారమార్గాలు సైతం, ఎట్టి ఒడుదుడుకులువచ్చినా లెక్కచేయక ఉన్నతపథా న్నధిరోహించిన రావుగారి జీవితగమనంలో కనుపించినవి. ఆయన నాకళ్ళయెదుట సాక్షాత్కరించినట్లుగానే గోచరించింది. రావుగారి రచనలు చదువుతున్నకొలదీ, వారియెడల నాకు గల గౌరవభావం, గురుత్వం క్రమేణా పెరుగుతూ వచ్చినవి.

హరిసర్వోత్తమరావుగారి జీవితం బహుముఖమైనది. రాజకీయ, సాహిత్యాది ఏఒక్క రంగానికో పరిమితమైనదికాదు. అందుకని రావుగారిపట్ల భిన్న దృక్పథాలుగలవారుండటంసహజం. తమతమ దృక్పథాలకు అనుగుణంగా అభిప్రాయాలను చెప్పినవా రున్నారు. ఐతే నేను ఈ రచనలో ప్రధానంగా రావుగారు వ్రాసిన వ్యాసాలు, దినచర్య నోట్సులు, జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలు, ఇచ్చిన ఉపన్యాసాలు, రేడియో ప్రసంగాలనే ప్రామాణికంగా తీసుకొన్నాను. అవి చదివినకొలదీ వివిధ సమస్యలపై వారి దృక్పథం క్రమేణా స్పష్టపడుతూవచ్చింది. బహుశా రావుగారిది దగ్గరి మిత్రులతోగూడా అన్ని విషయాలు చర్చించుకొనే మనస్తత్వం కాకపోవచ్చు. దీనివల్ల సన్నిహితులుగూడా వారిపట్ల భిన్నదృక్పథాలు కలిగి వుండవచ్చు. అందుచేతనే ఈ చరిత్ర వ్రాయుటలో ఆ యా సందర్భాల ననుసరించి, రావుగారిరచనలనే హెచ్చుగా ఉదహరిస్తూవచ్చాను. ఈ పద్ధతే వాస్తవ విషయా

లను అవగాహనచేసుకొనటానికి చదువరులకు తోడ్పడుతుందని ఆశించాను.

శ్రీ హరిసర్వోత్తమరావుగారు ఆంధ్ర జాతీయవికాసానికి అర్ధ శతాబ్దానికి పైగా తదేక దీక్షతో కృషిచేసిన మహనీయులు. వివిధ ఉద్యమాల ద్వారా వారుచేసిన బహుముఖకృషిని వివరించడమే నా ముఖ్యోద్దేశంగా పెట్టుకున్నాను. అందుచేత "ఉద్యమాల వారీగా" ఈ రచనను కొనసాగించాను. ప్రధాన భారత జాతీయ సంఘటనలను ఆధారంగా తీసికొని, అందు ఆంధ్రదేశంలో హరి సర్వోత్తమరావుగారు నిర్వర్తించినపాత్రను విశదీకరిస్తూవచ్చాను. ఆ యా సమయాల్లో సమకాలికులైన ప్రముఖ వ్యక్తుల, సంస్థల పనినికూడా క్లుప్తంగా వివరించాను. చివరను "ఉపసంహారము"లో సింహావలోకనంచేస్తూ నాకు తోచిన అభిప్రాయాలు వ్రాశాను. అనుబంధములో రావుగారి "జీవితపు తొలిరోజులు" గాంధీ, జిన్నాలకు వారు వ్రాసిన రెండు ప్రధానమైన ఉత్తరాలుచేర్చాను.

ఇంతవరకు తెలుగులో జీవిత చరిత్రలపై వచ్చిన విమర్శ నలు దృష్టికివచ్చినప్పుడు నాలో కొంత భయాందోళనలు కలుగక పోలేదు. కాని వ్రాసిన రెండు మూడుభాగాలు నాకు ఆత్మీయులైన శ్రీ వావిలాల, కోదాటిగార్లకు మొదట్లో చదివి వినిపించడం జరిగింది. వారి సూచనలు, సలహాలు నాకు ధైర్యం చేకూర్చినవి. భాషలో లోపాలున్నా చదువరులు సహృదయంతో మన్నిస్తారనే విశ్వాసం ముందుకు నడిపించింది.

రావుగారే తమ స్వీయచరిత్రనువ్రాసి ఆంధ్రదేశానికందించి నట్లయితే చారిత్రక, రాజకీయ, సాంఘిక పరిణామాలకు సంబంధించిన మరెన్నో ప్రధానసంఘటనల లోతుపాతులు వివరించివుండే

వారో! దురదృష్టవశాత్తు మనం దానికి నోచుకోలేదు. వారు చరిత్ర నిర్మాతలు. వ్రాతపని మరొకనిదైనది. నా ఈ ప్రయత్నములో ఎంతవరకు కృతకృత్యుడను కాగలిగానో? సహృదయులైన పాఠకలోకం చదివి ఆశీర్వదించవలసివున్నది.

డాక్టరు పట్టాభిగారి "కాంగ్రెస్ చరిత్ర," కాశేశ్వరరావుగారి "నా జీవితకథ - నవ్యాంధ్రం," దర్శి చెంచయ్యగారి "నేనూ-నా దేశం," ఆవటపల్లి నారాయణరావుగారు రచించిన "విశాలాంధ్ర" మున్నగు పుస్తకములున్నూ; ఆంధ్ర పత్రిక, భారతి, గ్రంథాలయ సర్వస్వము మొదలగుపత్రికలున్నూ ఉపకరించినవి. ఆయా గ్రంథకర్తలకు, పత్రికాధిపతులకు, సంపాదకులకు నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. "నా జీవితంలో ప్రజాసేవకునిగా విస్మరించరాని ఘట్టములు" అనే రావుగారి రేడియో ప్రసంగం ఎక్కువ తోడ్పడింది.

శ్రీ సర్వోత్తముని జీవితం మన బాధలను మరపింపజేస్తుంది. అది నాస్వానుభవం. సాధారణంగా పట్టుమని పదివ్యాసాలు వ్రాయగానే అది అచ్చయ్యేదాకా దుగ్ధ, పదినెలలు ప్రజాసేవంటూ చేసేసరికే ఏదో ప్రతిఫలంరాలేదంటూ అలసటకలగటం లోకంలో చూస్తున్నాము. ఎన్నేళ్ళు ఎట్టి కష్టాల్లో ఆయన దేశ సేవలో నిమగ్నులై నిష్కామకర్మచేశారో! రావుగారి జీవిత విధానమే ప్రతి ప్రజాసేవకునికి మార్గదర్శకమవుతుంది. నామట్టుకు నాలో మనఃపరివర్తనతెచ్చి నా కష్టాలను, బాధలను విస్మరింపజేసింది. దేశ చరిత్రలను, మహాపురుషుల జీవిత చరిత్రలను చదివించింది. అనేక గుణపాఠాలు నేర్పింది. ఇదొక అపురూప అనుభవంగా భావిస్తున్నాను.

రావుగారే ఒక విజ్ఞానఖని. దానిని తరచి చూచినకొద్దీ ఏ విషయంలోనైనా అనేక మణులను గ్రహింపవచ్చు. అది మన "సంస్కారం" మీద ఆధారపడివుంటుంది. గొప్పవాళ్ళ జీవిత చరిత్రలు తర్వాత తరాలవారికి ఆదర్శప్రాయ మవుతాయి. రావుగారి రచనలను, కనీసం ముఖ్యమైనవానినైనా, ఏరికూర్చి సంపుటములుగా ప్రచురించినప్పుడే ఈపని సమగ్రమవుతుంది.

త్యాగమయమైన, సౌశీల్యవంతమైన రావుగారి నిరాడంబర జీవితంవల్ల నేటి మన ఆంధ్రప్రజాజీవితంలో ఉన్నత ప్రమాణాలు నెలకొల్పటానికీ, నిష్కల్మష హృదయంతో నిస్వార్థసేవ చేయటానికీ స్ఫూర్తిని కలిగిస్తుం దనటంలో సందేహ మేమాత్రమూ లేదు. అందుకు ఈ రచన సహాయపడితే, నా కృషి కొంత ఫలించినట్లే.

పూజ్యులైన శ్రీ హరిసర్వోత్తమరావుగారి జీవితచరిత్ర వ్రాయటం ఒక మహద్భాగ్యంగా ఎంచుకొంటున్నాను. నాకీ సదవకాశం కలిగించి ప్రచురిస్తున్న ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమునకు, అధ్యక్ష కార్యదర్శులైన కోదాటి నారాయణరావు, పాతూరి నాగభూషణంగార్లకు, సహాయపడిన మిత్రు లెల్లరకూ నా హృదయపూర్వక నమస్కారాలు.

ఇట్లు
భవదీయుడు,
మాదల వీరభద్రరావు
గ్రంథకర్త

విద్యానగర్,
హైదరాబాదు-7

# విషయసూచిక

## పటములపట్టిక

# సవరణల పట్టిక

[పుస్తకమును చదువుటకు ముందే దిగువ సూచించిన సవరణలను చదువరులు ఆయా పుటలందు సరిచేసుకొనవలెను. వీనిలో చాల భాగము అంటని అక్షరములు.]

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| x | 4 | తెచి | తెచ్చి |
| | 24 | కవి మాజ | కవిసమాజ |
| xi | 2 | సంజీవి,శంకర్ లు | సంజీవి-శంకర్ లు, |
| xv | 6 | అద్యాపక | అధ్యాపక |
| xvii | 16 | ఉద్యమాలు | ఈ ఉద్యమాలు |
| xx | 13 | పూరటు | పూరట |
| | 20 | పాటించలేదవి | పాటించలేదని |
| xxv | 2 | వి. యాస్. శర్మ | వి. యన్. శర్మ |
| xxvi | 13 | గాంధీ, | , గాంధీ, |
| xxvii | 17 | లొకంలో | లోకంలో |
| xxviii | 8 | ప్రజా జీనితంలో | ప్రజా జీవితంలో |
| xxix | 6 | 1-10 | 1-13 |
| | 9 | 11-107 | 15-107 |
| xxxii | | 14-20 పంక్తులను 9 వ పంక్తికిపిమ్మట చేర్చవలెను. 15 వ పంక్తి చివర 155 అంకెను చేర్చవలెను. | |
| 3 | 13 | సెప్టెంబరు | సెప్టెంబరు |
| 10 | 1 | సాపన | స్థాపన |
| 11 | 14 | బృహాతర | బృహత్తర |
| 14 | 3,4 | విజానము | విజ్ఞానము |
| | 11 | జ్ఞానయోగమున | జ్ఞానయోగమున |
| 15 | 4 | పార్టీ-నిర్మాణం | పార్టీ నిర్మాణం |
| 18 | 14 | జతీయ నాయకత్వం | జాతీయ నాయకత్వం |
| 20 | 24 | విద్యార్థులను | విద్యార్థులను |
| 21 | 2 | దుర్గాప్రసపాదరావని | దుర్గాప్రసాదరావని |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 23 | 11 | సాపకులు | స్థాపకులు |
| 24 | 15 | పరప్రభుత్వత్వాధి కార్లకు | పరప్రభుత్వాధి కార్లకు |
| 25 | 17 | లులో | జైలులో |
| | 19 | సాపించారు. | స్థాపించారు. |
| 26 | 14 | అరెస్టుచే | అరెస్టుచేసి |
| | 20 | విపకీత | 'విపరీత |
| 35 | 14 | స్వదేశ్ మిత్రన్' | 'స్వదేశ మిత్రన్' |
| 40 | 18 | ప్రజాసామ్య | ప్రజాస్వామ్య |
| 41 | 1 | వల్లభాయిపటేల్, | వల్లభభాయిపటేల్, |
| 42 | 13 | పెటుకొవి | పెట్టుకొని |
| 42 | 25 | సాపనకిది | స్థాపనకిది |
| 47 | 4 | పరిశీలీంచు! | పరిశీలించు! |
| 51 | 7 | రాష్ట్రబోరు | రాష్ట్రబోర్డు |
| | 14 | సిదులగు | సిద్ధులగు |
| | 15 | దుత్తీరులగు | దుత్తీర్ణులగు |
| | 25 | కేం సంస్థ | కేంద్ర సంస్థ |
| 57 | 23 | సాపించబడింది. | స్థాపించబడింది. |
| 60 | 7 | గోపాలకృ ణయ్య | గోపాలకృష్ణయ్య |
| | 15 | డ్రాఫును | డ్రాఫ్టును |
| | 21 | విద్యారులు | విద్యార్థులు |
| 63 | 8 | వ్యషి | వ్యష్టి |
| | 10 | జా య | జాతీయ |
| | 18 | ప్రథమావస | ప్రథమావస్థ |
| 74 | 18 | కౌన్సిలలో | కౌన్సిలులో |
| 77 | 1 | సమాధనములు | సమాధానములు |
| 86 | 6 | దృక్పథాల | దృక్పథాలు |
| | 7 | కష్టపె టం | కష్టపెట్టటం |
| 89 | 9 | మాహాత్మాగాంధీకి | మహాత్మాగాంధీకి |
| 91 | 15-17 | మధ్యస్తంగా | మధ్యస్థంగా |
| | 17 | స్వాతంత్రతతో | స్వాతంత్ర్యముతో |
| 93 | 18 | దీనినేం | దీనినే |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 97 | 3 | నేసాగరదు, | సాగనేరదు, |
| | 22 | లోపకు | లోపలకు |
| 105 | 3 | యాందోళన | మాందోళన |
| | 4 | సాధనమార్గల | సాధనమార్గముల |
| 114 | 18 | మూడేండు | మూడేండ్లు |
| 115 | 10 | వ్రాసినారనుకొను | వ్రాసినారనుకొని |
| 116 | 12 | విజాన చంద్రికలోనుంచి | విజ్ఞాన చంద్రికలోనుంచి |
| | 20 | విజాన సర్వస్వం | విజ్ఞానసర్వస్వం |
| 120 | 5 | అప్నట్లో | అప్పట్లో |
| 129 | 10 | సమర్ధవంతంగా | సమర్థవంతంగా |
| 133 | 24 | మిథ్యగా | మిథ్యగా |
| 134 | 1 | వంహార్తకుడుగా | సంహార్తకుడుగా |
| 136 | 8 | వంశాబ్దికి | వంశాబ్ధికి |
| 139 | 10 | విద్యాభివృద్దికి | విద్యాభివృద్ధికి |
| 145 | 3 | విద్య : | 2. విద్య : |
| | 12 | గ్రంథాలయములు: | 3. గ్రంథాలయములు : |
| | 19 | పంచాయతీలు: | 4. పంచాయతీలు : |
| | 22 | రాజకీయములు: | 5. రాజకీయములు : |
| 147 | 1 | జీవిత చరిత్రలు: | 6. జీవిత చరిత్రలు: |
| | 6 | విజ్ఞానం : | 7. విజ్ఞానం: |
| | 10 | యాత్రాస్థలాలు: | 8. యాత్రాస్థలాలు : |
| | 13 | జర్నలిజం: | 9. జర్నలిజం : |
| 147 | 17 | ప్రజాసమస్యలు : | 10. ప్రజాసమస్యలు : |
| | 21 | స్త్రీయచరిత్ర : | 11. స్త్రీయచరిత్ర: |
| 152 | 19 | ప్లేటో | ప్లేటో |
| 154 | 1 | చెయువిధము | చేయువిధము |
| 159 | 2 | సానిక | స్థానిక |
| 165 | 21 | నిషూరాలను | నిష్ఠూరాలను |
| 182 | 6 | సాయీసంఘము | స్థాయీసంఘము |
| | 22 | సభ జరిపారు. | జరిపారు. |
| 187 | 7 | నిర్వివాదా | నిర్వివాద |
| 202 | 23 | సేటును | స్టేటును |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 24 | (పుటసంఖ్య) 02 | 202 |
| 227 | 25 | ,, 272 | 227 |
| 233 | 1 | పత్రికపలన | పత్రికవలన |
| | 17 | ద్వారానేతో వారి | ద్వారానే వారితో |
| 241 | 1 | వయోనవిద్యా | వయోజన విద్యా |
| 244 | 19 | తవఖీ | తనిఖీ |
| 246 | 13 | ఫిలిప్పైహెూన్స్ | ఫిలిప్పైన్స్ |
| 247 | 1 | సె|క్రటీరియటుకు | సెక్రటేరియటుకు |
| 252 | 5 | గ్రంథాలయాలకిచ్చె | గ్రంథాలయాలకిచ్చే |
| 253 | 1 | కాసిఫికేవన్ | క్లాసిఫికేషన్ |
| 259 | 1 | 'యూనెస్కో-క్లబ్బు' | 'యునెస్కో-క్లబ్బు' |
| 265 | 25 | వాటి స్థానేఫిర్యా | వాటిస్థానే ఫిర్యా |
| 266 | 8 | నూలంగా | స్థూలంగా |
| 267 | 4 | సానిక | స్థావిక |
| 278 | 5 | శ్రద్ద | శ్రద్ధ |
| 281 | 16 | అదేస మగంలో | అదే సమయంలో |
| 283 | 8 | విద్యాబివృద్ధికీ | విద్యాభివృద్ధికీ |
| | 16,17 | సహాయమలతో | సహాయములతో |
| | 27 | మగుదుము | మగుదుము. |
| 284 | 15 | కార్యదరిగాను | కార్యదర్శిగాను |
| 285 | 12 | రచయితకు వుండవలసిన | రచయిత కుండవలసిన |
| | 17 | ప్రకటించాడానికి | ప్రకటించడానికి |
| 290 | 15 | తమ ఇండలో | తమ ఇండ్లలో |
| 291 | 2 | పరిశ్రమను | పరిశ్రమకు |
| | 15 | ఈ వృత్తికి." | ఈ వృత్తికి." అని |
| | 18 | కొరవడ జే వి | కొరవడ జేసేవి |
| | 22 | అన్నారు. * | అని అన్నారు. * |
| 292 | 16 | పేతవోపేతంగా | వోపేతంగా |
| | 28 | జీవనమూలంగా | జీవనంమూలంగా |
| 293 | 11 | సహకార, | సహకార సంస్థలు, |
| | 17 | గౌతమీ ఆశ్రమం | గౌతమీ సత్యాగ్రహాశ్రమ |
| | 24 | జిల్లాలలోనుంచి | జిల్లాలోనుంచి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 296 | 13 | లేరుమందులేదని | వేరుమందులేదని |
| | 16 | ప్రాచీచాదార | ప్రాచీనాచార |
| | 18 | లనడానకి | లనడానికి |
| 297 | 11 | పంధొమ్మిదవ | పందొమ్మిదవ |
| | 16 | పా ంకాదు. | పాపంకాదు. |
| | 18 | సాగవలసిం . | సాగవలసించే. |
| 298 | 22 | లితినికి స్మారకం. | లితనికి స్మారకం. |
| 300 | 2 | తీర్చపచ్చు | తీర్చవచ్చు |
| | 7 | సరిసింహారావు | నరసింహారావు |
| | 10 | వారం | వారింతా |
| | 13 | అడ్లుడు | అల్లుడు |
| 301 | 6 | వసూ పోతూ | వస్తూపోతూ |
| | 8 | నా బిడకు | నా బిడ్డకు |
| 305 | 2 | విమరిస్తుండేవారు. | విమర్శిస్తుండేవారు. |
| 319 | 15 | "Peoples | "People's |
| 320 | 10 | కై తేనేమి. | కై తేనేమి |
| 325 | 4 | యివ్వచ్చునట్లు | యిచ్చునట్లు |
| | 24 | కృష్ణాజిలా | కృష్ణాజిల్లా |
| 326 | 15 | ట్రసువారి | ట్రస్టువారి |
| 333 | 4 | ఫ్యూడల్ | ఫ్యూడల్ |
| 336 | 7,8 | సమన యం | సమన్వయం |
| 341 | 9 | రావుగా కి | రావుగారికి |
| | 10 | తోచినని | తోచినవి |
| 342 | 24 | సామ్రాజ్య దం | సామ్రాజ్యవాదం |
| 350 | 9 | ఉపవాస పత్రాలు | ఉపవాస వ్రతాలు |
| | 10 | అనికలను | అస్తికలను |
| 350 | 21 | expluiters | exploiters |
| | 23 | revieing | revising |
| | 24 | Gandhijis | Gandhiji's |
| 352 | 18 | వుంటుందనడ | వుంటుందనడం |
| 356 | 8 | సంప్కరణాభిమ. | సంస్కరణాభిలాష. |
| | 9 | జీవిహితమునందు | జీవితమునందు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 360 | 3 | నరసింహాగారి | నరసింహన్ గారి |
| 365 | 20 | తలపెట్టినటున్నదని | తలపెట్టినట్లున్నదని |
| 366 | 8 | భిజావృద్ధి | జాభివృద్ధి |
| 368 | 11 | జానయోగము | జ్ఞానయోగము |
| | 18 | నది | నది. |
| 379 | 7 | గురియె | గురియైం |
| 383 | 5 | నాటిపా్రతలకు | నాటిప్రాతలకు |
| 387 | 7 | సత్పూరుషులు | సత్పురుషులు |
| 394 | 18 | వ్యతిరేకిస్తూ | వ్యతిశేకిస్తూ |
| 396 | 16 | మా చర్లల్లో | మా చర్చల్లో |
| 398 | 1 | ఉప్పుసత్యాగ్రహోది | ఉప్పుసత్యాగ్రహోది |
| 406 | 20 | ఒకటి | ఒకటి |
| 419 | 19 | అసహాయోద్యమం | అసహాయోద్యమం |
| 420 | 5 | నుడినితిని. | నుడివితిని. |
| 421 | 10 | వుస్తకము | పుస్తకము |
| 422 | 8 | మరియొక | మరియొక |
| 424 | 2 | విమర్శించినవారును | విమర్శించినవారును |
| 425 | 17 | ఎం ఏ. | ఎం. ఏ. |
| 426 | 19 | ్రదాన | ప్రధాన |
| 427 | 6 | తెలుగు | తెలుగు, |
| | 15 | దినవత్రికా | దినపత్రికా |
| 429 | 5 | వీరేశలింగంత | వీరేశలింగకవి |
| | 14 | ... | |
| | 15, 16 | పంక్తులు కొట్టివేయవలెను. | |
| | 17 | | ... |
| 431 | 17 | విక్రం | బిక్రం |
| 432 | 5 | వున్నటు | వున్నట్లు |
| | 6 | సత్యా-హింసల | సత్యాహింసల |
| 433 | 11 | పక్షాని మాతం | పక్షాన్ని మాత్రం |
| | 12 | నెతికంగా | నైతికంగా |
| | 14 | భాషా, జాతి, మత, | ,భాషా, జాతి, మత |
| | 18 | ఒక దేశము | ఒక దేశపు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 433 | 26 | సాధనలా | సాధనలో |
| 434 | 17 | సహచరులతో | సహచరులతో సహా |
| 435 | 12, 13 (ఎడమవైపు) | | మద్రాసు 15-10-1940 |
| | 18 | మిమ్ములను, | మిమ్ములను |
| 436 | 1 | మరు | మరో |
| | 5 | జాగ్ర గా | జాగ్రత్తగా |
| | 23 | అనుప ర్తింప | అనువర్తింప |
| 438 | 6 | ముడివడివుంది | ముడివడివుంది. |
| 439 | 12 | సిద్ధాంతీకరణ | సిద్ధాంతీకరణ |
| 440 | 22 | ఎకీభవించే | ఏకీభవించే |
| 441 | 1 | మెరికా | అమెరికా |

# ౧

# బాల్యం — విద్యార్థి దశ

జననం 1883 సెప్టెంబరు 14 కర్నూలు మండలం- విద్యాభ్యాసం 1900-1907 మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో- సజ్జన సాంగత్యం- దేశారాధనకై రక్తంతో ప్రతిజ్ఞను గైకొనుట- 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' స్థాపన.

౧

"తమ కార్యంబు బరిత్యజించియు, బరార్థ ప్రాపకుల్ సజ్జనుల్" అన్న భర్తృహరి కవి సుభాషితము ననుసరించి తమస్వ విషయములుగాక ప్రజాక్షేమాన్ని, దేశసేవను పరమార్థంగా ఎంచి పనిచేసేవారు లోకంలో చిరస్థాయిగా యశఃకాయులై నిలుస్తారు. అట్టివారిలో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారొకరు. ఆంధ్ర జాతీయ వికాసానికై అర్థశతాబ్దానికి పైగా, తన యావచ్ఛక్తిని వినియోగించి, అచంచలదీక్షతో, బహుముఖంగా కృషిచేసిన రావుగారు ఆంధ్రనాయకులలో అగ్రగణ్యులు. ఆ మహనీయుడు తన (హరి) సర్వోత్తమ నామమును నిజంగా సార్థకం చేసుకొన్నాడనవచ్చు. ఉత్తమ పురుషుల జీవితాలు లోకానికి ఆదర్శముగదా!

రావుగారి జననం 1883 సెప్టెంబరు 14 వ తేదీ (స్వభాను నామ సంవత్సర భాద్రపదశు ౧౨). తల్లి భాగీరథీబాయి, తండ్రి వేంకటరావు. ఈ పుణ్యదంపతులకు కర్నూలులో జనన మొందారు హరిసర్వోత్తమరావు గారు. వీరి పూర్వీకులు కడపజిల్లా పులివెందల తాలూకాలో నున్న సింహాద్రిపురంలో వుండేవారట. అంతకు పూర్వం మహారాష్ట్ర ప్రాంతానికి చెందినవారని చెప్పగా వింటాము. ఉద్యోగ ధర్మంగా తండ్రి కర్నూలు జిల్లాకు వచ్చి చేరుకొన్న కారణంగా వీరి పుట్టుక, బాల్యము కర్నూలు మండలంలో గడిచినవి.

ఒక్కొక్కరు పుట్టిన జన్మనక్షత్రముల ననుసరించి, వారి వారి జీవిత విధానం నిర్ణయించ బడుతుందని మన ప్రాచీన శాస్త్రజ్ఞులు చెప్పగా వింటుంటాము, ఒకడు మహర్దశ నందుకుంటాడు. మరొకడు నికృష్ట జీవితం గడుపుతాడు. ఒకడు మహామేధావియయి మహోన్నత పథాన్నందుకొంటాడు. ఇంకొకడు విద్యాగంధమే లేక అట్టడుగునే పడివుంటాడు. ఒకడు ఏ అర్హతలు లేకున్నా అభ్యున్నతస్థానానికి వస్తాడు. మరొకడు అన్ని అర్హతలుండీ అడుగునే వుంటాడు. ఈరీతి భిన్నభిన్న వ్యక్తులు మనకు సమాజంలో సాక్షాత్కరిస్తుంటారు. నక్షత్రబల నిజానిజా లెట్లున్నా విద్యా వినయ, సాహసౌదార్య, త్యాగమయ గుణగణములు గలిగిన రావుగారు జీవితాంతం వరకు కష్టపరంపరల నెదుర్కొంటూనే హాస్యజీవి యైనాడు.

శ్రీ వేంకటరావుగారిది సామాన్య మధ్యతరగతి కుటుంబం, కంభం, మార్కాపురం తాలూకాల్లో రెవిన్యూ యిన్స్పెక్టరుగా ఉద్యోగం చేస్తుండేవారు. హరిసర్వోత్తమరావు గారు ఆరు నెలల పసికందుగా వున్నప్పుడే, దురదృష్టవశాత్తు వీరితల్లి గతించింది. పెదతల్లి తనచేతులమీదగా ఈబిడ్డను పెంచి, పెద్దనుచేసింది. ఆయన తండ్రి, తర్వాత ద్వితీయ వివాహం చేసుకొన్నారు. ఆమె కుమారుడు వాయుజీవోత్తమరావు. ఆయన సంస్కృత పండితుడు. కొంత జ్యోతిష శాస్త్రంగూడ తెలిసినవాడు.

రావుగారి పినతండ్రులలో నొకరైన శ్రీనివాసరావుగారు వకీలు వృత్తిలో వుండేవారు. వీరికి కొద్దిపాటి భూవసతి వుండేది. తనకు సంతానం లేనందున, హరిసర్వోత్తమరావుగారిని దత్తత చేసుకొనే సంకల్పం గలిగిందీయనకు. హరిసర్వోత్తమరావుగారు

బాల్యంలో కొన్నాళ్లు మేనమామ ఇంటివద్దను, మరి కొన్నాళ్ళు ఈ పినతండ్రి వద్దను వుంటూవచ్చారు. తదనంతరం, రావుగారు రాజకీయోద్యమంలో దిగుటవల్ల వీరిద్దరిమధ్య భావవైరుధ్యం ఏర్పడి ఆదత్తత కుదరలేదు.

చిన్నతనంలో రావుగారి అక్షరాభ్యాసం కంభంతాలూకా రావిపాడు గ్రామంలో జరిగింది. కొంతకాలం కర్నూలు మునిసిపల్ బడిలో చదివారు. తొమ్మిదేండ్లకే వీరికి ఉపనయన మైనది. మొదటినుండీ కష్టపడి చదువుకొన్నారు. ఇంటిపనులుకూడా చేసి బడికి పోవలసి వచ్చేది. ఆలస్యంగా పాఠశాలకు వచ్చినందున ఉపాధ్యాయులు నిలుచోబెట్టేవారు. ఐతే రావుగారు చదువులో చాల చురుకైనవాడు. సూక్ష్మ గ్రాహి. పద్యాలు బాగా ఒప్పగించేవాడు. మంచి దస్తూరి వ్రాసేవాడు. తోడి విద్యార్థులకు, ఉపాధ్యాయులకు గూడ అత్యంత ప్రేమాస్పదుడైనాడు. ఆనాడు జరిగిన పబ్లిక్ పరీక్షలలో ప్రథముడుగా నెగ్గినాడు. తర్వాత గుంతకల్లు 'లండన్ మిషన్' పాఠశాలలో చేరాడు. గని శేషావధానులుగారు హైస్కూలు తెలుగు పండితులుగా వుండేవారు. రావుగారు తెలుగు, సంస్కృతం నేర్చుకొన్నదక్కడనే. ప్రధానోపాధ్యాయుడైన రఘునాథాచారిగారు గ్రంథపఠనమునందు విద్యార్థులకు మంచి అభిరుచి గల్గించేవారు.

హరిసర్వోత్తమరావుగారు పురప్రముఖుల నాహ్వానించి, హైస్కూలులో సారస్వత సభలు ఏర్పాటు చేసేవారు. కుస్తీ, చెడుగుడు, మున్నగు ఆటల పోటీలందు గూడా ఆరితేరారు. నిత్యమూ వ్యాయామం చేసేవారు.

'పువ్వు పుట్టగానే పరిమళిస్తుం'దన్నట్లు క్రమం తప్పక ఏటా పరీక్షలలో ఉత్తీర్ణులవుతూ, వీరు 1893 నుంచి 1900 నాటికి, ఏడేండ్లలో హైస్కూలు విద్యను పూర్తిచేయగలిగారు. రావుగారు నాల్గవఫారము చదువుచున్నప్పుడు ఆక్లాసులో తొమ్మండుగురు విద్యార్థులుమాత్రమే వుండేవారు. అందరిలోను వీరు మొదటి వాడుగా ఉంటూవుండేవారు. తర్వాత బి. ఏ. క్లాసులో కూడ మూడుభాగాలు ఒకేదఫా ఉత్తీర్ణులైనవారిలో హరిసర్వోత్తమ రావుగారే కాలేజీలో ప్రథములట.

పెరిగి పెద్దవారైన తర్వాత చిన్ననాటి గురువులను, మాతాపితలను మరిచేవాళ్ల కోవలో చేరలేదీయన. కన్న తల్లి దండ్రులమీద, చదువుచెప్పిన గురువులమీద వున్నప్రేమ గౌర వాల పురస్సరంగా రావుగారు తర్వాత రామువ్రాసిన గ్రంథాలను అంకిత మిచ్చారు వారికి.

తనతండ్రి గారికి 'ప్రచ్ఛన్న పాండవం' అనే నాటకమును, తల్లి భాగీరథీబాయికి "శ్రీరామచరిత్రము"ను అంకితమిచ్చారు. చిన్ననాటి గురువు గనిశేషావధానులుగారు అప్పటికే గతించినందుకు తానప్పటికిని తాను ఎం. ఏ. లో థీసిస్‌గా వ్రాసిన "The Neglected Emperor Poet" అను గ్రంథాన్ని అంకిత మిచ్చారు. ఈవిధంగా రావుగారు వారి ఋణం తీర్చుకొన్నారు.

ఆనాడు హైస్కూలు విద్యను దాటి చెప్పించే తాహతు వారి తండ్రులకు లేదు. కాని వెనుకబడిన దత్తమండలాలకు, మద్రాసు కళాశాలలో చేరుటకు ఉపకార వేతనములుండేవి. ఐతే పరీక్షలలో నెగ్గినవారికే ఈ అవకాశం లభించేది. అప్పట్లో జరి



శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
(పట్టభద్రుని దుస్తులలో)

గిన పరీక్షలో మొదటివాడుగా వచ్చినందున, మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో ఉన్నతవిద్య నభ్యసించే సదవకాశం కూడా రావు గారికి లభించింది, ఆరోజుల్లో బాగా ధనవంతులైనవారి బిడ్డలకే గాని, కళాశాల చదువులు సామాన్యుల కెవరికీ అందుబాటులో వుండేవికావు. మొత్తంమీద రావుగారు తన స్వయంకృషివల్ల ఉపకారవేతనం సంపాదించి పెద్దచదువు చదువ గల్గారు.

మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో 1901 నుండి 1906 వరకు ఆరేండ్లు క్లాసులు తప్పకుండా ఉత్తీర్ణులవుతూ ఎం. ఏ. ప్యాసు అయినారు. బి. ఏ. లో చరిత్ర, అర్థశాస్త్రము, రాజకీయ శాస్త్రము వీరి ఆప్షనల్ గ్రూపుగా వుండేవి. ఎం. ఏ. లో తెలుగు,కన్నడము, భాషాశాస్త్రము (Telugu, Kanarees and comparative Philology) అధిమానాంశాలుగావుండేవి. ఆనాడు ఎం. ఏ. పట్టమును పొందిన ఆంధ్రు లందరిలోను రావుగారు ద్వితీయులని చెపుతారు. మద్రాసురాష్ట్రానికి ఆనాడు ముఖ్యమంత్రిగా నుండిన పానుగంటి రామారాయణింగారు ప్రథములట. కొండా వెంకటప్పయ్య, ప్రకాశంగార్ల కోటివారున్నూ శ్రీ హరిసర్వోత్తమరావు గారి వలెనే స్కాలర్‌షిప్పులు పొంది ఉన్నతవిద్య చదువు కొన్నవారే.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, తమ పరిపాలన కనుకూలమైన గుమాస్తాలను, ఉద్యోగులను బానిసలుగా తయారు చేసుకోటానికి తగిన విద్యావిధానాన్ని మనదేశంలో ప్రవేశ పెట్టినారు. కాని అందరూ అలా దాసప్రవృత్తి అలవరచుకోలేదు. పాశ్చాత్య విద్యా సంస్కారంవల్ల ఆ వ్యామోహంలోనే పడక, జాతీయ భావ ప్రేరితులై, సంస్కార సంపన్నులై, భారతజాతీయ పునరుజ్జీవనానికి

మార్గదర్శకులైన మహనీయులు లేకపోలేదు. అట్టివారిలో హరి సర్వోత్తమరావుగా రొకరు.

ఇంగ్లండులో కేంబ్రిడ్జికి చదువుటకేగిన సేన్‌గుప్తా, బిపిన్ చంద్రపాల్, శ్రీప్రకాశ్, జవహర్‌లాల్, గోపాలకృష్ణగోఖలే, అరవిందఘోష్ మున్నగు నాయకులెల్లరూ స్వాతంత్రోద్యమ రథ సారధులుగా భారత దేశానికి తిరిగి వచ్చారు. అలానే రావుగారు ఎం. ఏ. చదువుచున్న రోజుల్లోనే పట్టాభిగారు వైద్యవిద్య నభ్య సించుటకు చెన్నపట్నానికి వచ్చారు. కాశేశ్వరరావుగారు ప్లీడరు పరీక్షలకు, గొల్లపూడి సీతారామశాస్త్రి యఫ్. ఏ. చదువుకొనుటకు వచ్చారు. కట్టమంచి రామలింగారెడ్డి, గిడుగు వేంకట సీతాపతిగార్లు కూడ హరిసర్వోత్తమరావు గారి సమకాలికులు. వీరంతా మన రాష్ట్రంలో రాజకీయ, సారస్వతరంగాల్లో తర్వాత అద్వితీయ ప్రతిభాశాలురుగా రాణించినవారే.

హరిసర్వోత్తమరావు గారికి ఎం. ఏ. లో తెలుగు అభి మాన విషయము. ఆముక్తమాల్యద, శ్రీకృష్ణదేవరాయలు వారి అభిమాన పాత్రములు. క్రిస్టియన్ కళాశాలలో సంస్కృతాం ధ్రాంగ్లములందు అఖండ పాండిత్యంగల మహామహోపాధ్యాయ వేదం వేంకటరాయశాస్త్రిగారు అధ్యాపకులుగా వుండేవారు. రావు గారి యెడల శాస్త్రిగారు శిష్యవాత్సల్యం చూపుతూ, ప్రేమగా వుండేవారు. కళాశాల చదువు ముగిసినతర్వాతకూడ ఈ గురు శిష్యుల చెలిమి పెరుగుతునే వచ్చింది. హరిసర్వోత్తమరావు గారిపై ప్రభుత్వం రాజద్రోహనేరం మోపినప్పుడుసైతం, వేంకట రాయశాస్త్రిగారు రావుగారి పక్షమున సాక్ష్య మిచ్చినట్లు గూడా తెలుస్తుంది.

"శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారి స్మరణ" అని రావుగారు వ్రాసినదానిలో ఇలావుంది:

"నా ఎం. ఏ. పరీక్ష భాషాంతరీకరణ పృచ్ఛకులు శాస్త్రిగారు. సప్త స్వరకల్పనకు సంబంధించిన ఇంగ్లీషు పద్యములలోనే ఏర్చియిచ్చిరి. నే నాశువుగా సీసమల్లితిని. శాస్త్రిగారు సంగీత ప్రియులని అప్పు డెరిగితిని.........

.... నేను కృష్ణరాయవాదిని. శ్రీ శాస్త్రులవారు కృష్ణదేవరాయ వాద మని తమ పీఠికానుబంధములో వ్రాసినది విశేషభాగము నావాదము. తరువాత మేదేపల్లి వేంకటరమణాచార్యులుగారు నా వాదమును వావిళ్ళవారి పునర్ముద్రణ పీఠికలో బలపరచబోయి, శాస్త్రులవారి తీక్ష్ణ విమర్శనకు గురియైరి. కాని శిష్యవాత్సల్యముచే నాయెడల శాస్త్రుల వారెల్లప్పుడూ కరుణనే చూపిరి. దానిఫలము వారి పీఠిక లోనే కానవచ్చును."

అప్పట్లో జరుగుచుండిన గ్రామ్య, వ్యావహారిక భాషా వాగ్వివాదంలో గూడా శాస్త్రిగారిని, హరిసర్వోత్తమరావు గారు తరచు కలుసుకొంటూ, చర్చిస్తుండేవారు. కళాశాలావిద్యార్థి దశ లోని ఆనాటి చర్చలు, తదుపరి సారస్వత రంగంలో రావుగారి కృషికి తోడ్పడినవి.

మద్రాసులో నున్నప్పుడు కట్టమంచి రామలింగారెడ్డి గారున్నూ, రావుగారున్నూ చాలా స్నేహంగా వుండేవారు. రావు గారిని 'సీనియర్ జ్యేష్ఠుడని' పిలుస్తుండేవారాయన. వీరిద్దరూ సభలు, సమావేశాలు జరుపుతూ, ఆంధ్రాంగ్ల భాషలలో ఉపన్యసి స్తుండేవారు. నగరంలోని సాంఘిక సేవా కార్యక్రమాల్లో పాల్గొంటూ ఉండేవారు.

అప్పటికే, విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి స్థాపన ఆలోచనలతో కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు మద్రాసు విచ్చేశారు. లక్ష్మణరావు, కాశేశ్వరరావుగార్లతో హరిసర్వోత్తమరావు గారికి మంచి పరిచయం, స్నేహం ఏర్పడింది. ముగ్గురూ కలిసి చారిత్రక,శాస్త్రీయ గ్రంథ ప్రచురణల ఏర్పాటుకు పూనుకొన్నారు.

రావుగారి దస్తూరి ముత్యాలలాంటిది. ఇంగ్లీషు, తెలుగులలోగూడ విశ్వవిద్యాలయం మొత్తంలోనే రెండవవారుగా ఉత్తీర్ణులయినారు. వీరి మంచి దస్తూరికి యూనివర్సిటీవారి స్వర్ణ బహుమతి లభించిందట.

ఈయన విద్యార్థి జీవితంలో గమనించవలసిన ముఖ్యవిశేషాల్లో చదువుపైనున్న శ్రద్ధ, గురువులయెడ భక్తి,మాతృ దేశాభిమానము ముఖ్యమైనవి. తీరికచేసుకొని కన్నెమరా లైబ్రరీకిగూడవెళ్ళి ఉత్తమ గ్రంథాలను చదువుతూవుండేవారు. వీరికి సద్గ్రంథపఠనం, సజ్జనసాంగత్యం అబ్బినవి. వీనికి తోడు సక్రమప్రవర్తన నలవరచుకొన్నారు. ఇవన్నీ, వీరిభవిష్యత్తులో చక్కని నియమబద్ధమైన జీవితాన్ని, ఉత్తమాశయాలతో నడుపుకొనుటకు మంచి పునాదిరాళ్ళయినవి.

కొంతమంది పుట్టుకతోనే గొప్పవారుగా పుడతారు. కొందరు స్వయంకృషిచే గొప్పవారవుతారు. మరికొందరు గొప్పవారగుటకు పరిస్థితులు సమకూడి ముందుకు నెడతవి. హరిసర్వోత్తమరావుగారు రెండవకోవకు చెందినవారు. ఉన్నతాదర్శములు, నిరంతరాన్వేషణ ఆయన్ని ముందుకు నడిపించినవి.

జాతీయ విద్యాభివృద్ధికై పాటుబడదామనే సంకల్పం రావుగారికి విద్యార్థిదశలోనే కలిగింది. తర్వాత కాలంలో విద్యార్థి

సోదరులతో కలిసి, తమరక్తంతో మాతృదేశారాధనకు ప్రతిజ్ఞ తీసుకోగలిగిన దృఢనిశ్చయమేర్పడింది. ఆసత్సంకల్ప బలమే రావుగారి ప్రజాహిత జీవితాన్ని తీర్చి దిద్దిందనవచ్చు.

వెనుకబడిన రాయలసీమలో ఫెర్గూసన్ కళాశాలవంటి దానిని నెలకొల్పాలని, ఉత్తమవిద్య ఉచితంగా నేర్పడానికి వీలౌతుందనీ దేశపాండే సుబ్బారావు, హట్టి శంకర్రావు గార్లతో రావుగారు కొన్ని ఆలోచనలుచేశారు. కాని తర్వాతవచ్చిన రాజకీయ పరిణామాల కారణంగా, ఇవేమీ ఫలప్రదంగాలేదు.

విజ్ఞాన చంద్రికాగ్రంథమండలి స్థాపన 1906 లో జరిగింది. మాతృభాషలో గ్రంథప్రచురణ సాగించుట వీరి ముఖ్యోద్దేశం. ఈగ్రంథమాల తరపున దేశచరిత్రలు, శాస్త్రగ్రంథములు, మహా పురుషుల జీవితచరిత్రలేగాక, తర్వాత తెలుగులో విజ్ఞాన సర్వస్వము ను ప్రచురించుటకుగూడ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారొక బృహత్తర ప్రణాళికను రూపొందించారు. లక్ష్మణరావుగారు ప్రధాన సంపాదకులుగా వుండేవారు. హరిసర్వోత్తమరావు, కాశీశ్వరరావుగార్లు కార్యదర్శులు, లక్ష్మణరావుగారు కలకత్తా విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. పాసైనారు. మహారాష్ట్రప్రాంతంలో వుండుటవల్ల మరాఠీభాషలో వారు పాండిత్యం సంపాదించారు. మునగాల దివాన్‌గిరి చేస్తుండేవారు.

ధేయర్సు రచించిన "అబ్రహాం లింకన్ చరిత్ర"ను హరి సర్వోత్తమరావుగారు తెలుగులో భాషాంతరీకరించారు. ఇది ఈ

గ్రంథమండలి ప్రచురించిన ప్రథమ పుస్తకం. విజ్ఞాన సర్వస్వమున కనేక వ్యాసాలు వ్రాశారు. వీనిలో "అచ్చుయంత్రములను" గూర్చిన వ్యాసం చాలా విపులమైనది. రావుగారు ఢిల్లీ దర్బార్ అను గ్రంథమును రచించారు. ఈ గ్రంథమండలి ఆంధ్ర దేశంలో సారస్వత రీత్యా విజ్ఞాన వ్యాప్తికి చాలా దోహద మిచ్చినది. వ్యవసాయశాస్త్రం, పదార్థ విజ్ఞానశాస్త్రం, జీవశాస్త్రం, రసాయనిక శాస్త్రం, అర్థశాస్త్రం, మున్నగు శాస్త్ర గ్రంథములున్నూ, "ఆంధ్రుల చరిత్ర", "హిందూ మహాయుగం", "విజయనగర సామ్రాజ్యం" వంటి చరిత్ర గ్రంథములున్నూ, వీరేశలింగంగారి స్వీయచరిత్ర, అబ్రహాం లింకన్ జీవితంలాంటి మహాపురుషుల జీవిత చరిత్రలును ఇలా ఎన్నో గ్రంథములు ఈ విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి పక్షాన ప్రచురింపబడినవి. ఆయా విషయాల్లో సుపరిచితులైన మల్లంపల్లి సోమశేఖరశర్మ, కట్టమంచి రామలింగారెడ్డి, చిలుకూరి వీరభద్రరావు, గోటేటి జోగిరాజు, వేమూరి విశ్వనాథ శర్మగార్ల వంటి పండితులు, చరిత్రకారులు, శాస్త్రజ్ఞులు పై నుదహరించిన గ్రంథ రాజములను రచించారు.

తెలుగు తల్లి (1944 అక్టోబరు) లక్ష్మణరాయ వర్ధంతి సంచికలో "అన్నయ్య కొమర్రాజు లక్ష్మణరావు"అను వ్యాసంలో హరిసర్వోత్తమరావుగారు విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి స్థాపన కాలంనాటి పూర్వ స్మృతులెన్నో పేర్కొన్నారు. తమ రేడియో ప్రసంగంలో రావుగా రిలా మాట్లాడారు :

"వందేమాతరం ఉద్యమములో మాతృభాష మీది ప్రేమకారణంగా ఎక్కడి ప్రజలక్కడే మాతృ భాషాభిమానమును పొంది తద్భాషాభివృద్ధికి కృషిచేయటం మొదటిఫలంగా ఏర్పడింది. తెలుగు దేశంలో విజ్ఞాన చంద్రికా గ్రంథమాల స్థాపన కిదియే కారణమన వచ్చును. మద్రాసు నగరంలో 1906 లో లక్ష్మణరావు, కాశేశ్వర రావు, నేను సమావేశ మైతిమి. లక్ష్మణరావు గారప్పుడు మునగాల జమీందారు రాజా నాయని వెంకటరంగారావు గారి దివాను. జమీందారు గొప్పసరసుడు, నిరాడంబరజీవి. విద్యాభిమాని. ఆయన అండగా నిల్చినాడు. హైదరాబాదులో మనసబ్‌దారుగా నుండిన రావిచెట్టు రంగారావు మాతో చేరి పుస్తకములు మోసికొని పోయి, టపాకందించే బంట్రోతు పనికూడ నెరవేర్చుటకు సిద్ధమాయెను. అనేక కారణములచేత, నేనే ఆ గ్రంథమాలలోని మొదటి పుస్తకము "అబ్రహాం లింకన్" వ్రాయువాడ నైతిని. అన్నయ్య లక్ష్మణరావు దాని సంపాదకత్వము నిర్వహించెను. నాటి మాసంబంధమే బహుకాలము గ్రంథ రచనలోను, తరువాత విజ్ఞాన సర్వస్వమువంటి మొదటి మూడు సంపుటముల రచనా నిర్వహణలోను మమ్ము భాగస్థులను చేసినది. కాబట్టి ఇది ప్రజా సేవకుడుగా, నేను విస్మరింపలేని ఘట్టముగా ఏర్పడినది."

"మన ప్రజకు విజ్ఞానము వ్యాపింపకుండుటే మన యధోగతికి కారణము. ఎల్ల యభివృద్ధికిని విజ్ఞాన వ్యాపనయే ప్రథమాధారము. అక్షరజ్ఞత దానికి మూల సాధనము. అక్షరజ్ఞతతోగూడ విజ్ఞానము వ్యాపింప జేయుటకు ఇతర సాధనము లున్నవి, పత్రికలు, గ్రంథములు చదివి వినిపించుట, ఉపన్యాసములు, మేజిక్‌లాంతరు సినిమా ప్రదర్శనములు, భజనలు, హరికథలు, ఇట్టివి అనంతములు. వీని నన్నిటిని ఏర్పఱచి కృషిచేయునట్టి యుద్యమము గ్రంథాలయోద్యమము. ఏ యుద్యమమునందు ఉత్సాహము కొరవడినను ఈ యుద్యమము సాగుచుండెనా ప్రజలను అంధకార మావరించదు. అంధకారమున పడిపోనంత కాలము మానవుడు తలయెత్తు కొనుటకు మార్గమున్నది. కావున జ్ఞానయోగమున కంత ప్రాముఖ్యము. అందుచేత సరస్వతీ మందిరము సదా సేవింపదగినది. దీనిని మఱువవలదు."

—గాడిచర్ల హరిసర్వోత్తమరావు

## ౨

# రాజకీయరంగం

వందేమాతరం ఉద్యమం–స్వరాజ్య పత్రిక–హోంరూలు ఉద్యమం–స్వరాజ్య పార్టీ – నిర్మాణం–కర్యాలు ఖద్దరుబోర్డు–భారత హిందూస్థానీ సేవాదళ్–ఆంధ్ర రాష్ట్రీయ ఐచ్ఛిక భటసంఘం – మదరాసు కౌన్సిలు సభ్యత్వం – ఆంధ్ర విశ్వకళా పరిషత్ సభ్యత్వం–జాతీయ విద్యా ప్రణాళిక – ఆదర్శ శాసనసభా సభ్యుడు – సైమన్ కమిషన్ బహిష్కరణ – ఉప్పు సత్యాగ్రహోద్యమం – కౌన్సిలు సభ్యత్వానికి రాజీనామా – కాంగ్రెసు కేంద్ర శాసనసభ ప్రవేశం – ఆంధ్ర స్వరాజ్యపార్టీ పునరుద్ధరణ ప్రయత్నం –

## ౨

# వందేమాతరం ఉద్యమం

మన పరిశ్రమల స్థితి - జపానువెళ్ళే శ్యాంజీ రామారావుకు సహాయం - రాజమహేంద్రవరం ట్రయినింగు కాలేజీలో చేరుట - ప్రథమ వయోజన రాత్రి పాఠశాల నడుపుట-బెంగాలునుండి బిపిన్ చంద్రపాల్ రాక - రాజమండ్రి కళాశాల విద్యార్థుల దీక్షాకంకణం-హరిసర్వోత్తమరావుగారిని కాలేజీనుండి బహిష్కరించుట - ఎక్కడా ఉద్యోగా లివ్వరాదని ప్రభుత్వం ఆంక్షవిధించుట-కాకినాడ విద్యార్థుల ఆందోళన - ప్రథమ రాజకీయ 'క్రిమినల్ కేసు - టెర్ర రిస్టు ఉద్యమ సంబంధాలు - బందరు జాతీయ కళాశాల.

అరోజులలో పరిశ్రమలంటే యేమో, మనదక్షిణాదిన ఎవరూ యెరుగరు. బొంబాయిలో మాత్రం బట్టల మిల్లులుండేవి. అహమ్మదాబాదు పేరుగూడా ఇంకా ప్రచారంలోకి రాలేదు. మద్రాసులో బకింగుహాం కర్నాటక మిల్లులుండేవి. ఆంధ్రదేశంలో ఏచిన్న పరిశ్రమలూలేవు. ఇంగ్లండులోని మాంఛెస్టరునుండి మనకు సన్నబట్టలు దిగుమతి అయ్యేవి.

వందేమాతర నినాదంతో విదేశవస్తు బహిష్కారం కొంత వ్యాప్తిలోకి వచ్చింది. ప్రజలకు పరిశ్రమలమీద దృష్టి ప్రాకింది. మద్రాసులో "స్వదేశీఅండ్ ఇండస్ట్రియల్ అసోసి యేషన్" అనేసంస్థ ఏర్పడింది. సర్కారు జిల్లావాస్తవ్యుడు

వంగల వెంకటనారాయణ అనే .యువకుడు జపానుకు పరిశ్రమ నభ్యసించడానికి ప్రయాణమయినాడు. రాయలసీమలోని శ్యాంజీ రామారావుగూడా జపాన్ పోదామని బయలుదేరాడు. సబ్బుబిళ్ళల పరిశ్రమ నేర్చుకొందా మనుకున్నాడు. హరిసర్వోత్తమరావు గారితో రామారావుకు స్నేహంవుంది. కొంతడబ్బు సహాయం చేయమని కోరాడు. రావుగారిదగ్గర డబ్బెక్కడుంది? కాని స్నేహితునికి సహాయం చేయడం ధర్మమని భావించారాయన. మునగాల జమీందారు వద్దకువచ్చి కొంత పైకంతెచ్చి యిచ్చారు. మిత్రులు అక్కడక్కడ నాటకాలువేసి, మరికొంత డబ్బు సహాయం చేశారు.

అనాడు తిలక్ మొదలగు జాతీయనాయకులు స్వదేశీ పరిశ్రమలు పెంపొందాలని వాంఛించారు. తాతా ఉక్కుఫ్యాక్టరీ నిర్మాణానికి ప్రభుత్వం అడ్డుతగిలింది. బ్రిటిష్ ప్రభుత్వచర్యను, జతీయనాయకత్వం విమర్శించిందిగూడ.

సముద్రయానంచేసి, విదేశాలకు పొయ్యేవారిని బహిష్కరించే రోజులవి. రావుగారిలాంటి స్నేహితుల సహకారంతో, ఎలాగో సాహసంచేసి రామారావు జపానుకువెళ్ళి పరిశ్రమల సాంకేతికత నభ్యసించ గలిగినాడు. అప్పుడదొక ఘనకార్యంగా వుండేది,

1907 లో ఎం. ఏ. పరీక్ష పాసయి, ట్రయినింగు చదువుటకు హరిసర్వోత్తమరావుగారు రాజమండ్రివెళ్ళారు. ఉపాధ్యాయ శిక్షణ పొందుతూనే, వీరు 90 మంది వయోజనులకు రాత్రి పాఠశాలను స్థాపించారు. అబ్రహాం లింకన్ జీవిత చరిత్రను చెపుతూ, పత్రికలను చదివి వినిపిస్తూ, వారిలో అక్షరాస్యతతోపాటు చైత

న్యం కలిగించుటకు పూనుకొన్నారు. తన ప్రజాసేవవల్ల రావుగారు సహవిద్యార్థుల అభిమానాన్ని చూరగొన్నారు.

అవి వందేమాతరం రోజులు. అప్పట్లో రాజప్రతినిధిగా నున్న లార్డుకర్జన్ బెంగాలును రెండుగా చీల్చదలచాడు. బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వానికి సహజమైన "విభజించి పరిపాలించు" అనే దుష్టరాజనీతి నవలంబించాడు. ఈ విభజనకు ప్రతికూలంగా "వందేమాతరం" ఉద్యమం ప్రజ్వరిల్లింది. కోర్టులను, పాఠశాలలను, సర్కారు బిరుదులను, విదేశ వస్త్ర, వస్తువులను బహిష్కరించాలనే ప్రచారం ఎల్లెడలా ప్రతిధ్వనించింది. ఈ చతుర్విధ బహిష్కారం యావద్భారతదేశంలోనూ వ్యాపించింది. మహారాష్ట్రంలో బాలగంగాధర తిలక్, పంజాబులో లాలాలజపతిరాయి బెంగాలులో బిపిన్‌చంద్రపాల్ గార్లు ఈ మహదుద్యమానికి నాయకత్వం వహించారు. బాల్, లాల్, పాల్ లని దేశంలో వీరు ప్రసిద్ధి కెక్కారు.

బిపిన్ చంద్రపాల్ ఉద్రేకపూరిత ఉపన్యాసా లివ్వగల వక్త. వీరి ఉపన్యాసాలతో ఆంధ్ర విద్యార్థి లోకం ఉద్రిక్తమైపోయింది. వారు జాతీయ భావప్రపూరితులైనారు. రాజమండ్రివిద్యార్థులు వందేమాతరం బిళ్ళలు ధరించి, పాల్ ఉపన్యాసానంతరం బ్రహ్మాండమైన పీడ్కోలిచ్చారు. ఆ బిళ్ళలతోనే విద్యార్థులు కళాశాలకు రావటం కాలేజీ ప్రిన్సిపాలుగావున్న మార్కు హంటర్‌కు కన్నుగుట్టి నట్లయినది. ఆ చిహ్నాలు తీసివేయమని హుంకరించాడు. కాని అతని మాట నెవరూ వినిపించుకోలేదు. పాఠశాల నుంచి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించాడు. కాని విద్యార్థులు కేకలువేస్తూ గేలిచేయ సాగారు. హరిసర్వోత్తమరావుగా రక్కడకు వచ్చి

వారిని శాంత పరిచారు. విద్యార్థు లందరికీ ఆయనంటే ఎంత అభి మానమో అర్థమైంది. ఈ విద్యార్థుల ఆందోళనకంతా రావుగారే కారణమని శిక్షిస్తానన్నాడు హంటర్. ప్రిన్సిపాల్ మరొక విద్యార్థిని కొట్టబోగా, రావుగారు ముందుకొచ్చి "అతన్ని కొట్టబోకండి" అని వారించాడు. హరిసర్వోత్తమరావుగారిని బడిలోనుంచి తీసి వేశానన్నాడు. ఇది విని ఆర్ట్సు కాలేజీ, ట్రయినింగు కాలేజీ విద్యార్థులంతా బయటికివచ్చి రావుగారి ననుసరించారు. పవిత్ర గోదావరీ నదిలో స్నానంచేసి, దీక్షాకంకణం ధరించారు. మరల కళాశాలలో కాలుపెట్టమని శపథం చేశారు.

ఈవిధంగా రాజమహేంద్రవరం విద్యార్థులు తెలుగు దేశంలో వందేమాతరం ఉద్యమానికి మార్గదర్శకులైనారు. హరి సర్వోత్తమరావుగారు వారి నాయకులైనారు. 160 మంది విద్యార్థులపై జరిమానాలు విధించడం జరిగింది, రావుగారి కెక్కడా ఉద్యోగమివ్వరాదని ప్రభుత్వం ఆంక్ష విధించింది.

ఈ ఉదంతాన్నిగూర్చి రావుగారిలా తనరేడియో ప్రసంగంలో చెప్పారు :

"ట్రయినింగు కాలేజీ, ఆర్ట్సు కాలేజీలకు ప్రిన్సిపాలగు హంటరు నామీద ఛార్జీలు మోపిరి. నేనెంతో శాంతంగా జవాబిచ్చితిని. నాకు శాంతం పెరిగినకొల్లా, వారికి కోపముపెరిగెను. తుదకు నన్ను శిక్షింతు మనిరి. చిత్తము, కానివ్వండని బదులుచెప్పితిని. తర్వాత నాభేటీని వర్ణిస్తూ హంటరునకు నేనొక 'దయ్యముగా' గోచరించితినని చెప్పెనట. నేను బయటికి రావటంతోనే, విద్యార్థులందరూ గోదావరిలో స్నానంచేసి ఆ కళాశాలలో మరల కాలుపెట్టకుండుటకు దీక్షబూనిరి....
.... అదరించీ, ఆశలుచూపీ, వొక్కరొక్కరుగా విద్యారులను విడ

దీసీ, ఎట్లైనా మరల కళాశాలలో చేర్చుటకు అచ్చటి పబ్లిక్ ప్రాసిక్యూటరు, వారిపేరు దుర్గాప్రసాదరావని నాకు జ్ఞాపకము, ప్రయత్నించ నారంభించెను. ఆయనను అరికట్టటానికి విద్యార్థులెన్నో రీతుల ప్రయత్నించిరి. ఒక విద్యార్థి దిట్టమయిన యువకుడు, బలమైన బడితె తీసుకొని నావద్దకు వచ్చెను. అతనిని ఆబడితెపాలు చేయడానికి నా అనుమతి కోరెను. అనుమతిస్తానా మహాప్రమాదము. అనుమతింపనా, ఆ బడితె నాపైకే తిరుగుతుందేమో! వెనుకాడ వీలులేదు. దృఢతరంగా 'అదికూడ'దని శాసించితిని. ఆయువకుని, ఆబడితెను నేను మరువగలనా?

— "నా జీవితంలో విస్మరించరాని ఘట్టాలు" నుండి

ఈఘటనతర్వాత, బిపిన్ చంద్రపాల్‌తోపాటు ఆంధ్రదేశ పర్యటనలో రావుగారు పాల్గొన్నారు. కాకినాడ, బెజవాడ, బందరు పట్టణాలలోగూడా పాల్ మహోపన్యాసా లిచ్చాడు. మద్రాసులో ప్రకాశంగారి అధ్యక్షతను గొప్ప బహిరంగసభ జరిగింది. ఇంగ్లండులో బారిస్టరుపరీక్ష పూర్తిచేసుకొని అప్పుడే ప్రకాశంగారు మద్రాసులో ప్రాక్టీసు పెట్టారు.

వందేమాతరం నినాదం రాజమండ్రి నుండి కాకినాడకు ప్రాకింది. అక్కడ డాక్టరు కెంపు అను నతడు వైద్యాధికారిగా వుండేవాడు. కోపల్లె కృష్ణారావు అనే విద్యార్థి "వందేమాతరం — మనదే రాజ్యం" అనే నినాదాలు చేయటం ఆయనకు గిట్టలేదు. ఆ విద్యార్థిని కొరడాతో కొట్టాడు. ఈతని దుందుడుకు చర్య పురజనులను ఆగ్రహావేశ పరవశులను చేసింది. దీనితో జనం గుంపుగా చేరి కెంపుదొరగారిని చుట్టుముట్టారు. దొరల క్లబ్బులోకి దూరి అతను తలదాచుకొన్నాడు. ప్రజలు క్లబ్బుమీదపడి సామానులన్నీ ధ్వంసంచేసివేశారు. పోలీసులు 20 మందిని అరెస్టుచేసి,

రెండేళ్ళ చొప్పున జైలుశిక్ష విధించారు. అప్పీలు చేసుకోగా కొందరు ముద్దాయిలను తర్వాత విడుదలచేయటం జరిగింది. ఇది ఆంధ్రదేశంలో జరిగినమొదటి రాజకీయ క్రిమినల్ కేసు. మిగతా వారు కఠిన శిక్షలకు గురియైనారు.

పురప్రముఖుల తోడ్పాటుతో, కొరడా దెబ్బలు తిన్న విద్యార్థి కృష్ణారావు డాక్టరు కెంపు మీద కోర్టులో నష్టపరిహారపు దావా వేశాడు. ఆ జడ్జీ 300 రూపాయలు, కెంపుచేత నష్టపరిహారం యిప్పిస్తూ తీర్పు చెప్పటం జరిగింది.

హరిసర్వోత్తమరావుగారికి ఏ గవర్నమెంటు, ప్రైవేటు కాలేజీలలోగాని, స్కూళ్ళలోగాని వుద్యోగం యివ్వరాదనే ఆంక్షను కాంగ్రెస్ మంత్రిత్వాలు స్వీకరించిన తర్వాత, 1937 అక్టోబరు 25 వ తేదీ రద్దు చేయటం జరిగింది. * 30 ఏండ్ల తదనంతరం,

---

* *Government of Madras.*

EDUCATION & P. H. DEPARTMENT

G. O. No. Ms. 2498 dated 25 October 1937.

READ the following paper:-

G. O. 385 Edn dated 18 6 1907.

From M. R. Ry. G. Harisarvothama Rau, dated 14 th September 1937.

ORDER:—

The Government direct that the orders in para 13 of G. O. No. 385 Edn., dated 18 th June 1907, debarring M. R. Ry., G. Harisarvothama Rao Garu from employment as a teacher in any Government or aided school or college be cancelled.

(By Order of His Excellency the Governor)

C. H. Masterman,

Secretary to Government.

To M. R. Ry. G. Harisarvothama Rao.
To the Director of Public Instruction.

రావుగారిపై విధించిన ఆర్డరును రద్దుపరచా రన్నమాట. ఈ విధంగా ముప్పదేండ్లు ఉద్యోగానికే అనర్హులుగా ప్రకటించి, ప్రభుత్వం ఈ దేశభక్తునిపై కసితీర్చుకొన్నది. రావుగారు ఇక చదువుకు స్వస్తి చెప్పివేశారు. ఉద్యోగ బంధనాలనుండి గూడా విముక్తు లయ్యారు. విశాలమైన స్వేచ్ఛా ప్రపంచంలో ప్రవేశించా రాయన.

పాశ్చాత్యుల విద్యాలయాలను బహిష్కరించాలని తీర్మానించడంవల్ల వివిధ రాష్ట్రాలలో జాతీయ విద్యాలయా లనేకం వెలసినవి. బందరులోని జాతీయ కళాశాల ఆ ఫలితంగా ఏర్పడినదే. కోపల్లె హనుమంతరావు, డాక్టరు పట్టాభి, ముట్నూరి కృష్ణారావుగార్లు దీని సాపకులు. కోపల్లె హనుమంతరావుగారు ప్లీడరు వృత్తి మానివేసి పూర్తిగా దీనిపై కేంద్రీకరించారు. ఈ జాతీయ విద్యాపీఠమునకు ఆచార్యులైనారు, ఆంధ్ర దేశంలో తొలిదినాలలో సుప్రసిద్ధులైన రాజకీయ వేత్తలను, కవులను గాయకులను, చిత్రకారులను సృష్టించిన ఘనత ఈ జాతీయ కళాశాలకు దక్కింది. స్వరాజ్య ఉద్యమంలో పాల్గొన్న ప్రముఖ లనేకులు ఇచ్చట అధ్యాపకులుగా వుండి పనిచేశారు. హరిసర్వోత్తమ రావుగారు ఈ కళాశాల స్థాపనా ప్రయత్నాలలోను, విరాళములు వసూలు చేయుటలోను తోడ్పడినారు. చిరకాలం పాలకవర్గ సభ్యులుగా వున్నారు.

చెరుకువాడ వేంకట నరసింహం పంతులుగారొక అధ్యాపకుడుగా ఇచ్చట పనిచేస్తుండేవారు. గవర్నమెంటు ఈనేషనల్ కాలేజీకి 15 వేలరూపాయలు గ్రాంటు యిచ్చేది. ఆకారణంగా, "చెరుకువాడవారు అసహాయోద్యమ ప్రచారకుడు కాబట్టి ఆయ

నను తొలగించకపోతే, కాలేజీకి ఇచ్చే గ్రాంటును ఆపివేస్తా"మని ప్రభుత్వం హుకుం జారీచేసింది. హనుమంతరావు గారేమి సమాధానమిచ్చారో చూచారా! "ఆయన అసహాయోద్యమ ప్రచారకులైతే, శిక్షాస్మృతి ప్రకారం కోర్టులో అభియోగం తేండి - వారి రాజకీయ అభిప్రాయాలతో ఇక్కడ నిమిత్తంలేదు"అన్నారు.

ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకత్వమున "కృష్ణాపత్రిక" బందరునుండి ఉజ్జ్వలంగా వెలువడ సాగింది. ఈ రోజుల్లోనే వీరి సంపాదకీయాలు తెలుగువారిలో అద్భుత రాజకీయ చైతన్యం కల్గించినవి. ఆరోజుల్లో మన ఆంధ్రజాతీయ, భాషా, సాంస్కృతిక పునరుజ్జీవనానికి తోడ్పడిన వందేమాతరం ఉద్యమంతోను, విజ్ఞాన చంద్రికా గ్రంథమండలితోను, బందరు జాతీయ కళాశాలతోను హరిసర్వోత్తమరావుగారికి సన్నిహిత సంబంధాలేర్పడినవి.

వందేమాతరం రోజుల్లో బెంగాలులో చెలరేగిన టెర్రరిస్టు ఉద్యమం గమనించ దగినది. పరప్రభుత్వాధికార్లకు వ్యతిరేకంగా విప్లవపూర్వక చర్యలు జరుపుతుండేవారు. అప్పట్లో 'తల్వార్' అను కరపత్రం బెంగాలునుండి తెలుగుదేశానికి గూడా వస్తుండేది. తల్వార్ అనగా కత్తి. "యుగాంతర్"మరొక ముఖ్య పత్రిక. అవి తెల్లపరిపాలకులను చంపివేయాలని భావోద్రేకం కలిగించేవి. అందు చేతిబాంబులు ఎలాచేయాలో వ్రాస్తుండేవారు. హరిసర్వోత్తమరావుగారు మొదట్లో వాటిని తెలుగుచేసి, చేయించి రహస్యంగా అందజేస్తుండేవారని చెరుకువాడవారు మా సంభాషణలో చెప్పారు.

అప్పుడప్పుడు బెంగాలు విప్లవయువకులు వస్తూపోతూ

వుండేవారు. అది పసికట్టి పోలీసుశాఖ ఆంధ్రదేశపట్టణాల్లో కొన్నిసోదాలు చేసేది. కాని ఆచూకీతెలిసి, నిరూపణ అయ్యేది కాదు. ఇక్కడ పెద్దగా జరిగిందీలేదు. టెర్రరిస్టు ఉద్యమ త్యాగ ప్రభావం ఆంధ్రయువకుల్లో కలిగినా, ఆ విప్లవకేంద్ర బీజాలు ఆంధ్ర భూభాగాల్లో అంతగా వేరూనినట్లు కనుపించదు. తదితర ఆంధ్రనాయకులవలెనే హరిసర్వోత్తమరావుగారు కూడా దరిమిలా వాటితో అంతసంబంధాలు పెట్టుకొన్నట్లులేదు. రావుగారు తన మిత్రులతో మాట్లాడుతూ "టెర్రరిస్టుల ఉద్దేశాలు, త్యాగాలు మహోన్నతమైనవే. కాని వారనుసరించే హింసాపద్ధతులుమాత్రం సరికావు" అనేవారట. అహింసావ్రతుడైన రావుగారెన్నడూ హింసాయుత విప్లవచర్యలను ప్రోత్సహించనూలేదు. అనుసరించనూలేదు. అవి భారత స్వరాజ్య సంపాదనకు సరియైన మార్గాలు కావని వారు విశ్వసించినట్లు తెలుస్తుంది.

## 'స్వరాజ్యపత్రిక'

స్వరాజ్యపత్రిక వ్యాసం - హరిసర్వోత్తమరావు గారిపై రాజద్రోహం నేరం - 1908 జులై 18 బందరులో అరెస్టు - వెల్లూరు జైలులో నరకబాధలు.

స్వరాజ్యభావాలను ప్రచారం గావించుటకుగాను, ఆనాటి దేశభక్తులు అనేక పత్రికలు స్థాపించారు. తద్వారా చదువరులలో దేశభక్తిని రగుల్కొల్పారు. మహారాష్ట్రంలో తిలక్ మహాశయుడు 'కేసరి', 'మరాటా' పత్రికలు నడుపుతుండేవారు. బెంగా

ులో అరవిందఘోష్ 'వందేమాతరం' భూపేష్‌నాథ్ 'యుగాంతర్' లను స్థాపించారు. ప్రజాభిప్రాయాన్ని తీర్చిదిద్దుటకు స్వతంత్ర పత్రికలు ప్రముఖ సాధనములుగదా!

ఈ అవసరమును గుర్తించిన హరిసర్వోత్తమరావు గారు బెజవాడ విచ్చేశారు. శ్రీ కాశీనాథుని వీరమల్లయ్యగారితో ఒక అంగీకారానికి వచ్చి, ఒక ముద్రణాలయమును తీసుకొన్నారు. బోడి నారాయణరావు, పింగళి లక్ష్మీనారాయణగార్లతో కలిసి రావుగారు ప్రధాన సంపాదకులుగా, స్వరాజ్య అను తెలుగువార పత్రికను నడుప సాగారు.

ఆరోజుల్లో దక్షిణాదిన కోస్తావ్యాపారమంతా బ్రిటిష్ దొరల అధీనంలో వుండేది. ఒ. వి. చిదంబరం పిళ్ళై అను నతడు ఆంగ్లేయుల గుత్తవ్యాపారమును వ్యతిరేకించి, స్టీమరునుకొని, దక్షిణాదిన కోస్తావ్యాపారం చేయ మొదలుపెట్టాడు. దీనికి ప్రభుత్వం ఏవో సాకులతో నేరంమోపి పిళ్ళైగారిని అరెస్టుచేసి, యావజ్జీవ శిక్ష విధించింది.

1908 లో తిరునల్వేలి జిల్లాలో 'ఆష్' అను ఆంగ్లేయాధికారిని విప్లవకారులు కాల్చిచంపివేశారు. అందుపై గుమిగూడిన ప్రజలపై నిర్దాక్షిణ్యంగా పోలీసులు తుపాకులు కాల్చారు. ఇద్దరు చనిపోయి, పలువురు గాయపడినారు. ఈసంఘటన రావుగారి మనస్సునెంతో కలచివైచినది. స్వరాజ్య పత్రికలో విపరీత బుద్ధి' అనే శీర్షికక్రింద ఇలా వ్రాశారు:

"అరెరీ! ఫిరంగీ! క్రూరవ్యాఘ్రమా! నిష్కారణముగ నీవు ముగ్గురు హిందువులను ఒక్కసారిగా పొట్టన పెట్టుకొంటివి గదరా! నీవు నీనీతి

చట్టములనుగూడా అతిక్రమించుచున్నావు. ఓ భయభ్రాంతుడా! పొగరుబోతు తనమున కన్నులు గాననివారికి సహజ లక్షణమైన ఇట్టి వ్యతిరేకాభిప్రాయములను కలిగిన నీవు, నీరహస్యములను బయటపెట్టుకొంటివి. హిందూ జాతీయాభివృద్ధితో మీవిదేశ పరిపాలనా విధానమంత మొందగలదని నీవు ఋజువుచేసి చెప్పుచున్నావు."

ఈ సంపాదకీయమును పురస్కరించుకొని, 1908 జులై 18 వ తేదీన రావుగారిపైన, ముద్రాపకులైన బోడి నారాయణరావు గారిపైన రాజద్రోహ నేరం మోపారు. హరిసర్వోత్తమరావు గారిని బందరులో అరెస్టు చేశారు. ఈకేసు సందర్భంలో బెజవాడలో కాశేశ్వరరావుగారియిల్లు, బందరులో పట్టాభిగారియిల్లు పోలీసులు సోదాచేశారు. బెజవాడ సబ్‌డివిజనల్ మేజస్ట్రేటు కోర్టులో కేసు నడిచింది. తర్వాత బందరు కృష్ణాసెషన్సు కోర్టుకు పంపబడింది. రావుగారి పక్షాన కిందికోర్టులో చింతకింద సూర్యనారాయణ, బందరులో జె. డి. శామ్యూలు, రామాచార్యులు గార్లు న్యాయవాదులుగా పనిచేశారు.

అప్పట్లో జడ్జీగా పార్శీయుడైన "కెర్షాస్పు" అనే వారుండేవారు. ఆయన చాలా ఉదారహృదయుడు. "ఈవ్యాసంలో ఉద్రేకంవుందిగాని రాజద్రోహం అంతగాలే"దని చెపుతూ రావుగారికి 6 నెలలు, బోడి నారాయణరావుగారికి 9 నెలలు శిక్ష విధించాడు. ప్రభుత్వ దృష్టిలో ఈశిక్ష చాలలేదుగాబోలు! ప్రభుత్వం మద్రాసు హైకోర్టుకు అపీలు చేసుకొన్నది. ఆన్యాయమూర్తులు జస్టిస్ బెన్‌సన్, మిల్లరులు రావుగారికి మూడు సంవత్సరములకు శిక్షను పెంచారు. కెర్షాస్పు ఉద్యోగం తగ్గించివేసింది ప్రభుత్వం. తర్వాత ఆయన ప్రభుత్వోద్యోగమే మానివేశాడు.

ఈకేసులో ముద్దాయిలలో నొకరగు పింగళి లక్ష్మీనారాయణగారు అరెస్టు తప్పించుకొని, పుదుచ్చేరికి వెళ్ళి అటనుండి సింహళం, బర్మాలు తిరిగి, కేసుపోయిన తర్వాతవచ్చి, 1930_32 కాంగ్రెస్ సత్యాగ్రహోద్యమాలలో జైలుకు వెళ్ళారు. సన్యసించి స్వామినారాయణానంద సరస్వతి అయినారు.

ఈకేసును గూర్చి రావుగారు రేడియో ప్రసంగంలో ఇలా అన్నారు:

"మాకేసు విచారణచేసిన న్యాయమూర్తి కెర్షాస్పు ఒక పార్శీపెద్ద. నాయందు ఎనలేని దయగలవా డాయెను. దానికి కారణము ప్రాసిక్యూషన్ వారు నాదురాలోచనలను రుజువు చేయడానికి సాక్ష్యముగా తెచ్చిన నా 'శివాజీ ఉత్సవపు టుపన్యాసము'. ప్రాసిక్యూటరు దానిని చదివి వినిపిస్తుంటే న్యాయమూర్తికి పరవశత్వము కలిగి పోయింది. అతడు నన్ను నిర్దోషిగా ప్రకటించి, విముక్తుణ్ణి చేస్తాడేమో యని మాకే భయం కలిగింది. అట్లా వదలిపెడితే పోలీసువారు వేరే కేసుపెట్టి అయిదేండ్లు శిక్షవేయింపిస్తారని మాభయం. కాబట్టి కెర్షాస్పుగారు తేలికగా శిక్షవేయడమే మేలనే సూచన ఆయనకు అందింది. ఆయన నాకు ఆరునెలలు సింపిల్ ఖైదు విధించెను. గవర్నమెంటు అంగీకరిస్తుందా? ఎక్కువ శిక్షకొరకు హైకోర్టుకు అపీలు పెట్టింది. న్యాయమూర్తులైన జస్టిస్ బెన్‌సన్, మిల్లరులు నాఖైదును మూడేండ్ల కఠినశిక్షకు పెంచినారు.

నాయందు దయచూపిన జడ్జికెర్షాస్పు ముప్పుతిప్పలు పడవలసి వచ్చెను. సర్కారు ఉద్యోగమే మానుకొని బారిస్టరుగా వుండిపోవలసి వచ్చెను. అట్టి ఉదారహృదయుణ్ణి నేను విస్మరింపగలనా? విస్మరింపవచ్చునా?

— 'నాజీవితంలో విస్మరింపరాని ఘట్టములు' నుండి

హరిసర్వోత్తమరావుగారిని అరెస్టు చేసిన రోజుననే, పూనాలో లోకమాన్య బాలగంగాధర తిలక్‌గారిని అరెస్టు చేయడం జరిగింది. ఆరేండ్లు కఠినశిక్ష విధించి బర్మాలోని మాండలే జైలులో నిర్బంధించారు. తిలక్ అరెస్టుకు నిరసనగా ఆరు రోజులు బొంబాయి కార్మికులు, విద్యార్థులు సమ్మెచేశారు. తమ కోర్కెల కోసమేగాక, జాతీయ సమస్యలయెడలగూడా కదిలి ముందుకు రాసాగారు. "నా స్వాతంత్ర్యంకంటే నానిర్బంధం నా దేశానికి శ్రేయస్కరం కాగలదన్నారు" తిలక్. ఆంధ్రదేశంలో ప్రప్రథమ రాజకీయఖైదీ హరిసర్వోత్తమరావుగారు. ఆంధ్రుల త్యాగ మార్గానికే మార్గదర్శకులైనారు. వీరిని "ఆంధ్రతిలక్" అని ఆరోజుల్లో వ్యవహరించే వారు.

వెల్లూరుజైలులో రావుగారు ఆమూడేండ్లు నరకబాధల ననుభవించారు. ఆనాటి జైలు పరిస్థితులనుగూర్చి, తర్వాత విప్లవ కారుడుగా అరెస్టు చేయబడిన దేశభక్తులలో నొకరైన దర్శి చెంచయ్యగారిలా వ్రాశారు :

"శ్రీ హరిసర్వోత్తమరావుగారిని అతిక్రూరంగా శిక్షించి వెల్లూరు సెంట్రల్ జైలులో నిర్బంధించిరి. ఆకాలంలో జైళ్లలో ఖైదీలను పెట్టు చుండిన బాధలు వర్ణించుట సాధ్యంకాదు. ఈ బాధలన్నిటికి ఆయన గురిఅయ్యారు. ఇతరఖైదీలకువలెనే రాజకీయఖైదీయైన హరిసర్వోత్తమ రావుగారి బట్టలుతీసివేసి రెండు గోచీలు యిచ్చిరి. మూరెడు చదరంగల రెండు తువ్వాళ్లు యిచ్చిరి. పడుకొనుటకు చిన్న ఈతచాప యిచ్చిరి. అన్నంతినుటకు మట్టిచట్టి, నీళ్ల త్రాగుటకు మట్టిముంత, మలమూత్ర విసర్జనకు మరొక చట్టిమాత్రమే యిచ్చిరి. కాలికి లావాంటి కడియం, మెడకు మరొక ఇనుపకడియంవేసి ఒక కొయ్యముక్కను దూర్చివేసిరి.

మట్టితో పండ్లు తోముకోవాలి. అధికార్లు నిర్ణయించిన సైముకే మల విసర్జన చేయాలి. స్నానానికి మూడునాల్గుముంతల నీరు యిస్తూవుండిరి. తినుటకు రాగిసంకటిముద్ద. ఆముద్దలో పుల్లలు, రాళ్లు, మట్టి వుండేవి. ఆకులలములతో ఉడకబెట్టిన పులుసునీరు. వాటిలో వుండిన పురుగులనైనా కడిగివేయరు. ఈలాగు తయారయిన పులుసునీళ్లలో ఉడికిచచ్చిన పురుగులు తేలుచుండేవి. మొలత్రాడు, జంధ్యము తీసివేశారు. తల బోడిచేశారు. ఎన్నివిధాల మనుష్యులను అగౌరవ పరచడానికి సాధ్యమో, అన్నివిధాల అగౌరవపరుస్తూ దేహబలాన్ని మనోబలాన్ని అణగద్రొక్కి, ప్రజలు దేశసేవకు, మానవసేవకు ప్రయత్నించకుండా వుండేలాగు జైలు పద్ధతి ఆంగ్లేయ సామ్రాజ్య వాదులు తయారు చేసిరి. మన ఆంధ్రవీరుడు సుమారు 1200 రోజులు ఆలాగున అహోరాత్రిళ్లు కఠినశిక్ష ననుభవించిరి. ఆయన చదువుకొనుటకు స్వంత పుస్తకమునైనను యివ్వలేదు. ఆయనతో మాట్లాడినా, ఆయనకు సానుభూతి చూపించినా ఉద్యోగము పోవునని జైలు ఉద్యోగులు భయపడుచుండిరి. 3 నెలలకొకక ఉత్తరం వ్రాయుటకు, ఒక ఉత్తరం తెప్పించుటకు ఉత్తర్వు చేసిరి.

గవర్నరు జైలు చూచుటకు వచ్చినపుడు రావుగారు తనను ఒక మనుష్య మాత్రునిగా పరిగణించ వలసిందని కోరగా ఆ సామ్రాజ్య వాద దురహంకారి రావుగారిని దుర్భాష లాడిరి. ఇలాంటి కష్టాలను ఆంధ్రదేశంలో మరొక దేశభక్తుడు అనుభవించలేదని దృఢంగా చెప్పగలను."

— దర్శి చెంచయ్యగారి "నా దివ్య స్మృతులు" అను పుస్తకంనుండి

హరిసర్వోత్తమరావుగా రెలాంటి దుర్భరజైలు జీవితం అనుభవించారో దీన్నిబట్టి తెలుసుకోవచ్చు. తనవెనుక ఎవరు వస్తారో, రారో తెలియనిస్థితి. వుండేది ఖూనీలు, దొంగతనాలు చేసి జైలుకు వచ్చిన దొంగలతో. నికృష్టమైన తిండి. బయటి ప్రపంచంతో ఏమీ సంబంధంలేదు. బంధుమిత్రులను చూడటానికే

వీలులేదు. పుస్తకాలు చదువుకోటాని కవకాశంలేదు. పత్రికలు జైలులోనికి రానివ్వరు,అది ఆనాటిస్థితి.

తర్వాత కాలంలో జతీన్‌దాసుగుప్తా బోటి విప్లవకారులు ఆమరణ నిరశనవ్రతాలు చేసి జైలు సంస్కరణలకోసం ఆత్మా ర్పణ గావించారు. రాజకీయ ఖైదీలకు సౌకర్యాలు కావాలని బయట ఆందోళన జరిగింది. ఫలితంగా ఎ, బి, సి తరగతు లేర్పడి నవి. తదనంతరం జరిగిన సత్యాగ్రహోద్యమాల్లో వందలు వేల కొలది వాలంటీర్లు జట్లుజట్లుగా వచ్చేవారు. జైల్లోగూడా కలిసే వుండేవారు. జైల్లో వేదాలు, వేదాంతాలు అధ్యయనం చేసినవా రున్నారు. 'స్వీయ చరిత్రలు' వ్రాసిన నాయకులున్నారు. మన స్సుకు, శరీరానికి మంచి విశ్రాంతి నిచ్చిందనేవారు, జైలు జీవితం ప్రశాంత ఆలోచనలకు తావిచ్చిందన్నవారు చాలామంది. ఇవి తర్వాత తర్వాత జైలు పరిస్థితులలో వచ్చినమార్పులు. రాజకీయ ఖైదీలకు ఏమాత్రం అసౌకర్యాలున్నా, వారియెడల అగౌరవం జూపినా, దేశంలో బ్రహ్మాండమైన ఆందోళన చెలరేగుతుందనే భయంవుండేది జైలు అధికార్లకు.

ఉద్యమపు మొదటి రోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వం క్రూర మైన నిర్బంధాలు జైలులో అమలుపరచడానికి కారణం ఒక్కటే. హరిసర్వోత్తమరావుగారి లాంటి మేధావులను హింసించి, వారి మనోనిబ్బరాన్ని కోల్పోయేటట్లు చేయటం, దేశసేవ చేయుటకు ముందుకొచ్చే దేశభక్తులను భయభ్రాంతులను చేయటం ఆనాటి పరిపాలకుల ముఖ్యోద్దేశం.

కాని జాతీయ స్వాతంత్ర్యోద్యమ పురోగమనాన్ని ఈ నిర్బంధాలు, కఠిన శిక్షలు ఎంత మాత్రం ఆపలేకపోయినవి.

వందేమాతరం అనే నినాదంతో ప్రారంభమైన భారత స్వరాజ్య ఉద్యమం నానాట అభివృద్ధి కాజొచ్చింది. రావుగారిలాంటి తొలి దేశభక్తులు చేసిన త్యాగాల పునాదులమీదనే నేడు భారతస్వరాజ్య సౌధం నిర్మించబడిందనే విషయం మరువ గలమా !

తన జైలు అనుభవాలను గురించి, రేడియో ప్రసంగంలో రావుగా రిలా చెప్పారు :

"మూడేండ్ల శిక్ష ననుభవించడంలో విస్మరింపరాని ఘట్టాలు - చిల్లర మల్లరివి - చాలా వుండునని ఎవరికైనా తోచును. అవియన్నిటిని ఇచ్చట ఏకరువు పెట్టడము చేయదగిన పనికాదు. ఏ కారణం చేతనో జైలులో నాకు 'తిక్కుడు రాజు' అని పేరు పడిపోయెను. అచ్చటి జీవితాన్ని నేనంతటి ఔదాసీన్యముతో చూచుటకు నాకీశ్వరుడు శక్తి నిచ్చెను, ఆ కారణంచేత అందరికి నాయందు ప్రేమాదరణలు హెచ్చి నాకు అచటి జీవితముకూడా తేలికయయిపోయెను. ఈ సందర్భములో నా మిత్రుడు ఎరుకల సుంకని నేను మరువలేను. అతడు బందిపోటు నేరానికి ఎనిమిదేండ్ల శిక్ష ననుభవించినాడు. రత్నకంబళి పనిలో ప్రవీణుడయి యుండినాడు. ఆతనికి గూడా నాయందు గొప్ప ప్రేమ కలిగింది. జైలు అధికారులు నాకు కూడా రత్నకంబళి నేత పనిని వినియోగించినారు. పనిలో క్రొత్తయయిన నాకు పని నేర్పడమే గాక, నేను ప్రతి దినము చేయవలసిన పని పరిమాణము తగ్గినప్పుడు నాపనిని కూడ పూర్తిచేసి యిచ్చేవాడు. ఆపదలో బంధువుడుగా నా కుపకరించిన ఈ మిత్రుణ్ణి (ఎరుకల సుంకని) మరచుటెట్లు ?.....

....మూడు సంవత్సరములు నేను కారాగారమందుండగా చెప్పరాని కష్టములన్నిటిని భరించి, నేను విడుదల యగు నాటికి హాజరయి, పూలమాలతో, చిరునగవుతో నన్ను పూజించిన నా ప్రియసతిని మరచుటెట్లు ?"

—'నా జీవితంలో విస్మరించరాని ఘట్టాలు' నుండి

## హోంరూలు ఉద్యమం

రాష్ట్ర హోంరూలు లీగ్ కార్యదర్శి-దక్షిణ భారత సత్యాగ్రహ సంఘ సంయుక్త కార్యదర్శి - గాంధీ యుగారంభం-1921 సహాయ నిరాకరణోద్యమం.

1914 లో ప్రథమ ప్రపంచ సంగ్రామం వచ్చింది. అప్పటి దాకా కాంగ్రెస్‌లో మితవాదులకు, జాతీయ వాదులకు భిన్నాభి ప్రాయాలుండేవి. బ్రిటిష్‌వాళ్ళ మంచిపై మితవాద నాయకులకు మంచి విశ్వాసం వుండేది. భారత ప్రజల బలంపై నేషనలిస్టులకు విశ్వాసం వుండేది. మితవాదుల పిటీషనుల కార్యక్రమం వీరికి నచ్చేదికాదు. బాలగంగాధర తిలక్ తీవ్ర జాతీయ వాదులకు నాయకుడుగా వుండేవాడు.

క్రమేణా ఇండియాకు అధినివేశ ప్రతిపత్తి కావాలనే స్వాతంత్ర్య వాంఛ బలపడ జొచ్చింది. బ్రిటిష్ సామ్రాజ్యాధికారం కింద అధినివేశ ప్రతిపత్తియే (Dominion Satus) హోంరూలు లీగ్ ఆశయం కూడ. ఈ వుద్యమానికి స్థాపకురాలు శ్రీమతి ఆనీబిసెంటు. ఈమె ఒక ఐరిష్‌యువతి. మహావక్త. దివ్యజ్ఞాన సమాజ నాయకురాలు, తన అనర్గళ ఉపన్యాసాలతో భారత ప్రజల నుద్రూత లూగించింది. "న్యూయిండియా","కామన్‌వీల్" పత్రికల ద్వారా అతివాద జాతీయ భావాలను ప్రచారం గావించేది. హోంరూలు ఉద్యమ ముఖ్య కార్యక్రమంలో (1) స్వదేశీ వ్రతం (2) బ్రిటిష్ వస్త్ర బహిష్కారం (3) జాతీయ విద్య (4) కల్లు, సారా పికెటింగులు మున్నగునవి ప్రధానంగా వుండేవి.

భారతదేశ రాజభక్తికి ఫలితంగా దీనికి స్వాతంత్ర్యం లభించాలి.
(The price of India's loyalty is India's freedom) అని బీసెంటు స్పష్టపరిచింది. ఈమె ప్రసంగాలు పట్టణమధ్యతరగతి మేధావులను బాగా ఆకర్షించినవి. అనీబిసెంటు కృషివల్ల కాంగ్రెస్ లోని అతివాద-మితవాద నాయకుల మధ్యగూడా కొంత సఖ్యత ఏర్పడింది.

1916 నాటికే తిలక్ మహారాష్ట్రంలో హోంరూలు లీగ్ నేర్పరచి పనిచేస్తున్నారు. అలహాబాద్‌లో మోతీలాల్ నెహ్రూ గారీబాధ్యతను స్వీకరించారు. కాంగ్రెస్ వాదులేగాక, దివ్యజ్ఞాన సమాజ నాయకులు సైతం ఈ లీగ్‌లో చేరారు. దక్షిణ భారతంలో బీసెంటు తీవ్ర ప్రచారం చేసింది. బ్రిటిష్ ప్రభుత్వం ఇది సహించలేక, బీసెంటునూ, ఆమె సహచరులైన అరండేల్, వాడియాగార్లనూ ఉదకమండలం, కోయంబత్తూరులలో నిర్బంధించింది. దీనితో ఉద్యమం ఇంకా పెరిగింది. వీరి విడుదలకై తీవ్ర ఆందోళన సాగింది. కొందరు సాత్విక నిరోధం చేస్తామన్నారు. ప్రజాందోళనవల్ల ప్రభుత్వం ఆమెను విడుదల చేసింది. 1917 లో ఆమె కాంగ్రెస్‌కు అధ్యక్షురాలుగా ఎన్నుకోబడింది.

ఆంధ్రలో బలమైన హోంరూలు లీగ్ శాఖ ఏర్పడింది. కాంగ్రెస్ వాదులంతా దీనిలో చేరారు. హరిసర్వోత్తమ రావుగారు రాష్ట్ర కార్యదర్శిగా, యావదాంధ్ర దేశం పర్యటించి, హోంరూలు ప్రచారం చేశారు. స్వరాజ్యం కావాలని కోరుతూ, వేలకొలది సంతకాలుచేసి ప్రభుత్వానికి పంపించారు.

అవి యుద్ధపురోజులు. దక్షిణాఫ్రికాలో భారతీయుల హక్కులకోసం పోరాడి, గాంధీజీ భారతదేశానికి తిరిగి వచ్చారు.

ప్రభుత్వానికి యుద్ధంలో సహకారం చేయాలనేది గాంధీజీ, బిసెంటమ్మల వాదన. "ఎర్రగా కాలియున్నప్పుడే ఇనుమును సమ్మెటతో కొట్టు" (Strike while the iron is hot) అను సామెతప్రకారం యుద్ధకాలంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయాలని తిలక్‌గారి వాదన. బిసెంటుగారి యుద్ధసహకార ధోరణి హరిసర్వోత్తమరావుగారికి నచ్చలేదు. భేదాభిప్రాయా లుత్పన్న మైనా, హోంరూలు ఉద్యమంలో కలిసే పనిచేశారు. అరండేల్ జనరల్ సెక్రటరీగా వుండేవారు. రావుగారితో ఎలాగో సర్దుక పోతుండేవారు.

బందరులో హోంరూలు ఉద్యమ సందర్భంలో గొప్ప బహిరంగసభ జరిగింది. 'రాజకీయ సభల్లో విద్యార్థు లెవ్వరూ పాల్గొనరా'దని ఆరోజుల్లో గవర్నమెంటు జీ. వో. నెం 555 జారీ చేసింది. మద్రాసులోగూడా ఆనీబిసెంటు, రావుగార్లు బహిరంగ సభలు జరిపారు. స్వదేశ్ మిత్రన్' రంగస్వామి అయ్యంగార్ మున్నగువారంతా బాగా సహకరించేవారు.

వెనుకటి హోంరూలు రోజులను గురించి, రేడియో ప్రసంగంలో రావుగారిలా చెప్పారు :

"నాజీవితంలో నేను విస్మరించరాని ఘట్టములు హోంరూలు యుగంలో ఒకటి, రెండుకలవు. తిలక్ మహాశయు డొకవైపున, మద్రాసు ప్రాంతంలో ఆనీబిసెంటమ్మ మరొకవైపున హోంరూలు లీగులు స్థాపించి పనిచేయుచుండినారు. మిత్రులు పట్టాభిసీతారామయ్యగారు విరమించుకొన్నందున పోటీలేక, నేనే హోంరూలు లీగుకు రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నికయితిని. మొదటి సందర్భనంలోనే నాకు, బీసెంటమ్మగారికి భేదాభిప్రాయములు కలిగినవి. కాని ఆమె గొప్ప

ఉదారహృదయ. కాబట్టి నాధోరణిలోనేను పనిచేసుకొని పోవుట కంగీకరించెను. ప్రజలలో రాజకీయ విజ్ఞానమును వ్యాపింపజేసి చైతన్యము కల్గించడమే మాయుద్దేశము."

—'నా జీవితంలో విస్మరించరాని ఘట్టాలు' నుండి

వందేమాతరం, హోంరూలు ఉద్యమాల వలన దేశంలో రాజకీయ చైతన్యం హెచ్చయినది. జాతీయోత్సాహం దేశవ్యాప్త మయింది. 1919 ఏప్రిల్ 6 వ తేదీన హర్తాళములు జరిగినవి. మరొకవైపు ఈ పొంగులువారుతున్న జాతీయోద్యమాన్ని అణచి వేయుటకు బ్రిటిష్ప్రభుత్వం సామదానభేదదండోపాయాలు పన్నుతూవున్నది. క్రమానుగతంగా అధినివేశ ప్రతిపత్తి ప్రసాదించటమే తమ వుద్దేశమని ప్రకటించినది. మాంటేగూ చమ్సుఫర్డు రాజ్యాంగ సంస్కరణలంటూ నివేదిక తయారుచేశారు. కాని ఇవేమీ దేశీయులను సంతృప్తి పరచజాలక పోయినవి. అనుమానంపై ఎవ్వరినైనా అరెస్టు చేయటానికి వీలుగా ప్రభుత్వం రౌలట్ శాసనాన్ని సిద్ధంచేసుకొన్నది. ప్రజలపై కాల్పులు చేసింది. 1919 సంవత్సరంలో అమృతసర్ కాంగ్రెస్ మహాసభ జరిగింది. అప్పటికి కాంగ్రెస్‌లో గాంధీజీ నాయకత్వం స్థిర పడింది. నాటినుండి భారతదేశంలో గాంధీయుగ మారంభమైన దనవచ్చు. రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా మహాత్ముడు అసహాయోద్యమాన్ని ప్రబోధించ ప్రారంభించారు. లాలా లజపతిరాయి ప్రభృతులకు తీవ్రజాతీయ భావాలున్నా, అప్పట్లో అసహాయోద్యమం ఆచరణ సాధ్యమైనది కాదన్నారు. బీసెంటు ఈవాదనను బలపరచింది. ఈమె 'నేషనల్ హోంరూలులీగ్' అంటూ స్థాపించ ప్రయత్నించిందిగాని, కాంగ్రెస్‌వాదులు గాంధీజీవైపు

మొగ్గ చూపారు. తదాది భారతవాణికి మహాత్ముడు ప్రాతినిధ్యం వహించి కాంగ్రెస్ సారధ్యం వహించారు. కాంగ్రెసులో అత్యధిక సంఖ్యాకులు అసహాయోద్యమాన్నే బలపరచ సాగారు. గాంధీజీ సత్యాగ్రహ ప్రమాణపత్రాన్ని సిద్ధపరచి, సత్యాగ్రహులను సమకూర్చుకొనుటకు కృషిచేశారు. 1920 లో కలకత్తాలో జరిగిన ప్రత్యేక కాంగ్రెస్‌లో నాన్‌కో ఆపరేషన్ తీర్మానం ఆమోదించబడింది. హరిసర్వోత్తమరావుగారు దక్షిణ ఇండియా సత్యాగ్రహ సంఘ సంయుక్త కార్యదర్శిగా నియమింప బడినారు. తదనుగుణ్యంగా ప్రచార కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

1921 లో వేల్సు రాకుమారుని (Prince of Wales) బహిష్కరణ, హర్తాళములు దేశమెల్లెడలా జరిగినవి. దీనిని అణచటానికి ప్రభుత్వం విచ్చలవిడిగా నిర్బంధ విధానాన్ని అవలంబించింది. అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశం, బెజవాడలో బ్రహ్మాండమైన మహాసభలాగా, అత్యంత వైభవోపేతంగా జరిగింది. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి 'రామదండు' క్రమశిక్షణ, ఆంధ్రవాలంటీర్ల సేవాదీక్ష మహాసభ విజయాని కెంతగానో తోడ్పడినవి. ఈ సభకు పిమ్మట సి. ఆర్. దాస్, మోతీలాల్, జవహర్‌లాల్, లజపతిరాయి మున్నగు దేశనాయకులెందరో అరెస్టుచేయ బడినారు.

దేశంతోపాటుగా, పలువురు ఆంధ్రప్రముఖులు వేలు గణించే న్యాయవాద వృత్తిని విసర్జించి, స్వరాజ్య ఉద్యమంలో పాల్గొన్నారు. విద్యార్థులు కళాశాలలను బహిష్కరించారు. కరణాలు, మునసబులు గ్రామోద్యోగాలకు ఒక్కుమ్మడిగా రాజీనామాలిచ్చారు. 1922 లో గుంటూరు జిల్లాలోని పెదనందిపాడు

ప్రాంతాల పన్నుల నిరాకరణ, పల్నాడుతాలూకాలోని అడవి పుల్లరి సత్యాగ్రహాలు ఈ సందర్భంలో ప్రధానంగా పేర్కొన దగినవి. ఆంధ్రదేశంలో జరిగిన పన్నుల నిరాకరణ ప్రసక్తి బ్రిటిష్ పార్లమెంటులోనైతం వచ్చింది. పల్నాడు ఫారెస్టు సత్యాగ్రహాల్లో ఉన్నవ లక్ష్మీనారాయణ, మాడభూషి నరసింహా చారిగార్లను ప్రభుత్వం అరెస్టు చేసింది. ఆ పోరాట సందర్భంలో వీరుడైన మించాలపాడు వాస్తవ్యుడు కన్నెగంటి హనుమంతుని ప్రభుత్వం కాల్చి చంపింది. ఈ విధంగా అసహాయోద్యమ ప్రభావం ఆంధ్రదేశంలో అతిస్వల్పకాలంలోనే అల్లుకొని పోయింది. దేశవ్యాప్తంగా 20 వేలమంది స్వచ్ఛంద సేవకులు అరెస్టులకు గురియయినారు. చౌరీచౌరాలో ప్రజలు దౌర్జన్య చర్యలకు పూనుకొన్నారని, గాంధీజీ సత్యాగ్రహాన్ని విరమించు టకు నిర్ణయించారు. కాని ప్రభుత్వం గాంధీగారి నరెస్టుచేసి 6 ఏండ్లు శిక్ష విధించింది. దేశంలో మతకలహాలు లేచినవి. ఉద్యమం విరమించ బడినది.

హరిసర్వోత్తమరావు, తన అభిప్రాయాలను నిష్కర్ష గాను, నిర్మొగమాటంగాను చెప్పటంలో ఆయనకు ఆయనయే సాటి. ఎ. ఐ. సి. సి. లో గాని, తుదకు గాంధీతోగాని స్పష్టంగా చెప్పుటకు వెనుదీయని స్వభావమాయనిది. ఒకసారి కాంగ్రెస్ కమిటీ సమావేశంలో గాంధీగారిని, తీర్మానాన్నిగూడా వ్యతిరేకిస్తూ సభా దృష్టికి తెచ్చారు. ఆ ఉదంతాన్ని గురించి తన రేడియో ప్రసంగంలో ఇలా చెప్పారు :

"గాంధీ యుగంలో మరపునకు రాని జీవిత ఘట్టాలెన్నిటినో గడుప వలసి వచ్చినది. ఆ వివరములన్నిటినీ ఉల్లేఖించుట అప్రస్తుతము.

ఒక్క విషయం ప్రస్తావిస్తాను. నా స్వోత్కర్షకోసరము చెప్పుచున్నా నని మాత్రం కోపపడవలదు. అందులో గాంధీజీ మహోత్కృష్టత ప్రకటిత మవుతుంది గావున సహించండి.

....అది 1922 వ సంవత్సరము. కోర్టుల బహిష్కారము ఉధృతంగా సాగుతూవుంది పెద్ద పెద్ద ఆదాయాలను మానుకొని ఎందరో మహనీయులు వకీలువృత్తిని విసర్జించి త్యాగమును కనుపరచుచుండినారు. ఆ సంవత్సరం ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశం జరిగింది. ఆ సమావేశంలో గాంధీజీ ఒక విచిత్రమైన తీర్మానమును ప్రవేశపెట్టినారు. 'కోర్టుల బహిష్కారం నుంచి వాదులను మినహాయించవలె' నన్నారు. దీనికి కారణం ఆశ్రితవాత్సల్యము. దేశపాండేయో, రాజేంద్రుడో నే నిప్పుడు చెప్పలేనుగాని, వాదిగా కోర్టు కెక్కకపోతే లక్షలు నష్టమయ్యే సందర్భమది. ఆ వ్యక్తికి గౌరవం దక్కవలెను. కాబట్టి ఈ తీర్మానము. సభలో 250 మందిమి ఉన్నాము. నాయకుడిట్టి తీర్మానము తెచ్చినాడు. ఆక్షేపించు కఠిన హృదయ మెవ్వరికి కలుగగలదు ? ఒకరి మొగ మొకరము చూచుకొనుచూ కూర్చున్నాము. తుదకు నేను లేచి, గుండె సర్దుకొని 'ఏమండీ గాంధీజీ ! మీరు ఆలోచించే ఈ తీర్మానమును పెట్టుతున్నారా? వాది అనే ఆసామీ లేకపోతే కోర్టువుండదే. పాప మీ వకీళ్ళు వాదులవల్లనే గదా బ్రతికేది ? వాదిలేకుంటే సాక్షులెక్కడ వస్తారు ? తొలగిస్తే బహిష్కారం పూర్తిగా తొలగించండి. లేకుంటే వున్నదున్నట్లే వుంచండి, సర్వ కష్టాలు పడుతుండే యీ వకీళ్ళకు మాత్రం అన్యాయం చేయకండి' అన్నాను.

గాంధీజీ చప్పున గ్రహించినాడు. 'నేను పెద్ద పొరపాటుపడినాను, బేషరత్తుగా నా ఈ తీర్మానాన్ని వుపసంహరించు కొంటున్నాను' అని వుపసంహరించుకొంటూ, తాను అప్పుడు నడుపుచుండిన "యంగ్ ఇండియా" పత్రికలో జరిగిన దంతయూ ప్రకటిస్తూ 'ధైర్యశాలి హరి

సర్వోత్తమరావు (The brave Harisarvothama Rao) గబుక్కునలేచి ఆక్షేపించినాడు' అని నాకొక విశేషము తగిలించినాడు. ఆయన యౌదార్యమును నాబోటివాడు మరువగలుగునా ?"

— 'నా జీవితంలో విస్మరించరాని ఘట్టములు' నుండి

# స్వరాజ్యపార్టీ నిర్మాణం

1923 లో కాకినాడ కాంగ్రెస్ మహాసభ- ఆంధ్ర స్వరాజ్యపార్టీ ఏర్పాటు - రాష్ట్రీ కాంగ్రెస్ కార్యదర్శిత్వం- పశ్చిమాంధ్ర సుబాకు ఏకైక నాయకుడు.

కాంగ్రెస్‌లో చిత్తరంజన్‌దాసు, మోతీలాల్ నెహ్రూ మున్నగువారు శాసన సభా ప్రవేశం చేయాలనీ, తద్వారా స్వాతంత్ర్యోద్యమాన్ని పెంపొందించ వచ్చుననీ వాదించేవారు. గాంధీజీ, రాజగోపాలచారి మొదలగువారు నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగిస్తూ అసహాయోద్యమాన్ని విజృంభింప చేయాలనేవారు. ఈవిధంగా ఆనాడు కాంగ్రెస్‌లో శాసన సభా ప్రవేశవాదులకు - నోఛేంజర్లకు మధ్య తీవ్ర వాగ్వివాదాలు సాగుతుండేవి...గయా కాంగ్రెస్‌లో సి. ఆర్. దాసు వాదనలు ఓడిపోయిన తర్వాత, మోతీలాల్ ప్రభృతులతోకలిసి 'స్వరాజ్యపార్టీ' నేర్పరిచారు. స్వరాజ్యం కోరే ప్రజాస్వామ్య వాదులెల్లరూ కౌన్సిళ్ళను వశపరుచుకోవలెనని, దేశమంతటా పర్యటించి ప్రచారం గావించారు.

1922_23 ప్రాంతాల్లో మునిసిపల్ కమిటీ మేయర్లుగా ప్రముఖ కాంగ్రెస్ నాయకులు ఎన్నుకోబడినారు. కలకత్తా కార్పొరేషన్‌కు దాసు, బొంబాయికి విఠల్‌భాయి పటేల్, అహమ్మదా

బాద్‌కు వల్లభాయిపటేల్, అలహాబాద్‌కు జవహర్‌లాలునెహ్రూ, ఈ విధంగా ప్రసిద్ధ నగరాలకు సుప్రసిద్ధ దేశభక్తులు కార్పొరేషన్ మేయర్లుగా ఎన్నుకోబడినారు.

*1923* లో మన ఆంధ్రదేశంలోని కాకినాడ పట్టణంలో అఖిల భారత కాంగ్రెస్ మహాసభ బ్రహ్మాండంగా జరిగింది. శాసన సభా ఎన్నికలను బహిష్కరించాలనే వారికి, ప్రవేశించాలనే వారికి మధ్య రాజీ తీర్మానం ఆమోదించబడింది. మహమ్మదాలీ, షౌకతాలీ సోదరులు ఖిలాఫత్ సమస్య కారణంగా హిందూ-మహమ్మదీయ ఐక్యతకు కృషిచేశారు. బులుసు సాంబమూర్తి గారి ఆధ్వర్యంలో దేశభక్త కొండా వెంకటప్పయ్యగారి అహ్వాన సంఘాధ్యక్షతను కాకినాడమహాసభ వైభవోపేతంగా జరిగింది. అది ఆంధ్రులలో అపూర్వ చైతన్యాన్ని కలిగించింది. కాకినాద కాంగ్రెస్‌లో కౌన్సిళ్ళలో ప్రవేశించే, సహాయనిరాకరణ చేయవచ్చునని తీర్మానించారు. వెనుకటి కాంగ్రెస్ నాన్ కో ఆపరేషన్‌ను పునరుద్ఘాటిస్తూనే, స్వరాజ్యస్టుల శాసనసభా ప్రవేశానికి అనుమతి నిచ్చిందా తీర్మానం.

దక్షిణాదిన యస్. శ్రీనివాసయ్యంగార్, వేమవరపు రామదాసుగారు మున్నగువారు స్వరాజ్యపార్టీ నాహ్వానించారు. ఆంధ్ర దేశంలో అయ్యదేవరకాళేశ్వరరావుగారు అధ్యక్షులుగాను, దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు కార్యదర్శిగాను ఆంధ్ర స్వరాజ్యపార్టీ యేర్పడింది. హరిసర్వోత్తమరావుగారు స్వరాజ్యపార్టీలో చేరారు. స్వరాజ్యపార్టీ నిర్వహణ బాధ్యతలను హరిసర్వోత్తమరావు గారి కప్పగిస్తూ 1924 నవంబరు 28 వ తేదీన మోతీలాల్ నెహ్రూ ఒక లేఖవ్రాశారు. రావుగారిలాంటి దేశభక్తుడు స్వరాజ్య

పార్టీలో చేరటానికి చేసుకొన్న నిర్ణయం, చాల విజ్ఞతతో కూడిన దని యిట్లు అభినందించా రాయన:

ఆనంద భవన్,

అలహాబాదు 1924-11-28.

ప్రియమైన హరిసర్వోత్తమరావుకు,

స్వరాజ్యపార్టీలోకి మిమ్ములను హృదయ పూర్వకంగా ఆహ్వానిస్తున్నాను, పార్టీలో చేరుటకు మీరు విజ్ఞతతో తీసుకొన్న నిర్ణయమును మనసారా అభినందిస్తున్నాను. మీరెంత ఉత్సాహపరులైన, చురుకైన కార్యకర్తలో నాకు తెలియనిది కాదు. ఆంధ్రలోను, దక్షిణాదిన స్వరాజ్యపార్టీ నిర్మాణానికి మీ సహకారమెంతో అవసరం.

మానుంచి నెలకొక వందరూపాయలు మీ ఖర్చుల నిమిత్తం దయతో స్వీకరించండి. ప్రత్యక్షంగా కేంద్ర పార్టీ నిర్మాణంతోనే సంబంధం పెటుకొని, కార్యక్రమం కొనసాగించ గోర్తాను. అచ్చట మన్న రాష్ట్రి నాయకులైన శ్రీనివాసయ్యంగార్, వి. రామదాసుగార్లతో సహకరించి కృషిచేయుదురని విశ్వసిస్తున్నాను. త్వరలో మనం బెల్గాంలో కలుసుకొందాం.

ఇట్లు,

మీ విశ్వసనీయుడు

మోతీలాల్ నెహ్రూ

## రాష్ట్రి కాంగ్రెస్ కార్యదర్శిత్వం

1917 వ సంవత్సరంలో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రి కాంగ్రెస్ సంఘం ఏర్పడినది. ఇందుకు బిసెంటు, గాంధీజీలు ప్రథమంలో వ్యతిరేకించారు. కాని తిలక్ గారి తీర్మానాన్ని బలపరచడంతో అధిక సంఖ్యాకులు ఆమోదించారు. తర్వాత జరిగిన భాషా ప్రయుక్త రాష్ట్రి కాంగ్రెస్ సంఘాల సాపనకిది మార్గదర్శకమైనడి.

ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘ కార్యస్థానం బెజవాడలో ఏర్పాటుచేయబడినది. తదాది జిల్లాలలో దేశారాధకులను నియమించి ప్రచారం గావించారు. జాతీయ పాఠశాలలస్థాపన, ఖద్దరు వ్యాప్తి, అస్పృశ్యతానివారణ, మద్యపాననిషేధం, హిందూ-మహమ్మదీయ ఐక్యత, హిందీభాషాప్రచారం మున్నగునవి నిర్మాణ కార్యక్రమాల్లో ముఖ్యభాగాలుగావుండేవి. తిలక్ స్వరాజ్యనిధి, గాంధీజీ పూజానిధులకు విరాళములు వసూలుచేసేవారు. గ్రామసీమల్లోనైతం సభాసమావేశాలుచేసేవారు. రావుగారు రాష్ట్రవ్యాపితంగా తిరిగి ప్రచారం గావించారు.

హరిసర్వోత్తమరావుగారు నెల్లూరుజిల్లా సంచారంలో గూడూరులో ఉపన్యసించినప్పుడు, ఆ గంభీరోపన్యాసాన్ని విని కీ. శే. వల్లటూరి వెంకయ్యనాయుడు మున్నగువారంతా తమ విదేశీ సిల్కుగుడ్డలన్నీ కుప్పవేసి, సభలో దగ్ధంచేసినదృశ్యం మరువరానిదని చెపుతారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి కొండా వెంకటప్పయ్యగారధ్యక్షులు. కాశేశ్వరరావు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, హరిసర్వోత్తమరావుగార్లు కార్యదర్శులు. గోపాలకృష్ణయ్యగారు దేశారాధకబృందం, జాతీయవిద్య, శాంతిసేన అను మూడుశాఖలు చూస్తుండేవారు. కాశేశ్వరరావుగారు కాంగ్రెస్ సంఘముల ఏర్పాటు, అస్పృశ్యతానివారణ, ఆఫీసుపని, కరస్పాండెన్సు చూస్తుండేవారు. హరిసర్వోత్తమరావుగారికి కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలను "పశ్చిమాంధ్ర సుబా"గాచేసి, సదరు సుబాకు సంబంధించిన సర్వవ్యవహారములు జరుపుటకు ప్రత్యేక కార్యస్థాన మివ్వబడినది.

పశ్చిమాంధ్ర వ్యక్తిత్వమును గుర్తించినందులకు ఆప్రాంతీయుల కెంతో సంతృప్తికలిగిందట.

వీటితోపాటు, ఖద్దరుబోర్డులకుగూడ హరిసర్వోత్తమరావు గారు ప్రధానకార్యదర్శిగా పనిచేసేవారు. రాష్ట్రఖద్దరుబ్యాంకు పనిని అప్పట్లో గొల్లపూడి సీతారామశాస్త్రిగారు * చూచేవారు. ఈ బహుముఖకార్యాదులను ఒకక్షణంగూడ విరామంలేకుండా రావు గారు నిర్వర్తిస్తుండేవారు. పనులు సులువుగాను,త్వరగాను జరుగు టకు వీలుగా, పెండ్యాల శేషగిరిరావు, మార్తిసూర్యనారాయణగా ర్లను ప్రచారకులుగా నియమించారు. అలానే మండలప్రచారకుల సహకారంతో, తమవిధులు కొనసాగించేవారు. ప్రచారకులకు కొద్దిగా గౌరవభృతి యిచ్చేవారు. కలచవీడువేంకటరమణాచా ర్యులు, కల్లూరి సుబ్బారావుగార్లు క్రమంతప్పక తమ ప్రాంత నివే దికలు పంపుతూ వుండేవారు.

ఆ నివేదికాంశములు ఇలావుండేవి:

1. వరుసనంబరు 2. దేశారాధకునిపేరు 3. గౌరవభృతి 4. ప్రయాణఖర్చులు 5. దర్శించినగ్రామాలు 6. ఏర్పరచిన గ్రామ సంఘములు 7. చేర్పించినసభ్యులు 8. వసూలైనచందాలు (గాంధీజీ పూజానిధి–తిలక్ స్వరాజ్యనిధి) 9. దర్శించినహరిజనపల్లెలు 10. ఏర్పరచిన ఖద్దరుసంఘములు 11. వృద్ధిచేసినరాట్నములు 12. ఏర్ప రచిన మగ్గములు 13. అమ్మినఖద్దరు 14. నూతనంగా తాను ఏర్పా టుచేసిన యితరకార్యక్రమములు.

---

* వీరుతర్వాత సన్యాసాశ్రమాన్ని స్వీకరించి 'స్వామి సీతారాం'గా వ్యవహ రింపబడినారు.

ఈవిధంగా చేసినపనికి సంబంధించిన స్టేటుమెంట్లను తయారుచేసి కార్యస్థానమునకు తెప్పించేవారు. వీటినన్నిటిని క్రోడీకరించి, రావుగారు రాష్ట్ర సంఘ నెలసరి నివేదికలు సిద్ధం చేసి పంపుతుండేవారు. ఆనాటి దేశారాధకుల నివేదికలను, తమ 'సుబాకు' సంబంధించినంతవరకు, తమ జీవితాంతం వరకూ భద్రంగా వుంచారు. అంతేగాదు, వారికిచ్చిన గౌరవభృతి, ప్రయాణ ఖర్చులు, వారు వసూలుచేసిన విరాళములు, మున్నగు జమాఖర్చుల పట్టికలు వుంచటంలో రావుగారెంత జాగ్రత్తలు తీసుకొనేవారో యీ నివేదికలవల్ల స్పష్టపడుతుంది.

రావుగారు అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశమునకు ఉత్తరదేశానికివెళ్ళివచ్చారు. బెజవాడరాష్ట్రకాంగ్రెస్ సమావేశమునకు, ఖద్దరు బోర్డు సమావేశమునకు హాజరైనారు. వీలు కలుగజేసుకొని స్వయంగా ఖద్దరు అమ్మకం చేసేవారు. దత్తమండలాల ప్రచారకుల సమావేశం జరిపేవారు. ఐతే ఎంత నిర్విరామంగా కృషిచేస్తున్నా, ఆయనకు పనిలో సంతృప్తి వుండేదికాదు. ఈ బహుముఖ సేవలనుగూర్చి ఒక కార్యక్రమ నివేదికలో ఇలా వ్రాసి పంపినట్లున్నది:

"కాంగ్రెస్ కార్యాలయపు పని చూచుట, ఖద్దరు కార్యదర్శి పనిని చూచుట, ఖద్దరు అమ్మకం జేయుట, రాష్ట్రీయ మహాసభలు - ప్రచార సభలు ఇత్యాదికములకు హాజరై అందు పాలుపుచ్చుకొనుట, దత్త మండలములలోని ఇతర ప్రాంతములకు అప్పుడప్పుడు పోయివచ్చుట యివన్నీ నాకు తప్పుటలేదు.

.... ఈ ఫిబ్రవరి, మార్చి మాసములలో రు 650/ల ఖద్దరు అమ్మకం జరిగింది. రమారమి ఇది అంతయు హరిసర్వోత్తమరావు అమ్మినదే. ఏ రు 50/ ల సరుకో యితర ప్రచారకులు అమ్మినారు.

.... నంద్యాలలోనే మేమువుండి, అచ్చట కలరా వ్యాపించకుండా పనిచేయవలసి వచ్చింది. క్షామ నివారణకు కొంత కృషిచేశాము. ఈరెండు నెలల్లోను ఎక్కువ కాంగ్రెస్‌పని చూడలేక పోయినాను."

నంద్యాల 29-4-1924.

## ఖద్దరు బోర్డు బాధ్యత

కర్నూలు ఖద్దరు బోర్డులో హరిసర్వోత్తమరావుగారితో పాటు, బై. మహానందయ్య, కైప సుబ్రహ్మణ్యం, వనం శంకర శర్మగార్లుగూడా వుండేవారు. రాష్ట్రీ ఖాదీబోర్డువారిచే ధనం మంజూరుచేయించి, దానిని రాయలసీమ క్షామ నివారణార్థము విని యోగించేవారు. ప్రత్తి, దూది, ద్రవ్యం, ధాన్యం విరాళములు వసూలుచేసి బీదసాదలకు పని కల్పించేవారు. రాయలసీమలో అనేక రాట్నములు పెట్టించి, పేదవారిచే నూలు వడికించేవారు.

రావుగారి కృషితో నంద్యాల పురప్రముఖుల సమావేశ మొకటి జరిగింది. రావుబహద్దూర్ వెంకటరంగారెడ్డిగా రగ్రాస నాధిపత్యం వహించారు. ఈ మండలములలోని వివిధ కరువు ప్రాంతములలో బీదలకు సహాయం చేయుట కొరక సంఘం ఏర్పడింది. హరిసర్వోత్తమరావుగారు కార్యద్రష్టగా ఎన్నుకో బడినారు. ఈ సంఘం అప్పటినుంచీ క్షామ నివారణకు కృషిచేస్తూ వచ్చింది.

కర్నూలు ఖద్దరుబోర్డుకు కొంతనష్టం వచ్చిందని ఆంధ్ర రాష్ట్రీ బాధ్యతను చూస్తున్న కొండా వెంకటప్పయ్యగా రొకసారి విచారించడానికి వచ్చారట. కర్నూలు ఖద్దరుబోర్డు పనిని చూస్తున్న హరిసర్వోత్తమరావు, తదితర ప్రచారకులున్న సమావేశంలో

'ఈ నష్టం తేలకపోతే కేసుపెట్టవలసి వస్తుందన్నారట' వెంకట ప్పయ్యగారు. రావుగారులేచి, 'ఏమి వెంకటప్పయ్యా! నేను ఇతరులవలె వున్నది దాచుకొని త్యాగం చేసినవాడిని కాదే! ఎవరి మీద కేసు? నష్టంవచ్చిన కారణాలు సరిగా పరిశీలించు! ఇందులోని వర్కర్లు ఎవరూ పబ్లిక్ ధనాన్ని చిల్లిగవ్వగూడా స్వంతానికి వాడుకున్నవారు లేరే!' అని ఆలెక్కల పుస్తకాల కట్ట పంతులు గారి ముందు పడేసి చూచుకోమన్నారట. తర్వాత యథార్థ పరిస్థి తుల నర్థంచేసుకొని, వెంకటప్పయ్యగారు వెళ్ళిపోయినారట.

రావుగారు నిర్వహించిన సంస్థలతాలూకు జమా – ఖర్చుల లెక్కలన్నీ, కార్యకర్తల ప్రయాణఖర్చులతోసహా, రావుగారు భద్రంగా వుంచారు.

## భారత హిందూస్థానీ సేవాదళ్ కమాండర్

కాకినాడ కాంగ్రెస్ మహాసభ సందర్భమున, ప్రథమ పర్యాయము దేశవ్యాప్తంగా సుశిక్షితమైన ఒక వాలంటీరు దళ నిర్మాణావశ్యకతను గుర్తించడం జరిగింది. కాంగ్రెస్ ఆదేశాలను పాటించి, అనుసరించేందుకు వాలంటీరు సంస్థ ఏర్పాటుకు కాంగ్రెస్ కార్యవర్గం తగు చర్యలు తీసుకొన్నది.

1924 జనవరి 1, 2 తేదీలలో కాకినాడలో అఖిల భారత కాంగ్రెస్ వాలంటీర్ల సభ జరిగింది. వివిధ రాష్ట్రాలనుంచి జవ హర్‌లాల్‌గారి అధ్యక్షతను హరిసర్వోత్తమరావు, శంకరరావు దేవ్, డాక్టరు సైపుద్దీన్‌కిచ్లూ, డాక్టర్ యన్. యస్. హార్డికర్ మున్నగువా రనేకులు హాజరైనారు. ఈసమావేశంలోనే "హిందూ స్థానీసేవాదళ" నిర్మాణం చేశారు. అందు ప్రధానపాత్ర వహించిన వారిలో రావుగారొకరు. సమావేశం, మహాత్మా గాంధీలోను,

ఆయన నిర్దేశిస్తున్న సత్యాగ్రహోద్యమంలోను సంపూర్ణ విశ్వాసం వెలిబుచ్చింది. అహింసాయుత అసహాయోద్యమానికి భారత ప్రజలను సంసిద్ధం చేయుటకున్నూ, అందుకు కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించుటకున్నూ కృషిచేయాలని తీర్మానించారు.

వాలంటీర్లకిచ్చే శిక్షణావిధానాన్ని, కాంగ్రెస్ చరిత్రకు సంబంధించిన సిలబస్‌ను తయారుచేయుటకు హరిసర్వోత్తమ రావుగారు నియమితులైనారు. కవాతు, నూలు వడుకుట, పత్రికా పఠనము, ప్రాథమిక చికిత్స, వాలంటీర్ల విధులు ధర్మములు, నిర్వర్తించవలసిన నిర్మాణ కార్యక్రమాలు మున్నగు వివిధాంశములతో గూడిన ఒక సమగ్ర శిక్షణ ప్రణాళికను రూపొందించారు. బ్రిటిష్ పాలనా దుష్ఫలితాలు, కాంగ్రెస్ చరిత్రలోని ముఖ్యఘట్టాలు, భూగోళం, గ్రామాభ్యుదయం, గాంధీజం మున్నగు విషయాలతో ఒక పాఠ్యక్రమాన్నిగూడా రావుగారు తయారుచేశారు. దీనినే హిందూస్తానీ సేవాదళబోర్డు చర్చించి అంగీకరించింది. తర్వాత దీనిననుసరించే శిక్షణాకేంద్రాలు నిర్వహించ బడినవి.

రాష్ట్ర వాలంటీరు మహాసభలకు హరిసర్వోత్తమరావు, బులుసు సాంబమూర్తి, హార్డికర్‌గార్లు హాజరయ్యేవారు. దరిమిలా పంజాబు శిరోమణి అకాలీదళ్ ప్రతినిధి యొకరికి అఖిల భారత సేవాదళ్ బోర్డులో స్థానం కల్పించారు. వందేమాతరం గీతంతో, జాతీయ పతాకవందనంతో కవాతు చేయిస్తూ నాయకులు ఉత్సాహం కలిగించారు. రాష్ట్రబోర్డుల నేర్పాటు చేశారు.

సేవాదళ్ బోర్డు అంతర్గత నిర్వహణ, నిర్మాణములలో పూర్తిస్వేచ్ఛ నిచ్చి, తన అజమాయిషీక్రింద కాంగ్రెస్, ఈవాలంటీరు దళమును ప్రోత్సహించి, పెంపొందిస్తూ వచ్చింది.

జాతీయ కాంగ్రెస్ సంస్థకు, హిందూస్థానీ సేవాదళమునకు గల సంబంధాలను గురించి చర్చించి నిర్ణయించింది.

"సేవాదళ్ కాంగ్రెసుకు అనుబంధంగావుండి కాంగ్రెసు సిద్ధాంతానికీ, కార్యక్రమానికీ కట్టుబడివుండే స్వచ్ఛందసేవకుల (వాలంటీర్ల) సంస్థగా విలసిల్లవలెనని యీబోర్డు వాంఛిస్తున్నది. అయితే దీని అంతర్గతపాలన, నిర్వహణవిషయములలోమాత్రం కాకినాడ కాంగ్రెసు తీర్మానప్రకారం దీనికి పూర్తిస్వాతంత్ర్యముంటుంది."* అని 1931 ఏప్రిల్ 18 వ తేదీన జవహర్‌లాలు నెహ్రూ విశదీకరించారు. దీనిననుసరించియే, దేశంలో సేవాదళ్ కార్యకలాపాలు జరుగుతూ ఉండేవి.

1929 లో కలకత్తా నగరంలో జరిగిన అఖిలభారత సేవాదళ్ బోర్డు సమావేశమునకు బులుసు సాంబమూర్తి, హరిసర్వోత్తమరావుగార్లు వెళ్ళి పాల్గొన్నారు. 1931 ఏప్రిల్‌లో బోర్డు సమావేశం కరాచీలో జరిగింది. ఆంధ్రనుంచి హరిసర్వోత్తమరావు,

---

* "This board desires it to be known that 'Sevadal' is an organisation of Volunteers auxiliary to the congress and subject to the policy and programme of the congress. In regard to the internal management and administration however, the Dal retains complete freedom, as was laid in the congress resolution at Coconada"

సాంబమూర్తిగార్లు హాజరైనారు. డాక్టరు సైఫుద్దీన్‌కిచ్లూ, వామన్ నాయక్, కమలాదేవిచటోపాధ్యాయ, జవహర్‌లాల్‌నెహ్రూ, యన్. వి. గాడ్గిల్, డా. హార్డికర్‌గార్లు వివిధ ప్రాంతాలనుంచి వచ్చారు. ఈ కేంద్రసంస్థ నిర్వహణ కవసరమైన నిధివసూళ్ళ కొాక సబ్‌కమిటీ ఏర్పాటుచేయబడింది. ఆంగ్లంలో ఒక బులెటిన్ ప్రచురించేవారు. ఈ సమావేశంలోనే కర్నాటక, ఆంధ్రశాఖల నిర్మాణం జరిగింది. ఆంధ్రశాఖకు తెన్నేటి విశ్వనాథం, నడింపల్లి నరసింహారావు, డాక్టరు బ్రహ్మజ్యోస్యుల సుబ్రహ్మణ్యం, కల్లూరి సుబ్బారావు, శ్రీమతి దుర్గాబాయిగార్లు సభ్యులుగా నియమింప బడినారు. తదాది ఆంధ్రదేశంలో అప్పటికే జరుగుతున్న వాలంటీరు సంస్థల కార్యకలాపాలు విస్తృతం చేయబడినవి.

కేంద్ర సంస్థతరఫున 1931 మే 1 వ తేదీనుండి సేవాదళ ఆఫీసర్ల ట్రయినింగు కాంపు బొంబాయి (గిర్గాం) లో జరుప బడినది. అప్పుడు, మీసంపూర్ణ సహకారం వుంటుందనీ, మీమీద ఆధారపడి ఈక్యాంపును తలపెట్టితిమనీ, రావుగారి నాహ్వానిస్తూ కార్యదర్శి హార్డికర్‌గా రొకలేఖ వ్రాశారు.

## ఆంధ్ర రాష్ట్రీయ ఐచ్ఛికభట సంఘం-రామదండు నిర్మాణం

ఆంధ్రరాష్ట్రీయ ఐచ్ఛికభట సంఘం 19-5-1924 వ తేదీన కొవ్వూరు నందు సమావేశమైనది. అయ్యంకి వేంకటరమణయ్యగారు కార్యదర్శిగా ఎన్నుకోబడినారు. అప్పటినుంచి రాష్ట్రంలో వాలంటీరు దళ నిర్మాణానికి కృషి జరిగింది. 'రామదండు' నిబంధనలు తయారు చేశారు. దండునాయకులకు శిక్షణయిచ్చే ఏర్పాట్లు గావించారు. జిల్లా వాలంటీరు బోర్డుల నిర్మాణం జరిగింది.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ తరఫున రాష్ట్ర హిందూస్థానీ సేవాదళబోర్డులో పనిచేయుటకు 1. గాడిచర్ల హరిసర్వోత్తమరావు 2. గద్దె రంగయ్యనాయుడు 3. దండు నారాయణరాజు గార్లు నియమింప బడినారు. వీరికి తోడు అఖిలభారతబోర్డు తరఫున కాశీనాథుని నాగేశ్వరరావు, జి. వి. పున్నయ్యశాస్త్రి సూర్యదేవర సంజీవరాయణం, శివస్వామి, యం. వి. యస్. గుప్తా గార్లున్నారు. ఈ 8 మందితోను కూడిన రాష్ట్రబోర్డు సేవాదళ కార్యక్రమం నిర్వహిస్తూవుండేది.

'ఆంధ్రరత్న' నాయకత్వమున రామదండు నిర్మాణం చేయబడి, ఆంధ్రదేశంలో ప్రజాహిత కార్యాల్లో పాల్గొనేది. రామదండును, సేవాదళమునకు అనుబంధం చేశారు.

"స్వరాజ్య సంపాదనకై వలయు చతురంగ బలములో ప్రాధాన్యము వహించిన స్వచ్ఛంద సేవాదళములను, ధైర్య స్థైర్య శౌర్య సాహసౌదార్య తేజో బలసమన్వితులనుచేసి, స్వసంప్రదాయ సిద్ధులగు అహింసాది ప్రవృత్తిమార్గముల సర్వసమర్పణమునందు తీర్ణులగు స్వీయ మతధర్మము ప్రధాన ప్రేరణాంశమని ఈ సంఘంవారు గ్రహించుచున్నారు.

.... ఈ సిద్ధాంతానుసారము వేర్వేరు మతావలంబకులగు నాంధ్రులు నిజమతధర్మ చోదితమైన మార్గముల ననుసరించుటకు ప్రత్యేక దళములను నిర్మింప సంసిద్ధులగుచు, ప్రకృతము తద్భావ ప్రకాశితమును, ఆంధ్ర సాంప్రదాయమునగు 'రామదండు' స్వరూపమున హిందూస్థానీ సేవాదళమున కుపాంగముగా రాష్ట్రదళనిర్మాణ మొనర్చుటకు నిశ్చయించచడ మైనది". అని నిర్ణయించు కొన్నారు.

1927 అక్టోబరులో నంద్యాలలో వాలంటీర్లసభ రావుగారి ఆధ్వర్యమున జరిగింది. కేంద్రసంస్థ గౌరవకార్యదర్శి ఆర్గనైజరు

అగు జి. కె. దేవాధర్, ఎం. ఏ. వచ్చి ఉపన్యాసాలిచ్చారు. వారు తిరిగివెళ్ళి హరిసర్వోత్తమరావుగారికి ఒక అభినందనలేఖ వ్రాస్తూ 'ఆప్రాంతాల్లో మీపలుకుబడి, ప్రజాసేవ, ఆతిథ్యం ఎంతయో కొనియాడ దగినవి' అన్నారు.

## మద్రాసు కౌన్సిలు సభ్యత్వం

మద్రాసు కౌన్సిలు, కేంద్ర శాసనసభలకు పోటీచేయుటకు మన రాష్ట్రి కాంగ్రెస్ సంఘం నిర్ణయించింది. దాసు, మోతీలాల్ గార్ల కార్యవిధానంతో ఏకీభవించి, ప్రకాశంగారు ఎన్నికల రంగం లోకి దుమికారు. కర్నూలు జిల్లాకు మొదట్లో నాయకంటి శంకర రెడ్డిగారిని అభ్యర్థిగా వుండమని కోరారు. కాని, ఆయన పత్తి కొండ, కర్నూలు తాలూకాలు పర్యటించివచ్చి హరిసర్వోత్తమ రావుగారి కొక లేఖ వ్రాశారు. అందులో 'నాకంటే గెలుపుకు మీకే ఎక్కువ అవకాశాలున్నట్లు కనుపించింది' అన్నారు.

హరిసర్వోత్తమరావుగారికి మంచి స్నేహితుడైన శరభా రెడ్డిగారిని జస్టిస్ పార్టీ నిలిపింది. ఒకవేళ తనను కాంగ్రెస్ తర పున పోటీచేయమంటే, శరభారెడ్డికి పడే ఓట్లు చీల్చుకోటానికి మాత్రమే నిమిత్తమాత్రంగా వుంటాననీ, తప్పక రావుగారినే పోటీచేయమని శంకరరెడ్డిగారు ఒత్తిడి తెచ్చారు. తన అభి ప్రాయాలను స్పష్టంగా ప్రకాశంగారికి గూడా వ్రాశారు. దీనితో ప్రకాశంగారికి కోపం వచ్చింది. "శంకరరెడ్డి యింత బలహీను డుగా వుంటాడని నే నెప్పుడూ అనుకోలేదు" అంటూ రావుగారి దరఖాస్తును, శంకరరెడ్డి వుత్తరాలను ఎన్నికలబోర్డు ముందుంచు

తానని వ్రాసి ఉదకమండలం వెళ్ళిపోయినారు. చివరకు నంద్యాల, కర్నూలు ప్రాంతాల ముఖ్యులంతా హరిసర్వోత్తమరావుగారినే బలపరచడంతో, రాష్ట్ర బోర్డువారు హరిసర్వోత్తమరావుగారిని కర్నూలు జిల్లా అభ్యర్థిగా నిశ్చయించారు.

ఇద్దరు దగ్గర స్నేహితుల మధ్య, కాంగ్రెస్ తరఫున హరి సర్వోత్తమరావు, జస్టిస్‌పార్టీ పక్షమున శరభారెడ్డిగార్లకు పోటీ జరిగింది. రావుగారికి వ్యతిరేకంగా ప్రత్యర్థులు చెప్పటాని కేము న్నది? విద్యావేత్తగాదనా? గుణవంతుడు కాదనా? త్యాగశీలం లేదనా? ప్రత్యర్థులకు ఏమి ప్రతికూల ప్రచారం చేయడానికి ఆస్కారం వుండేదికాదు. ఉన్న యథార్థవిషయాలు చెప్పి, 'ఆయ నను కాంగ్రెస్ నిలిపింది. కనుక వారికి ఓట్లు యివ్వవద్దు' అని నమస్కరించేవాడట శరభారెడ్డిగారు. ఈ విషయాన్నే రావుగారి "విస్మరించరాని ఘటన"లలో ఇలా చెప్పారు:

" 1927 లో ఎన్నికలు వచ్చినవి. కాంగ్రెస్‌వారు నన్ను కర్నూలు జిల్లా ప్రతినిధిగా నిర్ణయించినారు. జస్టిస్‌పార్టీ పరంగా కంభం శరభా రెడ్డి, బేతంచర్ల శేషారెడ్డిగార్లు నిలిచినారు. వోట్లప్రచారం ముమ్మరంగా సాగుతూవుంది. శరభారెడ్డి నాకు ఆ బాల్యమిత్రుడు. సాధ్యమైన సందర్భాలంతటా నాచేత జిల్లాకు సేవ చేయించేవాడు. అతని ఉదారహృదయము నాకుపరిచయమైనట్లు మరెవరికీ కాలేదు. వోట్లప్రచా రంలో అతనిధోరణివిని, నిజముగా ఆశ్చర్యపడేవాణ్ణి, నాగుణగణాలు నా సేవా నిరతిని అన్నిటీని పొగడిచెప్పి, 'కాని ఆయన కాంగ్రెస్‌వాడు. అందుచే ఆయనకు ఓటీయవద్దు' అనేవాడట. ఆమిత్రుని, ఆజీవిత ఘటాన్ని నేనెట్లు మరువవచ్చును?"

— రావుగారి రేడియో ప్రసంగంనుండి

సాధారణంగా వ్యక్తిగత నిందారోపణలతో, పరస్పరదూషణలతో జరిగే ఎన్నికల పోటీలలో యిలాంటిది ప్రత్యేకంగా చెప్పుకోదగినదే.

అప్పటికే రావుగారు స్వరాజ్య పార్టీ నాయకుడుగా రాష్ట్రం యావత్తూ తిరిగి ప్రచారం చేశారు 'స్వరాజ్య పార్టీనుంచి, మన రాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి మీకోసం 75 రూపాయలు వచ్చినవనీ ఇంక ఒక్క నెలకు మాత్రమే మీకు గౌరవభృతి యివ్వగలమనీ' ప్రకాశంగారు ఉత్తరం వ్రాశారు. 'మీకోసం, మీ నియోజకవర్గాల ఎన్నికల ఖర్చులకోసం కర్నూలు జిల్లాలోనే డబ్బు వసూలు చేసుకోం' డన్నారు. ఈ స్థితిలో రావుగారు వూరూర తిరిగి, ఓటర్ల వద్దనే ఎన్నికల నిధినిగూడా వసూలు చేసుకొంటూ, రాయలసీమ నియోజకవర్గాలన్నింటా విస్తృత ప్రచారం గావించారు. కర్నూలు జిల్లా ప్రతినిధిగా ప్రజలు అత్యధిక మెజారిటీతో హరి సర్వోత్తమరావుగారి నెన్నుకొన్నారు. ప్రజల హక్కుల కోసం శాసన సభలోగూడా పనిచేయుటకు రావుగారి కొక సదవకాశం లభించింది.

మద్రాసు కౌన్సిలులో స్వరాజ్య, కాంగ్రెస్ వాదుల అండతో డాక్టరు సుబ్బరాయన్ ముఖ్యమంత్రిగా ఎన్నికైనారు. శాసన సభా చర్చలలోను, పార్టీనిర్మాణానికి సంబంధించిన విషయాలలోను హరిసర్వోత్తమరావుగారు ముఖ్యపాత్ర వహించేవారు. 10-1-1927 వ తేదీ కాంగ్రెస్‌పార్టీ సమావేశంలో స్వామి వెంకటాచలం చెట్టి గారిని నాయకునిగా ఎన్నుకొన్నారు. కోటిరెడ్డి డెప్యూటీ లీడరుగాను, రావుగారు కార్యవర్గంలోను వుండి కృషిచేశారు. అత్యవసర పరిస్థితిలో, ఎప్పటికప్పుడు సముచితనిర్ణయములుచేయుటకు, ఎమ

జైన్సీ కమిటీ నొకదానిని ఏర్పాటుచేసుకొన్నారు. అందులో పార్టీ లీడరుతోపాటు హరిసర్వోత్తమరావు, గోవిందరాజులునాయుడు మెంబర్లుగా వుండేవారు. శాసనసభా కాంగ్రెస్‌పార్టీ రూల్సు ముస్నగువాటిని తయారుచేసుకొన్నారు. ప్రతిపాదించబోవుసవరణలు, తీర్మానాలు, చర్చలసరణిని ఎప్పటికప్పుడు చర్చించి నిర్ణయించుకొనేవారు.

1928 అక్టోబరు 12,13 తేదీలలో కాంగ్రెస్‌కౌన్సిలుపార్టీ ప్రత్యేక సమావేశంజరిగింది. అందులో అంతవరకు జరిగినపనిని సమీక్షచేసుకొన్నారు. కౌన్సిలుకాలపరిమితి, మరొక్క సంవత్సరం మాత్రమేవున్నది గావున, తమతమ బాధ్యతలను నిర్వర్తించుటకు ప్రతిమెంబరుకు పని పంపకం జరిగింది. వివిధ సబ్ కమిటీల నేర్పాటుచేసుకొని, పనిని తీవ్రంచేయుటకు పూనుకొన్నారు. పబ్లిసిటీ కమిటీకి రావుగారు కన్వీనరు. మద్రాస్ కాంగ్రెస్ కౌన్సిలు పార్టీ సభ్యులు చేసిన పనులన్నిటికి ఒక సమగ్రనివేదికను ఇంగ్లీషులో తయారుచేయు బాధ్యత హరిసర్వోత్తమరావుగారి కప్పగించారు. దానినే వివిధ ప్రాంతీయభాషల్లోగూడా ప్రచురించారు. రాష్ట్రప్రజల కష్టాలను పరిశీలించి, కౌన్సిలులో వాటి నివారణకు పూనుకొనుటకుగాను కె. ఆర్. కరంత్ కన్వీనరుగా, రావు, సామి వెంకటాచలంచెట్టిగార్లతో ఒక ఉపసంఘాన్ని ఎన్నుకొన్నారు.

రాష్ట్రకార్మిక సమస్యలను, ముఖ్యంగా మద్రాసు సిటీ లేబరు పరిస్థితులను పరిశీలనచేసి, కౌన్సిలులో పనిచేయుటకు ఒక లేబరు సబ్‌కమిటీ నేర్పాటుచేశారు. దానిలో రావుగారు భక్తవత్సలం నాయుడుగారు సభ్యులు. కౌన్సిలులో ప్రతిపాదించుటకు ఒక్కొక్క సభ్యునికి, వారివారికి అభిరుచియున్నకొన్ని ముఖ్యమైన బిల్లులను,

అంశములను కేటాయించారు. అందులో రావుగారికి (1) లోకలు బోర్డుయాక్టు (2) గ్రామకోర్టులయాక్టు (3) మద్రాసుఫారెస్టుయాక్టు అమెండింగుబిల్లులున్నూ (4) కార్మికశాసనములవిషయమున్నూ ప్రత్యేకించారు.

వీటినిచూస్తే, కాంగ్రెస్‌కౌన్సిలుపార్టీ నిర్మాణసమస్యల లోను, కౌన్సిలులోను రావుగారు ఎంత ప్రధానపాత్ర వహించారో తెలుస్తుంది. *

## ఆంధ్ర విశ్వకళా పరిషత్తు సభ్యత్వం

రావుగారు మద్రాసు కౌన్సిలు సభ్యుడుగా వున్నప్పుడు, ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యుడుగాగూడా ఎన్నుకో బడినారు.

అప్పటికి ఇండియాలో పెద్ద ఉద్యోగాలన్నిటిలోను పాశ్చాత్య దేశీయులే వుండేవారు. భారతదేశంలో ఉన్నత విద్యాభివృద్ధికి గాను కళాశాలలు, విశ్వవిద్యాలయములు నెలకొల్పాలనే ఆందో ళన ఆరంభమైనది. 1916 వ సంవత్సరం నుండి పదేండ్లలో 9 విశ్వ విద్యాలయములు స్థాపించ బడినవి. తెలుగు జిల్లాలకొక ప్రత్యేక ఆంధ్ర యూనివర్సిటీ కావాలనే ఆందోళన జరిగింది. ఉన్నత విద్య నభ్యసించగోరేవారు దూరానగల మద్రాసునగరమునకు వెళ్ళ వలసి వచ్చేది. ఇది సామాన్య విద్యార్థులకు ఆర్థికంగా చాలా భారంగా వుండేది.

అప్పటికి తెలుగు జిల్లాలలో చదివే హైస్కూలు విద్యా ర్థులు 46,660 మంది వుండేవారు, కళాశాలలలో 2 వేలమందే చదు

*కౌన్సిలులో రావుగారికృషి వివరములు, ఇదేఅధ్యాయములో 'ఆదర్శశాసన సభానభ్యుడు' శీర్షిక క్రింద చూడనగును.

వుతుండేవారు. వీరుగాక మరి 900 మంది మద్రాసు కాలేజీలకు వెళ్ళి చదువుకొనేవారు. మాతృభాషలో విద్యాభివృద్ధికి ప్రత్యేక విశ్వవిద్యాలయా వశ్యకతను ఆంధ్రోద్యమం ముందుకు తెచ్చింది.

సాంకేతిక విద్యాలయాలుగూడా ఆనాటికి భారతదేశంలో చాలఅరుదుగా వుండటంతో ఇంజనీర్లు, డాక్టర్లు సైతం విదేశస్థులే వుండేవారు. 1924 లో ఇండియాలో నున్న 13 రైల్వేలలోను మొత్తం 1037 మంది ఇంజనీర్లు వుంటే, అందు 129 మంది మాత్రమే భారతీయులుండేవారు. ఇలానే టెలిగ్రాఫ్ శాఖలో 142 మంది ఇంజనీర్లలోను 24 మందే ఇండియను లుండేవారు. మన దక్షిణమహరటా రైల్వేలో 62 మందిలోను 7 గురే భారతీయులు.

ఆరోజుల్లో స్త్రీవిద్యగూడా చాల తక్కువగా వుండేది. 1925 నాటికి తెలుగు జిల్లాలన్నిటిలోను 9 గరల్సు హైస్కూళ్ళు మాత్రం వుండేవి. ఇందులో 157 మంది మాత్రమే విద్యార్థిను లుండేవారు. మరి 38 మంది మద్రాసుకు వెళ్ళి చదువుకొనేవారు. మొత్తం 195 మంది మాత్రమే స్త్రీలు ఉన్నత విద్య నభ్య సించేవారు.

ఈ విధంగా సాంకేతిక విద్యలోగాని. స్త్రీ విద్యలోగాని, అసలు విద్యలోనే అనాడు ఎంత వెనుకబడియున్నామో తెలు స్తుంది. ఉన్నత విద్యాభివృద్ధికి, మాతృభాషా వికాసానికి, విశ్వ కళా పరిషత్తు కావాలని హరిసర్వోత్తమరావు, కొండా వెంకట ప్పయ్య ప్రభృతులగు ఆంధ్రనాయకులంతా ఎలుగెత్తి చాటారు. ఫలితంగా 1926 వ సంవత్సరంలో ప్రత్యేక ఆంధ్ర విశ్వవిద్యా లయం స్థాపించబడింది. ఆంధ్రోద్యమ పరిణామంలో ఇదొక మైలురాయి.

మద్రాసుకౌన్సిలు అనధికారసభ్యుల నియోజకవర్గంనుండి హరిసర్వోత్తమరావుగారు ఆంధ్రయూనివర్సిటీ సెనేట్ మెంబరుగా ఎన్నుకోబడినారు. 10-2-27 నుండి మూడేండ్లపాటు సెనేట్ సభ్యులుగావుండి ఆంధ్రవిశ్వవిద్యాలయాభివృద్ధికి ప్రథమంలో కృషిచేసిన గౌరవం రావుగారికి దక్కింది.

భాషాసాన్నిహిత్యాన్ని పరిగణించకుండా, రాయలసీమజిల్లాలకు మద్రాసే అందుబాటులోవున్నదనీ, కావున మద్రాసు విశ్వవిద్యాలయమునకే అనుబంధంగావుండేటట్లు రాయలసీమవాస్తవ్యులు కొందరు ఆందోళనచేసి నెగ్గించుకొన్నారు. కాని భాషాసమైక్యతను వాంఛించి, రక్షించుకోవాలనేవారిలో రావుగారొకరు. రాయలసీమలో వైద్యకళాశాల, ఇంజనీరింగు కళాశాల కావాలనికోరుతూ, రావుగారు యూనివర్సిటీవారితోను, ప్రభుత్వంతోను చాలా ఉత్తరప్రత్యుత్తరాలు జరిపారు. ప్రత్యేక సాంకేతిక కళాశాలలు ఏర్పాటుచేసేదాకా, వెంటనే రాయలసీమ విద్యార్థులసౌకర్యార్థం, ప్రస్తుతమున్న కళాశాలల్లో కొన్నిసీట్లు ఉపకారవేతనంతో కేటాయించాలని కోరారు. ఇందులకు విశ్వవిద్యాలయం, ప్రభుత్వంకూడా అంగీకరించి తగుఏర్పాట్లు చేయడం జరిగింది.

1929 లో చేసిన నిబంధనలననుసరించి, దత్తమండలాల యేరియాను ఆంధ్ర యూనివర్సిటీనుంచి విడదీశారు. అప్పుడొకసమస్య ఉదయించింది. హరిసర్వోత్తమరావుగారు నంద్యాల వాస్తవ్యులు కావున, కర్నూలుజిల్లాకు చెందినవారనీ, ఆజిల్లాలను విడదీయుటమూలంగా, వారి సెనేట్ సభ్యత్వం కోల్పోతున్నారనీ రిజిష్ట్రారు తెలియజేశారు. దీనిపై రావుగారు మద్రాసుకౌన్సిలు నియోజక వర్గంనుంచి ఎన్నుకోబడినవారైనందున, తనకీ నిబంధన

వర్తించదని జవాబువ్రాసినమీదట అంతటితో ఆ సమస్య ఆగిపో యింది. 1952వ సంవత్సరంలోగూడా మరొకపర్యాయం రావుగారు సెనేట్ సభ్యులుగా నామినేటుచేయబడినారు.

యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్లుగావున్న కట్టమంచి రామ లింగారెడ్డి గారూ, లక్కరాజు సుబ్బారావుగారూ హరిసర్వోత్తమ రావుగారి నత్యంత స్నేహ, గౌరవ భావాలతోచూచేవారు. సెనెట్ సమావేశాలలో వీరి సూచనలకెంతో విలువ యిస్తూవుండేవారు.

హరిసర్వోత్తమరావుగారు బి. ఏ., ఎం. ఏ. లకు తెలుగు పరీక్ష పత్రాలను తయారుచేసే బోర్డు (Board of paper setters) లో మెంబరుగావుండేవారు. రావుగారు నిరంతర పర్యట నలవల్ల సకాలంలో పరీక్షపత్రాలుతయారుచేసి పంపటం కుంటు పడకుండాచూడాలని రావుగారికి రిజిష్ట్రారు వ్రాస్తుండేవారు. ఎన్ని పనులున్నా, తమ నియమితపనులను పూర్తిచేయుటలో ఎప్పుడూ రావుగారు లోపంరానిచ్చేవారుకాదని తర్వాత యూనివర్సిటీ అధి కార్లకే అర్థమైంది.

## జాతీయ విద్యా ప్రణాళిక

ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభ మహానంది క్షేత్రంలో జరిగింది. ఆ మహాసభలో, జాతీయ విద్యా ప్రణాళికను తయారు చేయుటకు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, హరిసర్వోత్తమరావు గార్లకు బాధ్యత యివ్వబడినది. ఆరంభ శూరత్వంగా, అప్పటికే జాతీయ విద్యాలయా లేర్పడడం, క్రమేణా అవి జీర్ణావస్థలో పడి పోవటం తటస్థించింది. వాటిని పునరుద్ధరించి, అభివృద్ధి పరచుట కాంగ్రెస్ కర్తవ్యంగా ఎంచి ఈ జాతీయ విద్యా ఉపసంఘమును నియమించింది.

హరిసర్వోత్తమరావుగారితో చర్చించి, ఆంధ్రరత్న ఒక ముఖ్యప్రణాళికను రూపొందించారు. దీనిలో (1) స్థానిక స్వపరిపాలనా సంస్థలద్వారా గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు జరుప సంకల్పించారు. (2) జాతీయ విద్యాలయములు జీర్ణించిపోకుండా వృద్ధిచేయుటకు పూనుకొన్నారు. ఈ రెండు ముఖ్య విషయాలను గురించి సమగ్రమైన వివరణను ఆంధ్రరాష్ట్రి కాంగ్రెసు సంఘంద్వారా అందజేశారు. గోపాలకృష్ణయ్య, హరిసర్వోత్తమరావుగార్లు ఎంతో సుహృద్భావంతో కలసిమెలసివుండేవారు. మూడవ కార్యదర్శియైన కాశేశ్వరరావుగారు మరొకవిధంగా వ్యవహరించేవారు. ఈజాతీయ విద్యను గురించి, దుగ్గిరాలవారితో చర్చించిన కాశేశ్వరరావుగారు, వారికి తెలుపకుండానే, 'స్థానిక స్వపరిపాలనా సంస్థలలో నిర్వర్తించవలసిన నిర్మాణ కార్యక్రమం' అంటూ ఒక అచ్చుప్రతిని అతిత్వరగా తయారుచేసి, పంపటానికి ప్రయత్నించారు. అదొక నిర్జీవప్రతిమగా వుందని ఆంధ్రరత్న, హరిసర్వోత్తమరావుగారలు మరొక డ్రాఫ్టును సిద్ధంచేసి పంపారు. అందలి కొన్ని ప్రధాన భాగాలనైనా యిందుదహరించు టవసరం.

## జాతీయ విద్యాలయాల జీర్ణస్థితి

5-4-1924వ తేదీ ఆంధ్రపత్రికయందు ప్రచురించిన రాష్ట్రి కాంగ్రెస్ సంఘ నివేదికలో ఇట్లున్నది:

"జాతీయ విద్యాలయములు కొన్ని గతించినవి. కొన్ని అంతరించుటకు సిద్ధముగా నున్నవి. జాతీయ పాఠశాలల విద్యార్థుల సంఖ్య క్షీణగతి పట్టెను. కొన్ని పాఠశాల లింతవరకే అంతర్ధానమైనవి. భీమవరంలోని తిలక్ జాతీయోన్నత పాఠశాల అస్తమించినది. కాకినాడ, తణుకు జాతీయ పాఠశాలలు చావుబ్రతుకులమీద నున్నవి. ఈ విద్యాలయములే చాలావరకు అసహాయోద్యమ ప్రచారమునకు తోడ్పడినవి.

నేటికిని నీ జాతీయ విద్యాలయములు గల తావులందే చాలవరకు సహాయ నిరాకరణము సజీవముతో నున్నది. ప్రభుత్వోద్యోగములు త్యజించి, జాతీయ పోషణకై యావజ్జీవమును కృషి సలుపుటకై దీక్ష బూనిన యువకుల యెడల ఉపేక్షాభావము వహించుట స్వరాజ్యోద్యమ మునకు నష్టదాయకము. ఆంధ్రదేశమున మొత్తముమీద యింతవరకు మా కార్యాలయమునకు తెలిసినంతవరకు 87 పాఠశాలలు గలవు. అందు 2 కళాశాలలును, 11 ఉన్నత విద్యాలయములును, 75 ప్రాథమిక పాఠశాలలును గలవు. వీనిలో 8 పాఠశాలలు కాంగ్రెస్ సంఘములచే నిర్వహింపబడుచున్నవి. 32 విద్యాలయములు కమిటీలచే స్థాపించబడినవి. 47 ప్రత్యేక వ్యక్తులచే ప్రతిషింపబడిన వారియాదరణము క్రిందనున్నవి."

వీటిని పెంపొందించవలసిన ఆవశ్యకతనుగూర్చి వీరి నివేదికలో ఇలా వ్రాశారు :

"ఈ మహోద్యమము ప్రారంభమైన నాటినుండియు, జాతీయ విశ్వవిద్యాలయమును నెలకొల్పి ఆంధ్రజాతికి ఉచిత విద్యాప్రదానము గావింపనెందరో మన నాయకులు సలిపియున్న ప్రయత్నములు ఈలోజువరకు సఫలీకృతము గాకుండుటయేగాక, మీదుమిక్కిలి అచ్చటచ్చట బయలుదేరిన జాతీయ పాఠశాలలుగూడా క్షీణస్థితి చెందుతున్నవి. స్థానిక స్వపరిపాలనా సంఘములు, బోర్డుగాని, మునిసిపాలిటీగాని ఆంధ్రదేశ ప్రధాన గృహస్థావళితో నిండియున్నది. ఆంధ్రులలో విద్యావంతులు, వదాన్యులు, పలుకుబడిగలవారు పెద్దలనేకులు బోర్డు, మునిసిపాలిటీలలో సభ్యత్వము వహించియున్నారుగదా! వీరికి జాతీయవిద్యయందాదరణ లేదా? మహాత్ములవారి యాదేశమునందు గౌరవములేదా? కాంగ్రెస్ సంస్థయెడల వైముఖ్యభావము గలదా? జాత్యున్నతికి ప్రధానసాధనమైన సర్వజన, సర్వమత సమాదరణీయమగు విద్యావ్యవహారమే యిట్టి దీనదశ జెందియుండ, స్వరాజ్యోద్యమమునందు ఇంక నేవ్యవహారము సానుకూలము కాగలదు? సామాన్య విద్యావిషయమిట్లుండ, స్త్రీవిద్యా

విషయము, నిమ్నజాతులు, అంటరానివారు మొదలగు ప్రజల విద్యా విషయము, ఇంకా ఉన్నతవిద్యావిషయము, వైద్యము, లలితకళలు, పారిశ్రామికవిద్యలు, మొదలగువాటిస్థితి మరింత దైన్యము నొంది యున్నవి.

వీటిని ఇంతమాత్రమైనా పోషించు మహనీయులకెంతయు కృతజ్ఞులముగాని, ప్రజాప్రతినిధులనుకొనిన ఈ యుభయ సంఘములవారము ఈ విద్యాసమస్యలపట్ల మన విధివిధానములను నెరవేర్చ నవసరంలేదా? స్వతంత్ర రాజ్యముల యందలి ప్రజలయొక్క లక్ష్యలక్షణములు మనకీ సందర్భమున మార్గదర్శకములగుగాక!

ఇప్పుడీ జాతీయ విద్యాలయములకు మీరు చేయూతనొసంగి, ప్రాణప్రతిష్ఠ గావించి వీటినిపొడదీసి, వీని నాధారముగ నొక జాతీయ విశ్వవిద్యాలయమును నెలకొల్పినచో అందుత్పన్నమగు విద్యా ప్రసాదముచే ఆంధ్రమునందు స్వరాజ్యోద్యమ విజృంభణము యేరూపమున నుండునో యూహింపనగును."

## నిర్మాణ కార్యక్రమము

స్థానికస్వపరిపాలనా సంస్థలలో, నిర్మాణకార్యక్రమమును కొనసాగించవలసిన తీరునుగూర్చి అందిట్లున్నది:

"ఆంధ్రదేశమున గుంటూరు, బెజవాడ, రాజమండ్రి, కాకినాడ, మొదలగు పురపాలకసంఘములట్లే వర్ధిల్లుచున్నవి. జిల్లాబోర్డు, తాలూకాబోర్డులయందు కాంగ్రెస్‌ప్రముఖులు ప్రధాన స్థానముల నలంకరించి యున్నారు. ఇటులనే క్రమశః స్వపరిపాలనాసంఘములన్నియు, కాంగ్రెస్ సంఘములతో నైక్యమునందగలవు. లక్ష్యలక్షణములందైన అచిర కాలములో సమరసభావము యేర్పడగలదు. అందిప్పుడు కాంగ్రెస్ సంఘములు ఆచరించ వలసిన కార్యవిధానము కేవలము నిర్మాణ కార్యక్రమమై యున్నది.

"జాతీయ విద్యావిధానమునందు (1) చేతితో నూలు వడుకుట, నేయుట, ప్రతి విద్యాస్థానమునందును (బాలశిక్షయందుగాని, విద్వద్భాగము నందుగాని) నిర్బంధంగా నేర్పబడవలయును.

(2) అదేరీతిగా హిందీ భాషాప్రచారము జరుపబడవలయును,

(3) స్వాతంత్ర్యము, దేశమత, జాత్యభిమానము, ధర్మరక్షణ, అధర్మ శిక్షణము, స్వార్థత్యాగము మొదలగు గుణసంపత్తులు విద్యార్థుల యందు పెంపొందింప వలెను.

(4) వ్యష్టి, సమష్టి వ్యవహారములయందు, అనవరతము అహింసా పథానువర్తనము గ్రహింపవలయును.

ప్రతి జాతీయ విద్యాలయముయొక్క అనుష్ఠాన క్రమమున శాస్త్రాలంకారాది విద్యాబోధనతోపాటు, యిట్టి సాధనమార్గమునుగూడా విధించవలసి యుండును.

ఇందులకెట్టి ప్రతిబంధకములు తటస్థించినను విద్యా విషయమగుటచే అణుమాత్రము సందీయక, అసహాయోద్యమ పద్ధతిని సాధించి నిజమార్గమును పోషించు కొనవలసి యుండును."

స్థానిక సంస్థలవారికి పంపిన ఆ సర్క్యులరులో ఇలా పేర్కొన్నారు:

I "ఇందు ప్రథమావస మన మనోగతమైన తాత్పర్యమును ఈ సంస్థలయందున్న సభ్యులు యావన్మందికి నివేదించి, వీలగునంత వరకు వారి ఆశీర్వాదాంగీకారముల బడయుట;

II ప్రబల ప్రాతికూల్యమే ప్రతిఫలమైనచో, తగు ప్రతీకారమూహించి, ప్రజల నుద్బోధించి, ప్రోత్సహించి వ్యవహార రంగమున నుచిత రీతిని నడుపు సన్నాహ సంరంభముల సాగించుట ద్వితీయావస్థ;

III అనంతర మవసర మగుచో, నీ సంస్థల సంపూర్ణముగ నాక్రమించి, మహా ప్రస్థానమును సంధించుట తృతీయావస్థ;

IV పిమ్మట చరమావస్థ స్వరాజ్యపథ మాకాంక్షించువారల కెల్లరకు విదితమే".

— స్థానిక సంస్థలవారికి పంపినచిత్తు ప్రతి నుండి

## ఆదర్శ శాసనసభా సభ్యుడు

మద్రాసు కౌన్సిలు మెంబరుగా, హరిసర్వోత్తమరావుగారు తన కర్తవ్యాన్ని నిర్వర్తించుటకు శక్తివంచన లేకుండా కృషి చేశారు. స్థానికప్రజల కష్ట నిష్ఠురాలను ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. వివిధ రాష్ట్రీయ సమస్యల నెన్నిటినో శాసన సభాముఖంగా ప్రస్తావించారు. ప్రతి సమావేశము రావుగారి ప్రశ్నలు, ఉపప్రశ్నల పరంపరలతో నిండివుండేదని చూచినవారు చెపుతారు. తమకున్న ప్రజారంగ పరిజ్ఞానంతోపాటు, వీరికి నిశితమైన విమర్శనా శక్తి వుండటంతో పసిడికి తావి అబ్బినట్లయినది. చురుకైన కౌన్సిలు సభ్యులలో రావుగారు ఒకరుగా ఆరోజుల్లో గణుతికెక్కారు. ఆదర్శ శాసనసభాసభ్యునిగా నిరూపించు కొన్నారు.

ఒకసారి 'జేమ్సు' అనే యూరోపియన్ సభ్యుడొకడు పొగరుబోతుతనంగా భారతీయులను పరిహసిస్తూ ప్రసంగించాడట. దానితో హరిసర్వోత్తమరావుగారు ఉగ్రుడై లేచి, ఆ ఆంగ్ల సభ్యుని జాత్యహంకారాన్ని గట్టిగా ఖండించారు. ఆనాటి ముఖ్య మంత్రిగానున్న మునుస్వామి నాయుడుగారితోసహా, సోదరసభ్యు లెల్లరూ రావుగారిమాటల కెంతగానో హర్షించి అభినందించారు.

అప్పట్లో తుంగభద్ర కాలువక్రింద భూములకు నీళ్ళు కట్టు కొనుటకు కొన్ని నిర్బంధము లేర్పడి వుండినవి. బగరుకింద ప్రతి సంవత్సరం లక్షలకొలది పెనాల్టీలు విధించేవారు. రావుగారు కౌన్సిలులో కాలుపెట్టినది మొదలు ఈవిషయమై ప్రశ్నలను ప్రారంభించారు. అర్జీలు వ్రాసి అచ్చువేయించి, అయకట్టు రైతుల

చేత చేవ్రాలు చేయించి పంపారు. అందుమీద ప్రభుత్వం పెద్ద విచారణ జరిపించింది. చివరకు బగరు దండుగలు రద్దయినవి. దీనివల్ల కర్నూలు, నందికొట్కూరు, నంద్యాల, కోవెలకుంట్ల శిరువెళ్ళ తాలూకాలలో రైతాంగానికి ఎక్కువ మేలు చేకూరింది.

కడప - కర్నూలు కాల్వక్రింద పల్లపు సాగును విస్తృత పరిచే విషయంలో ఆత్మకూరు డెప్యూటీ తహశ్శీలుదారు ఏవో ఆటంకాలు కల్గిస్తూ ఒక సర్క్యులరును జారీచేశాడు. అంతకు పూర్వం ఇర్రిగేషన్ ఎగ్జిక్యూటివ్ యింజనీరు, కడపజిల్లాలో మైదుకూరు, చీపాడు ప్రాంతాలలో మెట్టను శాశ్వత పల్లంగా మార్చుకొనుటకు అవకాశం యిస్తూ ఒక పథకం రూపొందించాడు. కాని తహశ్శీలుదారు ఆర్డర్లు దీనికనుగుణ్యంగాలేవని అసెంబ్లీలో రావుగారి వాదన. ఈవాదన నంగీకరించి రెవిన్యూశాఖ, రైతులకు కష్టంగానున్న తహశ్శీలుదారు జారీచేసిన సర్క్యులర్లను రద్దుచేసింది. ఇది కె. సి. కెనాలు క్రిందనున్న ఆయకట్టుదార్లకు ఎంతగానో ప్రయోజనం కలిగించింది.

కె. సి. కెనాలును వెడల్పు చేయాలనీ, తద్వారా ఇరిగేషన్ సౌకర్యాలు హెచ్చుచేయవచ్చుననీ రావుగారు శాసనసభలో పలుసార్లు ప్రస్తావించారు. ఈకాల్వ 3 వేల క్యూసెక్కుల నీరు ప్రవహించేలాగున రూపొందించ బడినదనీ, కాని ముఖ్యమైన తూముల గుండా ఎప్పుడూ 2 వేల క్యూసెక్కులకు మించి నీటి పారుదల లేదనీ, వెలుగోడు ప్రాజెక్టుకుగూడా నీరు కావలసివుంటేనే దీనిని వెడల్పు చేయవలసి వుంటుందనీ, గవర్నమెంటు సమాధానాలు చెపుతూ తప్పుకోజూచేది. కావుననే గరిష్ఠ ఇరిగేషన్ పొందుటకు మెట్టప్రాంతరైతులకు ప్రభుత్వం తగువసతులు చేకూర్చాలని

రావుగారు వత్తిడిచేస్తూ వచ్చారు. ఆయకట్టుదార్ల ఇబ్బందులను, మెట్టరైతులకు చేయవలసిన సౌకర్యాలనుగూర్చి అనేక సూచనలు చేశారు. నీరువదలే సందర్భంలో యిచ్చే "వాటర్ టిక్కెట్ల" పని సులభతరం చేశారు.

రాయలసీమలోని 4 జిల్లాల పాడిపంటలకు గాను కావలసిన నీటి వనరుల విషయమై చాలా శ్రద్ధ తీసుకొన్నట్లు రావుగారి కృషిని పరికిస్తే తెలుస్తుంది. "దత్తమండలాల ఇర్రిగేషన్ ప్రాజెక్టుల కమిటీ" అను నొక కమిటీ నేర్పరచి దానికి కడప కోటిరెడ్డి గారితో జాయంటు కార్యదర్శిగా నుండి పని జరిపించారు. 1927-28 సంవత్సరపు బడ్జెటులో తుంగభద్ర ప్రాజెక్టుకు సంబంధించి, 25,000 రూపాయలు మంజూరైనది. 1929 బడ్జెటులో గవర్నమెంటు ప్రత్యేక ఇంజనీరింగు సిబ్బంది నేర్పరచి పని జరిపించారు. కర్నూలు జిల్లాలోని సంగమేశ్వరం వద్ద భూమి నైజాము ఇవ్వనందున పని నిలిచిపోయింది. తుంగభద్రా ప్రాజెకులో కడప- కర్నూలుకాల్వ ఎక్కువ వెడల్పుచేసి బలపరచుటకు, 'వెల్గోడు ప్రాజెక్టు' 'ఔకు ప్రాజెక్టు' లకై అనేక సమయాల్లో రావుగారు ప్రశ్నలడిగారు.

చిన్ననీటివనరుల మరమ్మతులను గూర్చిగూడా రావుగారు ప్రభుత్వదృష్టికి తెచ్చారు. దువ్వలేరు ప్రాజెక్టు, మార్కాపురం చెరువు, నంద్యాలచెరువు, రుద్రవరము, దుర్వేశి గ్రామాల చెరువులు, తిప్పాయ పాళెం ప్రాజెక్టు, తోకపల్లి ప్రాజెక్టు దత్త మండలాలలోని అనేక ప్రాంతాల చెరువుల మరమ్మతులను గురించి కృషి చేశారు.

ఫారెస్టు ప్రజల కష్టాలు, అడవి చట్టంలోని లోపాలు రావుగారి అనుదిన ఆలోచనలో నున్నట్లు తెలుస్తుంది. ఒక సారి కౌన్సిలు సమావేశం జరిగిన 50 రోజుల్లోను, 38 పర్యాయములు ఫారెస్టు బాధలను గురించి విమర్శనలు చేశారు. సూచన లిచ్చారు. (1) పుల్లరి (2) పెంటఫీజు (3) మేతకు సంబంధించిన కాంపౌం డులు (4) మేకలు, గొర్రెలమేత (5) రేంజీలలోనుండి రేంజీ లలో దోవలు (6) లోకల్ క్యాటిల్ (పశువుల) నిర్వచనము (7) ఒకటికంటే ఎక్కువ రేంజీలలోకి ప్రవేశం (8) వ్యవసాయపు పనిముట్లు (9) ఎరువు ఆకు (10) కాంపౌండురేట్లు (11) ఊరి దగ్గరగా రిజర్వులు (12) 2 వ నంబరు రహదారి (13) రిజర్వు లోని వ్యవసాయపు భూమి (14) ఫారెస్టు కేసులలో శిక్షలు (15) ఫారెస్టు పంచాయతుల అధికారములు (16) ఫారెస్టు విభ జన మొదలగు విషయములలో ప్రజలకు గల కష్టములు వెల్లడి చేయటమే గాకుండా, ప్రభుత్వమునుండి అనేక సమాధానాలు యిప్పించి ప్రకటించ గలిగారు. ఇందునుగూర్చి ప్రత్యేక జిల్లా మహాసభలు జరిపి తీర్మానాలు చేయించారు. అచ్చు అర్జీలు వ్రాయించి, గ్రామగ్రామంనుండి మహజర్లు పంపించేలా చూచారు.

నల్లమల అడవి ప్రాంతాలన్నీ స్వయంగా తిరిగి ఫారెస్టు ప్రజల ఇబ్బందులను మహజర్లరూపంగా తయారు చేయించారు. 'రాయలసీమ సమితి' మహాసభ జరిగినప్పుడు అందులో వారు ఒక ముఖ్య తీర్మానాన్ని ప్రవేశపెట్టి అంగీకరింప జేశారు.

"కర్నూలు జిల్లా ప్రజాప్రతినిధి శ్రీయుతులు గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు స్వయంగా తిరిగి అటవీ ప్రాంత వాసులనుంచి సిద్ధము చేయించిన మహజర్లలోని కోర్కెలు రాయలసీమ అన్నిమండ

ములకును సమానముగా చెందియున్నవిగనుక, అందు కనబరచిన ఇబ్బందుల నివారణచేయు సదుపాయములు, అత్యవసరముగాను, నిరాలస్యముగాను జరుప వలయునని అధికారులను, ప్రజాప్రతినిధులను, శాసన సభవారిని ఈ మహాసభవారు కోరుచున్నారు."

అని రాయలసీమ సమితి తీర్మానించింది. సభలు, సమావేశములు జరిపి, వాటి తీర్మానములను శాసనసభలో ప్రస్తావించి ప్రభుత్వదృష్టికి తెచ్చుటకును రావుగారు కృషిచేస్తూ వుండేవారు రాజకీయ విధానములకు సంబంధించిన వాటి నటుంచి, మిగతా చిన్న స్థానిక సమస్యలను ప్రభుత్వం వెంటనే విచారణ చేయించడం, వీరిప్రశ్నలకు తగు సమాధానములిచ్చి సబబైనవాటి నంగీకరించడం సాధారణంగా జరుగుతుండేది. హరిసర్వోత్తమరావు గారు మంచివిద్యావంతు లగుటవల్లనూ, రాజకీయ ప్రజారంగముల యందు గొప్ప అనుభవపరులగుటవల్లనూ, శాసనసభా రంగమున తరచు మాట్లాడుచూ, ప్రతిభావంతుడైన పార్లమెంటేరియనుగ ఆనాడు రాణించారు. ఆయాస్థానిక సమస్యలను పరిష్కరింప చేసేవారు. ఇందు మూలంగా శాసనసభలోను, ప్రజలలోను రావుగారి పలుకుబడి ఇనుమడించిందనవచ్చును.

మార్కాపురం తాలూకాలో అణచబడిన జాతులకు అడవి భూములను కేటాయించే విషయంలో, ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. దీనిపై అక్కడి బీదజనం 'సివాయి జమాయి' పద్ధతిని ఒకటి రెండు ఏండ్లు సాగుచేయటం, ప్రతిఫలం రాలేదని వదలివేయటం జరుగుతున్నదనీ, భూములకోసం వత్తిడి ఎక్కువగాలేదనీ, (demand for land is not great) ఏవో కారణాలు చూపుతూ వచ్చింది. ప్రభుత్వం, రావుగారి కృషివలన, ఆ యా గ్రామాల్లో

భూములులేని పేద లెందరున్నారో, వారికెంతభూమి కావలసి వుంటుంతో మినహాయించి, మిగతాది రిజర్వులో కలుపుకొనే టట్లు సవరించుతామని ప్రభుత్వం తరపున హామీనిచ్చారు. తదను గుణ్యంగా కర్నూలు జిల్లా కలెక్టరుగానున్న డబ్లియు. స్కాట్ బ్రౌన్, హరిసర్వోత్తమరావుగారి సహాయంతో ఒక నివేదికను అప్పట్లో తయారుచేయటం జరిగింది.

రావుగారు చేసిన ఆందోళనాఫలితంగా, ఫారెస్టులో రైతులుగా వున్నవారు నెత్తిమోపులుగా ఉచితంగా గడ్డి తెచ్చు కొనుటకు, మార్కాపురం తాలూకాలోను, యర్రగుండపాలెం రేంజిలోను పర్మిషన్ యివ్వబడిందనీ, జిల్లా కలెక్టరు 1927 జులై 28 వ తేదీన వ్రాశారు.

ఒకసారి మిట్టపాలెం, రామసముద్రం, యర్రగొండపాలెం, మిర్యంపల్లి, మురారిపల్లి, మానేపల్లి మొదలగు గ్రామాల్లో కలరా వ్యాపించింది. ఆ సందర్భంలో రావుగారు ఆరోగ్యశాఖ వారిని తీసుకొనివెళ్ళి మందు లిప్పించారు. 1927 ఆగస్టులో యిందుకు ప్రత్యేక సిబ్బందిని నియమించి ప్రభుత్వం తక్షణ సహాయం అంద జేసింది.

ఈ సందర్భంలోనే వ్యవసాయ ఋణాలు, భూమి అభి వృద్ధిఋణాలు ప్రభుత్వం ఈ.ప్రాంతాలకు మంజూరు చేసింది. రైతులు కలరావల్ల రాలేదని స్థానికాధికారులు సకాలంలో డబ్బు యివ్వటం మానివేశారు. ఈ యిబ్బందులు కలెక్టరుకు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లకుచెప్పి, రావుగారు తర్వాత ఆడబ్బు యిప్పించే ఏర్పాట్లు గావించారు. 1927 సెప్టెంబరులో 70 వేలరూపాయలు వ్యవసాయ ఋణాలు, 3 వేల రూపాయలు భూమి అభివృద్ధి

ఋణాలు అదనంగా శాంక్షన్ చేయించుటలో రావుగారు కృతకృత్యు లైనారు.

రాష్ట్రంలో కుటీర పరిశ్రమల విషయం సర్వే చేయుటకు రావుగారు శాసనసభలో చేసిన ప్రస్తావన ఫలితంగా, ప్రభుత్వం 1928 లో ఒక జీ. వో. ను. ప్రకటించింది. కాని దానిని బహిరంగంగా ప్రచురించలేదు. దానిపై మరల వత్తిడి చేశారు. తగు సిబ్బందిని నియమించి, సాధ్యమైనంత వరకు 1929 బడ్జెటు లోగానే నివేదికను ప్రకటిస్తామని రావుగారికి ప్రభుత్వం హామీ యిచ్చింది. కుటీర పరిశ్రమలు బ్రిటిష్ పరిపాలనలో నానాట చితికి పోతున్నవనీ, వీటి నభివృద్ధిచేయు టవసరమనీ, రాష్ట్రంలోను, రాయలసీమలోను సమగ్రమైన సర్వే జరిపించాలనీ హరిసర్వోత్తమరావుగారు ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. ఫలితంగా ప్రభుత్వం ఈ పరిశీలన కొరకు స్పెషల్ ఆఫీసరును, సిబ్బందిని నియమించి రాయలసీమలో సర్వే చేయించింది.

శ్రీశైలమునకు రోడ్డు వేయవలసినదిగా రావుగారు కోరారు. జిల్లా బోర్డువారి ద్వారా 4 లక్షల రూపాయలు ఎస్టిమేట్లు తయారు చేయించినారు. శ్రీశైల యాత్రికుల సౌకర్యార్థం ఈ రోడ్డు చాలా వుపకరించింది. అహోబిల క్షేత్రమునకు గావలసిన మంచినీటి వసతిని గురించి రావుగారు ఎసెంబ్లీలో మాట్లాడినారు. నంద్యాలకు రక్షిత నీటి సరఫరా పథకాన్ని వర్తింపజేయవలెనని కౌన్సిలులో ఆందోళన చేశారు. సమీపమున నున్న 'మహానంది' క్షేత్రంనుండి మంచినీరు వచ్చే అవకాశమున్నదేమో పరిశీలించుటకు 1930 లో శానిటరీ యింజనీరును స్థానిక స్వపరిపాలనా

శాఖ నియమించింది. ఈ విధంగా తమ నియోజకవర్గానికి చెందిన అనేక స్థానిక సమస్యలను గురించి శ్రద్ధ వహించేవారు.

గ్రామోద్యోగులు, నాన్ గజెటెడ్ ఉద్యోగుల జీతభత్యాల పెంపుదలను గూర్చి రావుగారు కౌన్సిలులో కృషి చేశారు.

1927 మార్చి 13 వ తేదీన గ్రామోద్యోగుల మహాసభ ద్రోణాచలంలో హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను జరిగింది. సభా తీర్మానములను ప్రభుత్వమున కందించి, గ్రామోద్యోగుల జీతభత్యముల పరిస్థితులను మెరుగుపరచాలని వారు శాసనసభలో ప్రసంగించారు.

ఆనాటి కరణము, మునసబుల జీతాలు మరీ అధ్వాన్నంగా వుండేవి. ఇప్పటికీ అలాగే వున్నవి. అందుకనే ఇటీవల వారు మూకఉమ్మడి రాజీనామా లిచ్చేవరకు వచ్చారు. అప్పటి మున సబులకు నెల ఒకటింటికి 13 రూ., కరణములకు రు. 14 లు మాత్రమే జీతం యిచ్చేవారు. వెట్టి, మోతాదు, తలార్లకు నెలకు 3, 4 రూపాయలే వుండేవి. వీరి నెలసరి జీతాలు పెంచాలని రావుగారు శాసనసభలో కోరారు. జమాబందికి, ఆఫీసు పను లకు వచ్చినప్పుడు గ్రామోద్యోగులకు కొంత అలవెన్సు యివ్వా లన్నారు. ఇందులో డబ్బు ఎంత హెచ్చుదల అవుతుందో ఆలో చించి చేయవలసి వుంటుందని రెవిన్యూ శాఖామంత్రి సమాధానం చెప్పారు. అందరికీ తెలిసే విధంగా జమాబందికి ఒకరోజు ముందుగా టముటమా వేయించాలని రావుగారు కోరారు. కాని గ్రామంలో జమాబందికి ఒక వారం రోజులు ముందుగా అలా చేయుటకు ప్రభుత్వం అంగీకరించింది.

గ్రామ లెక్కల మాన్యుయల్‌లో ఎప్పటి కప్పుడు జరిగిన మార్పులు నమోదు కావటంలేదనీ, దీనివల్ల రైతులకు చాలా

యిబ్బందులు గలుగుచున్నవనీ రావుగారు విశదపరచారు. వీరి కృషి ఫలితంగా, ప్రభుత్వం బోర్డు స్టాండింగు ఆర్డర్లు 12, 27 సెక్షనులలో కొన్ని ముఖ్యమైన మార్పులు, చేర్పులు గావించింది. ఒక పట్టాలో ఏమైనా మార్పులు, అమ్మకాలు జరిగివున్నట్లయితే, వెనుకటి పట్టాను మార్చి, కొత్త పట్టా నంబరు వ్రాసి, ఆ గ్రామం లోనే ఆ రైతుల కివ్వవలసి వుంటుందన్నారు. ఏ రైతు అయినా జమాబందీ కాలంలో అలా జరుగలేదని ఫిర్యాదు చేసినట్లయితే, గ్రామోద్యోగులు అప్పటి కప్పుడే దానిని తయారుచేసి యిప్పించే టట్లు జమాబంది ఆఫీసరు శ్రద్ధ తీసుకోవాలని రావుగారు కోరారు. ఈ రెండు ప్రధానమైన మార్పులు యిప్పటికీ సక్రమంగా అమలు జరగటంలేదని అందరికీ తెలిసిన విషయమే. బోర్డు స్టాండింగు ఆర్డరులో చేసిన మార్పు ఇది :

"రైతుల స్వాధీన భూములలో ఏమైనా మార్పులు జరిగితే, జమా బందీలో పట్టాలు దాఖలుచేస్తే, ఆ మార్పులకు నమోదు చేయటం జరుగుతుంది. అసలు పట్టాలో చాల హెచ్చుగా మార్పులు జరిగిన పక్షంలో క్రొత్త పట్టా జారీ చేయటం జరుగుతుంది. తన గ్రామం జమాబందీ జరిగే సమయంలో రైతు మార్పును బొందిన పట్టాను ఇవ్వవలసిందిగా కోరితే, జమాబందీ ఆఫీసరు వెంటనే తయారు చేయించి ఇప్పించవలెను." *

---

* "If changes have taken place in the holding the modifications will be carried out on the production of the pattas at jamabandi or a fresh patta will be issued in the event of numerous changes having taken place in the original patta. If however, a ryot asks for a revised patta in the jamabandi of his village, it should be prepared at once and given to him by the jamabandi officer."

రావుగారి వాదఫలితంగా ఈ మార్పు జరిగింది. ఇది యీనాటికీ ముఖ్యమైన మార్పుగా గమనించవలసి వుంది.

ఎ. రంగనాథ మొదలియారుగారు గ్రామోద్యోగుల వారసత్వపు హక్కు చట్టములకు కొన్ని సవరణలు ప్రతిపాదించి, వారసత్వము మరియొక వంశమువారికి సంక్రమించకుండునట్లు చేశారు, ఆ సందర్భంలో యిందుకు సంబంధించిన చర్చలో రావుగారు తోడ్పడినారు.

కౌన్సిలులో రావుగారు యన్. జీ. వో. హక్కులు, జీతములను గూర్చి చేసిన కృషికి తమ కృతజ్ఞతను 1927 నవంబరు 27 వ తేదీ సమావేశమైన యన్. జీ. వో. ల మహాసభ ప్రకటించింది.*

హరిసర్వోత్తమరావుగారు మద్రాసు గవర్నమెంటు ప్రెస్ వర్కర్సు యూనియన్ సంస్థాపకులు. ఆనాడు ప్రభుత్వ ప్రెస్‌లో 646 మంది పనివార లుండేవారు. వారి జీతాలు బహు తక్కువగా వుండేవి. అచ్చు యంత్రాల నిపుణులంటూ 5 గురు పెద్ద జీతాలు తీసుకొనే ఆంగ్లేయ గజెటెడ్ ఆఫీసర్లు వుండేవారు. వీరి దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ప్రెస్ కార్మికులు పనిచేస్తుండేవారు. తమ కిష్టంలేనివారిని ఎప్పుడు పడితే అప్పుడు తీసేస్తుండే

---

* "Thanking you for the assistance you have rendered in the Madras Legislative Council, for the cause of Non-Gazetted government officers association."

(మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో నాన్ గజెటెడ్ ఆఫీసర్ల సంఘ ఉద్యమానికి మీరు చేసిన సహాయానికి కృతజ్ఞత.)

వారు. 1927-28 లో ఒకసారి యిలా కొందరిని తొలగించడం జరిగింది. దీనితో ఈ విషయాలన్నీ అసెంబ్లీలో చెప్పి, ఆంగ్లేయ అధికార్ల దురుసుతనాన్ని తీవ్రంగా రావుగారు విమర్శించారు. అనేక ప్రశ్నలు వేశారు. ఆ ఆంగ్లేయ సూపరింటెండెంటుకు నెలకు ఆ రోజుల్లోనే వెయ్యి రూపాయలు జీతమట. పెద్ద భవనం వుండేదట. పని వాళ్ళచే వూడిగం చేయించుకొనేవారట.

ఇక ఆనాటి కార్మికుల జీతాలు చూడండి. మొత్తం పని చేస్తున్న 646 మందిలోను—

| ఉద్యోగుల సంఖ్య | | నెలసరి సగటు జీతం |
|---|---|---|
| 2 | — | రు. 70 |
| 2 | — | 60 |
| 8 | — | 50 |
| 55 | — | 40 |
| 237 | — | 30 |
| 130 | — | 25 |
| 101 | — | 20 |

మిగతావాళ్ళకు 20 రూపాయల లోపు జీతం మాత్రమే వుండేది. ఇవన్నీ కౌన్సిలులో ఏకరువుపెట్టి కొద్దిగా జీతాలు పెంపుదల చేయించారు. ఇష్టంవచ్చినట్లు తీసివేయకుండా కొన్ని రక్షణలు కలిగించారు. చక్రయ్యచెట్టియార్ లాగా, హరిసర్వోత్తమరావు గారు కార్మిక నాయకులుగా ప్రసిద్ధి పొందారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ఎక్కువ డబ్బు కేటాయించవలయుననీ, రాజమండ్రి కళాశాలా భవనములకు ధనం మంజూరు చేయవలెననీ, జైళ్ళలోని దురవస్థలు తొలగించవలెననీ, మంత్రుల

జీతాలు, స్పెషల్ పోలీసుఖర్చులు తగ్గించాలనీ, మున్నగు అనేక విషయాలపై కౌన్సిల్లో వుపన్యసించారు.

ఆయుర్వేద వైద్య విషయమున చాలాముఖ్యమైన ఉపకారము హరిసర్వోత్తమరావుగారు చేశారు. డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు ఆరోగ్యాశ్రమమునకని సంపాదించిన భూమిలో మంచి భాగమును కూలీలను చేర్చుకొని తీసుకొనిపోవు తెల్లవాండ్ల స్వాధీనం చేయడానికి క్రింది అధికార్లు ఆలోచనలు చేశారట. బహుత్వరత్వరగా ఆర్డర్లు అమలు పెడుతుండేవారట. ఈ విషయాలు రావుగారు తెలుసుకొని, కౌన్సిలు సభాకార్యక్రమం ఆపి ఈ ముఖ్య విషయము నాలోచించమని కోరారు. తీర్మానం ప్రవేశపెట్టి, అంతకుపూర్వం చేసిన తప్పుపనులను ఆపివేయించ గల్గారు. ఆ విధంగా ఆయుర్వేదాశ్రమానికి ఆ భూమి దక్కింది.

క్షామ నివారణ, దత్తమండలాల కళాశాలలు, ఆంధ్రా యూనివర్సిటీ బిల్లు, గుత్తి ప్యూనిటివ్ పోలీసు, పరిశ్రమల విచారణ, పంచములకు మంచినీటి వసతులు, చేతిపరిశ్రమల పునరుద్ధరణ, అనంతపురం జిల్లాలో గ్రామోద్యోగుల సస్పెన్షనులు, సెటిల్మెంటు రిజస్టరులు, కుడిమరమ్మతుల చట్టము మున్నగు అనేక విషయాలపై రావుగారు కౌన్సిలులో చర్చించినట్లు కనుపిస్తుంది.

రాయలసీమ సభ్యులలో ఎవరెవరు, ఎన్నిరోజులు కౌన్సిలుకు హాజరైనది? ఎన్నిప్రశ్న లడిగినది? ఏ అంశములమీద చర్చలలో పాల్గొన్నది? ఛార్టులు తయారుచేసి యిప్పటికీ అట్టిపెట్టి వుంచారు. ఆ ఛార్టునుబట్టి 1927 నుంచి - 1928 ఫిబ్రివరి ఆఖరు

వరకు హరిసర్వోత్తమరావుగారు కౌన్సిలు సభ్యులుగా చేసిన కృషి తెలియుచున్నది. ఈ కాలములో వీరు

304 ప్రశ్నలడిగారు.

371 ప్రశ్నల సందర్భంలో చర్చలలో పాల్గొన్నారు.

47 అంశములమీద బడ్జెటు చర్చలలో మాట్లాడారు.

34 విషయాలపై సప్లిమెంటరీ గ్రాంటు చర్చల్లో పాల్గొన్నారు.

12 అడ్జరన్ మెంటు మోషనులలో పాల్గొన్నారు.

19 ప్రజాహితైక తీర్మానములపై ప్రసంగించారు.

5 చిత్తుబిల్లుల చర్చలలో పాల్గొన్నారు.

కౌన్సిలు జరిగిన మొత్తం 59 రోజులలోను 55 రోజులు రావుగారు హాజరైనారు. వీటినన్నిటినీ ఆరోజుల్లో రాయలసీమ నుండి ప్రచురింపబడే "ఇంద్రావతి" పత్రికానుబంధంలో వివరంగా ప్రకటించారు. (1928 వ సంవత్సరము జులై నెల 27 వ తేదీ) తన ఒక్కరి కృషిమాత్రమే గాక, దత్తమండల శాసనసభ్యులైన (1) శరభారెడ్డి (2) ఓబిరెడ్డి (3) కేశవపిళ్ళె (4) కోటిరెడ్డి (5) పరశురామారావు (6) రంగనాథ మొదలియారు (7) శివరావు (8) నాగన్నగౌడు (9) గంగాధర శివ (10) హంపయ్య గార్లు చేసిన సేవలుగూడా పూసగుచ్చినట్లు తయారు చేశారు. వీరిలో గంగాధరశివ, హంపయ్యలు నామినేటెడ్ మెంబర్లు. రంగనాథ మొదలియార్ మంత్రిగా వుండేవారు.

శాసనసభ ముగియగానే ఇంటికివచ్చి, ఆ యా విషయాలకు సంబంధించిన వాటిని రావుగారు వాటి శాఖాధికార్లకు జాబులు వ్రాసేవారు. రావుగారు వ్రాసిన జాబులు, వాటికి ప్రభుత్వ

ద్యోగులు, వివిధ శాఖామాత్యులు యిచ్చిన సమాధనములు వేర్వేరుఫైళ్ళు పెట్టివుంచారు. వీటిని పరికిస్తే కౌన్సిలు కార్య క్రమాలను గురించి, రావుగారు ఎంతటి శ్రద్ధాసక్తులు కలిగి యున్నారో అర్థమవుతుంది. తా నడుగవలసిన ప్రశ్నలకు ఉప ప్రశ్నలకు సంబంధించిన నోట్సు, సమగ్ర సమాచారం ముందుగా సేకరించి, వ్రాసి వుంచుకొన్నట్లు కనుపిస్తుంది.

రావుగారిమాట ఎంతకచ్చితమో, వుత్తరాలు వ్రాయుటలోను అంత కచ్చితంగా వుండేవారు. "ఇది చాల జరూరు విషయము గనుక ఏమాత్రమూ ఆలస్యము జరుగకుండాను, అత్యవసర పరిస్థితులను నిర్లక్ష్యం చేసేటందుకు కచేరీలలో మామూలుగా జరిగే కాలవిలంబన జరుగకుండాను చూడగలరని నమ్ముతున్నాను."*అని ఒకతూరి వ్రాశారు. అధికార్లుకూడా మొదట్లోచేసిన తప్పులను సరిదిద్దుకొంటూ, ఆయా కోర్కెల సామంజస్యాన్నిబట్టి పనిచేయుటకు సహాయపడినట్లు కనుపిస్తుంది, కౌన్సిలు సభ్యులుగా రావుగారు స్థానిక, జిల్లా, రాష్ట్రీ అధికార్లతో అనుదిన సంబంధాలుంచుకొని, ప్రజల కోర్కెలకై కృషిచేసే వారని స్పష్టపడుతున్నది. రావుగారు ఆదర్శ ప్రాయుడైన శాసన సభ్యుడు,

రావుగారుశ్రీశైలం రోడ్డువేయాలనీ, అహోబిళం నీటిసరఫరా స్కీము కావాలనీ, కర్నూలుజిల్లా బోర్డు వారితోను, ప్రభుత్వముతోను అనేక ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. అడవి ప్రాంతాల్లో పుల్లరి తగ్గుదలకు కృషి చేశారు. చెల్లించిన వాటికి గూడా

---

* "As this is a very urgent matter, I hope no delay will be permitted nor any thumb-rule of Red-Tapism will be allowed to override the necessities of the situation"

కాంపౌండు ఫీజు వసూలు చేయుటను గూర్చి విమర్శించారు. చెరవు, కుంటల మరమ్మతులను గూర్చి, బావులను - ముఖ్యంగా (హరిజన వాడలలోనివి) బాగుచేయించాలని కౌన్సిలులో ప్రసంగించారు. కరువు ప్రాంతాల్లో కల్లు, సారా దుకాణాలను మూసి వేయవలెనని కోరారు. వ్యవసాయార్థిక పరిశోధనకు ప్రభుత్వం తక్షణం తగుచర్యలు తీసుకోవాలన్నారు. కౌన్సిలులో మాట్లాడడమే గాక, ఆ వివరములతో, తుంగభద్రా ప్రాజెక్టు, కె. సి. కాల్వలను గూర్చి 'భారతి' లోను, ఆంధ్రపత్రికలోను ప్రముఖ వ్యాసములు ప్రకటించారు.

కోయిలకుంట్ల కాల్వులు, మలబార్ కౌలుదారీ కమిటీ ఏర్పాటు, ఆంధ్ర ఆయుర్వేద సానిటోరియము మున్నగు అనే కాంశములపై శాసనసభలో అడ్జరన్ మెంటు ప్రతిపాదనలు గావించారు,

ఆంధ్రయూనివర్సిటీ, ఆంధ్రరాష్ట్రి సమస్యలను గూర్చి, స్థానిక స్వపరిపాలన చట్టం అమెండుమెంటును గురించి, ప్లాంటర్సు లేబరుచట్టమును గురించి కౌన్సిలులో ఉపన్యసించారు. ప్రాథమిక విద్యాబిల్లును తయారు చేయుటలో తోడ్పడినారు,

రాష్ట్రిబడ్జెటు చర్చలలో, వివిధశాఖల పద్దులమీద తరచుగా మాట్లాడువారిలో హరిసర్వోత్తమరావుగారగ్రిగణ్యులు. రావుగారు కౌన్సిలు మెంబరుగావున్న మూడేండ్ల (1926 డిసెంబరు నుండి) అసెంబ్లీ ప్రొసీడింగ్సుయొక్క వాల్యూములు (33, 34, 35, 36, 37, 38, 39, 41) చూచినట్లయిన, శాసనసభలో హరి సర్వోత్తమరావుగారికృషి ఎంతమహత్తరమైనదో బోధపడుతుంది.

## సైమన్ కమిషన్ బహిష్కరణ - అనంతర కృషి

ఇండియా కార్యదర్శిగా వున్న మాంటేగు మనదేశంలో తిరిగి, కొన్ని రాజకీయ సంస్కరణలు చేయ ప్రయత్నించాడు. ఆకాలంలో మనకు వైస్రాయిగా వున్న ఛెమ్సుఫర్డు, మాంటేగులు కలిసి ఒక రిపోర్టును తయారు చేశారు. దీనినే మాంటేగు-ఛెమ్సుఫర్డు రిపోర్టు అనేవారు. దీని ననుసరించి, తర్వాత రాష్ట్రములలో ద్వంద్వ ప్రభుత్వము లేర్పడినవి. ఈ సంస్కరణలు కొరమాలిన వనీ, ద్వంద్వ ప్రభుత్వాలను భగ్నంచేయవలెననీ గౌహతీ కాంగ్రెస్ తీర్మానించింది. హరిసర్వోత్తమరావుగారు మాంటేగు-ఛెమ్సుఫర్డు సంస్కరణలను విమర్శిస్తూ ఇంగ్లీషు, తెలుగు పత్రికలలో అనేక వ్యాసాలు వ్రాశారు.

ఈ గౌహతీ తీర్మానాల కనుగుణంగా కాక, ప్రభుత్వంతో సహకారం నెరుపుతున్నదని మద్రాసు కౌన్సిలు కాంగ్రెస్ పార్టీ మీద విమర్శనలు వచ్చినవి. ఈవిషయం అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గానికి గూడా ఫిర్యాదు చేయబడినది. 1927 మే 15వ తేదీ బొంబాయిలో సమావేశమైన కార్యవర్గం ఈ సందర్భాలన్నీ చర్చించింది. స్వామి వెంకటాచలం చెట్టి, సత్యమూర్తిగార్లు వెళ్ళి చెప్పిన విశదీకరణ విని అనుకూల ప్రతికూల విమర్శనల నన్నిటినీ పరిశీలించిన తర్వాత, "మద్రాస్ కాంగ్రెస్ కౌన్సిలు పార్టీ కాంగ్రెస్ యొక్క స్వరాజ్య ఆశయానికి భిన్నంగాగాని, గౌహతీ తీర్మానాలకు వ్యతిరేకంగాగాని ఏమీ వ్యవహరించ లే"దని కాంగ్రెస్ కార్యవర్గం విశ్వాసం వెలిబుచ్చింది. అంతేగాదు. 'ఆ రాష్ట్ర పరిస్థితులలో మద్రాసు కౌన్సిలు పార్టీ కృషి అభినంద నీయం' అన్నది. 'అనుకూల అవకాశములు లభించినప్పుడు

ద్వంద్వ ప్రభుత్వాన్ని భగ్నం చేయుటకే పూనుకోవా'లని సూచన లిచ్చింది. ఈవిధంగా ఆసమస్య అంతటితో సమసి పోయింది.

## సైమన్ కమీషన్ నిరసన ప్రదర్శనాలు

పంజాబు ఘోర దురంతాలు, అమృతసర్ జలియన్ వాలాబాగు హత్యలకు తర్వాత, 1928 ఫిబ్రవరి 3వ తేదీన సర్ జాన్ సైమన్ రావటం, ఆ సందర్భంలో నిరసనగా నల్లజెండాల ప్రదర్శనలు జరిగినవి. బొంబాయి, మద్రాసులలో ప్రదర్శకులపై పోలీసులు కాల్పులు చేశారు. లాహోరులో పంజాబు కేసరి లాలా లజపతిరాయి లాఠీచార్జిలకు గురియై తర్వాత 9 రోజులకే చనిపోయినారు. మద్రాసు నగరంలో ప్రకాశంగారు తుపాకి గుండ్ల కెదురు నిలిచి, ముందుకుసాగి 'ఆంధ్రకేసరి' అనిపించుకొన్నారు. ఈవిధంగా సైమన్ కమీషన్ బహిష్కరణ దేశం ఎల్లెడలా వ్యాపించింది.

మద్రాసు కాంగ్రెస్ కౌన్సిలుపార్టీ, తదితర సభ్యులను గూడా సమావేశ పరచి సైమన్ కమీషన్‌ను బాయ్‌కాట్ చేయాలని తీర్మానించింది. కాని జస్టిస్‌పార్టీ నాయకుడు పానుగల్ రాజా, రామస్వామి మొదలియార్ మున్నగు వారుకమీషన్‌తో సహకరించడానికే పూనుకొన్నారు ఐతే జస్టిస్ పార్టీచే నడుపబడే సమదర్శిని అనే తెలుగు వారపత్రిక సహకరించడాన్ని తిరస్కరిస్తూ అప్పట్లో సంపాదకీయాలు వ్రాయటం గమనార్హం. "ప్రజలే ముందుకువచ్చి ప్రదర్శనలను జయప్రదం గావించారంటూ, సత్యమూర్తి మున్నగు కాంగ్రెస్ సభ్యుల ప్రవర్తనను తీవ్రంగా విమర్శిస్తూ ఆనాడు హరిసర్వోత్తమరావుగారు సోదర సభ్యులను మందలించడం

జరిగింది. రావుగారు వ్రాసిన ఆవుత్తరాలు యిప్పటికీ వున్నవి. సర్. సి. పి. రామస్వామిఅయ్యర్ ప్రోత్సాహంతో ముఖ్యమంత్రిగా నున్న డాక్టరు సుబ్బరాయన్ కూడా కమీషన్‌తో సహకరించా డానాడు. జస్టిసుపార్టీ సహకారంతో కొత్త మంత్రులను నియమించు కొని ప్రభుత్వాన్ని నడుపుకోజూచాడు.

మద్రాసు కాంగ్రెస్‌లో చేసిన తీర్మానం ప్రకారం, సైమన్ కమీషను బహిష్కారం జయప్రదమైనది. 'మనరాజ్యాంగాన్ని మనమే నిర్ణయించుకోవా'లనే భావన భారతావని అంతటా వ్యాపించింది. జవహర్‌లాల్ యూరప్‌నుండి తిరిగివచ్చి "భారత దేశానికి బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వంతో ఎలాంటి సంబంధమూ లేని సంపూర్ణ స్వాతంత్ర్యం కావా"లనే తీర్మానం ప్రవేశపెట్టాడు. సుభాస్ చంద్రబోసు ఆయనకు అండగా నిలిచాడు. అప్పటిదాకా కాంగ్రెసు ఆశయంగా వుంటూవచ్చిన "అధినివేశ ప్రతిపత్తి" అనేదిపోయి "పూర్ణ స్వరాజ్యం" కాంగ్రెసు ఆశయమైనది. 1929లో లాహోరులో జరిగిన సంపూర్ణస్వరాజ్య తీర్మానంతో భారత స్వాతంత్ర్యోద్యమం మరొకముందడుగు వేసిందనవచ్చు.

దేశంలో రాజకీయ సంచలనానికి, ఆర్థిక సంక్షోభం తోడైనది. కార్మిక కర్షకోద్యమాలు తీవ్రతరమైనవి. ఈ సమయంలో ప్రభుత్వం కుట్రకేసుపెట్టి పలువురు విప్లవకారులను అరెస్టుచేసింది. ఇదే మీరట్ కుట్రకేసుగా ప్రపంచ విఖ్యాతి గాంచింది.

## ఉప్పు సత్యాగ్రహం

ఈస్థితిలో 1930 సంవత్సరంలో గాంధీజీ ఉప్పుసత్యాగ్రహం ప్రారంభించాడు. గాంధీగారి నాయకత్వాన దండియాత్ర సాగింది. వేలాది దేశభక్తులు శాసనోల్లంఘనం చేసి కృష్ణ జన్మ

స్థాన మలంకరించారు. ఆ సత్యాగ్రహ మారంభించేముందు మహాత్ముడు కొండా వెంకటప్పయ్యగారిని సబర్మతీ ఆశ్రమానికి పిలిపించి, ఆంధ్రదేశంలో ఉద్యమ మారంభించ మన్నాడు. నాయకుని ఆదేశం ప్రకారం, గుంటూరులో తన ఇంటి ఆవరణలో పందిళ్ళు వేయించి, సత్యాగ్రహుల నాహ్వానించి, దేశభక్తుడు ఉప్పుచేయించాడు. శాంతియుత సత్యాగ్రహులను ప్రభుత్వం విచ్చలవిడిగా అరెస్టు చేయుటకు పూనుకొన్నది. లాఠీఛార్జీలు జరిగినవి. సముద్రపు రేవులవద్ద ఉప్పు కొఠార్లే వెలసినవి. ఆంధ్ర దేశం అగ్రగామిగా వుండిన దీమహోద్యమంలో.

ఈ విధంగా శాసనోల్లంఘనం జరిగేముందు, శాసన సభలలోని కాంగ్రెస్ సభ్యులనుగూడా తమ పదవులకు రాజీనామా నివ్వాలని కాంగ్రెస్ పిలుపిచ్చింది. బహుముఖాలుగా పర ప్రభుత్వాన్ని ఎదుర్కొనవలెననే ధోరణి హరిసర్వోత్తమరావు గారిది. అప్పట్లో శాసనసభలనుండి రాజీనామాలిచ్చి వచ్చుట సమయజ్ఞతగాదనీ, అలాచేస్తే నిరంకుశ ప్రభుత్వానికే బలం చేకూర్చిన వాళ్ళ మవుతామనీ ఆయన అభిప్రాయం.

1920 వ సంవత్సరంలో గాంధీగారి అసహాయోద్యమ విధానం కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్‌లో చర్చకు వచ్చినప్పుడే చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూగార్లు దానిని ప్రతిఘటించారు, దాసుగారికి గాంధీగారి సత్యాగ్రహమందు అంతగా విశ్వాసంలేదు. ఆయన దెబ్బకుదెబ్బతీసి, శత్రువువేసే ఎత్తుకు ఎదురెత్తువేసి ప్రభుత్వ కార్యకలాపాలను భగ్నం చేయాలనేవారు. హరిసర్వోత్తమరావు గారు మొదటినుండీ తిలక్ అనుయాయులు. తర్వాత దాసుగారి పద్ధతి నచ్చిందీయనకు. పులిబోనులోదూరి, కోరలు పట్టి దానిని

జయించాలనేవారు గాబట్టి హరిసర్వోత్తమరావుగారి లాంటి వారికి శాసనసభల బహిష్కారం గిట్టలేదు.

## రావుగారి రాజీనామా ఉదంతం

అందుచే రావుగారు కాంగ్రెస్ తీర్మానం ప్రకారం మొదట్లో శాసనసభా సభ్యత్వానికి వెంటనే రాజీనామా నీయలేదు. అప్పుడు అఖిల భారత కాంగ్రెస్ సంఘానికి జవహర్‌లాల్ నెహ్రూగా రధ్యక్షులు. శ్రీ ప్రకాశ్ గారు ప్రధానకార్యదర్శి. ఎవరైతే అలా రాజీనామా లివ్వలేదో వారు కాంగ్రెస్‌లోనున్న అధికార పదవులకు రాజీనామాలు పంపాలని కాంగ్రెస్ కార్యవర్గం నిర్ణయించింది. దీన్ననుసరించే నెహ్రూ ఇంకనూ రాజీనామాలివ్వని హరిసర్వోత్తమరావుగారి లాంటివారికి 1930 మార్చి 4 వ తేదీన నొక జాబు వ్రాశారు. అందులో ఇలావుంది:*

"తాము కౌన్సిళ్లలోను, అసెంబ్లీలోను దేశానికి ఎక్కువగా సేవ జేయగలుదుమను అభిప్రాయముతో వానిలోనే ఉండిపోవుటకు నిశ్చయించు కొన్నవారితో వ్యవహరించ వలసియున్నది. వారి కలా చేయటానికి అన్నివిధాల హక్కున్నది అయితే కాంగ్రెసు శాసనసభల బహిష్కారానికి కట్టుబడి యున్నన్నాళ్లు వారు కాంగ్రెసులోని కార్య నిర్వాహక సమితులనుండి వైదొలగి యుండవలసిందనే విషయాన్ని వారు హర్షిస్తారనటానికి సందేహం లేదు. కాబట్టి అఖిలభారత కాంగ్రెసు, రాష్ట్రీ కాంగ్రెసు కమిటీలనుండి రాజీనామాల నివ్వ వలసిందిగా కోరుచున్నాను.

జవహర్‌లాల్ నెహ్రూ

---

* We have to deal with those friends, who being of opinion that they can serve the country better in the Councils and in the Assembly have

కాంగ్రెస్ కార్యవర్గం ఈ తీర్మానం చేసినప్పటికే హరి సర్వోత్తమరావుగారు గవర్నరుకు తన రాజీనామా లేఖ నందజేసినారు. ఐతే అందులో మార్చి 17వతేదీ దరిమిలా దీనిని తమ రాజీనామాగా అంగీకరించవలెనని వ్రాసినారు. ఈలోగా కాంగ్రెస్‌ను సంప్రదించవచ్చుననీ, దేశపరిస్థితులను పరిశీలించవచ్చుననీ అభిప్రాయ పడినారు. అందుకు గవర్నరు, షరతులతో యిచ్చిన దానిని రాజీనామాగా పరిగణించుటకు వీలుపడదన్నారు. ఇంతలో కాంగ్రెస్ అధ్యక్షుని నుండి లేఖ వచ్చింది.

దీనికి సమాధానంగా రావుగారు అఖిల భారత కాంగ్రెస్ కార్యవర్గంవారి క్రింది జాబు వ్రాశారు:

నంద్యాల మార్చి 10, 1930,

ప్రియమైన జవహర్‌లాల్‌కు,

ఇప్పుడే 4-3-1930వ తేదీగల మీసర్క్యులరు, ఉత్తరము అందుతోనున్న యితర కాగితములు అందాయి. కాంగ్రెస్‌లో యెన్నిక హోదాగల వుద్యోగాలన్నింటికీ మామూలు రాజీనామాను దాఖలు చేసే ముందు, నాపరిస్థితిని నేను స్పష్టపరచాలి. అట్లా చేయకపోతే నన్ను నేను వంచపరచుకున్నవాడనవుతాను. కాంగ్రెస్ ప్రధాన తీర్మానంమీదనే నాకు మౌలికమైన అభిప్రాయభేదమున్నదని మీకు తెలుసు. కాంగ్రెస్ ప్రాథ

---

decided to remain there. They have of course every right to do so. But they will no doubt appreciate that having done so, they should retire from the executives of the Congress, so long as the Congress stands definitely committed to the boycott of the Legislatures. Therefore, I would beg of you to send your resignations from the A. I. C. C. and P. C. Cs."

*Jawaharlal Nehru*

మికసూత్రాన్నే మార్చుకొన్నదని మీరొప్పుకుంటారని నానమ్మకం, పాత సూత్రం ప్రకారం మనలో ప్రతిఒక్కరమూ, ప్రతి సంవత్సరమూ దాని మీద సంతకం చేసేవారం, కొత్తసూత్రంమీద సంతకం చేయమని నాకు పిలుపువస్తుందనుకున్నాను. అట్టి సంతకం చేసేవరకు నేను సభ్యుడను కాజాలను.అటువంటప్పుడు కాంగ్రెస్‌లో హోదాగల వుద్యోగాలకు నాకసలేఅర్హతవుండనేరదు. కొత్త సూత్రంమీద సంతకాలెందుకు సేకరించలేదో కాంగ్రెస్‌కార్యవర్గంవారికే తెలియాలి ఏమైనా మీసభ్యులరును శిరసావహిస్తున్నాను.

శాసన సభలలోవుండి వాటిద్వారా దేశానికి బాగా సేవచేయగల మనుకొనే మిత్రులము మేమని, మీసభ్యులరులో వున్నందుకు సంతోషం. ముందు నేనేమి చేశానో చెప్పనివ్వండి. శాసన సభాసభ్యులందరూ రాజీనామా లివ్వాలని కాంగ్రెస్ కార్యవర్గం ఆదేశించిన తర్వాత, మద్రాసులో జరిగిన పార్టీసమావేశ తీర్మానాన్ననుసరించి, నేను రాజీనామాను వెంటనే పంపాను. అది మార్చి 17 వ తేదీనుంచి అమలులోకి వస్తుందని అందు పేర్కొన్నాను. గవర్నరు ఆ రాజీనామాను అంగీకరించలేదు. అది సరియైన దవునో కాదో నాకు అర్థం కాలేదు. న్యాయస్థానాలలో విశ్వాసంగల ప్రముఖుల కున్న నమ్మకం నాకుగూడా వుంటే ఈ విషయాన్ని స్పష్టంగా ఆకోర్టులో పెటి వుండేవాడిని. కాని కోర్టుకు వెళ్ళకూడదనే పట్టుదలవల్ల నేను చాలాబాధలు పడినవాడి నైనందున, ఇప్పుడుగూడా నేను కోర్టుకు వెళ్ళదలచుకో లేదు.

శాసనసభల్లోనుంచి కూడా ప్రభుత్వాన్ని ధిక్కరించాలని నా విశ్వాసం. భవిష్యత్తులో ఎన్నికల పోటీలలో పాల్గొనరాదనే వుద్దేశం గూడా నాకు లేదు. అయినప్పటికీ, కొద్దినెలలపాటు ఏ అభిప్రాయానికీ రాకుండా, దేశంలో జరిగే పరిణామాలను గమనించా లనుకొన్నాను. కాంగ్రెస్ కార్యక్రమంలోని కొన్ని అంశాలమీద నా అభిప్రాయాలకు, ఈ నిర్ణయానికి సంబంధం లేదు. నారాజీనామా అమ

లులో వున్నదనే అభిప్రాయంతో నేను చిత్తశుద్ధితో ఏ శాసనసభా సమావేశమునకు వెళ్ళలేదు.

మీఉత్తరం చాలా స్పష్టంగానే వుంది. మీజాతీయ విధాన వివరాలతో హృదయ పూర్వకంగా ఏకీభవించని ఏవ్యక్తి అయినా యెన్నుకోబడే కాంగ్రెస్ హోదాలో వుండటానికి వీలుపడదు. ఇటీవల ప్రసిద్ధికి వచ్చిన భాషలో చెప్పాలంటే, కాంగ్రెస్‌లో వేర్వేరు దృక్పథాలు మీకు పనికిరావు. మిమ్ములను కాని, మీ కమిటీలనుగాని కష్టపెట్టటం నాకిష్టంలేదు. శాస్త్రోక్తంగా చెప్పాలంటే నారాజీనామాను మీరు కోరనవసరం లేదు. నూతన కాంగ్రెస్ సూత్రంమీద సంతకం పెట్టని వారాక్రమించిన స్థానాలన్నీ ఖాళీగా యున్నవని ప్రకటించడానికి మీకు పూర్తిహక్కు వుంది. అయినప్పటికీ మీరు కోరినట్లు నా అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యత్వానికేగాక, యెన్నిక హోదాలన్నింటికీ రాజీనామా యివ్వటం ద్వారా మీతో సహకరిస్తున్నాను. దీనినే నారాజీనామా పత్రంగా స్వీకరించమని కోరుచున్నాను. శాసనసభకు వెళ్ళుట తప్పనే భావంనుంచి నన్ను విడుదల చేసినందులకు మీకు నా అభివందనములు.

అహింసామూర్తి అయిన మహాత్ముని పద్ధతిలోనే, పరస్పర అవగాహన, సహనములతో, మనందరను ఒకే రంగంలోకి తీసికొని వచ్చే దేశసేవాకార్యక్రమంలో మనము తిరిగి కలిసికొనగలమని విశ్వసిస్తున్నాను. ప్రజాస్వామ్య జాతీయ జీవితానికి యింతకన్నా స్వతంత్రమైన వాతావరణ మేర్పడుగాక!

ఇట్లు
విధేయుడు
జి. హరిసర్వోత్తమరావు

ఈ విధంగా తానుసరించిన వైఖరిని కార్యవర్గానికి విశదీకరిస్తూనే, తన అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు. దీనికి పండిట్జీ యిలా జవాబు వ్రాశారు. *

ఆనంద భవన్–అలహాబాద్, 1930 మార్చి 16

శ్రీ హరిసర్వోత్తమరావుగారు, ఎం. ఏ.

మీ 10 వ మార్చి జవాబుకు కృతజ్ఞుడను. మీ రందులో వ్రాసిన దానికి ప్రశంసిస్తున్నాను. పరస్పర సహనమూ, అవగాహనలతో ఆరంభమైన ఈ మహాయుద్ధంలో మన మందరమూ సహాయపడుదు మని నాకు నిశ్చలమైన విశ్వాసం వుంది.

జవహర్‌లాల్ నెహ్రూ

హరిసర్వోత్తమరావుగారి వలెనే, కాంగ్రెస్ అధ్యక్షుని ఆదేశాన్నిపాటించి మొదట్లో రాజీనామాలివ్వని యన్. సి. కేల్కార్, యం. యస్. ఆనీ, బి. విశ్వనాథదాస్, యన్. సి. బార్డొలాయ్, ఖాలీ ఖుజ్జమాన్, గోదావరి మిశ్రా, యం, పి. కోల్టే మున్నగు వారెల్లరూ వివిధ రాష్ట్రాలనుండి కాంగ్రెస్ అధికార సభ్యత్వాలకు రాజీనామాలు పంపారు.

---

* Mr. Hari sarvottama Rao, M. A.

I thank you for your letter of the 10 th March and appreciate what you say in it. Certainly I hope that by mutual forbearence and understanding we shall all help in the great fight which has been started."

*Jawaharlal Nehru*
(16 March 1930)

1930 మార్చి 26-30తేదీల మధ్య అహమ్మదాబాదులో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గసమావేశము వీరి రాజీనామాల నంగీకరిస్తూ యిలా తీర్మానించింది: *

"కాంగ్రెసు తీర్మానము సరియైనదని అంగీకరించనివారు కార్యవర్గపు అభ్యర్థనను ఆచరించుటలో కనుపరచిన సౌజన్యాన్ని ఈ కార్యవర్గం ప్రశంసిస్తున్నది."

అప్పట్లో మద్రాసు కౌన్సిలుఅధ్యక్షులుగానున్న చింతలపాటి నరసింహరాజుగారు,కాంగ్రెస్‌పార్టీ లీడరుగానున్న సామి వెంకటాచలంచెట్టిగారు మున్నగు సోదర శాసనసభ్యులుకూడా హరిసర్వోత్తమరావుగారి అభిప్రాయాలతో ఏకీభవించారు. ఈ క్లిష్టపరిస్థితులలో కౌన్సిలుకు గైరుహాజరగుటవల్ల మంచికన్నా చెడు ఎక్కువగా సంభవించునని గుర్తించారు. ఆ విధంగా వారువ్రాసిన జాబులున్నవి. ఐతే పదుగురితోపాటు దేశంలో శిక్షణగల కాంగ్రెస్ సభ్యులముగా కాంగ్రెస్ ఆదేశాలను పాటించడమే యిప్పట్టున మన కర్తవ్యం"అంటూ రాజీనామా అందజేశారు. రాష్ట్రవిద్యావిధానమునకు, పంచాయతీలకు సంబంధించిన అనేక ముఖ్యమైన బిల్లులు కౌన్సిలులో చర్చనీయాంశాలుగా వున్నవి. బయట జరుగుతున్న ఉద్యమాలను బలపరుస్తూ, శాసనసభల్లోవుండి పోరాడుటయే వీరి ప్రధానోద్దేశంగా కనుపిస్తుంది.

హరిసర్వోత్తమరావుగారు తన దృఢమైన విశ్వాసాలనుగురించి కాంగ్రెస్‌లో వాదించారు. గాంధీమహాత్ముని అరెస్టు అనంతరం,

*"The working committee appreciates the spirit in which those who have not accepted the correctness of the congress resolution, have complied with the request of the working committee."

ప్రభుత్వ నిర్బంధ చర్యలను నిరసిస్తూ తీవ్రమైనభాషలో మద్రాసు గవర్నరుకు లేఖవ్రాస్తూ తమ శాసనసభ్యత్వానికి రాజీనామా యిచ్చి వేశారు

## రా జీ నా మా లే ఖ

నంద్యాల 21-5-1930

మద్రాసు గవర్నరుకు,

ఈదేశప్రజలను ప్రభుత్వం, రానురానుపూర్తిగా నిరాశాపూరితులను చేసివేస్తున్నది. దివంగతులైన శ్రీగోఖలే మహాశయుని శిష్యాగ్రేసరుడైన మాహాత్మాగాంధీకి దేశంయొక్క సంపూర్ణ స్వరాజ్యమే ప్రధానాశయంగా పెట్టుకొనక తప్పనిసరయింది. ఈభావం దేశంలోవ్యాపించకుండా వుండాలని ఆయన సంవత్సరాల తరబడి చేయదగిన కృషిచేశారు. కానిచివరికీ పరిణామం తప్పనిసరియైనది. రాజకీయదురంతాలను అహింసాయుతంగా ధిక్కరించడానికి ప్రజలకుగల ప్రాథమికహక్కును గట్టిగానమర్ధిస్తున్నందులకు బ్రిటిష్ప్రభుత్వమువారాయననుఖైదుచేశారు. ప్రమాదకారియని విచారణలేకుండా ప్రభుత్వం గాంధీజీనినిర్బంధించింది. ఈ అహింసా మూర్తి ప్రమాదకారియట. తప్పెక్కడున్నదో ప్రపంచం పరిశీలించి తేల్చదా?

గాంధీగారిని నిర్బంధించడమనే పెద్ద తప్పుచేసిన తర్వాత ప్రభుత్వ ప్రవర్తన ఏ నాగరికతా ప్రపంచం సహించలేనంత ఘోరంగావున్నది. శాంతియుతులయిన సత్యాగ్రహులను హింసించుట, శాంతి యుతమైన ప్రచారం చేయుచున్న స్త్రీలను నిర్బంధించుట, విచక్షణా రహితంగా 144 (పీనల్ కోడ్) సెక్షన్ను అమలు జరిపి, నిన్నటివరకు ప్రభుత్వ న్యాయశాఖను నిర్వహించిన మితవాద నాయకులకు వ్యతిరేకంగా కూడా, అందరినోళ్లు మూయించ ప్రయత్నించుట, సత్యాగ్రహులకు ఆశ్రయమో, ఆహారమో యిచ్చారనే నెపంతో ప్రజలను కఠినంగా శిక్షించుట, బహిరంగ విచారణ లేకుండానే తమవైఖరిని సమర్థించుకో జూచుట, ప్రెస్ ఆర్డినెన్సును అమలు జరిపి నాప్రాంతపు ఏకైక దిన పత్రికైన ఆంధ్రపత్రికను గూడా అణచజూచుట, స్వేచ్ఛాభిప్రాయాన్ని

బయటికిరాకుండా తొక్కిపట్టుట, - ఇవన్నీ ఈ దేశప్రజల న్యాయమైన కోర్కెలు నెరవేర్చు కొనుట కనుగుణ్యమైన చేష్టలుకావు; ఇండియామీద ప్రేమకు చిహ్నాలు ఎంతమాత్రం కానేరవు.

భారతదేశ ఆత్మగౌరవాన్ని తృణీకరించి, సైమన్ కమిషన్ మీదనే పట్టుపట్టి, ప్రభుత్వం నిరర్థకమైన రౌండు టేబుల్ కాన్ఫరెన్సును గూర్చి మాట్లాడుతున్నది. హాని ఈ సమయంలో భారతినాయకులంతా నిర్బంధంలో నున్నారు. మా దేశంలో బ్రిటిష్ పరిపాలనను సమర్థించే ముఖ్యులైన రైట్ ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రిలాంటి వారే రౌండుటేబుల్ సమావేశానికి ప్రాథమిక చర్చనీయాంశం, సంపూర్ణ అధినివేశ ప్రతిపత్తివుండాలని పట్టుపడుతున్నారు. గాంధీజీ, ఈ వుద్యమాన్ని ప్రారంభించడానికి పూర్వం కోరినదిదేగదా!

ఇంతకుపూర్వం చరిత్రలో కనీవినీ ఎరుగనంతటి తీవ్రంగా ప్రపంచం పురోగమిస్తున్నది. అటువంటి సమయంలో జాతీయ వాంఛలను, నాగరిక జీవితవిధానాన్నే రాక్షసంగా అణచివేస్తున్న బ్రిటిష్ ప్రభుత్వ దారుణ నిర్బంధ విధానానికి పూర్తి వ్యతిరేకంగా నా అసమ్మతిని తెలియజేస్తూ, నా మద్రాసు శాసన సభా సభ్యత్వానికి రాజీనామా యిచ్చివేస్తున్నాను.

ప్రభుత్వం మొట్టమొదటగా రాజకీయ ఖైదీలను తక్షణం విడుదల చేయాలనీ, నిర్బంధాలను విధించే ఆర్డినెన్సులను వుపసంహరించాలనీ, స్వయం నిర్ణయసూత్రాన్ని అమలు జరపాలనీ నేను చాటి చెపుతున్నాను. స్వయం నిర్ణయహక్కు ఈదేశప్రజలకు, బ్రిటిష్ ప్రభుత్వానికి చర్చనీయాంశం కాదగిన మేరకు వుండాలని నాఅభిప్రాయం.

తమరు ఇక నారాజీనామాను స్వీకరించండి.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు

గాంధీజీని అరెస్టుచేయగానే హరిసర్వోత్తమరావుగారు **అంత**కుముందే ఒక వివరమైన లేఖ గవర్నరుకు వ్రాశారు.

క్లుప్తంగా దీని మొదటి భాగాన్ని ఇందుదహరిస్తాను.

జి. హరిసర్వోత్తమరావు, యం. ఏ., యం. యల్. సి.

నంద్యాల 10-5-1930

గవర్నరు గారికి,

పరిపూర్ణ హింసామూర్తి అయిన మహాత్మాగాంధి నరెస్టుచేసి, నిర్బంధించుట మంచిదని ప్రభుత్వం అనుకొన్నందులకు నాకు చాలా విచారంగా వుంది. ఇది క్రీస్తుదేవుని మరొకసారి హింసించిచంపుటే అవుతుంది. అయితే యిప్పుడీ చర్యజరుపుతున్నది క్రిస్టియన్ వ్యతిరేక ప్రభుత్వం గాక, క్రైస్తు అనుయాయులే.గాంధీజీ గుజరాత్‌లోవుండే అక్కడి ప్రభుత్వాన్ని స్తంభింపజేసి ప్రమాదకారకుడయ్యాడని బొంబాయి ప్రభుత్వం చెప్పుట ఓటమి నంగీకరించుటే. గుజరాత్‌లో ప్రభుత్వోద్యోగుల శాంతియుతమైన తీవ్రమైన సాంఘిక బహిష్కరణ నదుపులో పెట్టాలని ఆయన ప్రయత్నిస్తున్నట్లు అరెస్టుఅయిననాటి దినపత్రికల వార్తలు తెల్పుతున్నాయి. ఆయన ఒక్కతాలూకాలో జయం పొందగలిగినా, అది చరిత్రలో మహోత్కృష్టమైన పనిగా వుండేది, బ్రిటిష్‌వారాయనను తమగురువుగా భావించెడివారు. బ్రిటిష్‌ప్రభుత్వానికి-తీవ్రవాదులకుమధ్యస్తంగా గాంధీజీకి సంపూర్ణస్వాతంత్రతతో అనగా ఆయనఅభిప్రాయాలకు ఎట్టినిర్బంధాలు లేకుండా, భారత రాజకీయాలలో అహింసా సిద్ధాంత ప్రయోగాన్ని చేయటానికి పూర్తిఅవకాశం లభించలేదని, ఇండియాలో మావంటివారికి విచారంగా వుంది. ఇండియాలో అన్నిప్రాంతాలకు సమానంగా ఆయన సిద్ధాంతాన్ని అమలుపరచటం సాధ్యంకాదని మాలో కొందరికి ధైర్యంచాలని కారణంవల్లనే మాకభిప్రాయభేదములేర్పడినవి.

జీవితంలో క్రీస్తుకు స్థానమేలేకుండా చేసిన మీవంటి పాలకజాతి మీద ఆయన సాత్విక సిద్ధాంతాలు పనిచేయవేమోనని మాబోంట్ల అభిప్రాయం. తమ హృదయంలో కనీసపు మార్పు వచ్చిందని ప్రభుత్వం చెప్పటం వ్యర్థం. తలచుకొంటే సహకరించుటకు ప్రభుత్వమునకు

ఒక్కొక్క దశలో గాంధీగారు అవకాశమిస్తూ వచ్చారు. ఆయన స్వాతంత్ర్యసారాన్ని ముఖ్యంగా పదకొండు సూత్రాలలో నిర్వచించారు. ఈసూత్రాలు న్యాయమైనవని ఒప్పుకుంటే, ఆయన దిగిరావటానికి సంసిద్ధుడే. సహేతుకమైన రాజకీయ ధురంధరులెందరో వీటి న్యాయాన్ని అంగీకరించారు. అహింసాసూత్రాన్ని ఆమోదిస్తే జాతికెంత శక్తి కలుగుతుందో నిరూపించటానికే ఈ ఉప్పు సత్యాగ్రహం ఆరంభింపబడిందని ఆయన చెబుతూ వచ్చారు.

జి. హరిసర్వోత్తమరావు

హరిసర్వోత్తమరావుగారి వైఖరిని పూర్తిగా అర్థం చేసుకొనలేని వారిలో, వీరి రాజీనామా ఉదంతం కొన్ని అపోహాలకు, దురభిప్రాయాలకు కొంత కారణమైన దనవచ్చు. రావుగారి రాజకీయ జీవిత గమనంలో, దీని ప్రభావం ఏదోరూపంలో చివరిదాకా వెన్నంటుతూనే వుంది. కాంగ్రెస్ సంస్థ శాసనసభా ప్రవేశాన్ని అంగీకరించిన తర్వాతకూడా, కాంగ్రెస్ అభ్యర్థిగా రావుగారినెన్నడూ వరించజాలక పోయింది. కేంద్ర, రాష్ట్ర లెజిస్లేచరు సభ్యత్వాలకు రాజీనామాలిచ్చి, సత్యాగ్రహోద్యమాలలో పాల్గొన్న ప్రకాశం, కాశేశ్వరరావుగార్లు, పట్టాభి, వెంకటప్పయ్య ప్రభృతులు తదనంతరం రాష్ట్ర కాంగ్రెస్ రథసారథ్యం వహించి నడుప సాగారు.

1905 నుండి 1930 వరకు పాతికేండ్లు ఆంధ్ర రాజకీయాలలో అతిప్రధాన స్థానం ఆక్రమించిన హరిసర్వోత్తమరావుగారు, తర్వాత రాజకీయ రంగంలో మరుగున పడిపోయినారనవచ్చు. ఇందులకు కారణం ప్రధానంగా 1930–32, 1942 సత్యాగ్రహోద్యమాలలో రావుగారు ప్రత్యక్షంగా పాల్గొనక పోవటమే. సాధారణంగా ప్రజలదృష్టిలో, ప్రభుత్వ నిర్బంధ విధానాలకు గురియై,

జైలు శిక్షల ననుభవించినవారే వీరులుగా, ధీరులుగా పరిగణింప బడటం పరిపాటైంది. అనేక కష్టాలకోర్చి రావుగారు నిరంతర ప్రజాసేవా కార్యక్రమంలో నిమగ్నులై యుండేవారు. దేశసేవకు తాను నిశ్చయించుకొన్న కార్యక్షేత్రంగూడా వేరైనది.

గాంధీజీ నాయకత్వాన కాంగ్రెస్, ఒకసారి శాసనోల్లంఘన మన్నా, మరొకమారు శాసనసభా ప్రవేశానికి అంగీకరించినా, అశేషప్రజల హృదయాలను చూరగొని దేశభక్తులతో అద్వితీయ త్యాగాలు చేయించింది. క్రమేణా పురోగమించగలిగింది. అహింసా యుత సమరమార్గాన జాతీయోద్యమం విజయ పరంపర సాధించింది.

## సత్యాగ్రహం రోజుల్లో

1930-33లో సత్యాగ్రహోద్యమం జరుగుచున్న రోజులలో హరిసర్వోత్తమరావుగారు కాంగ్రెస్ కార్యక్రమంతో ప్రజలను సంఘటితపరుస్తూ వచ్చారు. ఈ సంగతి అప్పట్లో రాయలసీమ నుండి నడపబడుచున్న "ఇంద్రావతి," "కౌమోదకి" పత్రికలు చూస్తే కొంతవరకు బోధపడుతుంది.

"గాంధీ జైత్రయాత్ర"అను ద్విపదనువ్రాసి కౌమోదకిలో ప్రకటించారు. దీనినేంపుస్తకరూపంలోతెచ్చి ప్రచారం చేశారు. మచ్చుకు అందులోని ఒకటి రెండుభాగాలు చూడండి:

"వినుడయ్య జనులెల్ల వీరుడౌగాంధి
ఉప్పు సత్యాగ్రహపు నున్నట్టి రూపు.
కనుడయ్య యీనాడు కన్నులారంగ
కలిలోను సత్యంబు కదనమాడుటను.
ఆ నాడు దక్షిణ ఆఫ్రికాలోన

సామాన్యులందర శాంతి మైజేర్చి
జైలులోగూర్చుండి జయమును పొంది
మన గౌరవంబును మనజేసినాడు.
భారతభూమికి జయనమ్మైవచ్చి,
మూడేండ్లు దేశంబు పూర్తిగా దిరిగి
మరికొన్ని నాడులు మాటాడకుండి,
డయ్యరు సేనాని దనుజుడై క్రూర
హత్యలు సేయంగ, హాహారవంబు
లోకమెల్లనునిండి, ప్రాకిపోవంగ
ద్రౌపది భంగంబు దలపునకు రాగ,
అసహాయ మంత్రంబు నట్టె జపియించి
పాలకులెల్లర భయమందజేసి
మన గౌరవముపెంచి మహిమంబునించి
మాహాత్మ్యమొప్పంగ మనినాడు దాను.

*　　　　*　　　　*

గాంధి బల్కెగదొడ్డ గంభీరసరళి
ఓ భాయి ప్రజలార, ఓ బహినులార
మీరెల్ల రారండు పోరుసల్పగను,
వలదు శాసనసభ వార్త యీమీద
వలదు సర్కారుతో కలిసిపోవుటలు
వలదు వుద్యోగాలు వలదు వక్కీలి
వలదు దౌర్జన్యంబు వలదుదర్పంబు,
కలదు "ధైర్య"మ్మనకు కవచరాజంబు
కలదు "సత్య"మ్మనకు కలదు నిత్యంబు
ఈరీతి తెగబల్కి యెల్లవారలను
నిశ్చేష్టులనుజేసె నీతిబలమున."

సత్యాగ్రహరోజుల్లో రాయలసీమ ప్రజలకు విజ్ఞప్తిచేస్తూ రావుగా రిలా ప్రకటించారు:

"వెంటనే రెండువిధములయిన కార్యక్రమమును గట్టిగా మన మారంభింపవలయునని నా యభిప్రాయం. (1) సుశిక్షిత వాలంటీయరు దళమును సిద్ధముచేయుట మొదటిపని. వెంటనే శిక్షణశిబిరమును నెలకొల్పవలయును.హిందుస్థానీ సేవాదళమువారు ఇందుకుతగిన సాంకేతిక, కార్యవ్యవహారమంతయు జేయగలరు.(2) ఏప్రిల్ నెల 26 వ తేదీ జాతీయపతాకాభివందనమునకు జాతీయదినముగా నియమితమైనది. నాటి దినమున ప్రొద్దున 8 గంటలకు భారతజాతిలోని స్త్రీ పురుషులొక్కొక్కరును జాతీయపతాకమునకు అభివందనమొనర్చుట మన కర్తవ్య విధి. మన జిల్లాలలోని సోదర, సోదరీమణులందరూ, నాటిదినమున జాతీయపతాకములు నెలకొల్పి అభివందనమొనర్చవలయును."

ఇంద్రావతి-1931 ఏప్రిల్ సంచిక నుండి

నంద్యాలపట్టణంలో 30 మందితో హిందుస్థానీ సేవాదళ శిక్షణశిబిరం రావుగారు నెలకొల్పారు. శిక్షణపొందిన వారిలో, తదనంతరం 20మంది సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నట్లు ఆ ప్రాంతవాసులు చెప్పగా విన్నాను.

రావుగారు అప్పట్లో కౌమోదకి, ఇంద్రావతి పత్రికలలో తీవ్రమైన వ్యాఖ్యలు – విమర్శలు వ్రాసేవారు. 'కౌమోదకి' పత్రికలోని మరొక విజ్ఞప్తిలో వారు వ్రాసిన వ్యాసభాగాలు కొన్ని దిగువ నుదహరించుచున్నాను.

"దేశములోని సర్వదృష్టులను దర్శనముమీదనే నిలుపవలయును. ప్రతిజిల్లాయును, నాయకులను, వాలంటీర్లను ఈపనికిగాను వెన్వెంటనే సిద్ధపరచవలయును. విదేశవస్త్రబహిష్కరణము దేశమంతటనూ అమలులోకి తేవలయును. రౌండుటేబిల్ కాన్ఫరెన్సుకు ఆత్మగౌరవము కలవా

రెవ్వరూ వెడలకుండ చూడవలయును. ఇవియన్నియు అహింస మూలముననే జరుగవలయును,………

సత్యాగ్రహమనగా చెడుగును శాంతముతో నెదురొడ్డుట. ఎంతకాలము నిర్దుష్టమైన చెడుపు నిలిచియుండునో అంతకాలమును సత్యాగ్రహము నడుపకతప్పదు. నమ్రతతో,ధర్మదీక్షతో నడిపిన సత్యాగ్రహం ఆనాడు ఫలమందకున్నను, రాబోవు ఫలము సమీపింపజేసిన దనుటకు సందేహంలేదు. ప్రతిసత్యాగ్రహికి ఈదృష్టి యలవడుట అత్యావసరం………

సత్యాగ్రహమునకు కాలపరిమితిగాని,అపజయముగానిలేవు. రణభూమిని జయమందితిమని భేరిభంకారములు చేయునట్టి మతము కాదిది. సత్యాగ్రహము పరిపూర్ణమైన నమ్రభావముచేత విరోధి చిత్తము నాకర్షించి అతనిచే సత్యమును ధర్మమును అంగీకరింప జేయునట్టి మతము. కావున దీనికపజయమే లేదు. ఇది యొకవేళ యోడినట్లగుపించిన దీనికి కారణం సత్యాగ్రహపద్ధతియందు కల దోషముకాదు. సత్యాగ్రహముచే మానవ భావిక వాతావరణము ఎంత మారుచున్నను దానినిగూడా కాదని తనసత్యమునే బయల్పెట్టనెంచు మానవునిలోని పశుబల ప్రేరణమే కారణము ………

….కడచిన 25 సంవత్సరములలో భారతభూమి చూపిన త్యాగశీలములు ఎట్టి ప్రభుత్వమునకైనను తలయూచ వలసినట్టివి ఎట్టి నిరంకుశులైనను భారతభూమి అర్హతను అంగీకరింప జేయవలసినట్టివి….

ఇదివరలో భారతభూమి కనపరచియుండు త్యాగమే అపారము, అట్లుండియు ఇంకను కావలసినచో, అపారమైన త్యాగము చేయుటకు ఈభూమి సిద్ధముగా నున్నదనుటను ప్రభుత్వము వారును, బయటి దేశములవారును ఎరుంగ తగియున్నది. త్యాగమునకై కావలసిన సంకల్ప మెన్నడును ఈదేశమున లోటుపడదు. కాని ప్రభుత్వాధికారులు తమకార్య కరణముచేత ఈ త్యాగముయొక్క పరిమితిని నిర్ణయించవలసి యుందురు.

.... ఎన్నిమాయలు జరుగనిండు. ఎన్నిసేతలు నడువనిండు. తుట్టతుదకు ప్రజల యనుమోదములేని పరిపాలన మాత్రము నేసాగరదు, సాగదు. ప్రభుత్వము దేశముకొరకేర్పడినది కాని దేశము ప్రభుత్వము కొరకేర్పడినది కాదు."

మరొక వ్యాసంలో "రాయలసీమ సోదరులకు విజ్ఞప్తి" చేస్తూ రావుగారిలా హెచ్చరించినారు:

"రాజకీయ వాతావరణమున ఈలోపుగా మార్పులు కలుగక, మనకు దర్శన దాడియందు పాల్గొనుటకు కాంగ్రెస్ అధికారులు అవకాశము కల్గించునట్టి భాగ్యమే కల్గినచో మనకు ఉచితమగు సంఖ్యలను చేర్చుకొని బయలుదేరుటకు, అహింసాపరులగు సత్యాగ్రహులపై ప్రభుత్వాధికారము చూపనెంచిన వేడివెలుగు ప్రతాపము నంతయు సహించి, కార్యమును నడుపుటకు సంసిద్ధముగా నుండవలయునని మామక సహోదరులను హెచ్చరించుచున్నాను."

— కౌమోదకి నుండి

1931 ఆగస్టు 21 వ తేదీ కాంగ్రెస్ వాలంటీయర్లు నంద్యాల తాలూకా ఆఫీసుముందు పికెటింగు చేయుటకు పూనుకొన్నారు. అప్పట్లో నంద్యాల సబ్‌కలెక్టరుగా టి. యస్. సామినాథన్ అనే అధికారి వుండేవాడు. కల్లు, సారాల యిజారా పాటలు సాగించుతున్నప్పుడు, ఆ మత్తుపదార్థాలు సేవించవద్దనీ, కల్లు పాటలు పాడవద్దనీ వాలంటీర్లతోకలిసి హరిసర్వోత్తమరావుగారు ప్రచారం చేశారు. 'పాటదార్లుతప్ప- మరెవ్వరూ, హరిసర్వోత్తమ రావుగారితో సహా, వాలంటీర్లు ఎవ్వరూ లోపకు రావీలులే'దని కలెక్టరు చుట్టూ పోలీసు బందోబస్తు పెట్టుకొని, కంట్రాక్టర్లచే సారా పాటలు పాడించుకొనవలసి వచ్చింది. హరిసర్వోత్తమ రావుగారిపై నోటీసు జారీచేసినట్లున్నది.

1939 ఆగస్టు 16 న అనంతపురం కలెక్టరు ఆఫీసు ముందు గూడా ఇలాంటి పికెటింగులు జరిగినవి.

దత్తమండలాల కాలేజీ విద్యార్థులు గాంధీటోపీలు పెట్టు కొని కళాశాలలకు, హైస్కూళ్ళకు హాజరైనారట. లోనికి రాని వ్వకుండా, విద్యాలయాధికార్లు చర్య తీసుకోగా అది తీవ్రాందోళనగా పరిణమించింది. తర్వాత సద్దుకొని, విద్యార్థులను బడులకు రాని చ్చారు. రావుగారిటోటి పెద్దలు విద్యార్థులకు అండగా నిలిచారు. ఈ గాంధీటోపీల వ్యవహారం బ్రిటిష్ పార్లమెంటులో గూడా ప్రస్తావనకు వచ్చింది. 1930 లో గాంధీటోపీ ధరించి బయట ఎవరూ తిరగకూడదని ఆంధ్రలోని గుంటూరుజిల్లా కలెక్టరు ఒక విపరీతపు ఉత్తర్వు జారీచేశాడు. ఢిల్లీకేంద్ర అసెంబ్లీ, ఇంగ్లాండు లోని పార్లమెంటులతో రావుగారు వుత్తర ప్రత్యుత్తరాలు జరి పినా, ఎవరూ సమాధానాలు వ్రాయలేదు. పైవాళ్ల వుత్తర్వులు పొందకనే ఈమధ్య ప్రభువులు బహుమతులందగోరి ఇలా శాసి స్తుండేవారు. లండన్ పార్లమెంటులో ఈ సంగతి చర్చకు వచ్చింది. ఫెన్నర్ బ్రాక్వే గాంధీటోపీ విషయం పట్టుదలగా మాట్లాడినారు. 'ఐతే తాముగూడా ఒకటోపీ ధరించం'డని కొందరు సభ్యులు ఆయనను పరిహాసం చేసినారట. తక్షణమే బ్రాక్వేగారు టోపీధరించి, గాంధీటోపీమీద భక్తిని వెల్లడించారట.

చూచారా! విజ్ఞతగల ఇంగ్లీష్ వారిలోగూడా భారత స్వాతంత్ర్య హక్కుల యెడలగల సానుభూతి! బ్రిటిష్ సామ్రాజ్య వాదుల వలస పాలనను, నిర్బంధ పద్ధతులను వ్యతిరేకించిన మహ నీయులెందరో ఇంగ్లీష్ వారిలోగూడా లేకపోలేదు. అట్టి స్వాతంత్ర్యా భిలాషులు చిరస్మరణీయులుగదా! ఆరోజుల్లో గాంధీటోపీ పెట్టు

కోటమే మహానేరమైంది. పదికొన్నేండ్లకు అటోపీలు ధరించే, కాంగ్రెస్ మంత్రులు, శాసనసభ్యులు ప్రభుత్వాధికారాన్ని స్వీకరించారు. కాని నేడు ఆపవిత్రచిహ్నంయొక్క విలువ, గౌరవం తగ్గుముఖంపట్టిందేమో ననిపిస్తుంది, దాని పునః ప్రతిష్ఠ మరెన్నటికో?

1932 సెప్టెంబరు 19 వ తేదీ మహానందీశ్వరాలయం ఆవరణలో బాయివాది మద్దులేటి అధ్యక్షతను ఒక మహాసభ జరిగింది. హరిసర్వోత్తమరావుగారు గాంధీజీ సాగిస్తున్న నిరశన వ్రతమును గురించి ఉపన్యసించారు. ఆసభలో

"గాంధీమహాత్ముని ఆ మరణదీక్షకు ఈసభవారు మిక్కిలి దుఃఖించుచు, వారుచెప్పినట్లుగా తగినన్ని స్థానములు ప్రత్యేకపరచి యిచ్చి, ప్రత్యేక ఓటింగునుమార్చి, అన్ని వర్ణముల హిందువులతో చేరిన వోటును ఆది ఆంధ్రులకు ప్రసాదించి, ఇప్పటి ఆపదను బాపవలసినదిగా ఈ సభవారు తీర్మానించుచున్నారు."

అనే తీర్మానం ఆమోదించ బడింది,

ఖద్దరు ప్రచారం, త్రాగుడునిషేధం, వీటినిగూర్చి సభలు జరిపారు. రావుగారు ఇంద్రావతి పత్రికలో ఒక వ్యాసంలో ఇలా వ్రాశారు:

"ఖద్దరు విస్తారముగ ఇటీవల మనసీమలో సృష్టియగుట నిజమే కాని, సంస్థల పటుత్వ మున్నయెడల యింకను చాలయెక్కువగ సృష్టింప బడుటయును నిజమే.

పెద్దవడుగూరు బోటి కొన్నిగ్రామములలో శ్రీ చిన్నారపరెడ్డి గారి వంటి వారి నాయకత్వమున త్రాగుడు నిరోధము ద్వారా పరిపూర్ణముగ సాగినదియు వాస్తవమే. కాని యట్టి నిదర్శనములు అన్నిప్రాంతములకు యింకను ప్రాకవలసి యున్నది."

"ఇంద్రావతి" — 1931 ఏప్రిల్ సంచికనుండి

ఆరోజుల్లో రాయలసీమ పట్టణాలలో హిందూ- మహమ్మదీయ ఘర్షణలు అక్కడక్కడ ప్రారంభమైనవి. హిందూ-ముస్లిముసఖ్యతకై రావుగారు కృషిచేసినట్లు కనుపిస్తుంది.

నంద్యాలలో మసీదుముందు హిందువులు మేళతాళములతో వూరేగింపులు చేయరాదని ఒక తగాదా బయలుదేరింది. న్యాయస్థానాల్లో కొన్నాళ్ళుగడిచిన తర్వాత, హిందువులు అనాదిగా వుండే ఆచారం ప్రకారం వూరేగింపులు చేసుకోవచ్చునని కోర్టు తీర్పు యివ్వటం జరిగింది. వూరేగింపు జరిగేసమయంలో ఘర్షణ చెలరేగింది. పోలీసు లాఠీచార్జీ చేస్తే దెబ్బలు తగిలినవి. ఇందుకై అవసరమైన దానికంటే, పోలీసులు తొందరపాటుతనంతో లాఠీ ఛార్జీ చేశారని హరిసర్వోత్తమరావు గారు ఆంగ్లంలో 'హిందూ' పత్రిక కొక వ్యాసం వ్రాశారు. మత తగాయిదాలను సమయింపజేయుటకు ప్రయత్నించారు.

ఇలానే కర్నూలు పట్టణంలోగూడా మరొక హిందూ-మహమ్మదీయుల తగాదా వచ్చిందట.

నంద్యాల, కర్నూలుప్రాంతాల్లో హిందూ - మహమ్మదీయ సఖ్యత కొరకు రావుగారు తీవ్రకృషి చేశారు. పురజనులను కలుసుకొని, మత సంఘర్షణలు పెరిగి పెద్దవిగాకుండా, వారు సోదరభావంతో కలసి వుండేందుకు ప్రయత్నించారు. ఒకవైపు పోలీసు సూపరింటెండెంటు, జిల్లా కలెక్టరుతోను, మరొకవైపు పురప్రముఖులతోను కలుసుకొని సంఘర్షణలను సర్దుబాటు చేయగల్గారు. హరిసర్వోత్తమరావుగారి వ్యక్తిత్వం, ఒండొరులమధ్య సామరస్యానికి బాగా తోడ్పడినట్లు జిల్లా అధికార్లు ప్రశంసించారు.

1933 లో నెహ్రూగారి నరెస్టుచేసినప్పుడు ప్రభుత్వ చర్యకు నిరసనగా నంద్యాల విక్టోరియా రీడింగురూములో

రావుగారొక గొప్ప బహిరంగ సభ నేర్పాటు చేశారు. ఆయన త్రివర్ణ జెండా చేబూని ఊరేగింపు ముందు నిలిచారు. వందలాది జనంతో నిరశన ప్రదర్శనం జరిపారు. "ప్రభుత్వ నిర్బంధ చట్టాలను రద్దుచేయా" లని ఉపన్యసించారు. ఇండియన్ పీనల్ కోడ్ 124 ఎ సెక్షను, బెంగాలు క్రిమినల్ లా అమెండు మెంటులాంటి నిర్బంధ చట్టాలను రద్దుచేయవలెననీ, దేశభక్తులను తక్షణం విడుదల చేయవలయుననీ సభలో తీర్మానించారు.

ఈ విధంగా హిందూ ముస్లిము సఖ్యతకు, ఖద్దరు వ్యాప్తికి, త్రాగుడు నిషేధానికి ప్రచారం చేశారు. శిబిరములను నెలకొల్పి వాలంటీర్లకు శిక్షణ నిచ్చారు. ప్రభుత్వ నిర్బంధ చర్యలకు నిరసనగా సభలు, సమావేశాలు జరిపారు. పత్రికాముఖంగాను, కరపత్రముల మూలంగాను సత్యాగ్రహ సమరమును గూర్చి వ్యాసములు- వ్యాఖ్యలు వ్రాశారు, 'రాయలసీమ సోదరులకు విజ్ఞప్తి' అను దానిలో వాలంటీర్లను ప్రోగుచేసుకొని సత్యాగ్రహంలో పాల్గొనుటకు సంసిద్ధులుగా వుండండని పిలుపునిచ్చారు.

గాంధీజీ అహింసాయుత సత్యాగ్రహం ఆరంభించిన తర్వాత, జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో మూడు తరహాల మనుషులు కావాలని హరిసర్వోత్తమరావుగారు చెపుతుండేవారట. ఒక్క రకం శాసనోల్లంఘనంలో ప్రత్యక్షంగా పాల్గొనేవారు. మరొక రకం సమర్థవంతంగా, పార్లమెంటరీ కార్యక్రమం నిర్వహించేవారు. వాక్సభా పత్రికా స్వాతంత్ర్య హక్కులకోసం అసెంబ్లీలో పోరాడేవారు. ఈ రెండు తరహాలవారికీ ఆర్థిక, నైతిక సహకారం అందజేసే దేశాభిమానులు. ఈమూడు తరహాల మనుష్యులు దేశ

భక్తి కార్యక్రమంలో సమానంగా కృషి చేస్తున్నట్లుగానే భావించవలసి వుంటుందని అనేవారట.

## కాంగ్రెస్- కేంద్ర శాసనసభా ప్రవేశం

1933 లో శాసనోల్లంఘనోద్యమాన్ని గాంధీజీ విరమించానని ప్రకటించారు. సత్యాగ్రహుల నందరిని ప్రభుత్వం విడుదల చేసింది, సహాయ నిరాకరణ అయిన తర్వాత రాజకీయ కార్యక్రమంలో ప్రతిష్ఠంభన యేర్పడింది. డాక్టరు అన్సారి, బి. సి. రాయి, బూలాభాయి దేశాయి మున్నగువారు సమావేశమై తర్వాత కార్యక్రమాన్ని గురించి సమాలోచనలు జరిపారు. పూర్వపు స్వరాజ్య పార్టీని పునరుద్ధరించుటకు, కేంద్ర లెజిస్లేచరులోకి ప్రవేశించుటకు నిశ్చయించారు. స్వరాజ్యపార్టీ ప్రయత్నానికి గాంధీగారు అడ్డురాలేదు. అంతేగాదు, తమ అంగీకారాన్ని తెలియ జేశారు. ఐతే దీనికి ప్రత్యామ్నాయంగా, కాంగ్రెస్ గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమం, అస్పృశ్యతానివారణ, హిందూ-మహమ్మదీయ సఖ్యత, ఖాదీ, గ్రామ పునరుద్ధరణలను దేశం ముందుంచారు. మొత్తంమీద రాజకీయంగా స్వరాజ్య పార్టీయొక్క శాసనసభా ప్రవేశ కార్యక్రమాన్నే కాంగ్రెస్ ఆమోదించిందనవచ్చు.

ఈ సందర్భంలో హరిసర్వోత్తమరావు గారికి డాక్టరు అన్సారీ ఒక సుదీర్ఘలేఖ వ్రాశాడు. రాబోవు ఎన్నికలలో పాల్గొని సెంట్రల్ అసెంబ్లీ ప్రవేశానికి కార్యక్రమాన్ని చేపట్టాలనీ, తమ ఆంధ్ర మిత్రులతో 'రాంచీ' మహాసభకు రావలయుననీ ఆహ్వానం పంపాడు. జాతీయ కాంగ్రెస్ మహాసభగూడా పాట్నాలో జరిగింది.

యస్. సత్యమూర్తి, సామి వెంకటాచలంచెట్టి మొదలగు మద్రాసు కాంగ్రెస్ నాయకులుకూడా రావుగారికి వుత్తరాలు వ్రాశారు. 1934 మే 18,19 తేదీలలో జరిగిన పాట్నా ఎ. ఐ. సి. సి. మహాసభకు, రాంచీ మహాసభకు హరిసర్వోత్తమరావు గారు వెళ్లి పాల్గొన్నారు.

పూనాపట్టణంలో మహారాష్ట్ర డెమాక్రటిక్ పార్టీ, యు. పి. నేషనలిస్టుపార్టీల సంయుక్త యాజమాన్యమున ఒక విస్తృత సమావేశం జరిగింది. ఈ సభకు ఆంధ్రనుంచి గుమ్మడిదల సుబ్బారావుగారు హాజరైనారు. దీనిలో పండిత మదనమోహన్ మాళవ్యా, ఆనీ, కేల్కార్ డి. వి. గోఖేలు, భోపాట్కార్ ప్రభృతులు పాల్గొన్నారు. కాంగ్రెస్ వాదులతోను, కాంగ్రెసేతరులైన ప్రజాస్వామ్య వాదులతోను కలిసి ఎన్నికలలో పోటీ చేయుటకు నిర్ణయించుకొన్నారు.

ఆంధ్రదేశంలోగూడా పూర్వపు స్వరాజ్యపార్టీ పునరుద్ధరణకు ప్రయత్నాలు జరిగినవి. జి. వి. సుబ్బారావు, లక్కరాజు సుబ్బారావు, వేమవరపు రామదాసుపంతులు, హరిసర్వోత్తమరావు గార్లతో సమాలోచనలు జరిపారు. కాంగ్రెస్ కార్యక్రమమే వుండాలనీ, ఐతే మన రాష్ట్రానికి సంబంధించినంతవరకు భాషా ప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతాన్ననుసరించి, ప్రత్యేక తెలుగురాష్ట్రం కోసం తక్షణం కృషి చేయవలసి వుంటుందని అభిప్రాయ పడినారు.

## ఆంధ్ర స్వరాజ్య పార్టీ పునరుద్ధరణ ప్రయత్నం

1934 లో గుంటూరులో ఆంధ్రా నేషనలిస్టు పార్టీ మహాసభ పేరుతో స్వరాజ్యిస్టుల సభ జరిగింది. నడింపల్లి లక్ష్మ

నరసింహారావుగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగా నుండి సభలు జరిపించారు. డాక్టరు మూంజీ సభాధ్యక్షత వహించారు. 1935 వ సంవత్సరంలో డాక్టరు మూంజీగారి అధ్యక్షతను విజయవాడలో "ఆంధ్ర స్వరాజ్య పార్టీ" మహాసభ జరిగింది. జి వి. సుబ్బారావు ప్రధానబాధ్యత వహించారు. హరిసర్వోత్తమరావుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా వున్నారు. కాంగ్రెస్ వాదులు అంతగా సహక రించనందున, కొన్నాళ్ళు "స్వరాజ్యపార్టీ" పేరుతోనే వ్యవహ రించారు.

"స్వరాజ్యపార్టీ అనగా కేవలం కౌన్సిలు పార్టీయేకాదు. కౌన్సిళ్లు ఒక సాధనంగాని, మా పరమావధిగాదు. కౌన్సిళ్ళు మంత్రి పదవులే స్వరాజ్యము సంపాదించుచో జస్టిస్ మిత్రు లిదివరకే మనకు స్వరాజ్యము తెచ్చేదివారు."

అని తమ కార్యవిధానంలో ప్రకటించారు.

స్వరాజ్యపార్టీ యావశ్యకతను గురించి జి. వి. సుబ్బారావు గారొక కరపత్రం ప్రకటించారు. ఆనాటి రాజకీయ పరిస్థితులను గూర్చి అందిట్లున్నది:

"అఖిలభారత ఖండమందును రాజకీయపరిస్థితులు తిరిగి తారు మారగుచున్నవి. మనరాజధానిలోని జస్టిస్‌కక్ష రంగరామానుజుని యోటమితో నిస్తేజమందెనని చెప్పవచ్చును. బొంబాయి, పూనాలలోని డెమాక్రటిక్ స్వరాజ్య వాదులు నూతన కార్యక్రమము నేర్పరచుకొన యత్నించుచున్నారు. పాంచాళమందలి సామ్యవాదులు కాంగ్రెసే తరులతో చేతులు కలిపిరని తెలియుచున్నది. కాంగ్రెస్‌నందలి సామ్య వాదులు పార్లమెంటరీ బోర్డుతో ఢీకొనుచున్నారు. ఈ సంవత్సరాంత మున జవహర్‌లాలు నెహ్రూగారి విడుదలతో కాంగ్రెస్ నందు రెండు చీలిక లేర్పడు సూచనలు కన్పట్టుచున్నవి. దేశమందలి సనాతన

పక్షమువారు ధర్మరక్షణ నొసంగు నూతన రాజకీయ కక్షకొరకు ఎదురు చూచుచున్నారు. మాళవ్యా పండితునిచే నేర్పరుపబడిన జాతీయ కక్ష సాంఘిక పరిష్కార విషయ యాందోళన సలిపి, స్వరాజ్య సంపాదన కనువగు సాధనమార్గముల నన్వేషించుచున్నది. వంగదేశమున జాతీయవాదుల చేతులలో కాంగ్రెస్ సంపూర్ణముగా నోడిపోయి నూతన కార్యక్రమమున కెదురు చూచుచున్నది. ఆంధ్రదేశమందలి మా స్వరాజ్య సంఘమును తిరిగి కార్యాలోచనకు గడంగెనని చెప్పవచ్చును. ........

"..... ఇటీవల పదునేను సంవత్సరముల నుండియు శ్రీ గాంధీ మహాత్ముని నాయకత్వమున కాంగ్రెస్ చేసిన కృషివల్ల దేశమందొక స్వరాజ్య తృష్ణ, నూతనవికాసము కలిగెనని యెల్లరు నంగీకరింతురు. కాని ఈ స్వరాజ్య శక్తుల తనలో నిముడ్చుకొన గలిగిన రాజకీయ సంస్థయొక్కటియు నేడులేదని చెప్పిన నతిశయోక్తి కానేరదు. ఇటు కాంగ్రెస్ సంస్థయు గాంధీమహాత్ముని నిర్మాణ కార్యక్రమమును నటుమ శాసనసభల నారాధించుచు క్రమేణా స్వరాజ్యమునే మరచుచున్నది. అటు దేశములో బలిష్ఠమును, జాతీయమునగు పార్టీ వేరొక్క టెద్దియు కానరాదు. ఇట్టి పరిస్థితులలో భారతఖండమంతటను స్వరాజ్యపార్టీని తిరిగి నెలకొల్పుటెంతయు నవసరము. ఇందుకై మా ఆంధ్ర స్వరాజ్య పార్టీ వారు చేయవలసిన కృషి యెంతయో కలదు ........

"ఆంధ్రమహాజనులు మాయత్నముల కుచితరీతిని చేయూత నొసంగెదరు గాక"।

ఆంధ్రరాష్ట్రము, సైనికశిక్షణ - రామదండు, శాసనసభా ప్రవేశం, మున్నగు ప్రధాన కార్యక్రమం నిర్ణయించుకొని స్వరాజ్యపార్టీ పనిచేయ పూనుకున్నది.

అప్పట్లో బూలాభాయిదేశాయి ఆంధ్రదేశానికి వచ్చి కాంగ్రెస్ వాదులను అభ్యర్థులుగా నియమించారు. బూలాభాయి

రాకతో ఆంధ్రకాంగ్రెస్‌సంఘం ఎన్నికల రంగంలో ప్రవేశించింది. హరిసర్వోత్తమరావుగారు కాంగ్రెస్‌లోను, తిరుపతిరాజుగారు పీపుల్సుపార్టీలోను వుండిపోవటంతో స్వరాజ్యపార్టీలో జి. వి. సుబ్బారావుగారే మిగిలిపోయినారు. సుబ్బారావుగారు, హరిసర్వోత్తమరావుగారి మధ్యగూడా విభిన్నాభిప్రాయాలు పొడసూపినవి. కాంగ్రెసే శాసనసభాప్రవేశానికి పూనుకోటంతో, ఆంధ్రదేశంలో యితర ప్రజాస్వామ్యవాదుల కవకాశం లేకుండా పోయింది. కేంద్రఅసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెస్ తరపున అభ్యర్థులుగా నిలుచున్న కాశీనాథుని నాగేశ్వరరావు, యన్. జి. రంగా, అనంతశయనం అయ్యంగారు, మున్నగువారు అఖండవిజయం పొందారు.

ఢిల్లీ అసెంబ్లీ ఎన్నికలలో మదనమోహనమాళవ్యా, యం. యస్. ఆనీ మొదలగువారు కాంగ్రెస్ నేషనలిస్టులుగా పోటీచేసి 11 మంది గెలిచారు. కాంగ్రెస్ పక్షమున 44 మంది ఎన్నికైనారు. సెంటర్‌లో బూలాభాయి దేశాయిగారు నాయకుడైనాడు.

## కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ

కాంగ్రెస్ సత్యాగ్రహోద్యమం విఫల మొందుటకు ముఖ్యంగా కార్మిక కర్షకులను ఎక్కువగా ఆకర్షించలేక పోవటమనీ, అందుకు కాంగ్రెస్‌లోనే కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ అవసరమనీ, సోషలిజం మనధ్యేయంగా వుండాలనీ జయప్రకాశ్, ఆచార్య నరేంద్రదేవ్, అచ్యుతపట్వర్ధన్ ప్రభృతులు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ నేర్పరచి 1934 నుండి కృషిచేయ సాగారు.

ఆంధ్రదేశంలో మద్దూరి అన్నపూర్ణయ్య, క్రొవ్విడి లింగరాజు, రంగశాయి మున్నగువారు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ

శాఖల నేర్పరిచారు, సుందరయ్య ప్రభృతి కమ్యూనిస్టులుగూడా ఆనాడు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీలోనే వుండేవారు. గుంటూరులో జొన్నలగడ్డ రామలింగయ్య, దుర్భాకృష్ణమూర్తి, పోలేపెద్ది నరిసింహమూర్తి, పి. లోకనాథంగార్లు కార్మిక సంరక్షణ సంఘం (labour Protection league) స్థాపించి, కరపత్రములు ప్రచురించి కూలీసభలు జరుపుతూ ప్రచారం చేశేవారు. కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించిన తర్వాత, కొలదిమంది వ్యక్తులు మినహా, ఆంధ్ర సోషలిస్టుపార్టీ కమ్యూనిస్టుపార్టీగా పరిణామం చెందింది.

హరిసర్వోత్తమరావుగారు అప్పటినుండి రాజకీయ కార్యకలాపాల్లకంటె గ్రంథాలయ, ఆంధ్రోద్యమాల్లోను, ప్రధానంగా నిర్మాణ కార్యక్రమంలోను నిమగ్నులైపోయినారు.

"విజ్ఞాన ప్రచారానికి మానవుడు తక్కిన అన్నివిషయాలలో వలెనే అనేక రకములైన సంస్థలను నిర్మించుకొని యున్నాడు. అట్టి సంస్థలలో నేటిదినము ప్రధానమైనది-చక్కగా ఆలోచిస్తే అద్వితీయ మైనది గ్రంథాలయసంస్థ.... విజ్ఞానమునుగూర్చి మహావేత్త యొకడు తనకు తెలిసింది సముద్రతీరంలోని యిసుక ప్రోవులోని ఒక్కరేణువు మాత్రమనియు, తెలియనిది అపారమైన సముద్రము వంటిదనియు వివరించినాడు. వ్యక్తిగతంగాఆలోచిస్తే యేమహావ్యక్తిని తీసుకొన్నా ఇది నిజమేఅవుతుంది. కాని ప్రపంచంలోని మహావేత్తలందరూ ఒక చోట గుమిగూడ గలిగితే ప్రపంచ విజ్ఞానసాధన సాధ్యమవుతుందన డానికి సందేహములేదు. ఆ ప్రకారముగా మానవుడు విజ్ఞానమును వశంచేసుకొనడము చేతనే నేటిదినము ప్రపంచములో మనము చూస్తూ,అనుభవిస్తూ,ఆనందిస్తూవుండే భౌతిక సౌఖ్యాభివృద్ధికలిగింది. దీనికి దారితీసింది లోకంలోని గ్రంథరచన, గ్రంథవిస్తారము, గ్రంథ వ్యాప్తి అనడంలో సందేహము లేదు."

—గాడిచర్ల హరిసర్వోత్తమరావు

# 3

# సారస్వత రంగం

సుప్రసిద్ధ రచయిత – విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి – ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము–పత్రికాసంపాదకత్వము – గ్రంథరచన–రేడియో ప్రసంగాలు – పీఠికలు – గ్రంథ సమీక్షలు – అముద్రిత గ్రంథాలు, నోట్సులు – తెలుగుభాషా సమితి వారి విజ్ఞానసర్వస్వము– వేసంగి పాఠశాలలు – శిక్షణ శిబిరాల్లు.

## 3

# సుప్రసిద్ధ రచయిత

హరిసర్వోత్తమరావుగారు ఎం. ఏ. పాసైన ఆంధ్రు లందరిలోను ద్వితీయులనీ, అర్థశాస్త్రం, చరిత్ర, రాజకీయముల లోను, తెలుగు కన్నడభాషా శాస్త్రములలోను పారంగతులనీ ఇది వరలో వ్రాశాను. మహారాష్ట్రము రావుగారి మాతృభాష. కన్న డము మధ్వుల ధార్మికభాష. ఆంధ్రము వారి అభిమానభాష. మద్రా సులో వుండటంతో తమిళం గూడా బాగావచ్చింది. భారతజాతీయ భాషఅయిన హిందీ నభ్యసించి, హిందీభాషా జ్ఞానమునభివృద్ధి చేసుకొన్నారు. ఈవిధంగా ఇంగ్లీషు, హిందీ, తెలుగు, కన్నడ, మహారాష్ట్ర, తమిళభాషలలో చదువను వ్రాయను నేర్చుకొనుటే గాక, మూడునాల్గు భాషలలో పాండిత్యాన్నిసైతం సంపాదిం చారు. అందుచేతనే రాజకీయంగా మాత్రమేగాక, భాషావిషయం గాగూడా బహుముఖ సేవచేయుట కవకాశం కలిగింది.

ఈయన జీవితాంతం వరకు వివిధశాస్త్ర గ్రంథములను పఠించి పరిశీలన గావించారు, తానార్జించిన అపారవిజ్ఞానాన్ని ప్రజానీకానికి పంచిపెట్టుటకు ప్రయత్నించారు. పెక్కు గ్రంథము లను రచించారు. పత్రికల సంపాదకత్వం వహించారు. గ్రంథ ప్రచురణాలయములు నెలకొల్పుటకు కృషిచేశారు. రేడియోలో ఎన్నో ప్రసంగాలు చేశారు. పుస్తకములకు అత్యుత్తమ.

పీఠికలు రచించారు. హిందూ పత్రికకు గ్రంథసమీక్ష లనేకం వ్రాశారు. ఈరీతి హరిసర్వోత్తమరావుగారు కవి, విమర్శకుడు, గ్రంథకర్త, సంపాదకుడు, సుప్రసిద్ధ పత్రికారచయిత, సంపూర్ణ వ్యక్తిత్వంగల మేధావి.

## విజ్ఞానచంద్రికాగ్రంథమండలి

రావుగారు మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో ఎం. ఏ. చదువుచున్నప్పుడే కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారితో కలిసి, తోడునీడగా 'విజ్ఞానచందిరికా గ్రింథమండలి'ని నెలకొల్పటం జరిగింది. దీనిలో మొదటి పుస్తకం అబ్రిహాం లింకన్ చరిత్రను రావుగారే వ్రాశారు. తదాది వివిధ చారిత్రక, శాస్త్రగ్రంథములను ఈ గ్రంథమండలి ఆంధ్రప్రజల కందజేయ గలిగింది. 'అన్న లక్ష్మణరావు' అంటూ ప్రేమగా పిలుచుకొనేవారు. వీరిచెలిమి, సోదరప్రేమ, తర్వాత తెలుగువిజ్ఞాన సర్వస్వ ప్రచురణలకు దోహదం చేసింది. ఈ గ్రంథమండలి, విజ్ఞాన సర్వస్వప్రచురణ ప్రయత్నాలను గురించి రావుగారి అభిప్రాయాలను తెలిపే "అన్నయ్య కొమర్రాజు లక్ష్మణరావు" అనేవారి వ్యాసంలోని ముఖ్యభాగాల నిందుదహరిస్తాను. ఇవి ఆనాటివారి ఆలోచనలను, అప్పటి పరిస్థితులను అర్థం చేసుకోటానికి వుపకరిస్తాయి.

"శ్రీలక్ష్మణరావు మహారాష్ట్రి దేశంలోవుండి, మరాఠీభాషలో పండితుడై అచ్చటి వాఙ్మయాభివృద్ధికి తోడ్పడి వచ్చినవాడుగా ఉత్సాహంతో వుప్పొంగుతుండేవాడు. కాశీశ్వరరావు శ్రీ వీరేశలింగంగారి సంస్కారోద్యమంలో బాగా విశ్వాసంగలవాడు. కాబట్టి మామాటలన్నీ దేశవికాసోద్యమంమీదికి మరలినవి. లక్ష్మణరావు 100 పేజీల పత్రిక ఆరంభించి విజ్ఞానప్రచారం చేయవలెనన్నాడు. అచ్చు, కాగితం, చిత్రాలు ఫస్టురేటువి కావలెనన్నాడు. నేను పుస్తకరూపంగా వెలువ

రిద్దాం అన్నా. విమర్శించుకొన్నాం. ఆరంభంలో పుస్తకాలు వేసుకోవే మేలనుకొన్నాం. మా ఉద్యమానికి పేరేమిపెడ్దాం అన్నాం. ఎన్నోపేర్లో ఆలోచించినాం. లక్ష్మణరావుచేసిన సలహాయే ననుకుంటా 'విజ్ఞాన చంద్రిక' అనేది స్థిరపరిచాం. ఈ మాటలు మాట్లాడుతునే సహాయకు లను నిర్ణయించుకొన్నాం. మునగాల జమీందారు, రావిచెట్టు రంగా రావు 1905 వ సెప్టెంబరులో అరటావు కాగితం లక్ష్మణరావు 'అప్పీలు' అచ్చువేయించినాడు. ప్రపంచంమీద విసరివేసినాం........

.... 1906 సంవత్సరం కొంతమారం సాగినతరువాతగాని విజ్ఞాన చంద్రిక రూపుదాల్చలేదు. అప్పట్లో 'కృష్ణాపత్రిక' మద్రాసులో తాత్కాలికంగా అచ్చువుతూవుంది. మిత్రుడు ఆవటపల్లి నారాయణరావు ముద్రణకార్యాలు చూస్తూవుండేవాడు. వాసనబట్టి నన్ను పట్టుకొన్నాడు. 'పున్నాదేవి' వగైరా కొన్నివ్యాసాలు నాచే వ్రాయించుకొన్నాడు. విజ్ఞాన చంద్రికమాట మాట్లాడుతుంటే, 'లింకన్' చరిత్ర నీవు వ్రాయ రాదా అని నన్నొక్క పొడుపు పొడిచినాడు..... .

అప్పటికింకా నాపేరే విజ్ఞానచంద్రికా సంపాదకత్వానికి లక్ష్మణ రాయాచులు నిర్ణయించి యున్నారు. కాశేశ్వరరావుగారు నాతోటి సంపా దకులు. 'రాణీసంయుక్త' మాచేతికి వచ్చింది. ఆనంద ప్రెస్‌కు అచ్చుకిచ్చినాం. కాని భరింపరాని ఆలస్యమైపోతూవుంది. అందువల్ల 'సరే, హరిసర్వోత్తమరావే అబ్రహాం లింకన్ చరిత్రను వెంటనే వ్రాయవలసింది. దానినే మొదటి గ్రంథంగా ప్రకటించవలసింది. కె. వి. లక్ష్మణరావు వాని సంపాదకత్వం వహించవలసింది' అనే తీర్మానానికి వచ్చినాం....

నేను నాగదిలోకూర్చొని వ్రాయడం, వ్రాసినవరకు ప్రతి లక్ష్మణ రాయనికి పంపడం, ఆయన చదవడం. నాప్రకృతి అతి స్వతంత్రమని ఆయన యెరుగును. కాబట్టి దిద్దుబాట్లు తానుచేయడు. నా వ్రాత ప్రతి మీద గుర్తుగీయును. (This is English)' ఇది యింగ్లీష్'అనును.

నాకు ఎక్కువ ఆలోచనకు వ్యవధి యుండునది కాదు. సాధారణంగా (omit) 'తీసివేయి' అనేవాణ్ణి. వదలివేయడానికి వీలులేని పట్టయితే సంస్కరించేవాణ్ణి. 'లింకన్' వ్రాత కార్యక్రమాలతో మాయిద్దరి స్నేహం సోదరభావంక్రిందికి మారిపోయింది......

.... ఇది జరిగింది నేను ఎం. ఏ. పరీక్షకు పోవడానికి ముందు. గ్రంథమచ్చు వేయడంకూడ అప్పుడే సాగిపోయింది. నేను పరీక్షకు చదువుతూ వుండటంచేత ప్రూఫులు దిద్దటం వగైరాపని అంతా లక్ష్మణరావుమీదే పడ్డది. ఆకూర్పుకు వ్రాసిన తొలిపలుకు మాయయిదు గురి చేవ్రాళ్లతో వుంది. మునగాల జమీందారు, లక్ష్మణరావు, కాశేశ్వరరావు, రావిచెట్టు రంగారావు, నేనూ అందరము ముఠా. తొలిపలుకు వ్రాతఅంతా లక్ష్మణరావుదే. ఆనాటి అభిప్రాయాలు, ఆశలు అందులో ప్రతిఫలించినవి. లక్ష్మణరావు తన స్వభాషలో వీనిని ముద్దులు తీర్చినాడు.........

.... ఆ సత్పురుషుడు రావిచెట్టు రంగారావు గ్రంథాలన్నీ హైదరాబాదుకు చేర్చుకొని పైవిలాసాలు వ్రాయడం, బుక్‌పోస్టు లతికించుకోవడంతో కూడా తానే స్వయంగా చేసుకొని విజ్ఞానచంద్రిక మొదటి గ్రంథాన్ని తెలుగుదేశానికి అందజేసినాడు.....

తరువాత మూడేండ్లు నాకు - లోకానికి, నాకూ లక్ష్మణరావుకు మధ్యన జెయిలనే నల్లతెర అడ్డంపడిపోయింది. విజ్ఞానచంద్రిక పనిలోకి డాక్టరు లక్ష్మీపతి అంతకుముందే ప్రవేశించినాడు. అతడు వ్యవస్థాపకుడుగా విజ్ఞాన చంద్రికను పెంచి పెద్దచేసినాడు. బరువంతటిని మోసినాడు.

జైలు గోడలైనా కాలగతికడ్డము రాలేవు. మూడేండ్లు ముగిసి పోయినవి. జైలునుండి నేను సరిగా మద్రాసుకు వచ్చిచేరినాను. మిత్రులు మునగాల, లక్ష్మణరావులు నాకప్పటికే కొంతవసతి యేర్పరచి పెట్టినారు. కొన్నాళ్లకు మళ్లీ విజ్ఞానచంద్రిక కార్యక్రమము పూర్ణంగా నా చేతిలో వుంచినారు. కాని ఆయుగం భీతియుగం. జైలునుంచి వచ్చిన నన్నుచూస్తే యితర మిత్రులకు జైలే కండ్లలో ఆడేది.

అందుచేత దగ్గరకురాను భయపడేవారు. పల్కరించను అంతకంటే భయపడేవారు. అట్టి తరుణంలో లక్ష్మణరావు మనసున నొచ్చుకొంటూనే, నాకు కొంత అపచారం కలిగినా సహించవలసి వచ్చింది........

.... 'ఢిల్లీ దర్బారు' నేను వ్రాసింది ప్రకటనదగ్గరకు వచ్చేటప్పటికి గ్రంథకర్తగా నాపేరు వేయడానికి కొన్నికష్టాలు అప్పటికి మిత్రులకు తోచినవి. నే వ్రాసిన దానిలో ఏలోపం వుంటుందో అని వకీలు రామదాసుగారిచేత పుస్తకమంతా చదివింపించినారు. నాపేరు వేయడం మానివేసి 'లక్ష్మణరాయ సంపాదిత' మని ప్రకటించినారు. అప్పటికింకా తెలుగుభాషలో కొన్ని పదాలు రూఢికాలేదు. లక్ష్మణరాయ సంపాదిత మంటే, లక్ష్మణరావుగారే వ్రాసినారనుకొను పత్రికల వారందరూ గ్రంథాన్ని తెగశ్లాఘించినారు. అన్నయ్య లక్ష్మణరావు చనిపొయ్యే వరకు యిది ఆయన మనసులో మెదులుతుండేది. ఇంకకొంత తానువ్రాసి చేర్చి నాపేరు, తనపేరు రెండూ గ్రంథకర్తల పేళ్లుగా వేసుకుందామని పాపమాయన యెన్నిపర్యాయాలో హెచ్చరించినాడు. కాని తుది వరకు అది సాగిందికాదు. అందుచేత విజ్ఞానచంద్రిక ప్రకటనలు తరువాత కాలమున వేసేటప్పుడు గ్రంథకర్తక్రింద అందులో నాపేరు వేయించి అతను కొంత మనశ్శాంతి పొందినట్లు గోచరిస్తుంది........

.... నేను విజ్ఞాన చంద్రిక మొదటివాళ్లలో ఒకణ్ణి. సభ్యుల పేళ్లు ప్రకటించుకోటానికి అప్పట్లో అవకాశంలేదు. ఏంచేయను? నా ప్రతినిధి పేరైనా ఇరికించక లక్ష్మణరావుకు మనసు తృప్తిగాదు. ఆ పనికి శ్రీ గూడూరు రామచంద్రరావును ఏరుకొన్నాడు. ఆయనకు నాయందు గల అనురాగంచేత్త ప్రాతినిధ్యం వహించను అంగీకరించినాడు. లక్ష్మణరావు నిర్యాణానంతరం జరిగిన విజ్ఞాన చంద్రిక చరిత్ర మూలకంగా ఆయన ప్రాతినిధ్యానికి విలువలేకపోయింది. అసలు నామొదటి సభ్యత్వంతిరిగి రావలసిన అగత్యం లేకపోయింది"........

ఇంకొక సంఘటన. చిలుకూరు వీరభద్రరావు 'ఆంధ్రుల చరిత్ర-రెండవభాగం' ప్రచురణకు వచ్చింది. దాని ప్రచురణ కార్యక్రమం

బంతా నాచేతుల్లో వుండిపోయింది. లక్ష్మణరావుకు దాని గొడవే తెలియదు. ఉపోద్ఘాతంగూడా సంపాదకుడనే పేరుతో నేనే వ్రాసినాను. గ్రంథంలో వెలమదొరలు 'చాపకూడు' తిన్నారనే ప్రసక్తియుంది. గ్రంథకారుల అభిప్రాయాలతో ఏకీభవించడం సంభవించక పోయినా అసభ్యం కానంతకాలం వానిని రద్దుపరచడం ధర్మంకాదు. కాబట్టి చిలుకూరివారి అభిప్రాయం నేనుదిద్దలేదు. అప్పటికి మండలికి పిఠాపురం, బొబ్బిలి, మునగాల వారంతా పోషకులు. వారిపేళ్లు మాగ్రంథ ల్లో ప్రముఖంగా ప్రకటించేవారం. ఈ ప్రచురణతో పిఠాపురం, బొబ్బిలివారల కాగ్రహం కలిగింది. తాము పోషకత్వం నుంచి విర మిస్తున్నామని లక్ష్మణరావుకు వ్రాసినారు. వారి తృప్తికొరకు నాకుగాని, వీరభద్రరావుకుగాని అన్యాయం చేయడం లక్ష్మణరావుకు నచ్చలేదు. ఆదినంనుంచి వీరిపేళ్లు విజ్ఞాన చంద్రికలోనుంచి అదృశ్యమయినవి."

## విజ్ఞాన సర్వస్వము

"లక్ష్మణరావూ నేనూ చేరితే విజ్ఞాన ప్రచారానికి క్రొత్త ఆలోచన చేయకుండావుండే ప్రకృతులుగావు మావి. ఆయనకు నూరు పేజీల మాసపత్రికయని కలగా తోచుతూవుండిన భావం, "విజ్ఞాన సర్వస్వం" గా పరిణమించింది. నాతో ప్రసంగించినాడు. నేను సెబాసన్నాను. కాని కాలం గడచిపోయింది. విజ్ఞాన చంద్రికమీద ఆధారపడటం వీలుకాదని నాకూ వొక భావం తోచింది. మిత్రునికొక రు 100 ల వంతున ఏ 20 మందినో మొదట చేర్చుకొని విజ్ఞాన సర్వస్వం స్వంతంగా సాగిస్తా మనుకొన్నా. అపీళ్లు తయారుచేసినా. ఎవరితో ఆలోచించడం? మళ్లీ లక్ష్మణరావుతోనేగా! 'ద్రవ్యపు ప్రయాస నీకుపెట్టి నిన్ను కష్టపెట్టట మెందుకు? నేనూ, లక్ష్మీపతి, నీవు కలసి చేసుకొందాం' అన్నాడాయన. నేనూ సరేనన్నా. విజ్ఞాన సర్వస్వకార్య మారంభ మయింది.........

అప్పుడు చూడవలె మాస్నేహం, లక్ష్మణరావు పరిశ్రమ, ఓపిక. ఆనాడు మద్రాసులోవున్న పెద్దగ్రంథాలయం 'కన్నెమరా' గ్రంథా

లయం. దినం తప్పకుండా మేమిద్దరమూ అచటికి ఊరేగేవారం. ఆయన ముందూ నేను వెనుకా. ఆయన వెనుకా నేను ముందు. అచ్చటి ఉద్యోగులు గడపలో మమ్ముచూస్తే దూషించుకొనేవారో, భూషించు కొనేవారో యెవ రెరుగుదురు? మేము టేబులువద్ద కూర్చుంటే, వాళ్లు గ్రంథరాసులు తెచ్చి పేర్చవలసిందే. ఒకొకప్పుడు తలుపులు బిగించే వరకు లేవం.... ...

క్రొత్తపుస్తకం కనుపించడమే ఆలస్యం, క్రొత్తబొమ్మ కంట బడటమే ఆలస్యం, లక్ష్మణరావుగుర్తు వ్రాసుకోవలసిందే. ఏమార్పుతో దాన్ని మావిజ్ఞాన సర్వస్వంలోకి తేవలెనో తీక్షాలోచనే....

....విజ్ఞాన సర్వస్వం లక్ష్మణరావు మొదటి యాదర్శరూపమే ధరించింది. నెలకు 100 పేజీల వంతున ప్రకటితమైంది. ఆకాలంలో అంత చక్కని ముద్రణం, అంత చక్కని కాగితం, అంత చక్కని చిత్రాలు పటాలు మరియే ప్రచురిత గ్రంథానికిని కన్పించలేదు. చేసినపని పరిపూర్ణంగా చేయవలెననే దృష్టి లక్ష్మణరావుకు పూర్తిగా వుండేది. పరిశీలించటం, పరిశోధించడం, నిర్ణయం తేల్చడం లక్ష్మణ రావుకు సహజంగా నున్న ధోరణి. ఈ ధోరణికి ఇతరులను బాగా పురిగొల్పేవాడు. ప్రోత్సాహ పరచేవాడు. కాబట్టే చారిత్రక పరిశోధన పటిమకు పేరుగన్న సోమశేఖరశర్మను ఆంధ్రభూమి కాంచినది. చిలుకూరి వీరభద్రరావు కృషికినీ లక్ష్మణరావు చేసిన దోహదం చాలా గొప్పది. భోగరాజు నారాయణమూర్తి ప్రభృతులను తీర్చి నదియు లక్ష్మణరావే యనవచ్చును

నేను ఆంధ్రపత్రికలో చేరేటప్పటికే విజ్ఞాన సర్వస్వముతో నాకున్న సహాయ సంపాదకత్వం మానుకొంటిని. కాబట్టి తరువాత బరు వంతా అంటే మూడవసంపుటపు బరువంతా ఆయనే ఏకైక వీరు డుగా మోసినాడు....

లక్ష్మణరావు తనకు తానే సాటి. అన్నివిధాల తీక్ష్ణ పరివర్తన కోరే వాడు. నిరంతర కార్యదీక్షా పరుడు. విజ్ఞాన రంగమున తనువు నర్పించి నాడు. సాంఘికముగా, కార్యరూపంగా అన్ని సంస్కారాలను తన జీవితంలో ప్రవేశపెట్టిన వాడు. అతనిని స్మరించుకొందాం. ముందుకు నడుద్దాం."

—తెలుగుతల్లి: లక్ష్మణరాయ వర్ధంతి సంచిక (1944 అక్టోబరు)నుండి

ఈవ్యాసం లక్ష్మణరావుగారిని గూర్చి వ్రాసినా, యిందులో హరిసర్వోత్తమరావుగారి జీవితసంఘటనలు పెనవేసుకొని వున్నవి. వీటినిచూస్తే, రాజకీయరంగంలో పాల్గొనేవారు, సారస్వత రంగంలో ఎట్టి కష్టనష్టాలకు గురి కావలసివస్తుందో స్పష్టపడు తుంది. తామువ్రాసిన 'ఢిల్లీదర్బారు' పుస్తకముపై పేరు ప్రచు రించుటకుగూడా రాజకీయ కారణములు అడ్డువచ్చినవి. స్వతంత్ర భావాలతో, పోషకులైన రాజుల ఆదరణనుసైతం వదలుకొను టకు సిద్ధపడినారు. అన్నదమ్ములుగా విజ్ఞాన సర్వస్వంలాంటి బృహత్తర ప్రయత్నానికి ఎంతగా పరిశ్రమించి కృషిచేశారో అర్ధమవుతుంది, అలాంటి విజ్ఞాన ఘనులైన వారందరి సాంగత్య ప్రభావం, ఆ పునాదియే రావుగారి జీవితాన్ని ఆదర్శవంతం చేయగలిగింది.

బందరు నేషనల్ కాలేజికి హరిసర్వోత్తమరావుగారిని మొదటి ప్రిన్సిపాల్‌గా చేదామనుకొని, దీనివల్ల ప్రభుత్వనిర్బం ధాలను కొనితెచ్చుకొన్నట్లవుతుందని విరమించుకొన్నారట. తదుపరి 'విద్యావిషయక నిపుణునిగా' రావుగారిని కళాశాల పరి పాలక వర్గంలో మెంబరుగా ఎన్నుకొన్నారు.

జైలునుండి విడుదలై వచ్చిన తదనంతరం 'విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి'లో రావుగారిస్థానే డాక్టరు ఆచంట

లక్ష్మీపతిగారిని నియమించుకోడం జరిగింది. హరిసర్వోత్తమరావు గారు యువకదశలో పల్చగానే వుండేవారట. ప్రభుత్వం రావు గారిపై పోలీసు గూఢచారుల నిఘా వుంచింది. రావుగారున్నూ, లక్ష్మణరావుగారున్నూ వెనుకగాచూస్తే ఒకేతీరున వుండేవారనీ, ఈ కారణంతో ఎవరు లక్ష్మణరావుగారో, ఎవరు హరిసర్వోత్తమ రావుగారో, వెంటనే పోల్చుకోలేక వారి నాన్నగారిమీద గూడా సి. ఐ. డీ. పోలీసులు అప్పుడప్పుడు కాపలా కాస్తుండేవారనీ, లక్ష్మణరావుగారి కుమార్డు వినాయకరావుగారు మాసంభాషణలో తెల్పారు.

అప్పటి సంఘంలోని విద్యావంతులుగూడా రాజద్రోహ నేరానికి శిక్ష విధింపబడిన రావుగారి నాహ్వానించుటకు భయపడే వారు. ఈవిధంగా ఒక చెంప పరప్రభుత్వ నిర్బంధ విధానాలు, మరొక చెంప సమాజంలో భయోత్పాతంతో, ఏసంస్థలో చేర్చుకొంటే ప్రభుత్వంవలన ఏముప్పు వస్తుందో అనే సందిగ్ధా వస్థ జాతీయాభిమానులైన రావుగారి సన్నిహితులలో గూడా కల్గేది. కనుకనే, "ఆంధ్రుల త్యాగ మార్గానికి దారి చూపింది రావుగారి జీవితం" అని ఆంధ్రపత్రిక సంపాదకీయంలో పేర్కొన్నది.

గిడుగు రామమూర్తిగారు వ్యావహారిక భాషా వాదానికి ఆంధ్రదేశంలో మూలపురుషులు. వీరికుమార్డు సీతాపతిగారి ద్వారా,హరిసర్వోత్తమరావుగారికి రామమూర్తిగారితోగూడామంచి పరిచయ మేర్పడింది. మొదట్లో సర్వోత్తమరావుగారు శుద్ధ గ్రాంధికవాదిగా వుండేవారని ప్రతీతి. ఒకసారి లక్ష్మణరావు గారితో కలిసి ప్రత్యేకంగా పర్లాకిమిడి వెళ్లి రామమూర్తిగారితో

భాషా చర్చలు సాగించారట. చిన్నయసూరి, వీరేశలింగంగార్ల వ్యాకరణ ఛందస్సులను తీసిచూపి, ఇందులో ఏయే సూత్రాలతో మీరు భేదిస్తున్నారో చెప్పండని రామమూర్తిగారి నడిగారట. వారు అవన్నీ అటుంచండని, తమ వ్యావహారిక భాషావాదాన్ని వినిపించారట. ఐతే వారివాదన అప్పట్లో రావుగారికి నచ్చలేదు.

1915 లో మరొకమారు మద్రాసులో నాయని వెంకట రంగా రావుగారింటికి రామమూర్తిగారి నాహ్వానించి చర్చలు కొన సాగించారట. రావుగారి వాదనను పూర్వపక్షం చేయడానికి అప్పటికే ప్రచురితమైన గురుజాడవారి 'కన్యాశుల్కం' ఎలావుందని అడిగారట. హరిసర్వోత్తమరావుగారు, అందులో ఉత్తమ కళా ధర్మం వుందని ప్రత్యుత్తర మిచ్చినారట. వీరేశలింగంగారి ప్రహసనా లెలావున్నవని ప్రశ్నించారట. చాలా బాగున్నవన్నారట. 'మీరు గంట నుండి మాట్లాడిన వాటినే షార్టుహేండు తీసుకొని గ్రంథస్థం చేయటానికి మీకభ్యంతరం ఎందుకు'? అన్నారట రామమూర్తిగారు. "మీరు వ్యావహారికభాష సహజంగానే మాట్లాడుతున్నారుగాని, వ్రాయుటకు మాత్రం అంగీకరించడం లేదా" అని తర్కించారట. కావుననే ఛందోబద్ధమైన అలంకార శాస్త్రాదులు ముఖ్యకావ్యాలకు అవసరం కావచ్చునేగాని వచనరచనకు అసందర్భమని నచ్చచెప్పారట. 'సీతాపతీ! మీ నాన్నగారు సంభాషణలో నేనన్న మాటలు కాగితంమీద పెట్టమని నామాటలే నాకు అప్పగించాడయ్యా!' అని హరిసర్వోత్తమరావుగారన్నట్లు సీతాపతి గారు మాసంభాషణా సందర్భంలో చెప్పారు.

హరిసర్వోత్తమరావు గారిలో ఒక ప్రత్యేకత వుంది. ఎదిరి వాదన నచ్చనంతవరకు చర్చిస్తారు. మనస్ఫూర్తిగా అంగీక

రించిన తర్వాత దాని ననుసరిస్తారు. అందుచేతనే 1919 వ సంవత్సరం దరిమిలా రావుగారి రచనలలో గ్రాంథికం కనుపించదు. 1934 నుండి వయోజన విద్యాబోధన కనువుగా చాలా సరళమైన సామాన్యజనుల భాషనే వుపయోగించటం స్పష్టంగా కనుపిస్తుంది.

భావకవిత్వ'మని మొదటిసారి పేరిడినవారు హరిసర్వోత్తమరావుగారేనని సీతాపతిగారి అభిప్రాయం. అప్పట్లో తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారి, రాయప్రోలు సుబ్బారావుగారి కవితలు, నండూరివారి 'యెంకిపాటలు' పత్రికలలో ప్రచురణ కాగా చూచారట. 'కొత్త ఫక్కీలో కవిత్వం వ్రాస్తున్నారు చూచావా? దీని కే పేరు పెడితే ఉచితంగా వుంటుం'దని సీతాపతిగారి నడిగారట. 'ఇప్పుడే గదా మనం అనుకొంటున్నది. ఆలోచిద్దాం' అని అంటుండగానే "ఆద్యంతం ఒకే భావం ప్రధానంగా పునాదిగా చేసుకొని ఆరచన సాగుతున్నదిగాన, దీనికి 'భావకవిత్వం' అంటే బాగుంటుం దనుకొంటున్నా"నని అన్నారంట రావుగారు. నూతనంగా వస్తున్న ఆలోచనలకు 'భావకవిత్వం' అని నామకరణం చేస్తూ ఆ మరుసటిరోజే హరిసర్వోత్తమరావుగా రొక వ్యాసం వ్రాశారట. తర్వాత కాలంలో అప్పుడప్పుడు రావుగారు ఈ ఫక్కీలో 'వచనగేయాలు' కొన్ని రచించినట్లు కనుపిస్తుంది. ప్రాచీన కావ్యాలను గౌరవించడంతో పాటు, వీరు ఆధునిక కవిత్వరీతులనుగూడా పరిశోధించి, ప్రోత్సహించారని తేటతెల్లమవుతుంది.

'ఎడిటర్' అనే పదానికి 'సంపాదకు'డని మొదట పేరు పెట్టింది హరిసర్వోత్తమరావుగారే నని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు మాసంభాషణలో చెప్పారు.

# పత్రికా సంపాదకత్వం

## స్వరాజ్య

అవి 'వందేమాతరం' రోజులు. కలకత్తా కాంగ్రెస్‌లో దాదాభాయి నౌరోజీ భారతభూమి కోరేది 'స్వరాజ్' అని చాటి ప్రచారం చేస్తున్నరోజులు. హరిసర్వోత్తమరావుగారు రాజమండ్రిలో వుండగానే, చిలుకూరు వీరభద్రరావుగారు సంపాదకులుగా "ఆంధ్రకేసరి" నారంభించినారు. బందరులో క్రొత్తగా 'నవయుగ' పత్రిక పెట్టారు. 1908 లో రావుగారు సంపాదకుడుగా బెజవాడనుండి 'స్వరాజ్య' అను తెలుగు వారపత్రికను ప్రారంభించడం, వీరు వ్రాసిన తీవ్రసంపాదకీయం కారణంగా, రాజద్రోహ నేరం మోపి 3 ఏండ్లు కఠినశిక్ష విధించడం – ఆ ఉదంతం యిదివరలో పేర్కొన్నాను.

## ఆంధ్రపత్రిక

శిక్షాకాలం పూర్తిచేసి వచ్చిన అనంతరం 1914 నుంచి 1916 చివరివరకు 'ఆంధ్రపత్రిక'కు హరిసర్వోత్తమరావుగారు ప్రథమ సంపాదకుడుగా పనిచేశారు. బొంబాయినుండి వారపత్రికగా వెలువడే దీనిని, కాశీనాథుని నాగేశ్వరరావుగారు మద్రాసుకు మార్చి దినపత్రికను చేశారు. బొంబాయిలో నున్నప్పుడు ఆవటపల్లి నారాయణరావు సంపాదకుడుగా వుండేవారు.

శ్రీ నాగేశ్వరరావుగారు అమృతాంజనం తయారు చేసి, దాని ఆర్థిక సహాయంతో ఆంధ్రపత్రికను నేటివరకు అవిచ్ఛిన్నంగా నడుపుకొని రాగల ఆర్థిక సౌష్ఠవాన్ని చేకూర్చారు. అన్ని జాతీయోద్యమాలలోను పాల్గొంటూ వీరు తన వితరణతో అశేష ప్రజల ఆదరాభిమానాలను చూరగొని విశ్వదాతగా, దేశోద్ధారకుడుగా,

భాషాపోషకుడుగా గణుతికెక్కారు. వీరి ఆంధ్రపత్రికకు తొలి మూడేళ్లు సంపాదకుడుగావుండి రావుగారు ఎనలేని భాషాసేవ చేశారు. ఆంధ్రులలో రాజకీయ చైతన్యం కల్గించారు.

## ది నేషనలిస్టు

హరిసర్వోత్తమరావుగారు 1919 లో మద్రాసునుండి 'ది నేషనలిస్టు' అను ఆంగ్ల వారపత్రికకు స్వయంగా సంపాదకత్వం వహించి నడిపారు. భారత స్వాతంత్ర్యాభిప్రాయాన్ని ప్రతిఫలింపజేయుటే యీ పత్రిక ఉద్దేశం. ఆంధ్ర నేషనలిస్టు పబ్లిషింగు కంపెనీ తరపున ఈ పత్రిక నడుపబడుతుండేది. 'భారత సాంఘికశాస్త్రం' (Indian Sociology) మీద రావుగారు వరుసగా వ్యాసాలు వ్రాశారు. భారతీయ విద్యావిధానంపై అరవింద ఘోష్, కందుకూరి వీరేశలింగం మున్నగు సంఘ సంస్కర్తలను గురించి కట్టమంచి రామలింగారెడ్డిగారు, సత్యాహింసల సిద్ధాంతములనుగూర్చి సి. రాజగోపాలాచారి మున్నగువారు ప్రముఖమైన వ్యాసాలు వ్రాసేవారు. అప్పటి రౌలట్ చట్టము, ప్రెస్ యాక్టులను, మాంటేగు - ఛెమ్స్ఫర్డు సంస్కరణలను గూర్చి తీవ్రంగా విమర్శిస్తూ రావుగారి వ్యాఖ్యలు - విమర్శనలూ వుండేవి. ఆనాటి స్వరాజ్య ఉద్యమ ప్రచారం దీనిద్వారా సాగింది.

1919 ఏప్రిల్ 13 ఆదివారం సంచికలో తుపాకిగుండు ఆరాధన (Cult of Bullet) అను సంపాదకీయం ప్రచురించినందులకు, ప్రభుత్వం 2 వేల రూపాయల ధరావత్తును వశపరుచుకొంది. తద్వారా స్వతంత్ర పత్రికా నిర్వహణకు ప్రభుత్వం అడ్డుతగిలింది. 19 వారాలు అనగా 4 నెలల 3 వారములు నడిపిన తర్వాత ధరావత్తును వశపరచుకొన్న ఫలితంగా రావుగారికి

పత్రికను ఆపివేయక తప్పలేదు. దరిమిలా ప్రెస్‌ను గూడ అమ్మివేసుకోవలసి వచ్చింది.

నేషనలిస్టు వారపత్రిక కొద్దికాలం నడిచినా, వివిధ ఆర్థిక, రాజకీయ, విద్యా, సాంఘిక సమస్యలమీద ప్రముఖమైన వ్యాసాలు ప్రచురించగల్గింది. పత్రికయొక్క స్వతంత్రభావాల ప్రచారవ్యాప్తిని పరప్రభుత్వం సహించలేక, వత్తిడితెచ్చి, చివరకు ఆపివేయవలసిన పరిస్థితికి తెచ్చింది.

## సౌందర్యవల్లి

1919-20 సంవత్సరంలోనే రావుగారు మద్రాసునుండి 'సౌందర్యవల్లి' అను మాసపత్రికను తెలుగులో నిర్వహించేవారు. ఇందులో ప్రత్యేకంగా మహిళా సమస్యలకు ప్రాధాన్య మిచ్చేవారు. సల్లా గురుస్వామిచెట్టిగారనే అడ్వొకేటు ధనసహాయంతో యీ పత్రిక నడిచింది. రావుగారి సతీమణి శ్రీమతి రామాబాయి సంపాదకురాలుగా వుండేవారు. స్త్రీల సమస్యలకు, సంఘసంస్కరణకు, స్త్రీవిద్యకు సంబంధించిన చక్కని సంపాదకీయాల ద్వారా రావుగారు మహిళా లోకంలో విజ్ఞానవికాసాలు కలిగించుటకు ఈ పత్రికాముఖంగా కృషిచేశారు.

## మాతృ సేవ

1922 లో "మాతృసేవ" అను పత్రికకు రావుగారు సంపాదకత్వం వహించి నడుపసాగారు. చిన్న స్వంతప్రెస్సునొకదానిని నెలకొల్పారు. ఇందుకుగాను చింతకుంటి వాస్తవ్యులైన కేతు వెంకటరెడ్డి, సంకటి కొండారెడ్డి గార్లతో ఒక అగ్రిమెంటు చేసుకొన్నారు.హరిసర్వోత్తమరావుగారిసైపులు, స్టాండులు మున్నగునవి మదింపువేసి మూలధనంగా జమకట్టుకొనేటట్లున్నూ,

వెంకటరెడ్డి కొండారెడ్డిగార్లు చెరివెయ్యి రూపాయలు షేరుధనంగా యిచ్చేటట్లున్నూ, తాడిపత్రిలోగాని లేక ఉభయులు నిర్ణయించు కొన్న మరొకచోటగాని ముద్రణాలయం, పత్రికస్థలం ఏర్పాటు చేసుకొనేటట్లున్నూ అంగీకారం కుదుర్చుకొన్నారు. పత్రికను నిర్వహిస్తూ, పత్రికను నడుపుతున్నందులకు గాను రావుగారికి నెలకు రు 25 మాత్రము గౌరవభృతిగా యిచ్చేటట్లు, లాభనష్టములు చెరిసగం భరించేటట్లు నిశ్చయించుకొన్నారు.

దీని ననుసరించి తాడిపత్రినుండి మాతృసేవ నడుపబడుతుండేది. ఇందులో కాంగ్రెస్ కార్యక్రమాన్ని ప్రచారం గావించేవారు. రాయలసీమ ప్రాంతాలకు సంబంధించిన ముఖ్య సమస్యలు ప్రచురించేవారు. క్షామ నివారణకు పత్రిక ప్రాధాన్య మిచ్చేది. అస్పృశ్యతను గూర్చి దీనిలో ఒక విలేఖరి 14–4–1924 వ తేదీ వ్రాసిన ఒకవార్తను గమనించండి. ఆనాటి సామాజిక పరిస్థితు లెట్లున్నవో తెలుసుకొనుటకిది కొంత ఉపకరిస్తుంది.

"పోయిననెల వేదమూర్తులైన దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు, శ్రీయుత గాడిచర్ల హరిసర్వోత్తరావుగారు పెనుగొండ దయచేసి యున్నపుడు, యూనియన్ బోర్డువారు శ్రీ వారికి ఒక స్వాగత పత్రమును చదువునట్లు తీర్మానించి, ఆ పత్రమును అంటరాని వాడైన మెంబరు మహారాజులగు దసెల బాబన్నతో చదివించిరి. రాజశ్రీ కొండ వెంకటప్పయ్యగారు బాబన్నగారు చదివిన స్వాగతమును త్రికరణ పురస్సరముగ గైకొని యూనియన్ బోర్డువారికి ఈ గౌరవమునకై తమకృతజ్ఞతను తెలియజెప్పిరి. 'దేశమున అంటరానితన ముండువరకు మనకు నిజముగా స్వరాజ్యము లభించ' దని బాహాటముగా వెల్లడించిరి. ఆసమయమందు ఈ యాశ్చర్యమును చూచుటకు చేరినవారిలో కొందరు విచార పరులు సహితముండిరి. ఈ నిమంత్రణమునకై ఊరి వైదీకులు

రావలసి వచ్చెను. ఆవైదీకులు సదరు గృహస్త పంచగవ్యము *
తీసుకొని, ప్రాయశ్చిత్తమునకు లోబడినగాని, శ్రాద్ధము నిర్వహించ
బడదని దిట్టముగా చెప్పిరి. అందుపైన ఆ బ్రాహ్మణుడు పంచములతో
పంతులుగారికి స్వాగతములు చెప్పించుట తప్పేననియు, అందుకామో
దించినది అపరాధమేననియు పంచగవ్యము స్వీకరించి, పంచాంగముల
వారికి శ్రాద్ధాన్నమును పెట్టెను. ఈతీరున పతితపావనత నెలకొల్ప
బడెను."

—'మాతృసేవ' పత్రికనుండి

హరిజనుడిచేత, నాయకులకు సన్మాన పత్రములు చదివించటమే ఆసనాతనాచార పరులకు మహాపరాధంగా తోచి, గ్రామాదులలో ఎలాంటివత్తిడి తెచ్చేవారో ఈ విలేఖరి కథనం ద్వారా తెలుస్తుంది.

1921 లో రావుగారు మద్రాసునుంచి వచ్చిన తర్వాత అనంతపురం జిల్లాలో మహాత్మాగాంధీ సందేశం వినిపించారు. కాలేజీని బహిష్కరించి, బయటికివచ్చిన వారిలో తాడిపత్రి కలచవీడు వేంకటరమణాచార్యులుగా రొకరు. 1921 ఆగస్టులో గాంధీగారు తాడిపత్రి వచ్చినప్పుడు, రావుగారు గాంధీగారి పర్యటనలో వెంటవున్నారు. సంకటి కొండారెడ్డి సహాయ నిరాకరణంలో మునసబుగిరికి రాజీనామా యిచ్చివేశారు. కడపజిల్లా కమలాపురం తాలూకా రంగశాయిపురం వాస్తవ్యులు కేతు వెంకటరెడ్డి కాంగ్రెస్ కార్యక్రమంలో వుత్సాహంతో పాల్గొనేవారు. తాడిపత్రిలో ప్రెస్, వారపత్రిక నెలకొల్పటానికి వీరి ఆర్థిక సహాయం చేకూరింది. కలచవీడు వెంకటరమణాచార్యులు అప్పటి సహాయ నిరాకరణంలో జైలుకేగినారు. వీరు కారాగారమునుండి

* గోవునకు సంబంధించిన అయిదింటి సమూహము (ఆవుపేడ, పంచితము, పాలు, పెరుగు, నెయ్యి)

వచ్చువరకు వీరిమిత్రులు చెన్నంపల్లి వెంకటరంగాచార్యులు పత్రిక పనిచూస్తూండేవారు. 1922 డిసెంబరులో గయా కాంగ్రెస్‌కు హరిసర్వోత్తమరావుగారు హాజరైన తర్వాత ఉత్తర సర్కారులలో సంచారంచేస్తూ, అచ్చటినుండే సంపాదకీయములు, ముఖ్య జాతీయవార్తలు వ్రాసి పంపుతుండేవారు. ఒక ఏడాదికి తిరిగివచ్చి, భాగస్థులతో లెక్కలు చూచుకొనగా నష్టం వచ్చి నట్లు తేలింది. తనభాగమునకు వచ్చిన నష్టమునకుగాను, మద్రాసునుంచి తానుతెచ్చిన ప్రెస్ సామానులు భాగస్థులకే వదలి పెట్టి రావుగారు నంద్యాల వెళ్ళిపోయినారు. అప్పటినుండి 1924-25 అనంతరం, నంద్యాలలో కాపురం పెట్టుట తటస్థించింది. అటు పిమ్మట నంద్యాల న్యాయవాదమిత్రులు, అచటి మునిసిపల్ ఛైర్మన్ నరసింగరావుగారు, తాలూకాబోర్డు ప్రెసిడెంటు, తదితర ప్రముఖులు రావుగారిని ప్రేమతోను, గౌరవంతోను ఆదరించి, వారికి వలయు సౌకర్యాలు ఒనగూర్చుతుండేవారు. కర్నూలు మండలమంతా పదేళ్ళపాటు (1923 నుండి 1934 వరకు) హరి సర్వోత్తమరావుగారి ముఖ్యకార్యక్షేత్రంగా వుండిపోయింది.

## కౌమోదకి

1930 నుండి నంద్యాలలో 'కౌమోదకి' అను పత్రికను భిషగ్వర డాక్టరు కైప సుబ్రహ్మణ్యశర్మగారి సంపాదకత్వమున స్థాపించడం జరిగింది. ఇందు ఆయుర్వేదవైద్యము, సాంస్కృతికాభివృద్ధితోపాటు, జాతీయోద్యమమునకు గూడా అధికతర ప్రాధాన్య మిచ్చేవారు. రావుగారు 'సాభిప్రాయవార్తలు' అను శీర్షికక్రింద ఆనాటి పరప్రభుత్వ నిర్బంధ విధానాలు, ఉప్పుసత్యాగ్రహవార్తలు, విశేషాలు వివరించుతూ దేశభక్తిని రగుల్కొల్పె

పారు. కృష్ణదేవరాయల వర్ధంత్యుత్సవ ప్రత్యేక సంచికలు ప్రచు రించేవారు. ప్రముఖ వ్యాసాలు వ్రాసేవారు.

## గ్రంథాలయ సర్వస్వము వగైరా

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంవారి 'గ్రంథాలయ సర్వస్వము', రాష్ట్రసహకార సంఘం వారి 'సహకారం' పత్రిక, మదరాసు రాష్ట్ర పంచాయతీ యూనియను వారి ఇంగ్లీషు, తెలుగు 'గ్రామ పంచాయతీ జర్నలు'ల నిర్వహణలో కొంతకాలము పూర్తి బాధ్యత వహించినారు. కొద్దికాలంపాటు బెజవాడనుండి వెలువడిన 'ఆంధ్రవార్త' అను తెలుగు దినపత్రికకు సంపాదకత్వం వహించినారు.

దక్షిణభారత వయోజనవిద్యా సంఘపక్షమున వయోజన విద్యా సమీక్ష (Adult Education Review) అను మాసపత్రికను రావుగారు ఆంగ్లభాషలో నిర్వహించినారు. కర్నూలుజిల్లా కోయిలకుంట్లనుండి యన్. శ్రీకంఠంగారి ఆధిపత్యమున నడచిన "వయోజన విద్య" అను తెలుగు మాసపత్రికకు, తత్వానంద శిల్పాశ్రమం వారి "పంచాయతీ రాజ్యం" పక్షపత్రికకు రావుగారు గౌరవ సంపాదకులుగా వుండినారు.

గ్రంథాలయములు. వయోజన విద్య, గ్రామ పంచాయతీలు, సహకార సంస్థలు హరిసర్వోత్తమరావుగారికి కేవలం అభిమాన పాత్రమైనవి మాత్రమేకాదు. తమ శేష జీవితాన్ని వీటి అభివృద్ధికోసం రావుగారు అంకితం చేశారనవచ్చు. వీటికి హరిసర్వోత్తమరావుగారు ప్రాణం, మూలం,

## గ్రంథ రచన

హరిసర్వోత్తమరావుగారు ఎం. ఏ. చదువు చుండగా, విద్యార్థి దశలోనే థీసిస్‌గా ('The Neglected Emperor Poet') "విస్మృత సార్వభౌమ కవి" అను పుస్తకమును ఇంగ్లీషులో రచించారు. కృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యదపై చక్కని సాహిత్య విమర్శనా గ్రంథమిది. పి. రామానాయణింగారు, ఎం. ఏ., యఫ్. యం. యు. దీనికి పీఠిక వ్రాశారు. ఆముక్తమాల్యద పెద్దన్నకవి వ్రాశాడనీ, రాయలు కాదని ఒక వాదన వుంది. హరిసర్వోత్తమరావుగారు శ్రీ కృష్ణదేవరాయలే ఆ గ్రంథమును వ్రాశారని సమర్థవంతంగా నిరూపించారు. ఈ సందర్భంలో ఆయన అనేక సారస్వత సమస్యలను పరిష్కరించవలసి వచ్చింది. ఆముక్త మాల్యదను సమీక్షించుటలో చిన్ననాడే రావుగారు సారస్వత క్షేత్రంలో తనకున్న ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించిన వాడయినారు. 1912 వ సంవత్సరంలో ఆ థీసిస్‌ను పుస్తక రూపంలో వెలువరించారు. శ్రీ కృష్ణదేవరాయల కవిత్వ ప్రతిభను ఇటీవలియుగమున బయటి ప్రపంచమునకు ప్రకటించిన వారిలో హరిసర్వోత్తమరావుగారు ముఖ్యులని చెపుతారు.

ఈ గ్రంథమును తన బాల్యదశలో చదువులు చెప్పిన బ్రహ్మశ్రీ గని శేషశాస్త్రిగారికి, సారస్వాతాభిరుచిని పోత్సహించిన సమర్థి రంగయ్యశెట్టిగారికి రావుగారు అంకితం చేసి, తమ కృతజ్ఞతను తెలుపుకొన్నారు.

### నీతి ధర్మము, మూర్ఖరాజు

మహాత్మాగాంధీజీచే రచించబడిన 'నీతి ధర్మము', 'మూర్ఖరాజు' (కథ) అను రెండు పుస్తకములను రావుగారు తెలుగు

లోనికి భాషాంతరీకరణం చేశారు. 'నీతి ధర్మం'లో సర్వ మానవ జీవితములకు ఆధారభూతమైన నీతి సూత్రముల తత్వమును సూత్ర ప్రాయంగా గాంధీజీ వ్రాశారు. ఇందులో ఉత్తమ నీతి ఏదో? నీతి కార్యం అనగా ఏమో? ధర్మములలోకెల్ల ధర్మము నెట్లు నిర్వర్తించవలెనో? లోక క్షేత్రమును గూర్చి వారు వివరించారు. "ఈర్ష్య, అసూయ, స్వార్థపరత్వములచే ఎవ్వని మానసము కలుషితముగాదో, ఎవడు పరమపవిత్ర జీవనము గడుపుచు మానవసేవయే దీక్షగా గైకొనుచున్నాడో అట్టివాడే నిజముగా నీతిమంతుడు; నిజముగా భక్తుడు. నిజముగా సుఖి. అట్టి మానవులే లోకమునకు సౌఖ్యము చేయగలరు" అన్నారు. వీరీ పుస్తకమును వేదాంత ప్రెస్‌లో ముద్రించారు.

## ఆధ్యాత్మిక స్వదేశీ లేక మానవతా జాతీయవాదం

గాంధీజీ ప్రవచిస్తున్న జాతీయతను, స్వదేశీవుద్యమాన్ని గూర్చి ప్రబోధించే స్వతంత గ్రంథాన్ని రావుగారు ఆంగ్లంలో వ్రాశారు. దీనిని "ఆధ్యాత్మిక స్వదేశీ లేక మానవజాతీయవాదం" (Spiritual Swadesi or Humanitarian Nationalism) అనే పేరున ప్రచురించారు.

ప్రాచీనకాలంనుండి పరంపరానుగతంగా వస్తున్న భారతీయ సంస్కృతీ సాంప్రదాయాలనుగూర్చిన వివరణతో రావుగారు పుస్తకం ఆరంభించారు. పృథివ్యాపస్తేజోవాయురాకాశాత్ అను పంచభూతాత్మకమైన ప్రపంచంలో భూతదయ, పరసర్వప్రేమ, శాంతి సందేశం వినిపించారు. హిందూ మహమ్మదీయ క్రైస్తవ జైన బౌద్ధమత ప్రవక్తలు ఉపదేశించిన మత సామరస్యము, విశ్వ

మానవ సౌభ్రాతృత్వము, సత్య- అహింసాచరణ నీతి సూత్రముల తత్వము నిందు వివరించారు.

రావుగారికి గాంధీ సిద్ధాంతములయెడల ఎంతటి గాఢాభిమాన మున్నదో ఈపుస్తకం ఒక్కసారి చదివితే అర్థమవుతుంది. జీవితంలో నైతిక విలువలకు, స్వధర్మ నిర్వహణకు అత్యంత ప్రాధాన్యత నిచ్చినారు. మహాత్ముడు నిర్బంధింపబడిన ఆకాలంలో భారత ప్రజలెల్లరూ దేశభక్తి పూరితమైన నిర్మాణ కార్య క్రమంలో ఎలా సంసిద్ధులై యుండాలో స్పష్టపరిచారు. తిలక్ మహాశయుడు నినదించిన 'కర్మచేయి- ఫలమాసింపకు' అనే గీతావాక్యాన్ని విశదీకరించారు. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే అరిషడ్వర్గాలను జయించి, ఆత్మనిగ్రహంతో మానవుడు తన విధ్యుక్త ధర్మాలను నిర్వర్తించాలనీ, కేవలం పాశ్చాత్యులవలె భౌతికవాంఛలకే లోనుగాక, శాశ్వతమూ, శాంతి మయమూ అయిన నిరాడంబర, నిత్యసేవాధర్మ జీవితవిధానాన్ని కొనసాగించు టుత్తమమని వుద్బోధించారు.

అనుబంధంలో ప్రాచీన హిందూమత సారాంశాలను, ద్వైతాద్వైత విశిష్టాద్వైతములలోని తేడాలను, ఖురాన్ బైబిలు లోని ధర్మాచరణ, సత్యాహింసలకు సంబంధించిన ముఖ్యాం శాలను ఉల్లేఖించారు.

ఈ గ్రంథంలోని ప్రత్యేకత ఏమంటే, ఆధ్యాత్మిక విష యాలకు అనాటి రాజ్యాంగ సంస్కరణలు, స్వరాజ్య - స్వదేశీ ఉద్యమ సందేశాలు, ఖద్దరు గృహపరిశ్రమ గ్రామపునర్నిర్మాణ విశిష్టతలను జోడించి వివరించడం జరిగింది. దీనినిబట్టి హరి సర్వోత్తమరావుగారు రాజకీయ పరిస్థితులకు, మత ఆధ్యాత్మిక

తత్వములను మేళవించి ఎలా అధ్యయనం గావించారో అర్థమవు తుంది. విశేష పాండిత్యం, విశాల మానవతా దృక్పథం, జీవిత గమనంలో నైతికఆధ్యాత్మిక విలువలకిచ్చిన ప్రాముఖ్యం ద్వారా రావుగారి అంతఃకరణ స్పష్టపడుతుంది. రావుగారు ఒక పెద్ద విస్తృతగ్రంథాన్ని వ్రాయుటకు పూనుకొన్నారుగాని, ధనాభావం వల్ల దీనిని కుదించి, ఈరూపంలో ప్రచురించినట్లు పేర్కొన్నారు. ఈగ్రంథ ప్రచురణకు ప్రకాశంగారు సహాయపడినారు. మద్రాసు 'స్వరాజ్యప్రెస్' లోనే దీనిని ముద్రించారు.

ఆనాడు గాంధీజీ భావాలపై రావుగారికి కలిగిన అకుంఠిత విశ్వాసం, వారి జీవితాంతంవరకు వెన్నంటి, తన జీవితాన్ని ధన్యం చేసుకొనుటకు కారణభూతమైం దనవచ్చు. ఈ గ్రంథం గాంధీజీ అనుయాయులుగా, రావుగారి మత ఆధ్యాత్మిక రాజకీయ విశ్వాసాలకు ఒక దర్పణంవంటి దనుటలో అతిశయోక్తిలేదు.

## వోటు

మాంటేగు సంస్కరణలు అమలులోనికి వచ్చేసరికి వోటు హక్కులను గూర్చి ప్రజా చైతన్యాన్ని కలిగించేందుకు వుద్దేశించి రావుగారీ పుస్తకం వ్రాశారు. అయితే మూడేండ్ల ధరిమిలా కాని (1923 సంవత్సరంలో) ఇది ప్రచురణ భాగ్యానికి నోచుకో లేదు. ఈ గ్రంథ ప్రచురణకు అయ్యంకి వెంకటరమణయ్యగారు తోడ్పడినారు. ఇది ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల (బెజ వాడ) యందు ముద్రింపబడినది.

ఇందులో ప్రభుత్వములు ఏర్పడు రీతి, వోటు హక్కు అనాది కాలంనుంచి ఎవరెవరికి ఏ విధంగా సంక్రమిస్తూవచ్చిందీ, ప్రజాప్రతినిధులకు ప్రాతినిధ్యం ఎలా లభించేదీ, అల్ప సంఖ్యా

కులప్రాతినిధ్యం, సంఖ్యానుగుణ ప్రాతినిధ్య పద్ధతులు, ప్రజాభిప్రాయము ఎలా వ్యక్తీకరింపబడవలసినదీ, పార్టీలు కక్షలు ఏదేశంల్లో ఎలా ఏర్పడి పనిచేస్తుండేదీ మున్నగు విషయాలన్నీ విపులీకరించారు. స్వయంసంపూర్ణత్వము, స్వయం నిర్ణయ సూత్రము లిమ విశదీకరించారు.

ఇంగ్లండు దేశముయొక్క దృష్టాంతమును చూపుతూ

"ఆదేశమున ఎక్కువగా వోటుగల వారెవ్వరు? సామాన్య కర్మకారులు, సాధారణ బీదజనులు. కాని రాజ్యపరిపాలన చేయువారెవ్వరు? సాధారణ కర్మకారులుకారు. సామాన్యులగు బీదసాదలుకారు. పలుకుబడిగల ధనవంతులు. హర్మ్యములలో నివసించు నధికారులు"

అన్నారు.

ఇందులకు కారణమేమిటని ప్రశ్నించి సమాధానాలు

వ్రాశారు.

"నిజముగా వోటున కిప్పటి పరిస్థితులలో, మనదేశంలో జాతి స్వయం నిర్ణయమును సూచించు సత్తువ లేనేలేదు. స్వల్ప సంఖ్యాకులను సంరక్షించు బలము లేనేలేదు. సత్య - ధర్మములను స్థాపించు శక్తి అంతకుముందే లేదు. కాబట్టియే ఈనాడు లోకశాంతికి, లోకకళ్యాణమునకు ఈవోటు ఆధారముకాలేక యున్నది"..... ....

.... ...గాంధీజీ విజృంభింప చేసిన..... .....నూతన పథమున శాంతి సమకూర్చునట్టి-వోటు, స్త్రీ-పురుష భేదములేక, ద్రవ్యాధికార, ద్రవ్యాభావ వివక్షణలేక, ప్యూర్ణయంత్రముల మహాభీతి యాధారము లేక సమానముగా పంచిపెట్టబడినది. ఈ వోటు దెలిచెనా నిజమైన వోటు ప్రపంచమునకు ప్రసాదితము కాగలదు. అంతదనుక లోకమున నేడు ప్రచారములో నుండు వోటు మిధ్యగావుండక తప్పదు. దాని ననుక

రించువాడు సృష్టి సంరక్షకుడుగాక, సృష్టి సంహర్తకుడుగా నుండక మానడు."

అని చివరకు ముగించారు.

'ప్రభుత్వము', 'కౌన్సిళ్ళ చరిత్ర' వేర్వేరుగా వ్రాశారు. 'ప్రభుత్వము'ను జమిలి సమ్మాళ్వారుగారు ప్రచురించారు. రెండవది అచ్చయినట్లు లేదు. 'సంపూర్ణ స్వరాజ్యం' అని అండూస్ వ్రాసిన ఆంగ్ల గ్రంథాన్ని రావుగారు తెలుగుచేసి ప్రచారం చేశారు.

## హైందవ స్వరాజ్యము

మహాత్మాగాంధీ విరచితమైన "హైందవ స్వరాజ్యము" (Hind Swaraj) ను రావుగారు తెలుగులోనికి అనువాదం చేశారు. ఇందులో గాంధీజీ స్వరాజ్య స్వరూప స్వభావాలను విశదపరచుటకు ప్రయత్నించారు. పరప్రభుత్వ పరిపాలన, కాంగ్రెస్ సంస్థ కార్యక్రమాన్ని వివరించి, స్వరాజ్యమనగా నేమో, అది ఎట్లా సాధించాలో, పశుబలము, సాత్విక నిరోధములకున్న తేడాలు ప్రశ్నలు - సమాధానాల రూపంలో వ్రాశారు. చదువరి ప్రశ్నలకు సంపాదకుడు సమాధానా లిస్తున్నట్లు గ్రంథం నడిచింది.

ఈ సందర్భంలోనే, హరిసర్వోత్తమరావుగారు 'దేశీయ మహాసభ' యొక్క స్థాపన, వృద్ధి పరిణామములను, సమకాలీన సంస్థల చరిత్రమును గురించి "హైందవ జాతీయోద్యమ పరిణామము" అను మరొక స్వతంత్ర గ్రంథమును వ్రాయుటకు పూనుకొని, ముఖ్యాంశాలను స్థూలంగా నోట్సు తయారుచేసుకొన్నారుగాని, అది పుస్తకరూపంలో ప్రచురింపబడినట్లులేదు.

# శ్రీరామ చరిత్రము, ప్రచ్ఛన్న పాండవం

హరిసర్వోత్తరరావుగారు సాహిత్యక్షేత్రమున చేసిన కృషిలో 'శ్రీరామ చరిత్రము' వ్యాఖ్యానము, 'ప్రచ్ఛన్నపాండవము' అను రెండు గ్రంథములను పేర్కొనవలసి వుంటుంది.

పోతన భాగవతములోని శ్రీరామ చరిత్రకు రావుగారు నవీన పద్ధతిని వ్యాఖ్యను వ్రాశారు. దీని మొదటి కూర్పు 1913 లో ప్రకటితమైనది. తర్వాత మద్రాసు టెక్స్టు బుక్ కమిటీవారిచే సిఫార్సు చేయబడినందున ఈ గ్రంథం 11 ఎడిషనులు వేయబడినది. మహాభారత ఇతిహాసములో నాయకి అయిన 'ద్రౌపదీ దేవి' చరిత్రను, ప్రచ్ఛన్నపాండవముపేరట 5 అంకముల నాటకముగా రచించారు. ఈ గ్రంథాన్ని 'మద్రాసు వేదం అండు కంపెనీ' వారు 1918 లో ప్రచురించారు.

ఇందులో రావుగారు తమ వంశవృక్షాన్నిలా తెలియజేశారు :

సూత్ర : 'ప్రచ్ఛన్నపాండవం'బను నొక్క నాటక మిటీవలనే ప్రకటిత మయినది.

నటి : దానిని రచించిన దెవరు ?

సూత్ర : రచించితినను నహంభావము తనకు వలదని కర్త నన్ను విన్నవింపమనినాడు.

నటి : రచింపకున్న గూర్చినవా రెవరనియైన నడుగం జనునా ?

సూత్ర : ఎఱుంగవా ?

గీ. హనుమ దర్పణమంచును నవని మెచ్చ
దండకంబును రచియించి దండి కవిత
నలరి వరలిన సుబ్బరాయనికి పౌత్రు
డాంధ్రభారత ఘవలీల నప్పజెప్ప
ప్రతిభ నందిన వేంకటరాయ పుత్రు
డాంధ్రభూమికి సేవకుం డరయ నతడు
కలడు కౌండిన్య గోత్ర విఖ్యాత యశుడు
గాడిచర్ల వంశాబ్ధికి కలువరేడు
హరియు సర్వోత్తమాఖ్యల నంట బలుక
గలుగు నుత్తమ నామంబు గలుగువాడు.
అతండె యీ నాటకంబు గూర్చినాడు.

నటి : ఆర్యా! ఇప్పుడెల్ల యర్థంబుం గోచరంబయ్యె. తిక్కన సర్వోత్తమ కవి యగుట సర్వోత్తమ నామధేయ భాగ్యంబున నీతని కీ కూర్పు నమర్చు నవకాశము తటస్థించె కాబోలు!

మహా పతివ్రతా శిరోమణియయిన ద్రౌపదిపై రావుగారి కుండు అభిమానంచేత చక్కని భాషలో ఈ నాటకమును రచించారు. ఇది యిప్పటి రోజుల్లో ప్రదర్శన కనుకూలంగా కనబడదు.

రావుగారు శ్రీరామచరిత్రను తన తల్లిగారి కంకితం యిచ్చారు. దీనిని విద్యార్థుల పఠనీయగ్రంథంగా వ్రాశారు. ఇందలి అంకిత పద్యాలు :

"చిన్నతనమునందె శిశువునన్ వీడుచు
భువిని గడచి చనియెఁ బుణ్యచరిత
తల్లి నామెఁ దలఁతుఁ దలఁచి యుల్లమునందు
నాకె గారవింప నాసగొందు".

"అయిన నాదు శక్తి యది సున్నమేయని
వగచుచుందు దైవవశముచేత
రాముచరిత వ్యాఖ్య వ్రాయుట యిది గల్గె
ధన్యుడగుదు దీని తల్లి కిచ్చి"
"భాగవతము చూడ భవ్యకావ్యము, పోత
రాజు వ్రాఁత మిగుల రమ్యమందు,
దాన రామచరిత తథ్య ముత్తమ మమ్మ!
కాన దీని వ్యాఖ్యఁ గరుణఁ గొనుము."
"తల్లి భాగీరథీబాయి ధర్మమూర్తి
'పోతరాజేడ నీవేడ బుద్ధిహీన'
యనుచుఁ గినుకను నన్ను నీవాడె దొక్కొ?
అవును నిజమౌను నీమాట యగునుగాని
యుడుత భక్తిని రామున కుపచరించెఁ
గాదె యారీతి నేనును గడఁగినాఁడ
గాన లోపంబులెంచక కరుణఁజూచి
కోరికీడేర్పు నీముద్దు కొమరునందు."

మాడపాటి హనుమంతరావుగారి సిఫారసుతో ఈ శ్రీరామ చరిత్రమును హైదరాబాద్ సంస్థానం విద్యాశాఖవారు, మిడిల్ స్కూళ్లలో 11 వ ఫారానికి (తెలుగు మీడియమ్) ఉపవాచకముగా నిర్ణయించి, తమ ప్రాంత పాఠశాలలలో పెట్టించినారు. దీనిని కొందరు జిల్లా విద్యాశాఖాధికారులు వ్యతిరేకించినను, విషయ ప్రాధాన్యతనుబట్టి పుస్తకం అనేకసార్లు అచ్చుఅయినది.

శ్రీరావుగారు వచన రచనలోనే హెచ్చుగ కృషిచేశారు. కొంచెంగా పద్యాలుకూడ అప్పుడప్పుడల్లినారు. వారి కవిత మృదు మధురంగాను, సుబోధకంగాను, భావస్ఫూర్తి కలిగి వుంటుంది. దిగువ పద్యం యీ విషయాన్ని ఋజువు చేస్తుంది:

## ఈశ్వర

పండు నీలిమ యాకసంబది
    పెండ్లిపందిరి యౌచు వెలయగ
అరుణ తరుణిమ నమరు చివురులు
    నలరు తోరణపంక్తి పన్నగ
వెండి వెలుగులు తారసంహతి
    దండి దీపావళులు కాగా
మావిపండులు మధువు నమరిచి
    మన్ననంబును జూపగా
క్రొత్త బెల్లము క్రొత్త బియ్యము
    కూర్మి సేసలు గూర్పగా
పూతవేములు సౌరభంబులు
    పొదవి జల్లులు జల్లగా
కుహుకుహూయని కూడి పాటల
    కొమ్మ కోయిలపిండు పిలువగ
కమ్మ తెమ్మెర నీకు తోడై
    నెమ్మి నీతో క్రుమ్మరన్
రమ్ము ఈశ్వర: రమ్ము రమ్మిక
    చిమ్ము శుభముల భూస్థలిన్।

—'గ్రంథాలయ సర్వస్వము' 10 వ సంపుటమునుండి

## వయోజన విద్యా ప్రచురణలు

'దక్షిణభారత వయోజన విద్యా సహకార ప్రచురణ సమితి లిమిటెడ్' అనునొక సంస్థ రావుగారి కృషితో మదరాసులో ఏర్పడింది. నూతనంగా అక్షరాస్యులైనవారి కుపయోగించు పుస్తకములను ఈ సంస్థద్వారా ప్రచురించారు. తెలుగులో వెలువడిన 'సత్య

ప్రియత్వము - గాంధీమహాత్ముడు, అబ్రహాం లింకను, విద్యలోని విలువ, మనదేశం, మనశరీరం, మనమతము' మున్నగు పుస్తకములను రావుగారు సంస్కరించారు. 1942-52 సంవత్సరాల్లో హరి సర్వోత్తమరావుగారు వయోజనుల అక్షరాస్యతా ప్రచారాని కుపయోగించు 3 పుస్తకములు, అక్షరాభ్యాస పటము (ఛార్టు) తయారు చేశారు. వయోజన ఉపాధ్యాయులకుగాను 'వయోజన విద్య - బోధనక్రమము'ను రచించారు. శ్రీ చిలకమర్తివారి గ్రంథాలయ వేదాన్ని పద్యంలోకి మార్చారు. వయోజనులను చదువుకొమ్మని ప్రబోధిస్తూ ఒక వయోజనవిద్యాగీతం రచించారు. ఇవన్నీ తెలుగు దేశంలో వయోజన విద్యాభివృద్ధికి చాల తోడ్పడి నవి. రాత్రి పాఠశాలల్లో విద్య గరపుటకు వీరి అక్షరాభ్యాస పటము బాగా వుపయోగపడింది.

## ఆంధ్రజాతీయ వాచకములు

1941-42 ప్రాంతంలో వి. సోమసుందరం, బి. ఏ. బి. ఇడి. గారితో కలిసి హరిసర్వోత్తమరావుగారు ప్రాథమిక విద్యార్థుల కుపయోగించే వాచకములు రచించారు. వీటిని కర్నూలు బాల సరస్వతీ బుక్కు డిపో అధిపతులు టి. బాలనాగయ్యచెట్టిగారు ప్రచురించారు. 1939 సిలబస్ ననుసరించి వీటిని 1 నుంచి 5 తరగతుల విద్యార్థులకు పాఠ్య పుస్తకములుగా ప్రభుత్వం సిఫార్సు చేసింది.

రావుగారు స్వయంగా వ్రాసిన 'పౌరవిద్య' (Elements of civics) పుస్తకములను 1 నుంచి 6 తరగతుల వరకు మద్రాసు ప్రభుత్వం పాఠ్యగ్రంథంగా నిర్ణయించింది.

ఇంగ్లీషులో "వన్యమృగ పరిరక్షణలో మహానందికి గల అవకాశాలు" (Preservation of wild Life - claims of Mahanandi) అను చిన్నపుస్తకమును రచించారు. వన్య మృగపరిరక్షణకని ప్రచారం గావిస్తున్న ప్రభుత్వం, మహానంది క్షేత్ర పరిసరాలలో దీని ప్రాధాన్యతను యిప్పటికైన గుర్తించ వలసినదిగా వుంది.

## ప్రపంచచరిత్ర (గ్రీసుదేశం)

1917-18 సంవత్సరంలో బైసాని నరసింహేశ్వరగుప్త గారితోను, భువనగిరి గోపాలశెట్టిగారితోను కలిసి హరిసర్వో త్తమరావుగారు 'వేదం కంపెనీ' అను ప్రచురణ సంస్థ నొక దానిని మద్రాసులో స్థాపించారు. దీని తరపున ప్రపంచ చరిత్ర (గ్రీసు) 20 ప్రకరణములు వ్రాసి, 3 సంచికలుగా ప్రచురించి చందాదార్ల కందజేశారు. ఒక్కొక్క దేశచరిత్ర సమగ్రంగా రావు గారువ్రాయుట కుద్దేశించారుగాని,కారణాంతరములవల్ల గ్రీసుచరిత్ర కూడ పూర్తిగాకుండానే ఆ ప్రయత్నం విరమించవలసి వచ్చింది. వివిధ దేశాలకు సంబంధించిన నోట్సు మాత్రం చిన్నకాగితము లుగా మిగిలిపోయినవి. 1920 సంవత్సరం వచ్చేసరికి 'వేదం అండుకో'కు రావుగారొక్కరే ప్రొప్రయిటరుగా మిగిలిపోయినారు.

"భారతదేశానికి ఒక జాతీయ జెండా" (A National Flag for India) అనే పుస్తకాన్ని పింగళి వెంకయ్య గారు 1916 లో రచించారు. దీనిలో భారత దేశానికొక జాతీయ జెండా వుండవలసిన ఆవశ్యకతను ఆ మహా శయుడు నిరూపించారు. వెంకయ్యగారు అప్పట్లో బందరు జాతీయ కళాశాల అధ్యాపకుడుగా వుండేవారు. ఈ గ్రంథంలో

30 జెండా బొమ్మలను రంగురంగులతో, ఆర్టిస్టు ఇ. వెంకట శాస్త్రిగారిచేత గీయించి మద్రాసు గార్డియన్ ప్రెస్‌లో ముద్రించారు. ఈ పుస్తకమును ఆంధ్రపత్రికా ప్రెస్‌లో ముద్రించారు. ఈ గ్రంథమునకు అప్పట్లో ఇంపీరియల్ లెజిస్లెటివ్ కౌన్సిలు మెంబరుగా వుండిన గౌ॥ రావుబహదూర్ బి. యన్. శర్మ, బి. ఏ., బి. ఎల్. ఒక చక్కని పరిచయం వ్రాశారు. గ్రంథ ప్రచురణకు సి. పి. రామస్వామయ్యర్ ధన సహాయం చేశారు. ఆంధ్రులకు గర్వకారణమైన విషయమేమంటే, పింగళి వెంకయ్య గారు సూచించిన కలరు బొమ్మలనుండే గాంధీజీ, కాంగ్రెస్ కార్య వర్గంవారు తర్వాత కాంగ్రెసు జెండాను నిర్ణయించారు.

ఈ విషయంలో తన మిత్రుడైన హరిసర్వోత్తమరావు గారి సలహాలను, సహాయాన్ని ప్రస్తుతిస్తూ పింగళి వెంకయ్య గారు వ్రాసిన దిగువమాటలు గమనార్హమైనవి:

"జెండా రంగు నమూనాల ప్రూఫులను దిద్దుటలో తీసికొన్న శ్రమకు,దీని యారంభమునుండియు నా కిచ్చిన మిక్కిలి విలువయగు సలహా సహాయములకు ఆంధ్రపత్రిక సంపాదకుడు, నా చిరకాల మనః పూర్వక మిత్రుడును అయిన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారికి కూడ నేను ఎక్కువగానే కృతజ్ఞతను తెలుపుకొనవలసి యున్నది." *

---

* "My thanks are also due in no small measure to my ever willing and sincere friend Mr. G. Harisarvottama Rao, M. A., 'Editor of Andhra Patrika' for the pains he has taken in correcting the proofs of the coloured designs,and for the very valuable advice and assistance he had given me throughout."

—From "A National flag for India"
Written by P. Venkayya.

తాము, హరిసర్వోత్తమరావుగారు చాలా స్నేహపూర్వకంగా వుండేవారమనీ, రాయలసీమ ప్రాంతంలోగూడా కలిసి పనిచేశామనీ, అఖిల భారత కాంగ్రెసు మహాసభకు ఉభయులూ పోతుండేవారమనీ తమ తండ్రిగారు చెప్పినట్లు, పింగళి వెంకయ్యగారి కుమార్డు శ్రీ పరశురామయ్యగారు మా సంభాషణలో చెప్పారు.

1937 లో రాష్ట్రాలలో కాంగ్రెసుమంత్రి వర్గాలేర్పడినప్పుడు 'కాంగ్రెస్సు ఈనాడు గద్దెయెక్కినది' అనే శీర్షిక క్రింద రావుగారు వ్రాసిన పద్యాలు ప్రబోధాత్మకంగా వున్నవి.

ఎనలేనికష్టాలు ఎన్నియో ఓర్చి
తిరముగా పోరాడి ధైర్యాననిలిచి
బిడ్డలను బలియిచ్చి పెద్దగా పెనగి
కాంగ్రెస్సు ఈనాడు గద్దెయెక్కినది.॥
గాంధీజి చెప్పేటి కర్మమార్గాలు
కార్యసాధనకెంతో గట్టిమార్గాలు
ఖద్దరునే కట్టి కనుము శాంతమ్ము!
మతపిచ్చలోపడక మరలుకోవయ్యా!
వర్ణాల భ్రమలను వదలుకోవయ్యా!
అస్పృశ్యదోషంబు అరికట్టవయ్యా!
ఇవిమెట్లులయ్యారో యెక్కిపోవుటకు॥
అక్షరజ్ఞుడవీవు అయితీరవాలె;
పూర్తివోటును నీవు పొందితీరాలె;
పరదేశ వస్తువును పారదోలాలె;
నీదేశ వస్తువులు నీవు వాడాలి
కూడు గుడ్డకు నీకు కొదువలేనట్టి
విద్యలనేర్వంగ విధులు పన్నాలి;

ఆకలి అప్పుల ఆర్తిలేనట్టి
ఆర్థికమార్గాల అరసివేయాలి ॥
ఇన్ని కోరికలెల్ల ఏనాడొకోరి
భంగపాటులకోర్చి బాధలకోర్చి
హరి నీకు వీటిని అందిచ్చినాడు ॥
పేరు రాజాజీది; పెద్దగాంధీజీ;
కాని రాజ్యమువారు కాదు ఏలేది;
ఏలేది నీవేను; ఏలేది నీవే
రావేగ, రావేగ, రావేగనీవు.
కోవేగ, కోవేగ, కోవేగహక్కు॥

—'గ్రంథాలయసర్వస్వము' 11 వ సంపుటమునుండి

## సభలు—సమావేశాలు

1947 వ సంవత్సరంలో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం వారు రావుగారు వ్రాసిన "సభలు-సమావేశములు" అను పుస్తకాన్ని మొదటిసారి ప్రచురించినారు. జాన్‌రిగ్ రచించిన 'How to conduct meetings?' అను ఆంగ్లగ్రంథం ఆధారంతోను, రావుగారు కౌన్సిలుమెంబరుగా, వివిధ సంస్థల నిర్వహణలో వచ్చిన అనుభవమును వినియోగించి, ఈ పుస్తకమును వ్రాశారు. ఇటీవల యీపుస్తకం రెండవముద్రణకూడ వెలువడింది.

## రేడియో ప్రసంగాలు

ప్రస్తుతకాలంలో, ప్రజలలో చైతన్యం గలిగించడానికి రేడియో ఒక ముఖ్యసాధనంగా వుంటున్నది. హరిసర్వోత్తమరావు గారు మద్రాసు, విజయవాడ రేడియో కేంద్రములద్వారా అనేక ప్రసంగాలుచేసినట్లు కనుపిస్తుంది. ఇందులో రాజకీయ, ఆర్థిక సాంఘిక, విద్యావైజ్ఞానిక సమస్యలకు సంబంధించిన వివిధాం

శములున్నవి. మహాపురుషుల జీవితచరిత్రలున్నవి. శాస్త్రీయ చర్చలున్నవి. రేడియోవారేర్పచిన చర్చావేదికలలో గోష్ఠులలో వీరు పాల్గొన్నారు.

రావుగారి ప్రసంగాలన్నిటా భాష సరళమైనది. భావం గంభీరమైనది. వారివిజ్ఞానం పుస్తకపరిమితమైనదేకాదు; అనుభవ జ్ఞానపూర్వకమైనదిగూడా. అందుకే హృదయానికి సూటిగా తట్టు తుంది. శాస్త్రీయ విషయాలుగాని, ఆర్థికరాజ్యాంగ సమస్యలు గాని, ఎంతటి క్లిష్టమైన అంశాలైనను, సులువుగా అవగాహన చేసుకొనుటకు వీలుంటుంది రావుగారి ప్రసంగధోరణి.

చరిత్ర, రాజకీయ, సాంఘిక శాస్త్రాల అధ్యయనంతో పాటు, స్వయంగా అన్ని అభ్యుదయ ఉద్యమాలలో పాల్గొంటూ వచ్చిన మహనీయుడగుటచేత, వారి జీవితానుభవాలనుగూడా తెలుసుకొనుటకు యివి అవకాశమిస్తున్నవి. రావుగారిలో మంచి విమర్శనా పటిమ, పరిశీలనాశక్తి ఉన్నవి. ఈయన భావాలు చాలా స్పష్టంగా వుంటాయి. కనుక వీరిప్రసంగాలు సులభంగా అర్థ మవుతాయి. అవి వినేవారికి ప్రబోధాత్మకంగాగూడా వుంటాయి. లభ్యమైనంతవరకు వీరి ప్రసంగాల అంశములనిక్కడ క్లుప్తంగా వ్రాస్తాను.

1. గాంధీసూత్రాలు :- రావుగారి రేడియో ప్రసంగాలను విభాగంచేస్తే అందులో గాంధీసిద్ధాంతాలు ప్రముఖభాగంగా వున్నవి. (1) గాంధీ ఆర్థికసూత్రాలు-గ్రామసమాజము (2) ప్రాచీనగ్రామ స్వరాజ్యం (3) ధర్మకర్తృత్వసిద్ధాంతం (4) గాంధీజీ-హరిజనోద్ధరణ (5) స్వయంనిర్ణయ సూత్రాలు-స్వయం

సంపూర్ణత్వము (6) గ్రామ సాముదాయక జీవనము మున్నగు నవి వీనిలో ముఖ్యమైనవి.

విద్య:విద్యకు సంబంధించినవాటిల్లో(7)జాతీయపునర్నిర్మాణము -నిర్బంధ ప్రాథమిక విద్య (8) అందరికీ విద్య (9) వయోజన విద్య (10) స్త్రీలు-విద్య (11) నేటి విద్యాభ్యాస సమస్యలు-ప్రాంతీయావసరాలు (12) వోటు-విద్య (ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య, హరిసర్వోత్తమరావుగార్ల చర్చ) (13) ఆధారిక విద్య (14) గ్రామాల్లో అవిద్యా నిర్మూలన ముఖ్యమైనవి. (15) విద్య-పునర్నిర్మాణము (Reorganisation of Education) అనే సమస్యపై ఆంగ్లంలో ప్రసంగం. (16) రాష్ట్రోదయము - విద్యా సమస్యలు మున్నగునవి.

గ్రంథాలయములు: (17) ఇంగ్లిష్‌లో 'డాక్యుమెంటేషన్, విద్యలో సామర్థ్యము' (Talk on Documentation and Efficiency in Education) అనే ప్రసంగంగ్రంథ భాండాగారులెల్లరూ ముఖ్యంగా చదువవలసినది. (18) 'గ్రంథాలయాల దర్శకత్వము-సాంస్కృతిక కార్యకలాపాలు' Library direc--tion-cultural activ-ities) అనునది గూడా ప్రధానమైనది. (19) సంచార గ్రంథాలయాలు.

పంచాయతీలు : (20) ఆంధ్రదేశం - స్థానిక సంస్థలు (21) ఆదర్శ గ్రామం ఎలా వుండాలి ? (22) గ్రామ పంచాయతీలు ప్రధానమైనవి.

రాజకీయములు : (23) 'ప్రజా ప్రభుత్వం - డెమాక్రసీ' అనే విషయంపై చర్చ (24) పంచశీలము (25) ఇండియా ప్రజల రాజ్యం (26) ప్రజాస్వామ్యం - ప్రతిపక్షాల అవశ్యకత

(27) నూతన భారత రాజ్యాంగానికి ప్రస్తావన మొదలైనవి. 'ప్రజాస్వామ్యం'పై చర్చలో "వోట్లు అందరికీవున్నా, పీఠమెక్కే వారువేరు. చదువురాని వారివద్ద, డబ్బులేని వారివద్ద వోట్లు తీసుకొని, వారి మీదనే సవారీ చేయటం జరుగుతున్నారు. పేరు ప్రజాస్వామ్యమేగాని, క్రియకు వర్గ ప్రభుత్వం అవుతూ వుం"దన్నారు.

'వోటు - చదువు'లో "చదువులేని వోటె కావలెననిగాని, చదువులు వచ్చేవరకు వోటు వుండరాదని కాని మొండివాదం చేయడం కుదురదు. యుక్త వయస్కు లందరూ వోటుతోగూడా చదువును పొందినవారు కావలెనని చేసే ప్రయత్నమే అత్యుత్తమమైనది" అన్నారు.

'పంచశీలము' అను దానిలో గృహము దగ్గరనుంచి రాష్ట్రానికి, దేశానికి, ప్రపంచానికి 'పంచశీలము - సహజీవనము'ను వర్తింపజేశారు.

"సిద్ధాంతము లేమైనా, మన మందరము ఈ లోకమున జీవితము నడుపవలసిన వారమే. ఒక కుటుంబములో పదిమంది వుంటే పది మాటలు మాట్లాడు తుంటారు ఈ కారణముచేత వీరు నిముష నిముషమునకు చీలిపోగలరా? చీలిపోతున్నారా? లేదే. ఒకరి నొకరు సహించుకొని భేద భావాలతోకూడ జీవించు చున్నారే! ఇదే సూత్రాన్ని రాష్ట్రాలకుగూడా సమన్వయము చేస్తే లోకశాంతికి భగ్నము కలుగదు. దీనినే సహజీవనమని వర్ణిస్తున్నాము.

విషయము సర్వకాలములకు సమన్వయమగునది. సత్పురుషులు దీని తత్వమును గ్రహించి, భారత రాజనీతికి దోహదం చేయుదురుగాక!" అన్నారు.

జీవిత చరిత్రలు : మహాపురుషుల జీవిత చరిత్రలలో (28) పండిత మదనమోహన మాళవ్యా (29) శ్రీ వి. యస్. శ్రీనివాసశాస్త్రి (30) దేశబంధు చిత్తరంజనదాసు (31) శ్రీమతి సరోజినీదేవి గార్ల సంక్షిప్త చరిత్రలు రావుగారి ప్రసంగాల్లో నున్నవి.

విజ్ఞానం : (32) జ్ఞానమార్గం, కర్మమార్గం, ముక్తిమార్గములు వివరించారు. (33) విజ్ఞాన శాస్త్రాభివృద్ధిమూలంగా కలిగే మేలు కీడులు విశదీకరించారు. (34)అంగవిహీనులు - విజ్ఞాన శాస్త్రాభివృద్ధి మొదలైనవి.

యాత్రాస్థలాలు : (35) హంపీక్షేత్రము (36) శ్రీశైలం (37) కర్నాటకంలో ప్రసిద్ధ దేవళములు అను యాత్రా స్థలాలు, క్షేత్ర మహత్త్వాలను గూర్చి ప్రసంగించారు.

జర్నలిజం : (38) జాతీయ వికాసానికి పత్రికలు (39) సాంఘిక పరిజ్ఞానం - సాహిత్యం (39) సంక్రాంతినాడు ఆహ్వానితులైన రచయితల సమావేశంలో పాల్గొని రావుగారు చక్కని ప్రసంగం చేశారు.

ప్రజా సమస్యలు : (40) మన ఆహార సమస్య-ప్రజల బాధ్యత (41) తుంగభద్ర ప్రాజెక్టు (42) కార్మికుల ఆరోగ్య సదుపాయాలు మున్నగువాటినిగూర్చి గ్రామస్థుల కార్యక్రమంలో మాట్లాడారు.

స్వీయ చరిత్ర : (43) "ప్రజాసేవకుడిగా నా జీవితంలో విస్మరించరాని సంఘటనలు" అను విషయంపై 9-8-1956 సాయంత్రం 7-30 నుండి 14 నిముషాలసేపు రావుగారు మద్రాసు రేడియో కేంద్రం ద్వారా చేసిన ప్రసంగం అతిప్రధానమైనది.

దీనిలో వీరు తమ పూర్వ స్మృతులను జ్ఞప్తికి తెచ్చుకొని, ఆ కొద్ది కాలంలోనే చెప్పదగిన ఘట్టాలు పేర్కొన్నారు. ఇవి ఈ చరిత్ర రచనకు గూడా తోడ్పడినవి.

ఇవి రావుగారు అసంఖ్యాకంగా చేసిన రేడియో ప్రసంగాలలో కొన్ని మాత్రమే. ఇంకా చాలా వుండవచ్చు. లభ్యమైనంతవరకే యిందుదహరించాను. విషయమునుబట్టి విభజించి, వాటినన్నిటిని పుస్తక రూపంగా ప్రకటించినప్పుడే, ఇది సమగ్రంగా వుంటుంది. హరిసర్వోత్తమరావుగారు వ్రాసిన దానినిబట్టే వారి రేడియో ప్రసంగాలు సుమారు 2500 పేజీలు కలవని తెలుస్తున్నది.

## పీఠికలు

రావుగారు అనేక పుస్తకములకు పీఠికలు రచించారు.

పాతూరి నాగభూషణంగారు వ్రాసిన "గ్రంథాలయ శాస్త్ర ప్రథమ పాఠములు" అను పుస్తకమునకు పీఠిక వ్రాస్తూ రావుగారు సాంఘిక, మనస్తత్వశాస్త్ర ప్రయోజనము; అర్థశాస్త్రము, వ్యక్తి స్వాతంత్ర్యం – సంఘ స్వాతంత్ర్యాలకుండే సంబంధాన్ని గూర్చి వ్రాశారు. అందులో కొన్ని ముఖ్యాంశాలిందు పేర్కొనుట అప్రస్తుతం కాదు.

"ఒక మహాతత్వవేత్త విజ్ఞానమును గురించి తనకు తెలిసింది సముద్రంలోని ఇసుక ప్రోవులోని ఒక్క రేణువు మాత్రమేననియు, తెలియనిది అపారమైన సముద్రమువంటి దనియు వివరించినాడు. వ్యక్తిగతముగా ఆలోచిస్తే ఏ మహావ్యక్తిని తీసుకొన్నా యిది నిజమే అవుతుంది. కాని ప్రపంచంలోని మహావేత్త లందరూ ఒకచోట గుమి

గూడ గలిగితే, ప్రపంచ విజ్ఞానసాధన సాధ్యమవుతుందనడానికి సందేహంలేదు."

వ్యక్తి - సంఘ స్వాతంత్ర్యములను గూర్చి చెపుతూ

"స్వాతంత్ర్యమనేది వ్యక్తిగతము, సంఘగతము. వ్యక్తికి స్వాతంత్ర్యము లేకపోతే అసలు స్వాతంత్ర్యపు టుద్దేశమే నశిస్తుంది. ప్రతి మానవుడు సుఖంగా. సంతృప్తుడుగా జీవించడానికే స్వాతంత్ర్యమనేది యేర్పడింది. కాని సంఘ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోలేకపోతే, ఏ వొక్కవ్యక్తికో, ఏ కొందరు వ్యక్తులకో స్వాతంత్ర్యమూ, ఇతరులందరికీ పారతంత్ర్యమూ తప్పవు" అన్నారు.

సాంఘికశాస్త్ర ప్రయోజనాన్నిగూర్చి వ్రాస్తూ,

"నా హక్కులేమిటి? నా జవాబుదారీ లేమిటి? అనేది నిర్ణయించుకొని మానవుడు సంఘంలో ప్రవర్తించే మనస్తత్వంమీదనే ప్రపంచ కళ్యాణమో, పతనమో ఆధారపడుతుంది........

మానవ మనస్తత్వం భిన్నభిన్న వర్గాలలో, భిన్నభిన్న సంబంధాలలో యెట్లు పనిచేస్తుందో పరిశోధించి, క్రమరీతిని శాస్త్రములు తీర్చుకొంటున్నారు. ఈ శాస్త్రానికే సాంఘిక శాస్త్రమనేపేరు కలిగింది.

ఇన్ని సంబంధాలను పరిశీలించి నిర్ణయించవలసిన విధి ఈ సాధనను వినియోగమునకు తెచ్చు కార్యకర్తలది" అన్నారు.

మహాభారతంలోని "ఒరులేయవి యొనరించిన" అను పద్యమును పురస్కరించుకొని రావుగారిలా వ్రాశారు :

"ప్రతి మనుజుడు తన నితరులెటు చూడగోరునో, తానును ఇతరులనట్లే చూడవలెనను నియమము సర్వ సంఘ శ్రేయానికి ఆధారభూతమైన మూలసూత్రం; క్రీస్తు తన బోధలో అత్యుదాత్తంగా నిర్వచించిన సత్యం; అహింసా సిద్ధాంతాన్ని లోకంలో స్థాపించడానికి ప్రధానాధారమైన భావం. సర్వసంఘ శాస్త్రములు రచించువారు, ఈసూత్రాన్ని

సమన్వయం చేసి తమ శాస్త్ర ప్రయోజనాన్ని సాధింపగలిగితే ప్రపంచం ఆనందమయ మవుతుందనడానికి సందేహం లేదు."

"ముఖ్యంగా అర్ధశాస్త్రంలో దీనిని సాధించితే, నేడు ప్రపంచం అనుభవిస్తుండే భీభత్స పరిస్థితికి ప్రతీకార మేర్పడుతుంది."

"నేటి సంఘంలో గలిగిన లోపాలను సరిదిద్దే సాధనం గ్రంథాలయోద్యమ మేనని తమ బోంట్ల విశ్వాస "మన్నారు." ఏండ్ల తరబడి అభ్యసించినను ఇంకా అభ్యసింపదగిన విశేషాలు పెక్కు- గ్రంథాలయాలలోవున్న" వని చెప్పి ఇలాంటి ప్రయోజనకరమైన పుస్తకాన్ని పాఠక లోకాని కందించిన గ్రంథ రచయిత నభినం దించి ఆశీర్వదించారు.

గోటేటి జోగిరాజుగారి వ్యవసాయ శాస్త్రము- రెండవ సంపుటమునకు రావుగారు మరొక చక్కని పీఠిక వ్రాశారు. వ్యవసాయ శాస్త్రం తెలుగుదేశంలో విరివిగా వ్యాప్తి గావటానికి జోగిరాజుగారు అపారమైన కృషిచేశారు. రాష్ట్ర వ్యవసాయశాఖ అసిస్టెంటు డైరెక్టరుగా వుండి విశేషానుభవం గడించారు. రావుగారి పీఠికలో

"వీరి శాస్త్ర రచన అపూర్వమైనది. ప్రత్యేక పరిశోధనచేసి తమ అనుభవములను వివరించుట వీరి ప్రధానాశయము. ఇతరులు పరిశోధించి తేల్చిన సత్యాలను వీరు నమోదు చేయుటకలదు ........శాస్త్రమంటే వట్టి సిద్ధాంతము చేయుట కాదు. అది సత్యాన్వేషణ అనే సంగతి వీరి వ్రాతల్లో స్పష్టంగా గోచరించుచుండును. కండ్లు మూసుకొని ఆచారమాత్రంగా దేనినీ అవలంబించరాదని వీరిబోధ........

"దీనికి సంబంధించి నంతవరకు వృక్షశాస్త్రము, భూగర్భశాస్త్రము, వాతావరణ శాస్త్రము మొదలగు శాస్త్రముల సారమంతటిని ఈ సంపుటమునందు ఇమిడ్చినా రన్నమాట. ఈ విజ్ఞానములేనినాడు వ్యవసాయ మును దక్షతతో నిర్వహించడానికి రాదు."

అన్నారు. శాస్త్రవిషయములకు ఆచరణను జోడించడం, రావు గారి ప్రత్యేకతగా కనుపిస్తుంది. అది వృక్షశాస్త్రం గానిండు, గ్రంథాలయశాస్త్రం గానిండు. యేజెళ్ళ శ్రీరాములుగారి 'అనుభవ పశువైద్య చింతామణి', కోదాటి వేంకటేశ్వరరావుగారి 'సహకారోద్యమం', మాదల వీరభద్రరావుగారి 'గుంటూరుజిల్లా సాంఘిక విజ్ఞానము' మున్నగు మరెన్నో పుస్తకాలకు రావుగారు పీఠికలు వ్రాశారు.

## గ్రంథ సమీక్షలు

హరిసర్వోత్తమరావుగారు 'హిందూ' (Hindu) పత్రికకు అనేక గ్రంథ సమీక్షలు వ్రాశారు. సౌందరనందము, అలంకార మంజరి, ఇంగ్లీష్-తెలుగు డిక్షనరీ (శాస్త్రీయ, సాంకేతికం) రంగనాథరామాయణం, కథాపారిజాతము, భారతదేశం-ప్రాచీన వైభవము (India in its ancient glory) మొదలగు ఎన్నియో గ్రంథరాజములకు సమీక్షలు వ్రాశారు. జి. హెచ్. యస్. (G. H. S.) అను పేరుతోనున్న గత రెండు దశాబ్దముల లో రావుగారు వ్రాసిన 'రెవ్యూ'ల నన్నిటిని భద్రపరచి వుంచారు. వీటిలో ముఖ్యమైనవాటిని ఎన్నికచేసి ప్రచురించినట్లయిన ఆంగ్ల పాఠకలోకానికి ఎంతయో ప్రయోజనకరంగాను, విజ్ఞాన దాయకంగాను వుంటుంది. ఒక్కొక్క గ్రంథాన్ని సమీక్ష చేయుటలో, వాటిని ఆమూలాగ్రం శ్రమపడి చదివి, విమర్శలు వ్రాసినట్లు కనుపిస్తుంది. వారి సారస్వత పరిశ్రమ వృథాగాకుండా ఈ సమీక్షలను గ్రంథస్థం చేయవలసిన అవసరముంది.

## అముద్రిత గ్రంథాలు, పరిశీలనా ఫలితాలు

హరిసర్వోత్తమరావుగా రనేక చారిత్రక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, తత్వశాస్త్ర సమస్యలకు సంబంధించిన పుస్తకాలు చదివి, వివరాలు బహుకాలంనుండి సేకరణచేసినట్లు కన బడుతుంది. ఏ క్రొత్త విషయం చదివినా నోట్సు వ్రాసుకున్న కాగితాలు కనిపిస్తవి. కొన్నిటికి అసమగ్రంగానైనా పుస్తక రూపం తెచ్చారు. మరికొన్ని చిత్తునోట్సు లున్నాయి.

అముద్రిత గ్రంథాలలో పేర్కొనవలసిన ముఖ్యమైనవి ఇవి:

1. హిందూదేశ చరిత్ర (హిందూ, మొగల్, మహారాష్ట్ర కాలములకు సంబంధించినది. సుమారు వెయ్యిపేజీలకు పైగానున్న గ్రంథం)
2. జనారోగ్యం - లోకశుద్ధి (Public Health and Sanitation) (సుమారు 400 పేజీల గ్రంథం)
3. ప్రపంచ భూగోళము (అసంపూర్ణం)
4. వాతావరణశాస్త్రము
5. జవహర్‌లాల్ నెహ్రూ (1920 వరకు)
6. సహకారం

వీని వ్రాతప్రతులున్నవి.

ఇక చిత్తునోట్సుకు సంబంధించిన విషయాలు:

1. సోక్రటీస్, ప్లాటో, అరిస్టాటిల్ మున్నగు తత్వవేత్తలు ప్రవచించిన తత్వశాస్త్రములు - మన భారతీయ తత్వ శాస్త్ర విషయాలను గూర్చి
2. ప్రాచీనకాలంనుండి ప్రభుత్వం - రాజ్యాంగ యంత్ర పరిణామాలను గురించి
3. ఏయే దేశాలలో జాతీయాదాయం ఎంతెంత వుందో లెక్కలు
4. యూరప్‌దేశంలోని భాషాసమస్యలు, భారతీయ భాషాపరిణామాలు

5. జాతీయోద్యమ ఘట్టాలు - ఆంధ్రోద్యమ ప్రగతి - తేదీలు
6. వివిధ రాష్ట్రాల గ్రామ పంచాయతీలు, సహకార శాసనముల ముఖ్యాంశాలు
7. శిక్షణ తరగతులలో వివరించుట కవసరమైన అర్థ శాస్త్రము - వాతావరణ శాస్త్రము - ప్రజారోగ్యం - సాంఘిక విద్య మున్నగునవి.
8. వివిధరాష్ట్రాలలో, దేశాలలో గ్రంథాలయాలు, వయోజన విద్యకు సంబంధించిన వివరాలు, సిలబస్‌లు మున్నగునవి,
9. ఆంధ్రదేశంలో వందేమాతరం ఉద్యమం నుండి వారి కృషి వివరాలు, వ్యాసాలు, ఉపన్యాసాలు, ఉత్తరప్రత్యుత్తరాలు - డైరీలు-పేపర్ కటింగ్సు మొదలగునవి.

ఇవీ హరిసర్వోత్తమరావుగారు ఆంధ్రదేశానికి యిచ్చిపోయిన సారస్వత సంపదలో మనకులభ్యమైనవి. వీటినెలా సద్వినియోగపరచుకోవాలో విజ్ఞులైన ఆంధ్రసోదరులు, సారస్వత సంస్థలు, విశ్వకళాపరిషత్తులు, ప్రభుత్వం ఆలోచించవలసి వుంది.

## తెలుగు భాషాసమితి

తెలుగుభాషలో విజ్ఞాన సర్వస్వ ప్రచురణకు ప్రథమంలో ప్రయత్నించినవారు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు. దీనిలో 'అ' నుండి 'అహి' వరకు అక్షరక్రమంలో గల పదాలకు సంబంధించిన వ్యాసములను వీరు ప్రచురించారు. సుమారు 1600 పుటలలో వెలువడిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమును బాగా పెంచి 2 సంపుటములుగా శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుగారు తిరిగి ముద్రించారు. ఈ ఆంధ్ర విజ్ఞానసర్వస్వము - మొదటి సంపుటములో శ్రీ హరిసర్వోత్తమరావుగారు 'అచ్చు' అను శీర్షిక క్రింద చక్కని వ్యాసం వ్రాశారు. దీనిలో వీరు అచ్చుపరిణామము,

లిథోపద్ధతి, బ్లాకులు చేయువిధము, టైపుల పోత యంత్రము లను గురించి, ప్రూఫులు దిద్దు పద్ధతి, ఫారములు కట్టుట, ఇంపోజింగు విధానములు, చిత్ర ముద్రణము, నానావర్ణ ముద్రణము, వివిధ ముద్రణయంత్రములు, లినోటైపు యంత్రములను గురించి, మనదేశమున ప్రారంభింపబడిన ముద్రాక్షరశాలలు, తెలుగులో మొదట ప్రచురింపబడిన పుస్తకములను గురించి విపులీకరించారు.

1946 సం॥లో కాంగ్రెస్ మంత్రివర్గము లేర్పడినప్పుడు, అప్పటి విద్యాశాఖామంత్రి శ్రీ అవినాశలింగం చెట్టియార్ ఆంధ్ర-తమిళ విజ్ఞాన సర్వస్వ ప్రచురణలకు కొంత ఆర్థికంగా తోడ్పాటు కలిగించారు. ఈ బృహత్తర కార్యక్రమనిర్వహణకు తెలుగు భాషా సమితి ఏర్పడినది. దీనికి బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షులుగాను, మోటూరి సత్యనారాయణగారు కార్యదర్శిగాను వున్నారు. హరిసర్వోత్తమరావుగారు కార్యనిర్వాహక సభ్యులలో నొకరు. I చరిత్ర - రాజనీతి II భౌతిక, రసాయనిక శాస్త్రములు అను రెండు సంపుటములకు రావుగారు సంపాదక మండలిలో సభ్యులుగా వున్నారు. వారుండగానే ఆ ప్రచురణలను చూచుకోగల్గారు. ఈ శాస్త్రీయ, రాజకీయ చారిత్రక విషయాలపై ప్రామాణిక గ్రంథములు లేని లోటును యివి కొంతవరకు తీర్చినవని చెప్పవచ్చు. రావుగారు కార్యనిర్వాహక సభ్యులుగా, వివిధ సంపుటములు ప్రచురించుట కవసరమైన బృహత్ప్రణాళికలను రూపొందించుటలో సహాయపడినారు.

1955 వ సం.లో హైదరాబాద్ కేంద్రంలో తెలుగుభాషా సమితి ఆఫీసును ప్రారంభించింది గాడిచర్లవారే. రాష్ట్రపతి



రాష్ట్రపతి రాజేంద్రప్రసాదుకు తెలుగు విజ్ఞాన సర్వస్వము
సంపుటముల బహూకరణము

[ పుట 155 ]

రాజేంద్రప్రసాద్‌కు, సమితి పక్షాన, అప్పట్లో తయారుచేసిన రెండు సంపుటాలను రావుగారే సమర్పించారు.

రాజనీతి సంపుటంకు హరిసర్వోత్తమరావుగారు 40 పేజీల సమగ్ర పీఠికను వ్రాశారు. అది రాజకీయ శాస్త్ర పరిజ్ఞానానికి ఎంతయో దోహదకారి. ఈ తెలుగు విజ్ఞాన సర్వస్వము సంపుటము లిప్పటికి 9 వరకు తయారైనవి. వీనిలో 3, 4 సంపుటములు తెలుగు సంస్కృతికి సంబంధించినవి. 5 వ సంపుటములో అర్ధ వాణిజ్య భూగోళశాస్త్రములున్నవి. 6 వ సంపుటము విశ్వ సాహితిని గురించినది. 7 వ సంపుటములో దర్శనములు, మతములనుగూర్చిన విషయములున్నవి. వ్యవసాయము, పశుపాలన, అటవీశాస్త్రములకు సంబంధించిన 8 వ సంపుటము, గణిత, ఖగోళ శాస్త్రములను గురించిన 9 వ సంపుటము అచ్చులోనున్నవి.

దీనికి పిమ్మట హైదరాబాదులోని సంగ్రహ ఆంధ్రవిజ్ఞాన కోశ సమితివారు తెలుగులో అకారాదిగ ఒక విజ్ఞాన సర్వస్వము ప్రచురణకు పూనుకొని యిప్పటికి 3 సంపుటములను వెలువరించినారు.

## వేసంగి పాఠశాలల నిర్వహణ

ఆంధ్రదేశంలో చైతన్యం గలిగించడానికి తోడ్పడిన సంస్థలలో వేసంగి పాఠశాలలను ప్రత్యేకంగా పేర్కొనవలసివుంది. అందు హరిసర్వోత్తమరావుగారి కృషి గణనీయమైనది. చాల వేసంగి పాఠశాలలను వీరు స్వయంగా నిర్వహించారు. కొన్నిటికి ప్రిన్సిపాల్‌గానున్నారు. మరికొన్నిటికి అధ్యాపకులుగా పనిచేశారు.

జాతీయోద్యమ కాలంలో, తెలుగుదేశంలో గ్రామ పునర్ని ర్మాణ ప్రాధాన్యతను ఆనాడే గుర్తించిన శనివారపు సుబ్బారావు, గరిమెళ్ళ సత్యనారాయణ, ముదిగంటి జగ్గన్నశాస్త్రి ప్రభృతులు 'పల్లెటూరు గ్రంథమండలి'ని, పత్రికను ఏర్పాటు చేశారు. ఆయా తాలూకాలలోని ఉపాధ్యాయులను రావించి, 1929 వ సంవత్సరంలో తాడేపల్లిగూడెంలోను, 1931 వ సంలో రాజమహేంద్రవరంలోను రెండు పాఠశాలలను నిర్వహించారు. ప్రత్యేకంగా పంచాయతీ అధ్యక్షులకు శిక్షణతరగతు లేర్పాటుచేశారు. ఆలమూరు కేంద్రంగా సహకార సూపర్‌వైజర్లకు, సహకార సంస్థల నిర్వాహకులకు తరిబీదు నిచ్చుటకు నరసింహదేవర సత్యనారాయణగారు కృషి చేశారు. గ్రంథాలయములు, వయోజన (సాంఘిక) విద్య, సహకార విధానాలు, ప్రజారోగ్య పద్ధతులు, ఆర్థిక రాజకీయ వైజ్ఞానిక విషయాలు బోధించుటకు పూనుకున్నారు. అనధికారంగా స్వల్ప వ్యయంతో జరిగిన పనులివి.

"నిడుబ్రోలు రామానీడు విద్యాలయం" రంగాగారి అధ్వ ర్యమున రైతాంగ కార్యకర్తలను తయారుచేసింది. కొత్తపట్నం, మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాలలు, సోషలిస్టు యువకులకు తరిబీదు నిచ్చుటకు పూనుకొన్నవి.

ఆనాటి ప్రభుత్వం ఈ వేసంగి విద్యాలయాలకు అనేక ఆటంకాలు కలిగించింది. తాడేపల్లిగూడెం గ్రామ పునర్నిర్మాణ తరగతులకు విరాళమిచ్చారని, తాడేపల్లిగూడెం తాలూకాబోర్డు అధ్యక్షునిపై సర్చార్జీ విధించింది. 1937-38 సంవత్సరాలలో జరిగిన కొత్తపట్నం రాజకీయపాఠశాలపై నిషేధం ప్రకటించింది. విద్యార్థులపై లాఠీచార్జీ ప్రయోగించి అరెస్టులు చేసింది. ఐనా

ఈ నిర్బంధాలు కార్యకర్తలను యింకా గట్టిపరచి కార్యోత్సాహు లను చేయడానికే వుపకరించినవి. ఇందు తరిబీదు అయిన విద్యా ర్థులు రాజకీయ నాయకులుగా, దేశారాధకులుగా పరిణతి బొం దుట జరిగింది.

ఆంధ్రదేశంలో గ్రంథాలయ, వయోజన విద్యా ప్రచారకు లను, రాత్రిపాఠశాలల అధ్యాపకులను తయారుచేసి, తరిబీదు నిచ్చుటలో హరిసర్వోత్తమరావుగారి కృషి చాలా ప్రశంసనీయ మైనది. అధ్యాపక చిత్త వృత్తి ఆయనగారిలో జీర్ణించిందన వచ్చు. చుట్టూ, విద్యార్థులను ఉపాధ్యాయులను చేరదీసుకొని వారి కనేక విషయాలు బోధించుటంలో అమితమైన ఆనందాన్నను భవించేవా రాయన. మద్రాసునగరంలో కార్మికులకు ఉన్నత విద్య నేర్పుటకు ప్రయత్నించారు. పంచాయతీ అధ్యక్షులకు, సహకార సంస్థల నిర్వాహకులకు, గ్రంథాలయ సేవకులకు శిక్షణ నిచ్చారు. రాజకీయ కార్యకర్తలకు వేసంగి రాజకీయ పాఠశాలలు నిర్వ హించారు. హరిసర్వోత్తమరావుగారే ఒక విద్యా సంస్థ. ఆంధ్ర దేశ వయోజన విద్యా పీఠమున కాయన అధిపతి.

## కాల్వబుగ్గ వేసంగి ఆర్థిక, రాజకీయ పాఠశాల

1939 మే 20 వ తేదీనుండి జూన్ నెల 20 వరకు మాసము దినములు కర్నూలు జిల్లా కాంగ్రెస్, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీల యాజమాన్యమున, 'కాల్వబుగ్గ' వద్ద ఈ వేసంగి రాజకీయ పాఠ శాల జరిగింది. ఆరోజుల్లో కర్నూలుజిల్లా కాంగ్రెస్ సంఘానికి దుబ్బా శేషిరెడ్డి అధ్యక్షులుగాను, టి. వి. నరసింహమూర్తి కార్య దర్శిగాను వుండేవారు. హరిసర్వోత్తమరావుగారు పాఠశాలకు

ప్రిన్సిపాలు రాయలసీమవారు 90 మందికి పైగా దరఖాస్తులు పంపినారుగాని, 64 మంది మాత్రమే సక్రమంగా, చివరిదాకా క్లాసులకు హాజరైనారు.

అధ్యాపకులుగా దేశపాండ్య సుబ్బారావు, సూరంపూడి శ్రీహరిరావు, వెన్నెలకంటి రాఘవయ్య, జొన్నలగడ్డ రామ లింగయ్య, విద్వాన్ విశ్వం, టి. నాగిరెడ్డి మొదలగువారు పని చేశారు. ఏ. బి. ఖర్డికర్ శాస్త్రీయసామ్యవాదము, చారిత్రక, భౌతిక శాస్త్రములనుగూర్చి ఉపన్యసించారు. అప్పటికే బెనారస్ విశ్వవిద్యాలయంనుండి వచ్చిన నాగిరెడ్డి, విశ్వంగార్లు మార్క్సి-జాన్ని వివరించారు. కమ్యూనిష్టు ప్రముఖులైన బుఖారి, కడేల్కర్ మొదలగువారుగూడా వచ్చారు. మద్రాసు వాస్త వ్యులు సామి వెంకటాచలం చెట్టి (కేంద్ర ఎం. ఎల్. ఏ), మద్రాసు కాంగ్రెస్‌పార్టీ సెక్రటరీ ఉక్కూరు సుబ్రహ్మణ్యం, మాగంటి బాపినీడుగార్లు పాఠశాలను సందర్శించి, కొన్ని క్లాసులు తీసుకొన్నారు.

ప్రిన్సిపాల్‌గా వున్న హరిసర్వోత్తమరావుగారు పాఠశాల క్రమశిక్షణా బాధ్యతను వహిస్తునే, అనేక అంశములమీద ప్రసం గించారు. (1) భారత రాజకీయోద్యమం 'నూతన రాజ్యాంగ సవరణలు, హైందవరాజ్యాంగ విధానం, కాన్‌స్టిట్యుయంట్ అసెంబ్లీ (2) రాయలసీమ చరిత్ర, పరిశ్రమలు, ప్రాజెక్టులు, క్షామ నివారణమార్గాలు, తుంగభద్ర ప్రాజెక్టు, కె. సి. కాల్వ స్కీములు, (3) స్వయం నిర్ణయసూత్రం (4) గాంధీ తత్వము-సంఘము- వ్యక్తి సంబంధాలు (5) పర్మనెంటు సెటిల్‌మెంటు

రైత్వారీ పద్ధతి, రీసెటిల్‌మెంటు, జమీందారీ రిపోర్టు, ప్రకాశం బిల్లు, అడవుల సమస్యలు, హరిజన సమస్య (6) ప్లానింగు—స్థానిక స్వరిపాలన, పంచాయతీలు (7) వార్తాపత్రికలు గ్రంథాలయములు గ్రామ పునర్నిర్మాణానికిచేయవలసిన కృషి, మున్నగునవి.

ఈ పాఠశాలలో విద్యార్థులకు చేతిపనులనుగూడా నేర్పటం ఒక విశేషం. ఇచ్చటి దేవాలయం తోట (Temple garden) లో చెట్లు అంటుగట్టు విధానం చూపారు. అప్పుడే శిక్షణబొందిన కోడి నరసింహం 'సబ్బుచేయు పద్ధతి' ప్రదర్శించారు. సమీపముననున్న 'కాల్వ' గ్రామమునకు అభ్యర్థులను తీసుకొనిపోయి, గ్రామీణ జీవిత వివరములు బోధపరచారు. విద్యార్థులు, టీచర్ల వుపయోగార్థం ముఖ్యమైన పుస్తకములు తెచ్చి 'ఒక రిఫరెన్సు గ్రంథాలయము' ను అక్కడే ఏర్పరచారు. రాత్రిళ్ళు గ్రూపుచర్చలు కొనసాగించేవారు. క్రమపద్ధతిని చర్చలు సాగుటకు ఉపాధ్యాయులు గూడా దగ్గరే వుండి తోడ్పడేవారు, వక్తృత్వ పోటీలు పెట్టేవారు. వార్తాపత్రికల పఠనం వుండేది. జాతీయగీతాలు పాడేవారు. ఈ ప్రదేశమే ఒక ప్రకృతి రామణీయ క్షేత్రము. ఇచ్చటి సుందరారామము స్ఫటికతేజోయుత జలములు, ప్రశాంత వాతావరణము హృదయానందకరంగా వుండేవి. రాత్రిళ్ళు మాజిక్ లాంతరు ప్రదర్శనలు విజ్ఞాన దాయకంగా వుండేవి.

ఈ వేసంగి పాఠశాలను గురించి రావుగారు వ్రాసుకున్న నివేదికలోని చివరిభాగం గమనించండి:

"తుదిమాటగా, విద్యార్థులను గురించి ప్రశంసింపక నేను ముగింపలేను. నెలదినములుగా తండ్రి కొమరులవలె నేనును, వారును

మెలగితిమి. కొన్నికొన్ని సందర్భములలో క్రమశిక్షణను దృష్టియం దుంచుకొని సహజముగా నేను కాఠిన్యము వహించవలసి వచ్చెను. కాని విద్యార్థులంతా నాయందు యెల్లప్పుడును ఎనలేని అనురాగమును జూపి, అతివిధేయులై ప్రవర్తించినారు.

బయటికిపోయి విస్తారతర ప్రపంచంలో పని చేయునపుడు వారు కాంగ్రెస్ జాతీయనాయకత్వము నెడలను, ఇట్టి విధేయతను జూపి, దేశస్వాతంత్ర్యమును సంపాదించుటకు, వారికి శక్తిసామర్థ్యములు సమకూరుగాకయని ఆశీర్వదించుచున్నాను. జయమగుగాక!

— గా. హరిసర్వోత్తమరావు 21-6-1939

రావుగారు క్లాసులు తీసుకొనుటకు తయారు చేసుకొన్న నోట్సు లెక్కల వివరాలు ఎన్నో యిప్పటికీ వున్నవి. నెలరోజుల పాటు జరిగిన ఈ వేసంగి పాఠశాల చక్కని ఫలితాన్నిచ్చింది. ఇచ్చట తయారయిన యువకులే, తర్వాత రాయలసీమ జిల్లాలలో రాజకీయ, సాంఘిక సేవకులై వివిధ ప్రజోద్యమాలలో హెచ్చుగా కృషి చేయుటకు పూనుకొన్నారు. కాంగ్రెస్- కమ్యూనిష్టు భేదాలేమీ పాటించక, సామరస్య పూర్వకంగా ఈ వేసంగి పాఠశాలను నిర్వహించడం జరిగింది. మొత్తంమీద యీ పాఠశాల రాయలసీమ జిల్లాల్లో విజ్ఞాన వ్యాప్తికిని రాజకీయ కార్యోత్సాహమును పెంపొందించుటకును చాలా తోడ్పడిందనవచ్చు. ముగింపు ఉత్సవమునకు మంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు విచ్చేసి స్నాతకోపన్యాసం యిచ్చారు.

దరిమిలా, నీలం సంజీవరెడ్డిగారు, హరిసర్వోత్తమరావు గారిని అనంతపురం జిల్లాలోగూడా అలాంటి పాఠశాలనొకదానిని జరపవలసిందిగా కోరి ఆహ్వానించారు.

## రాజకీయ పాఠశాల, హిందూపురం

5-5-1939 వ తేదీనుండి అనంతపురం జిల్లా యువ జనసంఘ యాజమాన్యమున, హిందూపురంలో మరొక పాఠశాల నడుపబడింది. హిందూస్థానీ సేవాదళ పద్ధతిపై యువజనులకు శిక్షణగూడా యివ్వబడింది. ఆచార్య రంగా, పి. సుందరయ్య గార్లతో పాటు హరిసర్వోత్తమరావుగారు వెళ్ళి పాఠాలు క్లాసులు తీసుకొన్నారు. 'ఆంధ్రప్రభ' అప్పటి సంపాదకులైన న్యాపతి నారాయణమూర్తిగారు ఈ తరగతులకు ప్రారంభోత్సవం గావించారు. పాఠశాలానంతరం జరిగిన జిల్లా యువజన మహాసభలో గూడా రావుగారు పాల్గొన్నారు.

## శ్రీ రాయల ఆయుర్వేద విద్యాలయం, మహానంది

హరిసర్వోత్తమరావుగారు శ్రీ రాయల ఆయుర్వేద విద్యాలయం పేరున మహానందీశ్వర దేవాలయంవద్ద, గురుకులవాస పద్ధతిలో, ఒక విద్యాలయం స్థాపించారు. దీనిలో ఆయుర్వేద మార్తాండ, భిషగ్వరాచాచార్య పండిత హెచ్. సుబ్బరాయశాస్త్రి ప్రధానోపాధ్యాయులుగా నియమింప బడినారు. వీరు వృక్షశాస్త్ర పరిశోధనావేత్తగూడా. విద్యాలయ పోషకవర్గంగా భైరవభట్ల మహానందయ్య, రాజా పెదసుబ్బరాయుడుశ్రేష్ఠి, కాసరబాద నరసింగరావు, కైప సుబ్రహ్మణ్యశర్మగార్లు వుండేవారు. 1944 వ సంవత్సరంలో 8 మందికి 'ఆయుర్వేదం'లో తరిబీదు యివ్వటం జరిగింది.

కమిటీవారి ఆశయం ఆంధ్రులకు కావలసిన వైద్యవిద్యను బోధించు కళాశాలను స్థాపించుటమాత్రమే కాదు. జ్ఞానోపార్జన

కనువగు శిక్షణతోపాటు - విద్యార్థులకు నిరాడంబర జీవనము, కాయకష్టము, ఓర్పు, నైతిక ఆధ్యాత్మిక శక్తులతో ధైర్య సాహసములతో తమజీవనము తాము నడుపుకొనుశక్తి గలిగి, గ్రామ పునర్నిర్మాణోద్యమములో జాతీయ సేవకులుగా నుండు నట్లు తరిబీదు యిచ్చుట ముఖ్యోద్దేశముగా వారు పేర్కొన్నారు

ఇలా ఉత్తమ ఆశయములతో స్థాపించబడిన ఈ విద్యాలయం - ధనాభావంవల్ల కొన్నాళ్లకు ఆపివేయవలసిన పరిస్థితు లేర్పడినవి. ప్రారంభంలో నంద్యాల వాస్తవ్యులైన డాక్టరు కైప సుబ్రహ్మణ్యశర్మ, వైద్య విశారద ఆర్. విశ్వం (తిమ్మనచర్ల) గార్లు నెలకొక రు 60 లు ఖర్చులు భరిస్తూవుండేవారు.

## రామానీడు విద్యాలయం, నిడుబ్రోలు

నిడుబ్రోలులో 'రామానీడు విద్యాలయం' రంగాగారి ఆచార్యత్వం క్రింద స్థాపించబడింది. ఆంధ్ర - తెలంగాణములలో నేడు రంగాగారి అనుయాయులుగా నున్నవారందరూ, ఎప్పుడో ఒకప్పుడు ఈ విద్యాలయంలో శిక్షణబొందినవారే, భారతీదేవి, రంగాగార్ల ఆతిథ్యం స్వీకరించినవారే. హరిసర్వోత్తమరావు గారితో రంగాగారిమైత్రి చిరకాలమైనది, రంగాగారు లండన్ నుంచి తిరిగివచ్చి, పచ్చయప్ప కళాశాలలో ప్రొఫెసరుగా చేరి నప్పటినుండి యిరువురిమధ్య స్నేహసుహృద్భావాలు పెంపొందు తునే వున్నవి. వీరుభయులు కలసి వయోజనవిద్యా కార్యక్రమాల్లో పాల్గొన్నారు. రాయలసీమలో రీసెటిల్‌మెంటుకు వ్యతిరేకంగాను, క్షామనివారణ కార్యకలాపాల్లోను కృషిచేశారు. ఏటేటా

రామానీడు విద్యాలయమునకు హరిసర్వోత్తమరావుగారు వెళ్ళి వివిధాంశములపై ఉపన్యసించేవారు.

## తెలంగాణాలో వయోజనవిద్యా శిక్షణశిబిరాలు

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ పక్షమున, వయోజనవిద్యా శిక్షణ శిబిరాలు, నల్లగొండజిల్లా కోదాడులో ఒకటి, ఆంధ్ర సారస్వత పరిషత్తువారి సహకారంతో హైదరాబాద్‌లో ఒకటి తెలంగాణాలో నిర్వహించ బడినవి.

1950 జూన్ 25-30 తేదీలలో హైదరాబాదులోని ఆంధ్ర సారస్వత పరిషత్తు' వారేర్పాటు చేసిన శిబిరానికి తెలంగాణాలోని వివిధ ప్రాంతాలనుండి 100 మంది విద్యార్థులు హాజరైనారు. హరిసర్వోత్తమరావుగారు, పాతూరి నాగభూషణం, కె. జె. జి. సుందరంగార్లతోవెళ్ళి బోధనా కార్యక్రమ బాధ్యత తీసుకొన్నారు. ఫలితంగా ఇచ్చట శిక్షణబొందిన వారనేకులు తర్వాత తెలంగాణాలో సారస్వత భాషాసేవ జేయుటకు ముందుకు వచ్చారు.

ఆ సందర్భంలోనే రావుగారు గౌలిగూడలోని బాలసరస్వతీ ఆంధ్ర భాషానిలయంలో వయోజనవిద్యాకేంద్ర ప్రారంభోత్సవం గావించారు. నారాయణగూడ గరల్సుహైస్కూలు ప్రారంభోత్సవం చేశారు. ఈ విధంగా తెలంగాణాలోని విద్యా సంస్థలతోటి రావుగారికి సాన్నిహిత్య మేర్పడింది.

## నిర్మాణ కార్యకర్తల శిబిరాలు

1952 నాటికి హైదరాబాద్ స్టేటులో, పోలీస్ యాక్షన్ తదుపరి, బూర్గుల రామకృష్ణరావుగారి ముఖ్యమంత్రిత్వమున

కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. నల్లగొండ జిల్లాకు సారస్వతాభిమానులైన పర్సా వెంకటేశ్వరరావుగారు జిల్లాకలెక్టరుగా వుండేవారు. వీరి ప్రోత్సాహంతో, భారత సాంఘిక సంక్షేమసభ – నల్లగొండశాఖ పక్షమున, బాపూజీ నిర్మాణ కార్యక్రమ సూత్రములను వ్యాప్తిచేయుట కుద్దేశించిన వుత్సాహ పరులకు శిక్షణయిచ్చుటకుగాను, పక్షంరోజులు 1952 లో నల్లగొండలో ఒక శిబిరం ఏర్పాటు చేయబడింది.

ఈ శిక్షణ శిబిరం హరిసర్వోత్తమరావుగారి ఆచార్యత్వమున జరిగింది. యన్. శ్రీ కంఠమ్, పాతూరి నాగభూషణం, కె. జె. జి. సుందరం, డాక్టరు కిషన్‌రావుగార్లు అధ్యాపకులుగా వుండినారు. ఈ శిక్షణకేంద్రమునకు వయోజనవిద్యా నిపుణులైన డాక్టరు లాబక్ విచ్చేశారు.

ప్రతిదినం సాయంత్రం ప్రముఖులచే బహిరంగోపన్యాసాలివ్వబడినవి. సాహిత్యసమావేశములకు కొప్పరపు కవులు దయచేశారు. పంచాయతీలు, సహకారం, గ్రంథాలయాలు, సాంఘికసేవ మొదలగు వాటితోపాటు భారత రాజ్యాంగం, వైద్యం, విద్య, కుటీరపరిశ్రమలు మున్నగు వివిధ విషయాలెన్నో వివరించబడినవి. సమాచారశాఖ ఫిలిం ప్రదర్శనాలు ఏర్పాటు చేసింది.

గ్రామ పునర్నిర్మాణమును గురించి మంచి పరిజ్ఞానం గల్గించుటకీ శిక్షణ శిబిరం తోడ్పడింది. ప్రజలలో విజ్ఞాన వ్యాప్తికి గూడా దోహద మిచ్చింది.

1945 మార్చి-ఏప్రిల్, జూలై నెలలలో గుంటూరుజిల్లా వినయాశ్రమంలో జరిగిన నిర్మాణ కార్యక్రమ బోధనా తరగతు

లలోను, సెప్టెంబరు నెలలో నిజాంరాష్ట్రాంధ్ర మహాసభవారు నిర్వహించిన నిర్మాణ కార్యక్రమ శిక్షణ శిబిరంలోను, అక్టోబరు నెలలో గుంటూరుజిల్లా చేబ్రోలులోనడచిన ఆంధ్రరాష్ట్ర మహిళా శిక్షణ శిబిరంలోను, అక్టోబరు-నవంబరు నెలలలో మదరాసులో జరిగిన ఆంధ్రరాష్ట్ర మహిళా కాంగ్రెసు శిక్షణ శిబిరంలోను, నవంబరులో గుంటూరుజిల్లా మంగళగిరిలో యేర్పాటైన చెన్న రాష్ట్ర చేనేత పారిశ్రామికుల శిక్షణశిబిరంలోను, వీరధ్యాపకులుగ నుండి నిర్మాణ కార్యక్రమం, ఆర్థిక, సాంఘిక, రాజకీయ విష యాలను విద్యార్థులకు బోధించినారు.

## గ్రామపంచాయతీ పాలన - శిక్షణ తరగతులు

శ్రీ తత్వానంద శిల్పాశ్రమం - మంగళగిరివద్ద "గ్రామ పంచాయతీ పరిపాలన"లో వారంరోజులపాటు 1955 మేలో హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను శిక్షణశిబిరం నిర్వహింప బడింది. స్థానిక స్వపరిపాలన శాఖామాత్యులు డాక్టరు బి. నాగేశ్వరరావుగారు దీనిని ప్రారంభించారు. చిట్టావూరు నాగభూ షణాచార్యులుగారు (పంచాయతీ ఆఫీసరు) కొన్నిక్లాసులను తీసు కొన్నారు. నాగభూషణాచార్యులుగారు హరిసర్వోత్తమరావుగారి యెడల గురుభావం కలిగినవారు. వీరున్నచోట్లల్లా గ్రంథాలయాభి వృద్ధికై కృషిచేశారు. గ్రంథాలయయాత్రలు సాగించి జీర్ణగ్రంథా లయాలను పునరుద్ధరింప జేశారు. ఆదివాసీ ప్రాంతాల్లో ప్రజల కష్టనిష్ఠూరాలను స్వయంగా గమనించి, ఒక గ్రంథం వ్రాశారు. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరుగా పనిచేసి యిటీవలనే పదవీ విరమణ చేసి పంచాయతీరాజ్యం పత్రిక సంపాదకత్వం వహించి

నారు. అధ్యక్షులకు పంచాయతీ చట్టమును గూర్చి, గ్రామాభ్యుద యానికి చేయవలసిన విధులను గురించి ఈ తరగతులలో శిక్షణ యివ్వబడింది. ఈ శిబిరమునకు మేనేజరుగా నున్న కోటవేంక టేశ్వర్లుగారి సంపాదకత్వమున "పంచాయతీరాజ్యం" పత్రిక గూడా నిర్వహింప బడుతూ వుండేది.

## ప్రభుత్వ వయోజన విద్యా బోధక శిక్షణాలయాలు

1949 లో మదరాసు ప్రభుత్వం వయోజనవిద్యా బోధ కుల శిక్షణ కార్యక్రమాన్ని చేపట్టింది. అంతకు ముందే మద రాసు ప్రభుత్వం హరిసర్వోత్తమరావుగారిని ఆంధ్ర ప్రాంతానికి వయోజనవిద్యా గౌరవ డైరెక్టరుగ యేర్పాటు చేసింది. వీరి సంప్రతింపులతో శిక్షణ ప్రణాళిక రూపొంది అమలులోకివచ్చింది. ఆంధ్ర ప్రాంతానికి మొదటి శిక్షణాలయం 1949 అక్టోబరులో పటమటలంకలోని శ్రీ సర్వోత్తమభవనంలో ప్రారంభమయింది. తర్వాత యిది వేటపాలెం, అనకాపల్లి, అనపర్తి మొదలైన తావులలో నడిచింది. రాయలసీమజిల్లాలకు చిత్తూరుజిల్లా మంగా పురంలో మరొక కేంద్రం ప్రారంభింపబడింది. ఇదికూడ ఒకటి రెండు తావులకు బదిలీ అయింది. ఈ కేంద్రాలన్నీ హరిసర్వో త్తమరావుగారి ప్రత్యక్ష పర్యవేక్షణక్రింద నడిచేవి. వీరు ప్రతి కేం ద్రంలోను కొంతకాలముండి ముఖ్యమైన పాఠాలను చెపుతూవుండే వారు. వీరిమూర్తి, బోధ అభ్యర్థుల నెంతగానో ఆకర్షిస్తూ వుండేవి. ఏటేటా వందలకొలది వయోజనవిద్యా బోధకులు వీరి ద్వారా శిక్షణ, ఉత్తేజంపొంది తమ తమ ప్రాంతాలలో వయో జనవిద్యా బోధకు పూనుకొన్నారు.



ప్రభుత్వ వయోజన విద్యాశిక్షణ కేంద్రం, మంగాపురం, చిత్తూరు జిల్లా

[ పుట 167 ]

ఈ స్కూళ్లలోని సిలబస్‌ను పరిశీలిస్తే ఎంతటి విషయ పరిజ్ఞానం గలిగించారో స్పష్టపడుతుంది భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, మహాపురుషుల జీవిత చరిత్రలు, ప్రపంచస్వరూపం, చరిత్ర, రాజకీయార్థిక శాస్త్రములు, ఆరోగ్యసూత్రాలు - శాసనాలు, గ్రంథాలయాలు, సహకార సంఘాలు, గ్రామపంచాయతీ సంస్థల నిర్వహణ, వ్యవసాయ పశువైద్య శాస్త్రములు, గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలోని ముఖ్యాంశములు వివరించేవారు. మ్యాజిక్‌లాంతరు ప్రదర్శన లుండేవి. మ్యాపులు, గ్లోబులు, ఛార్టుల సహాయంతో పాఠాలు చెప్పేవారు. ఇందు తరిబీదు పొందినవారే రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో రాత్రి పాఠశాలలుపెట్టి, వయోజనులకు విద్య గరిపేవారు.

## కాంగ్రెస్ పాఠశాల బారువ

1949 ఫిబ్రవరిలో ప్రారంభించి, పక్షంరోజులు జాతీయ కూలీ కాంగ్రెస్ యాజమాన్యమున, ఉత్తర విశాఖజిల్లా బారువలో రాజకీయ పాఠశాల నేర్పాటు చేశారు. ఈ శిబిర నిర్వాహకులు కొత్తపల్లి పున్నయ్యగారు. హరిసర్వోత్తమరావుగారు ఈపాఠశాల ప్రారంభోత్సవం చేయడమేగాక, కాంగ్రెస్ సేవకులకు రాజకీయ, స్వాతంత్ర్యోద్యమాలనుగూర్చి పాఠాలు చెప్పారు.

## కార్మికోన్నత రాత్రి పాఠశాల
## (Nighr High school for Workmen)

మద్రాసు నగరంలోని పెరంబూరులో కార్మికజనుల సౌకర్యార్థం "రాత్రి హైస్కూలు" ఒకటి స్థాపించారు. హరిసర్వోత్తమరావుగారీ స్కూలుకు ప్రిన్సిపాలుగా వుండేవారు.

డెన్మార్కు దేశంలో ప్రజానీకపు పాఠశాలలు (Folk Schools)ఇంగ్లండులో కార్మిక కళాశాలలు (Workmen colleges) పెట్టి వివిధ వృత్తులలోనున్న వయోజనులైన కార్మికులకు ఉన్నతవిద్య నేర్పేవారట. అలానే బొంబాయి నగరంలో గూడా రాత్రి హైస్కూళ్ళు నిర్వహింప బడుతుండేవి. బొంబాయిలో వాటిని చూచినప్పుడీ అభిప్రాయం గలిగింది రావుగారికి. వాటి ప్రయోజనాన్ని గుర్తించిన రావుగారు, తన మిత్రులను ప్రోత్సాహపరచి మద్రాసులోగూడా ఈ ప్రయత్నం చేశారు. పోలీసు, పోస్టలు మొదలగు చిన్న ఉద్యోగాలలో నున్నవారికి, ఫ్యాక్టరీలలో పనిచేయు కార్మికులకు రాత్రిళ్ళు చదువుకొనే అవకాశం గలిగించ నుద్దేశించారు.

ఒకటవ ఫారమునుండి స్కూలుఫైనలు వరకు క్లాసులు నడిపేవారు. ఇంగ్లీషు మీడియంగా వుండేది. 2 వ భాషగా తెలుగు, తమిళం, మళయాళం బోధించేవారు. స్కూలుఫీజుగూడా చాలా తక్కువగా వుండేది.

ఒకటవ ఫారమునుండి 3 వ ఫారమువరకు నెలకొక రూపాయి వంతున, 3, 4, 5 ఫారములకు నెలకు 2 రూపాయల వంతున, 6 వ ఫారమునకు (మెట్రిక్యులేషన్) నెలకు 3 రూపాయల వంతున స్కూలు జీతం నిర్ణయించారు. రావుగారు స్కూలు నిర్వహణకు అదనంగా దాతలనుండి విరాళములు వసూలు చేశారు. సేవాదృష్టి గలిగి బోధనాపద్ధతులలో శిక్షణ పొందిన అధ్యాపక బృందాన్ని సమకూర్చుకొన్నారు. కొందరు ఉచితంగా వచ్చి క్లాసులు తీసుకొనేవారు. ఈ విధంగా మొదటి

2 టరములు మంచి ఫలితాలు వచ్చినవనీ, పలువురు కార్మికు స్కూలుఫైనలు పరీక్షలకు కూర్చొని ఉత్తీర్ణులైనారని వారి నివే దికనుబట్టి తెలుస్తున్నది.

శ్రీ హరిసర్వోత్తమరావుగారు బోధకులుగానున్న వందలాది శిక్షణ శిబిరాలను పూర్తిగా పేర్కొనడం సాధ్యమైన పని గాదు. ఆంధ్రదేశంతోపాటు భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో నిర్వహింప బడిన యెన్నో శిక్షణశిబిరాలలోని అభ్యర్థులకు వారు వయోజనవిద్యకు, నిర్మాణకార్య క్రమానికి సంబంధించిన వివిధాంశాలను బోధించినారు. 1943 ఆగస్టులో దక్షిణభారత వయోజన విద్యా సంఘమువారి యాజమాన్యమున మదరాసులో నడచిన శిబిరంలో వయోజనవిద్యా బోధకులకు, 1943 మే- జూన్ నెలలలో తిరునల్వేలి జిల్లా మంగళగిరిలో జరిగిన గ్రామ పునర్నిర్మాణ కేంద్రం వారి వేసంగి పాఠశాల విద్యార్థులకు పాఠములు చెప్పుటయేగాక 1945 ఫిబ్రవరి నెలలో బొంబాయిలోని పరేల్ నందలి వయోజన విద్యా సంఘమువారు నడిపే పాఠశాలలోను, 1944 ఆగష్టులో బెజవాడలో కూడిన యువజన, మహిళా సంఘసేవకుల సమావేశంలోను వయోజన విద్యాబోధన క్రమాన్ని వివరించారు. ఎవ్వరు పిలచినా కాదనక వెళ్ళి వారి కోరికప్రకారం పాఠములు చెప్పిరావడం వీరికి పరిపాటి. వయోజన విద్య పట్ల వారికిగల గాఢమైన అభిమానం, దీని ప్రచారకులకు వారు 5 నెలల దీర్ఘకాల శిక్షణ ప్రణాళికను

స్వయంగా రచించి నిర్వహించుటకు పురికొల్పింది. తమిళ ప్రాంతంలో ఒకటి, తెలుగుప్రాంతంలో ఒకటి శిక్షణాలయాలను స్థాపించుటకు వారు పూను కొన్నారు. ఈ విషయమై పత్రికలలో ప్రకటన చేయగా ఆంధ్ర దేశమునుండి 40 మంది స్త్రీ పురుషులు దరఖాస్తులు సహితం పంపినారు. అయితే అనుకూలాలు కుదరక వారి యీ సంకల్పం నెరవేరలేదు.

# ౪

# ఆంధ్రోద్యమం

బెంగాలు విభజన, దీనిరద్దు–భాషాధారక రాష్ట్రముల యేర్పాటు – కాంగ్రెసు మహాసభవారు 1917 లో ఆంధ్రరాష్ట్ర మేర్పడవలెనని తీర్మానించుట – ఆంధ్ర మహాసభ బళ్ళారి సమావేశము – రావుగారు అంతకుముందు దీనికి వర్కింగు ప్రెసిడెంటుగానుండి 1951 లో గుంటూరులో జరిగిన ఆంధ్ర మహాసభ కధ్యక్షులుగ ఎన్నుకోబడుట–1937 లో మదరాసు శాసనసభలో ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర తీర్మానము చేయబడుట – రాయలసీమ నాయకులలో భేదాభిప్రాయాలు – ప్రొద్దుటూరులో రాయలసీమ మహాసభకు రావుగారి అధ్యక్షత – శ్రీ బాగ్ ఒడంబడిక – రాష్ట్రేతరాంధ్ర ప్రాంతాలలో పర్యటనలు – జె. వి. పి. రిపోర్టు – ఢిల్లీకి రాయబారం– రాష్ట్రసాధనకు స్వామి సీతారాం సత్యాగ్రహం – పొట్టి శ్రీరాములు పూర్ణాహుతి – ఆంధ్రరాష్ట్ర నిర్మాణం – ఆంధ్ర ప్రదేశ్ అవతరణ – సరిహద్దు సమస్యలు – ఆంధ్ర మహాసభ భవిష్యత్తు.

## ౪

# ఆంధ్ర మహాసభ నాయకుడు

"వందేమాతరం ఉద్యమమూలంగా ఆంధ్ర దేశంలో యువక హృదయ ముప్పొంగి, పల్లెపల్లెలలోను గ్రంథాలయములు పెట్టుటకు, పత్రికలు చదివి వినిపించుటకు, హరికథలు చెప్పుట, ఉపన్యాసము లిచ్చుట, యితర కార్యకలాపములు జరుపుటకు శ్రద్ధతో కృషి చేయుటచేతనే తిలక్ హోంరూలు, గాంధీజీ సహాయ నిరాకరణోద్యమాలకు తెలుగు దేశాన్ని సంసిద్ధం చేయగల్గినవి.

ఈ యువక హృదయాలే పొంగిపొరలి ప్రజల భాషలో సర్వ వ్యవహారములు సాధించవలెనను ఆకాంక్షతో, భాషాధారక' రాష్ట్రోద్యమమును విజృంభింప జేసినవి."

—హరిసర్వోత్తమరావుగారి వ్యాసభాగం : 'మాడపాటి హనుమంతరావుగారి షష్టిపూర్తి సంచిక' నుండి

ఈ శతాబ్దారంభంలో జరిగిన 'వందేమాతరం' ఉద్యమ ఫలితంగా 1911 లో బెంగాలు విభజన రద్దుచేయబడింది. అప్పటి వైస్రాయి హార్డింజి ప్రభువు బెంగాలు విభజనను రద్దుచేస్తూ ఒక ప్రకటన చేశాడు. ఒక భాష మాట్లాడే ప్రజలు ఒకే రాష్ట్రంలో వుండటం అవసరమని ప్రభుత్వం గుర్తించక తప్పలేదు.

"ఒక భాషయు, ఒక చరిత్రయును, ఒకే సంస్కృతిగల జనులు ఏకముగ నొక్క రాష్ట్రమున, నొక్క పరిపాలనలో నుండుటయే ధర్మము. అట్టి ఐక్యము జాతియొక్క సర్వతోముఖాభివృద్ధికి దోహద మిచ్చును."

—'హార్డింజి ప్రభువు ప్రకటన' నుండి

ఇది భాషాధారక రాష్ట్రంకోరే వారిలో ఉత్సాహాతిశయాలు రేకెత్తించినది. కాని బ్రిటిష్ రాజ్యాధిపతులు, 'కలగాపులగపు' రాష్ట్రాలనే అట్టిపెట్టి వుంచారు. బెంగాలు విభజనానంతరం, భాషారాష్ట్రాల నిర్మాణానికి బీజంవేసిన వారిలో ఆంధ్రులు అగ్ర గణ్యులు.

ఆంధ్ర రాష్ట్రావశ్యకతను కోరుతూ గుంటూరు నుండి ఆంగ్లంలో నడుపబడుచున్న 'ఆంధ్ర' వారపత్రికలో జొన్న విత్తుల శేషగిరిరావు, చట్టి నరసింహారావుగార్లు వ్యాసాలు వ్రాశారు. ఈ భాషాధారక సిద్ధాంతమును 'మోడరన్ రెవ్యూ', పంజాబు, మహారాష్ట్ర పత్రికలు బలపరిచినవి.

ప్రథమాంధ్ర మహాసభ గుంటూరుజిల్లా బాపట్లలో 1913 మే మాసంలో రావుబహద్దూర్ బయ్యా నరసింహేశ్వరశర్మ అధ్యక్షతను జరిగింది కొండా వెంకటప్పయ్యగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా వుండి సభను దిగ్విజయంగా నిర్వహించారు. ఈ విధంగా ఆంధ్రోద్యమానికి ఆంధ్రమహాసభ అంకురార్పణ చేసింది. తరావి ఏటేటా మహాసభలు జరిగినవి. రాష్ట్ర వాంఛను పునరుద్ఘాటిస్తూ వచ్చారు. స్వరాజ్యంతోపాటు - స్వరాష్ట్ర వాంఛగూడా పెరుగుతూ వచ్చింది.

అప్పటివరకు కాంగ్రెస్ సంఘాలు గూడా బ్రిటిష్ ప్రభు త్వం నిర్మించిన రాష్ట్రాలను పోలియుండేవి. మద్రాసు ప్రాంతా

న్నుండి విడగొట్టి ప్రత్యేక రాష్ట్ర కాంగ్రెస్ సంఘమును ఆంధ్రులు ఏర్పాటు చేసుకోగలిగారు. భాషారాష్ట్ర ప్రాతిపదికను, రాష్ట్ర కాంగ్రెస్ సంఘాల నిర్మాణాన్ని జాతీయ కాంగ్రెస్ ఆమోదించి, దేశంలో అమలు జరిపింది. ఈ విధంగా పదేండ్లలో భాషారాష్ట్ర సిద్ధాంతం భారతజాతీయ జీవనంలో ముఖ్యాంశమైనది.

"కాంగ్రెస్ మహాసభవారు తమకార్యములకు గాను ఆంధ్రరాష్ట్ర మేర్పడ వలెనను తీర్మానమును 1917 లో నంగీకరించిరి. తరువాత గాని ఇతర భాషాధారక కాంగ్రెస్ రాష్ట్రము లంగీకృతము కాలేదు. 1918 లో సింధురాష్ట్రము నంగీకరించిరి. భాషాధారక రాష్ట్ర విభజనము కాంగ్రెస్ లో 1920 లో అంగీకరించి 21 రాష్ట్రములుగా దేశమును విభజించిరి."

"…. దీనికి విత్తనము వేసినవాడు దూరదృష్టితో ఆంధ్ర కాంగ్రెస్ రాష్ట్రోద్యమమును బలపరచిన లోకమాన్యుడు తిలక్. దేశభాషలో వ్యవహారము నడిస్తేనేగాని ప్రజల అధికారము ప్రజలకు రాదని, ఆ మహారాష్ట్ర కేసరి ఆనీబిసెంటమ్మ వాదబలమున కెదురు నిలిచి, ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రుడైనాడు."

18 - 12 - 1938 లో ప్రొద్దుటూరులో జరిగిన రావుగారి
రాయలసీమ మహాసభాధ్యక్షోపన్యాసం నుండి

ఆంధ్రోద్యమంలో కేవలం రాజకీయ వేత్తలేగాక, జమీందార్లు, విద్యావంతులు, మేధావులు, వణిక్ ప్రముఖులు అనేక మంది అనేక విధాలుగా పాల్గొని రాష్ట్రోద్యమానికి తోడ్పడినారు. న్యాపతి సుబ్బారావు, కొండా వెంకటప్పయ్య, డాక్టరు పట్టాభి సీతారామయ్య గార్లవంటి మూల పురుషుల్లో హరిసర్వోత్తమరావుగా రొకరు. 1919 లో 7 వ ఆంధ్ర మహాసభకు రావు

గారు అనంతపురంలో అధ్యక్షత వహించారు. 8 వ మహాసభను 'మహానంది' క్షేత్రంలో విజయవంతంగా జరిపించారు.

ఆంధ్ర మహాసభలలో బళ్ళారి సభ ఒక మైలురాయి. దీనికి సర్ విజయాగారు అధ్యక్షులు. కార్యనిర్వాహక సభ్యులను అధ్యక్షులు నియమించాలా ? లేక కార్యవర్గం ఎన్నుకోవాలా ? అనేది ఆనాడు పెద్ద చర్చ నీయాంశమైనది. చివరకు అధ్యక్షునికే అధికారమిచ్చుటకు సభికులు అంగీకరించారు. ఆ సభలో హరిసర్వోత్తమరావుగారు ప్రధాన కార్యదర్శి అయినారు. 1947 లో మద్రాసులో జరిగిన మహాసభకు ఉయ్యూరు కుమార రాజా శ్రీ మేకా రంగయ్యప్పారావుగారు అధ్యక్షులు. 1950వరకు రావుగారు ఆంధ్ర మహాసభకు వర్కింగు ప్రెసిడెంటుగా వుండి కార్యభారం వహించారు. 1951 లో గుంటూరులో జరిగిన ఆంధ్ర మహాసభకు హరిసర్వోత్తమరావుగారు అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. తదాదిరాష్ట్రం వచ్చేవరకు నిరంతరం కృషి చేశారు.

స్వరాష్ట్రంకోసం ఎందరో మహనీయులు త్యాగాలు చేశారు. స్వామిసీతారాం బోటివారు నిరశన వ్రతం సాగించారు. ఆంధ్ర దేశంలోని భిన్న రాజకీయ పక్షాలు, వ్యక్తులు అనేక రీతుల ప్రయత్నం చేశారు. మారుమూలలకు కూడ ఆంధ్ర రాష్ట్ర నినాదం వ్యాపించి, క్రమేణా వేరూనింది. తుదకు అమర జీవి పొట్టి శ్రీరాములుగారి పూర్ణాహుతితోగాని,రాష్ట్రంసిద్ధించలేదు.

ఇక్కడ నలుబదేండ్ల ఆంధ్ర రాష్ట్రోద్యమాన్ని సమీక్షించుట సాధ్యంకాని పని. వివిధ దశలలో హరిసర్వోత్తమరావుగారు నిర్వర్తించిన కృషిని సంక్షిప్తంగా వివరించడమేముఖ్యం.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆంధ్ర దేశానికి అన్యాయం జరుగుతున్నదనే అసంతృప్తి ఎక్కువగా వుండేది. ప్రాజెక్టుల నిర్మాణంలో, పరిశ్రమల స్థాపనలో. వైద్య విద్యా విషయాలలో, ఆంధ్ర దేశానికి కేటాయించిన డబ్బు చాలా తక్కువగావుండేది. బ్రిటిష్ పరిపాలనలో మన పురోభివృద్ధికి కృషిజరుగలేదు. అందు వలన తరచు కరువుకాటకాలకు, నిరుద్యోగాలకు దేశం గురియవు తుండేది. పరప్రభుత్వ కాలములో ప్రత్యేక రాష్ట్రం ఏర్పడ లేదంటే ఎవరికీ ఆశ్చర్యంలేదు. రావుగారు తన ఉపన్యాసంలో ఇలా అన్నారు:

"బ్రిటిష్ ప్రభుత్వము అధికారమందున్నప్పుడు వారి నాశ్ర యించి ఆంధ్రరాష్ట్రము సంపాదించుట మనకుసాధ్యంకాలేదు.పర్లాకిమిడి రాజాగారివలె అధికారుల వెంటబడి ఒరిస్సా రాష్ట్రాన్ని వారు సాధించి నట్లు మనరాష్ట్రాన్ని సాధించుకొని వచ్చుటకు పూనినవారు మనలో లేరు. దేశశ్రేయమే ప్రధానమని మన మాసమస్యలను అప్రధానముగా పరిగణించితిమి. ఒకవేళ ఒరిస్సావంటి రాష్ట్రాన్ని ఆంధ్రులు అప్ప టిలో సాధించినా, దేశస్వాతంత్ర్య మేర్పడేవరకు అది నేతిబీరకాయ వంటిదేయని నాబోటివారి మతము. అందువలన బ్రిటిష్ యుగములో 'ఆంధ్రరాష్ట్రం' మనకు ఏర్పడ లేదంటే విస్మయము కలుగలేదు."

బ్రిటిష్ రాజ్యము నడిచినన్నిదినాలు, ఆ రాజ్యనిర్వాహ కులు మన ప్రజలలో ఒక భాగాన్ని ఇంకొక భాగంమీద ఉసి గొల్పి, పరస్పర వైషమ్యాలచేత తాము స్థిరపడే ప్రయత్నంలో వుండేవారు, ఈ కారణం చేత అరవలు – తెలుగువారికి మధ్య, ఉత్తర సర్కారులు – రాయలసీమవారిమధ్య వైమనస్యాలు రేకెత్తించారు. మనలోగూడ జాతివైషమ్యాలు కుల, మత

తత్వాలు ప్రేరేపించేవారు కొందరు బయలుదేరారు. రాయల సీమలో ఈ సంకుచిత ధోరణుల నరికట్టి భాషాప్రయుక్త రాష్ట్ర విశిష్టతను చాటుటకు రావుగారు పూనుకొన్నారు. ఐకమత్యానికై కృషి చేశారు.

1937 లో కాంగ్రెస్ మంత్రిపదవులను స్వీకరించిన తర్వాత ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర తీర్మానమును శాసనసభలో అంగీక రించారు. కాని దాని నమలుజరుపులోగానే ద్వితీయప్రపంచ సంగ్రా మంవలన, వారు రాజీనామాలిచ్చి వెలుపలకు రావలసివచ్చింది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం విషయంలో రాయలసీమ వాసుల్లో భేదాభిప్రాయా లుత్పన్నమైనవి. 'రాయలసీమ సమావేశము' పేరుతో ఆంధ్రరాష్ట్రానికి వ్యతిరేక ప్రచారం కొందరు చేసేవారు, రాయలసీమ వారికి మద్రాసు నగరంతోనున్న రాకపోకల సంబంధాలను, విద్యా విషయిక సమస్యలను సాకుగా తీసికొని కొందరు స్వార్ధపరులగు నాయకులు రాష్ట్రవాంఛకు అపశ్రుతులు పాడ సాగారు. కాని హరిసర్వోత్తమరావుగారు, కల్లూరి సుబ్బ రావు గారు, కడప కోటిరెడ్డిగారు పప్పూరి రామాచార్యులుగారు మున్నగు ప్రముఖులతో కలిసి రాష్ట్రోద్యమాన్ని రాయలసీమలో వ్యాపింపజేశారు. ఆదవానిలో, రాష్ట్రానికి వ్యతిరేకించే వారు సభ జరిపితే, ప్రొద్దుటూరులో, ప్రత్యేకాంధ్ర రాష్ట్రమును కోరే వారు మరొక రాయలసీమ సమావేశమును ఏర్పాటు చేశారు. 1937 లో జరిగిన "శ్రీ బాగ్ ఒడంబడిక" రాయలసీమ వాసుల అనుమానాలను పోగొట్టి, ఆంధ్ర రాష్ట్రం యెడల వారిని సుము ఖులుగా చేసుకొనుటకు కొంత తోడ్పడింది.

18-12-1938 వ తేదీన జరిగిన ప్రొద్దుటూరు రాయల సీమ మహాసభకు హరిసర్వోత్తమరావుగా రధ్యక్షత వహించారు. 'తుంగభద్రా ప్రాజెక్టు, పరిశ్రమల అభివృద్ధి అయ్యేదాకా ఆంధ్ర రాష్ట్రిం వద్దు' అనే వాదనలకు సవిమర్శకంగా సమాధానా లిచ్చి, రాష్ట్రంవస్తేనే రాయలసీమ ఎలా అభివృద్ధి అవుతుందో రావుగా రానాడు విశదీకరించారు. జస్టిసుపార్టీ కులతత్వవాదుల ధోరణులను తీవ్రంగా విమర్శించారు. ఆంధ్రాభ్యున్నతికి కాంగ్రెస్ ప్రభుత్వ కర్తవ్యమును రావుగారు చాటి చెప్పారు.

"కొన్నాళ్ళు ఇంగ్లీషులో చర్య జరిగిన నేమాయెను?"అను ధోరణితో వ్యవహరించువారును, దానిని హృదయ పూర్వకముగా నమ్మువారును లేకపోలేదు. వారే మితవాదులు. వారే కులతత్వవాదులు. వారే జస్టిసు పార్టీవారు. వారే రాజకీయ రణరంగములో ఇదివర కెలాంటి సంబంధం పెట్టుకొనక సామాన్య ప్రజలను దిద్దుచున్నామను కొనుచు కాలము గడపిన అధికారాభిమానులు. వారే బీదల కష్టముచే జీవించు మూల ధనాధికార వాదులు. కడుపులో చల్లకదలక, తాము కుడిచి కూర్చుండి సంఘ దారిద్ర్యాన్ని సంఘ దౌర్బల్యమును పోగొట్టటానికి కాగితముల మీద 'మందుచీట్లు' వ్రాసేయొజ్జలు. వీరికి సామాన్య ప్రజలు స్వయముగా అధికారములోనికివచ్చి, వారిభాషలో వారు వ్యవహారము జరుపు కొని ఆంగ్లభాషా కోవిదులు, శాస్త్ర పరిశోధనాపటిష్ఠులు, దేశభక్త ప్రపూర్ణులు అయి మధ్యవర్తులుగా నుండు తమ్ము త్రోసిపుచ్చటం ఇష్టంగాదు....

కాంగ్రెసు బ్రిటిష్ ప్రభుత్వముతో ఢీకొట్టుచూ వారిచే హింసింపబడి నంతకాలము వీరు బహిరంగముగానే విప్లవధోరణి నరికట్ట జూచిరి. ఇప్పుడు కాంగ్రెస్ బలపడి అధికారమునకు రావడంతో, ప్రత్యక్షముగా

తమ మతమును ప్రకటించుధైర్యము వీరికి తరిగిపోయినది. కాబట్టి ప్రజలకు తమమీద నిజమగు పలుకుబడిని గలిగించు నుద్యమములకు స్నేహితులవలె కన్పించుచు, ఒక్కొక్కప్పుడు ప్రజల పక్షమునందే కాంగ్రెసు సభ్యులుగానే చేరుకొని కువాదములు కల్పించి ప్రజలను భ్రమింపజేసి తమకార్యమును సాధించుకొను నైపుణిని అలవరుచుకొన్నారు. ఇట్టి వారిని గురించి దేశనాయకత్వము వహించియుండు కాంగ్రెసు వారును, దేశప్రజలును బహుజాగ్రత్త వహించవలసియుండును"

అని కాంగ్రెస్ అధికారం చేబట్టిన మొదటి రోజుల్లోనే రావుగారు హెచ్చరించారు.

"ప్రజల స్వాతంత్ర్యము వేరు, ప్రజల ఆర్థికాభివృద్ధి వేరు, దానిని సాధించు నాయకత్వము వేరు అనునట్టి కాలము గతించినది. ప్రజల స్వశక్తి విజృంభణకు, వారి ఆర్థిక సమస్యలకు వీడరాని సంబంధమున్నది. ఇవి పరస్పరాశ్రయములు. కాబట్టి మాతృభాషాధారక రాష్ట్రము ప్రజాశక్తి విజృంభణ కావశ్యమని యంగీకరించువారు, దానిని మరియొక సమస్యతో ముడివెట్టి అది తీరువరకు యిది తీరరాదనరు. అట్లనువారు నిజమునకు ప్రజల విజృంభణచే వారి స్వాతంత్ర్యము లేర్పడు ననువారుగాక, తమయుక్తులచే వారి స్వాతంత్ర్యము లేర్పడు ననువారగుదురు."

అని వీరన్నారు. మాతృభాషల యెడల కాంగ్రెస్ ప్రభుత్వ కర్తవ్యమును గూర్చిగూడ ఆ మహోపన్యాసంలో రావుగారిలా చెప్పారు.

"నేడు కాంగ్రెస్ పరముగా పరిపాలన స్వాధీనము చేసుకొనిన కాంగ్రెస్‌వారు ప్రజలభాషలో ప్రజల వ్యవహారములు నడిపి ఏనాటి

కానాడు వారిసేవా స్వభావమును వ్యక్తపరచుట మొదటివిధి. ఈ పరిపాలనా యంత్రమును సాధ్యమైనంత శీఘ్రముగా దీని స్వంతదారులును, తమ యజమానులును అయిన ప్రజల స్వాధీనము చేయుటకు మాతృభాషాధారక వ్యవహారమే ంత పూర్ణముగా జరుపుట అంత అవసరము."

'ఆంధ్ర రాష్ట్రము వచ్చినప్పటికీ, మాతృభాషలో సర్వ వ్యవహారములు జరుగునని ఏమినమ్మకం?' అనే ప్రశ్నకు సమాధానమిస్తూ,

"దేశభాషలలో వ్యవహారము జరుపుదువా? లేదాయని ముక్కుబట్టుకొని యడుగుటకు సాధారణ ప్రజకు హక్కు-ధైర్యము లేర్పడుతవి. కాంగ్రెస్ పరిపాలకులు తమపరిపాలనను ప్రజల మాతృభాషాధారకము చేయని యెడల వారికి నిలువనీడ యుండదు. నిజముగా కాంగ్రెస్ పరిపాలన, పరభాషాధారక పరిపాలన అను ఈ రెండును పరస్పర విరోధములు, పరస్పర సంహారకములు" అన్నారు.

— 18-12-38 వ తేదీ ప్రొద్దుటూరులో జరిగిన ద్వితీయ రాయలసీమ సమావేశము అధ్యక్షోపన్యాసము నుండి

ఈ విధంగా ఒకవైపు రాష్ట్రమును వ్యతిరేకించు వారి వాదనలను విమర్శిస్తూ, మరొకవైపు కాంగ్రెస్ కర్తవ్యాన్ని ప్రబోధిస్తూ రాయలసీమలో రావుగారు ప్రచారం గావించి, రాష్ట్ర వాంఛకు ప్రజలను సముఖులుగా చేయుటకు పూనుకొన్నారు.

## రాష్ట్రేతరాంధ్ర ప్రాంతాల్లో పర్యటనలు

ఆంధ్రదేశంలో కరువులు, నిరుద్యోగ సమస్య ఫలితంగా ఆంధ్ర జాతీయ జీవనం ఛిన్నాభిన్నమై ఇచ్చటి ప్రజలు వివిధ రాష్ట్రేతర ప్రాంతాలకు వలస పోవలసిన దుస్థితి ఏర్ప

డింది. జంషెడ్‌పురం, ఖరగ్‌పురం, బొంబాయి, కలకత్తా, నాగపూర్, షోలాపూర్ మున్నగు పట్టణాలకు వృత్తి వుద్యోగాలకై వెళ్ళినవారున్నారు. వీరందరితో సన్నిహిత సంబంధాలను పెంపొందించు కొనుటకు ఆంధ్ర మహాసభ కృషిచేస్తూవచ్చింది. 1927 లో కొండా వెంకటప్పయ్యగారి గృహంలో, సమావేశమైన ఆంధ్ర మహాసభ సాయీ సంఘము "ఖరగ్‌పురం, జెంషెడ్‌పురం ఆంధ్రుల స్థితిగతులను విచారించి వారి ఇబ్బందుల నివారణకు తగు చర్యలు తీసుకొనుటకు ప్రధాన కార్యదర్శిగా నున్న హరి సర్వోత్తమరావుగారిని కోరుతూ" తీర్మానం గావించింది. అంతకు పూర్వమే మద్దూరి అన్నపూర్ణయ్యగారు ఆ ప్రాంతాలు పర్యటించి వచ్చారు. హరిసర్వోత్తమరావుగారు రాష్ట్రేతరాంధ్ర ప్రాంతాలు సంచారంచేసి, సమగ్ర నివేదికను తయారుచేశారు. అచ్చటి ఆంధ్ర జన సంఘములు గ్రంధాలయములు, పఠన మందిరములు, నాటక సంఘములు ఏర్పరచుకొని సంగీత సాహిత్యరంగాల్లో కృషి చేస్తుండేవి. ఆంధ్ర నాయకుల నాహ్వానిస్తూ తరచు సభా సమావేశాలు జరుపుకొంటుండేవారు. రాష్ట్రేతర పట్టణాలలోని సోదరాంధ్రుల చిరునామాలు, సంఘ కార్యకలాపాలు ఆనాడే రావుగారు సేకరించారు. తర్వాత సచ్చిదానందమూర్తి ఒక చిన్న పుస్తకం ప్రకటించారు.

1929 అక్టోబరు నెలలో జెంషెడ్‌పురంలో రాష్ట్రేతరాంధ్ర మహాసభ (The Conference of The Andhras Abroad) సభ జరిపారు. నిబంధనలు మున్నగునవి తయారుచేసి, వివిధ ప్రాంతాలలోనున్న సోదరాంధ్ర ప్రతినిధులను సంప్రదించారు. ఈ రాష్ట్రేతరాంధ్ర మహాసభకు హరిసర్వోత్తమరావుగా రధ్యక్షులు

గాను, బి. దండపాణి జనరల్ సెక్రటరీగాను వుండేవారు. కార్య స్థానం ఖరగ్‌పురంలో వుండేది.

1946 ఫిబ్రవరి 16,17 తేదీలలో గంజాం - కోరాపుట్ ఆంధ్రమహాసభ జయపురంలో జరిగింది. డాక్టరు డి. కామేశ్వర రావు ఛైర్మన్‌గా, యం. ధర్మారావు (అడ్వొకేటు), వెంకటేశ్వర రావుగార్లు ఆర్గనైజర్లుగా మహాసభా కార్యక్రమం నిర్వహించారు. రావుగారు, దుర్గాబాయిగారు జయపురం ఆంధ్రమహాసభల్లో పాల్గొన్నారు.

బొంబాయి నగరంలో సుమారు 2 లక్షల మంది తెలుగు వారున్నారు. స్థానికంగా అనేక తెలుగు సంఘాలు పనిచేస్తుండేవి. కాని ప్రత్యక్ష జీవితంలోకలయిక, సమాలోచన, సమైక్యత తక్కువ గా వుండేది. మాతృభాష వీడిపోకుండా విద్యా ప్రచారాన్ని పెంపొందించుటకు, సాంస్కృతిక హక్కులను కాపాడు కొనుటకు, ప్రత్యేక రాష్ట్రోందోళనకు అండగా వుండుటకు "బొంబాయి ఆంధ్ర మహాసభ" హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను జరిగింది. ఆంధ్రులందరిని ఆంధ్రమహాసభ వేదికపైకి తెచ్చుటకు ముందుగానే వెళ్ళి రావుగారు కృషిచేశారు. 1945 వ సంవత్సరంలోను, 1952 వ సంవత్సరంలోను బొంబాయి, పూనాపట్నాలకు వెళ్ళి ఆంధ్ర మహాజన సంఘ కార్యకలాపాల్లో రావుగారు పాల్గొన్నారు.

ఆంధ్రమహాసభ పక్షమున నైజాం, బస్తరు సంస్థానాలకు "సౌహార్దసంఘంగా" వెళ్ళి ఆంధ్రసోదరులతో రావుగారు పరిచయాలు పెంపొందించుటకు కృషిచేశారు.

1951 – 52 సంవత్సరాల్లో ఆంధ్ర రాష్ట్రమునకు కర్నాటక, మహారాష్ట్ర ప్రాంత నాయకుల సహకార మర్థించుటకు ఆంధ్రమహాసభాధ్యక్షులుగా రావుగారు పర్యటించారు. "ఆంధ్రులు కోరేది నిజంగా ఆంధ్రరాష్ట్ర మొకటేగాదు. మనవలెనే అరవలకు అరవరాష్ట్రం, కన్నడులకు కన్నడరాష్ట్రం, మళయాళీలకు మళయాళరాష్ట్రం ఈ విధంగా భాషాధారక రాష్ట్రాలు ఏర్పడవలెననే ఆంధ్రులవాంఛ. ఆంధ్రరాష్ట్రం ఏర్పడటంతో ఇవీ యేర్పడుతాయనే వారివిశ్వాసం. ఇందరు భాషాపుత్రులకూ వారివారి సహజమైన హక్కులు సంపాదించి యివ్వడంలో తాము మార్గదర్శకులయినామని –ఆంధ్రులగర్వం. కాబట్టి భాషాధారక రాష్ట్రవిభాగంలో మొదటి మెట్టుతో ఆంధ్రరాష్ట్రం కోరడంతో, యితర భాషాపుత్రులతో సహకార మార్గంతో నడవటం ఆంధ్రుల వుద్దేశం కాని, వేరుకాదు. ఈదృష్టితోనే మా తమిళ సోదరులను, కర్నాటక సోదరులను భాషాప్రయుక్త రాష్ట్రోద్యమాన్ని గ్రహించి, జాతివీరాలాపాలు పలికి, జాతివైషమ్యాలు పెంచేమాటలు మాట్లాడవద్దనీ, చేతలు చేయవద్దనీ, వినయపూర్వకంగా ప్రార్థిస్తూ" ప్రచారం చేశారు. పత్రికలకు వ్యాసాలు వ్రాశారు.

1947 ఆగస్టు 15 వ తేదీన భారతదేశానికి 'స్వరాజ్యం సంప్రాప్తమయింది. ఆంధ్రులలో ఆశలు రేకెత్తినవి. ఆంధ్ర రాష్ట్రంగూడా కనుచూపు మేరలో కనిపిస్తుందనుకున్నారు. సర్ బి. యన్. రావుగారు భాషాధారక రాష్ట్ర సూత్రాలను 1945 లోనే భారతరాజ్యాంగాని కొక పథకం సూచించారు. అది తీవ్ర విమర్శనలకు గురియయింది. ఆంధ్రరాష్ట్రమును నూతన రాజ్యాంగం షెడ్యూలులో చేర్చాలనుకొని కాంగ్రెస్ అగ్రనాయ

కులు తుదినిముషంలో దానిని త్రోసిపుచ్చడం జరిగింది. తర్వాత నియమించిన 'ధార్ కమీషన్' భాషాధారక భావమునే మూలవిచ్ఛేదం చేసింది. ఇందుపై దేశంలో తీవ్రాందోళన సాగిన ఫలితంగా మరల జె. వి. పి. (జవహర్‌లాల్, వల్లభభాయి, పట్టాభి) కమిటీని కాంగ్రెస్ నియమించింది. డాక్టరు పట్టాభి జయపూర్ కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షుడు గావటంతో, ఆంధ్రులలో మరల ఆశ జనించింది. 1949 ఏప్రిల్ 6 వ తేదీన జె. వి. పి. కమిటీ తన నివేదికను సమర్పించింది. అందులో దేశానికి క్లిష్ట సమస్యలున్నవి గాబట్టి కొంతకాలం ఆగడం తమ అభీష్టమనీ, ఐతే ఆంధ్రులు మద్రాసు నగరం వదలుకుంటే, ప్రథమంగా ఆంధ్రరాష్ట్ర విషయం ఆలోచించ వలసిందనీ సూచించి నిర్వివాదమైన 11 తెలుగు జిల్లాలతో ప్రత్యేకరాష్ట్రం ఏర్పాటు చేయవచ్చునని యీ కమిటీవా రన్నారు.

మద్రాసును వదలుకోమనటంతో, ప్రకాశంగారు రోషావేశులై జె. వి. పి. రిపోర్టు సిఫార్సులకు వ్యతిరేకంగా ప్రచారం సాగించారు. మద్రాసు సమస్య అప్పట్లో చాలా వివాదాస్పదంగా తయారైంది. మద్రాసును వదలిపెట్టటానికి మొదట్లో రావుగారికి గూడా యిష్టముండేదిగాదు. మద్రాసు, కలకత్తా, బొంబాయి లాంటి ద్విభాషానగరాలను (Bilingual cities) ఏరాష్ట్రంలోను చేర్చకుండా, ప్రత్యేకం చేయాలనే వాదనగూడా బలీయంగా వుండేది. అప్పటి రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు రంగాగారు ఈ విషయాన్ని ఆలోచించుటకు అన్నిసంఘాల ప్రతినిధులను బెజవాడకు ఆహ్వానించారు. నిర్వివాద ప్రాంతములతో రాష్ట్రమును అంగీకరించుదామనే, వావిలాలవారి ప్రసంగాన్ని

కొనసాగనీయక సభికులు గేలిచేశారు. చివరకు 'కూమ్' నది సరిహద్దుగా ఆంధ్ర, మద్రాసురాష్ట్రముల రెండు రాజధానులు మద్రాసు నగరంలోనేవుండాలని ఆనాటిసభ తీర్మానం గావించింది. శొంఠి రామమూర్తిగారి నాయకత్వాన, నెహ్రూవద్దకు రాయబారం పంపారు.

ఈ సమస్యపై ఆంధ్ర మహాసభలోసైతం భేదాభిప్రాయా లుత్పన్నమైనవి. హరిసర్వోత్తమరావుగారి ఉద్దేశంలో మద్రాసును ఉమ్మడి రాజధానిగా గాని, లేక ఢిల్లీ, బొంబాయి పట్టణాలవలె ప్రత్యేకంగాగాని చేయాలని వుండేది. జె. వి. పి. రిపోర్టుపైన మద్రాసునుంచి హరిసర్వోత్తమరావుగారు, గుంటూరు నుంచి జి. వి. పున్నయ్యశాస్త్రిగారు వేర్వేరు దృక్పథాలను వెలిబుచ్చుతూ, ఒకేరోజు పత్రికా ప్రకటన లిచ్చారు. ఇది కొంత ఆశ్చర్యం గొలిపింది. అవి స్థాయీసంఘంలో నున్న భిన్నాభిప్రాయాలను బయటకు వెలిబుచ్చి నట్లయినది. తదుపరి ఆంధ్ర మహాసభా తీర్మానం అందరిని సమైక్యం చేసిందనవచ్చు. ఆ ఒక్క సందర్భంలో తప్ప, అధ్యక్షకార్యదర్శుల మధ్య ఎన్నడూ విభేదాలు రాలేదు. అత్యంత సుహృద్భావం వుండేది.

మద్రాసు నగరకారణంచూపి కాంగ్రెస్ అగ్రనాయకులు అసలు ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేయకుండా వుండేటట్లు కనుపించింది. స్థాయీసంఘ సమావేశాల్లో పున్నయ్యశాస్త్రి, వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు నిర్వివాద ప్రాంతాలతో సత్వరరాష్ట్ర నిర్మాణం చేయాలని వాదించ సాగారు. తనవ్యక్తిగతాభిప్రాయం ఎలావున్నా ఆంధ్రమహాసభ కార్యవర్గం, స్థాయి సంఘము వారంగీకరించినట్లయితే తానూ ఆ తీర్మానాన్ని అనుస

రిస్తానని రావుగారు జాబులువ్రాశారు. హైకమాండునుండి విశదీకరణ కోరుతూ, రావుగారొక రాయబారవర్గాన్ని ఢిల్లీకి నడిపారు. జె. వి.పి. రిపోర్టు ప్రకారం భవిష్యత్తులో మద్రాసుమీద హక్కు వదలుకోమని వారు ఎక్కడా తాముచెప్పలేదన్నారు. ఈ పరిస్థితులలో ఒంగోలు సమావేశానంతరం, హరిసర్వోత్తమరావు గారిలో మార్పువచ్చింది. అప్పటికే కమ్యూనిస్టులు, కాశేశ్వర రావు ప్రభృతులు నిర్వివాదాప్రాంతాలతో రాష్ట్రమేర్పడాలని ప్రచారంచేస్తున్నారు. ఆంధ్రమహాసభగూడా ఈ తీర్మానాన్ని చేయటంతో పని సులభతరమైంది. రావుగారి అభిప్రాయాల్లో వచ్చిన మార్పునుగూర్చి గుంటూరు ఆంధ్రమహాసభలో వారిట్లు పన్యసించారు :

"షరతులతో రాష్ట్రమిస్తామన్న ఈ జె. వి. పి. రిపోర్టును ఆలోచించనే అవసరంలేదని మొదట నాకు తోచింది. వివాదంలేని జిల్లాలను ఆంధ్రరాష్ట్రంగా ఏర్పరచదలుచుకొంటే, ఇండియా గవర్నమెంటుకు సలహాచేసి, రాష్ట్రనిర్మాణం తామే చేయించి వుండవచ్చునే? ఇంత డొంకతిరుగుడు పద్ధతులేల? అనిపించింది. నా అభిప్రాయము ను ప్రకటించనుగూడాప్రకటించితిని. కాని దేశంలోజరిగిన విమర్శల సందర్భంలో ఆ రిపోర్టును మరీమరీ చదివి ఆలోచించితిని........

....మన సమ్మతి కోరకుండా తమకు తోచినరీతిని రాష్ట్రాన్నేర్పరిచితే తుదకు తిరస్కరించి ఆంధ్రులు ఎదురు తిరుగుతారని వారు భ్రమపడిరనిపించింది. కాబట్టి యెంతవరకు వీరితో కలిసి వెళ్లవచ్చునో అంతవరకు కలిసివెళ్లి పని చేసుకుందా మనిపించింది. మన సమస్యలు సరిహద్దు సమస్యలు కాబట్టిన్నీ, తుది ఫలితం తేల్చడానికి ఆయా ప్రాంతాల ప్రజలవోట్లే ఆధారం గాబట్టిన్నీ ముందుకు నడుద్దామనిపించింది. అందుచేత మేమాంధ్ర మహాసభా పక్షమున చేయవలసిన

ప్రయత్నాలు చేసితిమి. జె. వి. పి. రిపోర్టు నెడల దేశంలో నున్న వ్యతిరేకత సర్దుకోటం జరిగింది. మొదట్లో వ్యతిరేకంగానున్న ఆంధ్ర కాంగ్రెసు సంఘంకూడా అంగీకరించింది."

తర్వాత విభజన సంఘం ఏర్పడింది. ఇతరులతోపాటు ప్రకాశంగారు అందులో సభ్యులుగా వున్నారు. 1950 జనవరి 26 వ తేదీనాటికి ఆంధ్రరాష్ట్రం నిర్మాణం కావలసిందని ఈపార్టిషన్ కమిటీవారు సన్నాహాలు చేశారు. రిపోర్టు సిద్ధమైనదిగాని, ఆస్తి పంపకం విషయంలో మరల పేచీ ఉత్పన్నమైనవి. ఈ కారణంతో కథ మళ్ళీ మొదటికొచ్చింది. ఆంధ్రరాష్ట్రం లోటు రాష్ట్ర మవుతుందనీ, బళ్ళారి విషయం తగాదావస్తుందనీ, ఏవో కారణాలు చూపి రాష్ట్రంయివ్వ నిరాకరించారు. దీనితో ఆంధ్ర - అరవనాయకుల మధ్యనూ, ఆంధ్ర - కర్నాటకుల మధ్యనూ వాగ్వివాదాలు చెలరేగినవి. ఉద్రేకాలు పెచ్చు పెరిగినవి.

పశ్చిమగోదావరి జిల్లా పర్యటనలో పెంటపాడులో ప్రకాశంగారి ఉపన్యాసం:

"దద్దనాల లక్ష్మీనారాయణగారు, రాష్ట్రం రాకపోవుటకు మీరే బాధ్యులని ప్రశ్నించగా ప్రకాశం పంతులుగా రీవిధంగా జవాబిచ్చారు: 'ఆస్తి పంపకం విషయంలో మనలను అరవలు చాలా మోసగించారు. మనకు భవనములనుదరా ఒక కోటిరూపాయలే యిస్తామన్నారు. మనకు 51 కోట్లరూపాయలు బాకీ పడియున్నారు. అది ఎగవేయుటకు ప్రయత్నించారు. ఆవిధంగా చెన్నపట్టణం లేని ఆంధ్రరాష్ట్రం సంపాదించిన 3 నెలల్లో దివాలా తీసేస్థితికి వచ్చేద'మని అన్నారు. ఆలస్యం అయినప్పటికీ అన్ని హంగులతోనున్న ఆంధ్రరాష్ట్రమునే సంపాదించుతా మన్నారు. ఇందుకు ముగ్గురు ఆంధ్రులు అరవలకు అమ్ముడు

పోయినా రన్నారు. మద్రాసు పట్టణంలోనే రెండు ముఖ్యరాజధానీ నగరాలు వుంచాలని ప్రకాశం, సాంబమూర్తిగార్లు పట్టుదలవహించారు."

—'ఆంధ్రపత్రిక ౪- ఫిబ్రవరి 1951' నుండి

ఆంధ్రరాష్ట్రంపై రాష్ట్ర ఆర్థికమంత్రి విపరీత వాఖ్య :

"ఇండియా, పాకిస్థాన్ విభజనకు దారితీసినట్టి పరిస్థితులే మద్రాసు రాష్ట్ర విభజనకు త్రోవతీశాయనీ, ఆంధ్రరాష్ట్ర విభజనకు ఆంధ్ర నాయకులు సరిగ్గా 'జిన్నావిధానాన్నే' అవలంబించారనీ మద్రాసు రోటరీ క్లబ్బులో 'విభజనతో ఉత్పన్నం కాగల సమస్యలు' అనే విషయంపై మాట్లాడుతూ ఆర్థికమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు."

—ప్రజాపత్రిక 23-4-1953

ఈవిధంగా ఉభయనాయకులు బహిరంగంగా తీవ్రవాగ్వివాదాలకు దిగినప్పుడు హరిసర్వోత్తమరావుగారు సమయోచిత వైఖరి నవలంబించి కార్యసాధనకు పూనుకొన్నారు. రాష్ట్రసమస్యపై ప్రజల్లో చైతన్యం కల్గించారు.

"మనవి సరిహద్దు వివాదాలు. జాతి మతముల వివాదాలు కావు. కాకూడదు. రెండు వైపులా ప్రజలను రెచ్చగొట్టి, ఒకరిపైనొకరిని పురిగొల్పవలసిన వివాదాలు కావు. సరిహద్దు సంఘాల మూలంగానో, పంచాయతీ మూలంగానో యివి కుదరనప్పుడు కడపటి మెట్టుగా 'ప్లెబిసైట్' ద్వారా తేల్చుకోదగినవి. తేల్చుకొన్న పిదప మరచిపోదగినవి." అన్నారు రావుగారు.

"ఆంధ్రరాష్ట్ర విభజనను పాకిస్థాన్ విభజనతోను, ఆంధ్ర రాష్ట్రోద్యమాన్ని ద్రవిడస్థాన్ ఉద్యమంతోను పోల్చేవారు బయలుదేరినారు. ఇది ఆంధ్రులకు చేసే అపచారలలో మహత్తరాపచా

రం. అందులో ఒకటి మతవైషమ్యంమీద ఆధారపడింది. రెండ వది జాతివైషమ్యం మీద ఆధారపడింది. ఆంధ్రరాష్ట్రం విష యంలో ఈరెండు వైషమ్యాల కేమాత్రం తావులేదు. ఉండ రాదు." అని వీరు వ్రాశారు.

"ప్రశాంతంగా ఆలోచించి మెట్టుమెట్టుగా సక్రమపద్ధతిని మనము రాష్ట్రదీక్ష సాధించడానికి చర్యలు తీసుకొనవలసి యున్న"దనికూడా వీరన్నారు.

ఆనాటి క్లిష్టపరిస్థితులలో ఆంధ్రమహాసభా పక్షమున హరి సర్వోత్తమరావుగా రిందుకు మూడుపద్ధతు లవలంబించినట్లు తెలు స్తుంది. (1) కేంద్రనాయకులవద్దకు రాయబారంవెళ్ళి నచ్చచె ప్పటం (2) అఖిల పక్ష ప్రతినిధులను సమావేశపరచి ఐక్యతను సాధించటం (3) ప్రజలలో విరివిగా ప్రచారం కొనసాగించటం. వీటినిమరికొంత వివరించుట అవసరం.

## ఢిల్లీకి రాయబారం

1949 సెప్టెంబరు 19, 20 తేదీలలో హరిసర్వోత్తమరావు గారి నాయకత్వమున ఢిల్లీకి రాయబారం వెళ్లారు. ఆవిషయా లను గురించి రావుగారి డైరీలో ఇలావుంది:

> "రాజేంద్రప్రసాద్ జబ్బుగావున్నారు. మేము 5 గురము పోయి మెమో యిచ్చినాము. కల్లూరి సుబ్బారావు వచ్చి సంతకంచేసి, అప్ప టికే ప్రయాణమై యున్నందున వెళ్లిపోయినాడు. తర్వాత అబుల్ కలాం ఆజాద్‌ను కలిసి రాష్ట్రం విషయం మాట్లాడినాము. మధ్యాహ్నం 1 గంటకు నెహ్రూను కలిశాము. 20 నిముషాలసేపు మాట్లాడితిని. జె. వి. పి. రిపోర్టులో తాను భాగస్థుడననీ, వర్కింగు కమిటీ కాబినెట్

ఆలోచించగలరనీ బహుసుముఖంగా మాట్లాడినాడు. ఆంధ్రరాష్ట్రం విషయం ఆయన సరియైన ఆలోచనలోనే వున్నట్లు తోచింది.

—'డైరీ 1949 సెప్టెంబరు 19' నుండి

ఈ రాయబారవర్గం ఢిల్లీలో డాక్టరు పట్టాభిగారి గృహంలో బసచేసింది. మొసలికంటి తిరుమలరావుగారు ఇంట ర్వ్యూలు ఏర్పాటుచేశారు. పట్టాభిగారి సూచనపై వల్లభభాయి పటేలును కలుసుకొనుటకు బొంబాయిగూడా వెళ్లారు. 21 వ తేదీ ఢిల్లీ ఆంధ్రసభ అధ్వర్యాన కళా వెంకట్రావుగారి అధ్యక్షతను సభ జరిగింది, ఆంధ్రమహాసభా నాయకులు ప్రసంగించారు. తర్వాత రాయబారవర్గం బొంబాయి వెళ్ళింది.

బిర్లాభవనంలో పటేలు బాగా జబ్బుగా వున్నట్లు తెలిసింది. ఐనా హరిసర్వోత్తమరావు మున్నగువారు వచ్చినట్లు కబురు పంపగానే, రాయబారవర్గ సభ్యులను లోనికి ఆహ్వానించి పటేలు ఆదరంగా మాట్లాడారు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం యిస్తే ఆంధ్ర రాష్ట్రం కమ్యూనిస్టుల చేతుల్లోకి పోతుందేమోగదా అని సందేహం వెలిబుచ్చారట పటేల్. 'ఆంధ్రులకు రాష్ట్రం యివ్వకుంటేనే, ఆ ప్రమాదం వుంటుం'దని రావుగారు బదులు చెప్పారట. 'రాయలసీమవారిలో, రాష్ట్రమునుగూర్చి తీవ్ర భేదాభిప్రాయా లున్నాయి గదా?' అని మరల ప్రశ్నించారట. "నేను రాయలసీమ వాసినని మీకు తెలియదా?" (Don't you know that I belong to Rayalaseema?) అని రావుగారు వెంటనే ఎదురుప్రశ్న వేయగా 'ఔనుఔను తెలియకేం!' అన్నారట పటేల్. ప్రధాన విషయాల్లో భేదాభిప్రాయా లేమున్నవి? స్వల్ప విభేదాలున్నా సమన్వయ పరుచుకోవచ్చునని రావుగారు వివరించారట.

పండిట్ నెహ్రూ మద్రాసు నగరంవిషయం ఆంధ్రులు తగాదా పెట్టకుండా వుంటే, నిర్వివాద ప్రాంతాలతో రాష్ట్రం ఏర్పరుచుటకు సుముఖత వ్యక్తంచేశాడనీ, వల్లభభాయిగారికున్న సందేహం రాజకీయమైనదనీ, ఈ అగ్రనాయకులకు రావుగారు రాష్ట్ర వివరాలు విశదీకరించారనీ, రాయబారవర్గంలో సభ్యులైన వావిలాల గోపాలకృష్ణయ్యగారు మా సంభాషణలో చెప్పారు.

హరిసర్వోత్తమరావుగారు అనేక పర్యాయములు, రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌తోను, ప్రధాని జవహర్‌లాలుతోను ఆంధ్ర మహాసభ తరఫున ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ వచ్చారు. ఎప్పటికప్పుడు రాష్ట్ర సమస్యాపరిష్కారానికి తమ సూచనలను ప్రభుత్వ దృష్టికి తెస్తూవచ్చారు.

తమ అభిప్రాయములను జంకూ – గొంకూ లేకుండా చెప్పి ఎంతటి నాయకునైనా విమర్శించే ధోరణి రావుగారిది. ఒకసారి పటేలు యింక రెండేళ్ళవరకు రాష్ట్రం కోరవద్దని వారించినప్పుడు వారిని విమర్శిస్తూ హరిసర్వోత్తరావుగారు పత్రికా ప్రకటన చేశారు. మరొకసారి హిందీ – మాతృభాషలనుగూర్చి వల్లభభాయిగారి వైఖరిని విమర్శిస్తూ ఇలా రావుగారొక స్టేటుమెంటు యిచ్చారు :

"ఇది ప్రజాప్రభుత్వానికి కాంగ్రెస్ నాయకులలో అతిముఖ్యులలో నొకరువేసిన ప్రశ్న. గొడ్డలిపెట్టనటానికి సందేహంలేదు. కాంగ్రెస్ వర్కింగు కమిటీవారి అభిప్రాయం వల్లభభాయిగారు ప్రకటించిన యభిప్రాయం కాకుండుగాక!

....బళ్లలో హిందూస్థానీ నేర్వటానికి అవకాశం గలుగజేసినాము అది నేర్చుకోండి, అందులో వ్యవహారము జరుగవచ్చును అనకూడదు.

ఇంగ్లీషునేర్చిన గుమాస్తాలు అధికారుల స్థానమున, హిందీ నేర్చిన వారిని తమ పాలకులుగా నిర్మించుకోడానికి, సర్వాంగ సుందరంగా తయారయియుండే మాతృభాషలు తెలుగు, తమిళం, కన్నడము, మళయాళమిత్రు లేనాటికైనా అంగీకరింతురనుట కలలోనివార్త. ఇదివరలో గాంధీజీయు, కాంగ్రెసున్నూ మొదటిభాష మాతృభాష, తరువాతే అఖిలభారత భాషయని గట్టిగా ప్రకటించియున్నారు. ఈ స్థిర మగు నేర్పాటును ఏమాత్రమును మార్చడానికి చూచినా, చాలా విప రీతావస్థలు కలుగక మానవని శ్రీ వల్లభభాయిబోటి మొదటి శ్రేణి నాయకు లెరుంగ దగును."

అని విమర్శించారు.

## సత్యాగ్రహములయెడల వైఖరి

కమిటీలతో కాలహరణంచేస్తూ, రాష్ట్రనిర్మాణ విష యంలో కేంద్ర, రాష్ట్రప్రభుత్వములు ఔదాసీన్యం వహించుట వల్ల ది 16-8-1951 తేదీనుండి స్వామి సీతారాం, 8 మంది సహచరులతో నిరాహారదీక్ష సాగించారు. వీరంతా జాతీయోద్య మాల్లో జైలుకేగి త్యాగంచేసినవారే. 'స్వామి సీతారాం' (పూర్వాశ్ర మంలో గొల్లపూడి సీతారామశాస్త్రిగారు) గాంధీజీ శంఖారావం విని వకీలువృత్తి విరమించి, కాంగ్రెస్ సత్యాగ్రహోద్యమాల్లో, పాల్గొన్న దేశభక్తులు. రేపల్లె తాలూకాలో 'వినయాశ్రమం' స్థాపించి నిర్మాణ కార్యక్రమంలో కృషిచేసినవారు. రాష్ట్రవాంఛకై 36 దినములు కఠోరతపస్సు చేశారు. ఈసందర్భంలో కాంగ్రెస్, సోషలిష్టు కార్యకర్తలు సభలుజరిపి ప్రచారం చేశారు. హరిసర్వోత్తమరావుగారు, ఆంధ్రమహాసభ రాష్ట్ర సాధనకు సత్యాగ్రహం మార్గంకాదన్నారు. స్వామిసీతారాంగారికి రావు గారిలా లేఖవ్రాశారు :

"మీరుయిప్పటికీ, మీనిరాహారదీక్షను విరమింప కుండుట మాబోటి స్నేహితులకు చాల ఆందోళన గలిగించు చున్నది. మీరు నిరాహార దీక్షను విరమించి, ఇదివరలోనూ యిప్పుడునూ ఆంధ్రరాష్ట్ర సాధనకై కృషిచేయుచుండే కార్యకర్తలతో చేరి తగిన చర్య తీసు కొనడానికి ప్రయత్నించడము ప్రస్తుత పరిస్థితులలో చాలప్రయోజన కరమని నేనుభావించుచున్నాను. తెలుగుజిల్లాలలో తగినంత బలమైన జనవాక్యం మనవైపు వుండటం అత్యవసరం. మీరు ఈనిరాహారదీక్షను విరమించి అందరితోను కలసి జనవాక్యమును బలపరచి కార్య సాధ నకు గడంగుటకు మీఈఉపవాసమువల్ల కలిగిన వాతావరణము తోడ్పడ గలదని విశ్వసిస్తున్నాను."

—గాడిచర్ల హరిసర్వోత్తమరావు

ఇందుకు సీతారాంగారి సమాధానమిది:

ఆత్మస్వరూపా!

"మీరు 8-9-51 తేదీన వ్రాసినవుత్తరం శ్రీ పున్నయ్యశాస్త్రి గారిద్వారా మరునాడు నాకుచేరింది. కృతజ్ఞుడను. మీరుసూచించిన ప్రకా రం తపోవిరమణ జరిగే అవకాశంలేదు. అది అచ్చగా దైవాధీనం. ఇంతవరకు నాకట్టి అంతఃస్ఫురణ కలుగలేదు. తాము సూచించిన జన వాక్యం, వగైరాలను గూర్చి నేనిప్పుడు చర్చించ దలచలేదు. మన్నించ వలెను"

—సీతారాం

36 రోజుల తదనంతరం వినోబాభావే జోక్యంతో స్వామి సీతారాం నిరాహారదీక్షను విరమించారు.

రావుగారు, స్వామివారి సత్యాగ్రహమును గూర్చి మద్రాసు ఆంధ్రప్రభ విలేఖరికి ఫిబ్రవరి 28వ తేదీన యిచ్చిన యింట ర్వ్యూలో ఇలాచెప్పారు:

"స్వామి సీతారాంగారు సత్సంకల్పులు. ధర్మమూర్తి. దేశభ క్తుడు. వారిని గూర్చి ప్రతికూలంగా చెప్ప దగిందేమీలేదు. కాని వారు నిరాశోద్రేకములతో నిండియున్నారు. అందుకు కారణం లేకపోలేదు.

1950 లో ఆంధ్రరాష్ట్రం వచ్చే అవకాశం పోయింది. అప్పుడాంధ్రు లంతా ఏకీభవించిప్పంటే రాష్ట్రం సిద్ధించి వుండేది. తరువాత గూడా శాసన సభలు అదివరకే తీర్మానించియున్నందున ప్రధానమంత్రి నెహ్రూ ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేయడానికి అవకాశ ముందెను. ఆంధ్రులు మద్రాసుపై హక్కు వదలుకుంటే యిస్తామన్నారు. అర వలు మదరాసు కావాలన్నారు. పండిట్ నెహ్రూ ప్రకాశంగారి ప్రతికూలతకు కంగారుపడి, కోపగించుకొని రాష్ట్రం నిరాకరించారు. నెహ్రూ ప్రకటనలు ఆంధ్రుల ఉద్రేకాన్ని యెక్కువచేసినాయి. ఇట్లు రెండో అవకాశం తప్పి పోయింది.

ఇప్పుడు రాష్ట్రం యివ్వవలసినా, నెహ్రూచేతుల్లోనే అధికారం లేదు. కొత్తగా ఎన్నికైన శాసనసభలు తీర్మానించాలి. రాజ్యాంగ రీత్యా పనిజరగాలి. ఇది మూడునెలల్లో జరుగవచ్చును. అందుకు తగిన ఏకీభావం మనలోవుండాలి. కాని సత్యాగ్రహంవల్ల ప్రయోజనం లేదు."

హరిసర్వోత్తమరావుగా రధ్యక్షత వహించిన గుంటూరు ఆంధ్రమహాసభలో వారిలా ఉపన్యసించారు:

"ఆంధ్రరాష్ట్ర సాధనకు సత్యాగ్రహం చేయదగునను మిత్రులు కొందరు గలరు. ప్రజానీకమునందు శుద్ధ శాంత వాతావరణము నిలువ గల పరిస్థితిలోనే సత్యాగ్రహం సాగించదగును. కాని యితరత్రా కూడ దనడమే గాంధీజీ బ్రిటిష్ వారితో పోరాడేటప్పుడే సూత్రంగా తన యెదుట పెట్టుకొని యుండినాడు. స్వతంత్ర భారతంలో మన ప్రతినిధులే రాజ్యమేలుచుండు దినములలో, ప్రతివ్యక్తికి వోటుకలిగి ప్రతినిధులను మార్చివేయడమునకు అవకాశమున్న సందర్భాలలో యీ సూత్రము నూరురెట్లు బలముతో ప్రవర్తింపగలదు. అందులోను నేడు మన దేశములో అల్లకల్లోల పరిస్థితు లేర్పడియున్నవి. ఆంధ్ర రాష్ట్ర సమస్యను శుద్ధ హృదయంతో, భాషాధారక సమస్యగా చూచే దృష్టి యింకా మనకుగూడ కుదురలేదు. ఇటి స్థితిలో సత్యాగ్రహము మాట తల

పెట్టుట, సత్యాగ్రహ విధానమునకే అపచారము చేయుట యగుచున్నదని నా నమ్మకము. అన్ని మార్గములను అనుసరించిన పిదప, ఈ విషయ మాలోచించదగును గాని, యిప్పుడు అప్రస్తుతము."

— రావుగారి అధ్యక్షోపన్యాసం నుండి

వీటినిబట్టి రాష్ట్రం రాకపోవటానికి గల కారణాలు స్పష్ట పడుతవి. ప్రజాస్వామిక రాజ్యాంగంలో 'సత్యాగ్రహ పద్ధతిని' గురించిన రావుగారి దృక్పథంగూడా అర్థమవుతుంది.

బళ్ళారిలో ఆంధ్రుల ఆందోళనకు రూపంగా యస్. రాజ గోపాలశెట్టి ప్రభృతులుచేస్తున్న సత్యాగ్రహమునుగూర్చి రావు గారికి వారు వుత్తరములువ్రాసి టెలిగ్రాములిచ్చారు. వాటికి సమాధానంగా హరిసర్వోత్తమరావుగారిచ్చిన సూచనలుగూడా ఈసందర్భంలో గమనించదగును :

మిత్రులు రాజగోపాలశెట్టిగారికి,

"మీరు ఆంధ్ర సమితి తరపున పంపిన టెలిగ్రాము, ఉత్తరములు మద్రాసు వచ్చిన తదుపరి చూచుకోటం జరిగింది. బళ్ళారిలో పికెటింగు వగైరాలు మీరారంభించుటకు పూర్వం, మీరట్లు చేయదలచుకొన్న సంకల్పాన్ని పండిత జవహర్‌లాల్ నెహ్రూకున్నూ, మీ జిల్లా కలెక్ట రుకున్నూ తెలియజేసి అవసరమైతే వచ్చి ముఖాముఖి మాట్లాడుతామని తెలిపితిరా ?........... ఆదిన 'ప్లెబిసైట్' మీదనే దృష్టి నంతటిని కేంద్రీకరించుట మంచిదికాదా ? బళ్ళారిని గురించి వుత్తర్వువేసి వెళ్ళి పోయినాడు జవహరులాల్. యింకను మన దేశానికి తిరిగి రాలేదు.... ఏది ఎట్లాగున్నా ఉద్యమ నాయకత్వం మీ చేతుల్లోనే వుంచుకొన్నారని, మిమ్ము నతిక్రమించి పనులు జరుగకుండా చూచుకోగలరని విశ్వసిస్తు న్నాను.

మనకు కలిగినది అపరిమితమైన అన్యాయము. దానిని సరిదిద్దు కోటంలో మనమేమాత్రం తొణికిసలాడినా, మన వుద్యమానికి హాని యగుననేది మీరెరుగనిది కాదు."

— గా. హరిసర్వోత్తమరావు, అధ్యక్షుడు, ఆంధ్రమహాసభ 20-6-1953

## రావుగారి ఐక్యతాకృషి

విభిన్నాభిప్రాయాలున్న ఆంధ్రప్రముఖుల నొకచోటచేర్చి, సామరస్యసాధనకు రావుగారు ప్రయత్నిస్తూ వచ్చారని ఆంధ్రోద్యమచరిత్రను పరికిస్తే స్పష్టపడుతుంది. భేదాభిప్రాయాలను పరిష్కరించు కొనుటకు 1949 జూన్‌లో రావుగారొక సూచన చేశారు. "ఆంధ్రశాసన సభ్యులను, రాజ్యాంగపరిషత్తు సభ్యులను, భాషాధారకరాష్ట్ర సమితి ప్రతినిధులను, రాయలసీమలోని రెండుపక్షాల ప్రతినిధులను, రాష్ట్ర కాంగ్రెస్ సభ్యులను, ఆంధ్రమహాసభా స్థాయిసంఘ సభ్యులను సమావేశపరచాలన్నారు. మనమంతా ఒకచోటచేరి కర్తవ్యాల నాలోచించడం సబబు. ఈవిధమగు సామరస్యవిధానం అనుసరించడం నేడు ప్రయోజనకర'మని ఉత్తరాలు వ్రాశారు. ముఖ్యులతో సంప్రదింపులు జరిపారు. కాని ఫలితం చేకూరలేదు.

పార్టిషన్ కమిటీలో వచ్చిన భేదాల వలన కేంద్రప్రభుత్వం అంతటితో రాష్ట్రసమస్యను ఆపివేసినప్పుడు రావుగారింకొక సూచన చేశారు.

అప్పట్లో రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు రంగా, తమిళ కాంగ్రెస్ సంఘాధ్యక్షుడు కామరాజునాడారు, జె. వి. పి. మెంబరు పట్టాభి, పార్టిషన్ కమిటీసభ్యులు కలిసి చర్చించుటకు సమా

వేశం కావాలన్నారు. కాని దీనికి తగిన అనుకూల వాతావరణం రాలేదని త్రోసిపుచ్చారు.

ఆంధ్రమహాసభాధ్యక్షులుగా రావుగారి కృషిఫలితంగా, మద్రాసులో ఆంధ్ర అసెంబ్లీ, కౌన్సిలు సభ్యుల సంయుక్త సమావేశం 27-2-1952 వ తేదీ జరిగింది. విభిన్న రాజకీయపక్షములకు చెందిన కొందరు మెంబర్లువచ్చి సమావేశంలో పాల్గొన్నారు.

ఈ అఖిలపక్ష సదస్సు (All Parties Convention)లో హరిసర్వోత్తమరావుగారు ఛైర్‌మెన్‌గా, వావిలాల కన్వీనరుగా ఈక్రింది సభ్యులతో ఒక ఉపసంఘం ఏర్పాటు చేయబడింది: శ్రీయుతులు 1. యం. ఆర్. అప్పారావు (కాంగ్రెస్) 2. డి. వెంకట్రావు (కాం.) 3. తరిమెల నాగిరెడ్డి (కమ్యూనిష్టు) 4. పసల సూర్యచంద్రరావు (కె. యం. పి.) 5. కందర్ప రామేశం (కె. యల్. పి.) 6. యం. వెంకటసుబ్బారెడ్డి (సోషలిస్టు) 7. యం. సిద్దన్నగౌడ్ (స్వతంత్ర) గార్లు, అందరికీ అంగీకృతమయ్యే అభిప్రాయానికి రావటానికి, ఆంధ్రరాజకీయ పక్షాలకు చెందిన ముఖ్యనాయకులు వస్తే మరింత ప్రయోజనకరంగా వుండేది. నాయకులు రాలేదు. ముఖ్యనాయకులలో ఏకీభావం లేకపోవటం దీనికి కారణం. ఏకీభావంలేదనే సాకుచూపుతూ రాష్ట్రనిర్మాణాన్ని వాయిదా వేస్తుండటం ప్రభుత్వానికి పరిపాటైంది. కాని రాష్ట్రాన్ని గాఢంగా వాంఛించే వ్యక్తులు, పార్టీభేదాల కతీతంగా 'సదస్సు'కు రావడం, తమతమ దృక్పథాలు వివరించడం కొంత శుభపరిణామాన్ని కలిగించిందనవచ్చు.

ఈ ఉపసంఘం తరపున రాష్ట్రమంతటా పర్యటన కార్యక్రమం తలపెట్టినారు. గుంటూరు, నెల్లూరుజిల్లాలలో రేయింబవళ్లు సభా

సమావేశాలు జరిపారు. హరిసర్వోత్తమరావు, టి. నాగిరెడ్డి, వావిలాల గోపాలకృష్ణయ్య, పున్నయ్యశాస్త్రిగార్లు పాల్గొని ఆంధ్రరాష్ట్రోద్యమాన్ని తీవ్రతరం చేయుటకు కృషిచేశారు.

ఈవిధంగా ఒకవైపున కేంద్ర నాయకుల వద్దకు రాయబారాలు నడపడం, మరొక వైపు ఆంధ్ర నాయకులలో ఐక్యతా భావనకు ప్రయత్నం చేయడం, ప్రధానంగా ప్రజల్లో సభా సమావేశాల ద్వారా ప్రచారంచేయడం, ఆంధ్రోద్యమంలో రావు గారు చేసిన పనులు, అప్పట్లో మద్రాసు శాసన సభలో వావిలాల వారు తెలుగులోనే తప్ప ప్రసంగించనని పంతం పట్టారు. "ఆంధ్ర సభ్యులందరూ తెలుగు భాషలో తప్ప, మరొక భాషలో ప్రసంగింప రాదనీ, 3 మాసములలోగా ప్రభుత్వం తగుచర్య తీసుకొనని యెడల ఆంధ్ర శాసన సభ్యులెల్లరూ రాజీనామా లిచ్చి రావడం సముచిత"మని రావుగారొక ముఖ్య ప్రకటన చేశారు.

## పొట్టి శ్రీరాములు పూర్ణాహుతి - రాష్ట్ర నిర్మాణం

ఇంతలో ఆంధ్ర ప్రయోజనాలకు విరుద్ధంగా మద్రాసు గవర్నమెంటు లోపభూయిష్ఠమైన కృష్ణా- పెన్నార్ పథకం తలపెట్టింది. ఆంధ్రుల అసంతృప్తి కిది "అగ్నిలో ఆజ్యంపోసిన" ట్లయింది. ప్రాజెక్టుల నిర్ణయంలో అన్యాయం జరగడానికి రాష్ట్రం రాక పోవడమే కారణమని మనవా రన్నారు. ప్రాజెక్టులు రావాలంటే వెంటనే రాష్ట్రం కావాలన్నారు. ప్రాజెక్టులు - రాష్ట్ర సమస్య అవిభాజ్యమైనవి. ఈతీవ్రతర ఆందోళనతో, విచారణకుగాను ఖోస్లాకమీషన్ రావడం జరిగింది. "నందికొండ" ప్రాజెక్టు (నాగార్జున సాగరం) ఆంధ్రుల ఏకైక వాంఛగా ముందుకు వచ్చింది.

తెలుగు దేశంలో రాష్ట్రాందోళన చరమ స్థాయినందుకున్నది. ఈస్థితిలో పొట్టి శ్రీరాములు మద్రాసులో మహర్షి బులుసు సాంబమూర్తి గారియింట నిరశన వ్రతం బూనారు.

19-10-52 నుండి 58 రోజులు శ్రీరాములుగారు అమరణ దీక్షబూని, 1952 డిసెంబరు 14 వ తేదీ నిర్యాణం చెందారు. మహానుభావుడు రాష్ట్రంకోసం ఆహూతి అయినాడు. అమర జీవి శ్రీరాముని మరణవార్త విని గట్లుతెగిన మహాప్రవాహం వలె ఆంధ్రప్రజానీకం ఉద్రిక్తమైపోయింది. రైళ్ళు ఆగిపోయినవి. ప్రభుత్వ కార్యాలయాలు మూతపడి పోయినవి. ఆవేశ పూరిత ప్రజా సమూహంపై పోలీసులు కాల్పులు చేశారు. కొందరు మరణించారు. ఎందరో లాఠీ చార్జీలకు గురియైనారు. ఎట్టకేలకు నెహ్రూ ప్రధాని నిర్వివాద ప్రాంతాలతో రాష్ట్రం యివ్వ నిర్ణయిస్తూ ప్రకటించారు. చివరకు ఆంధ్రుల చిరకాల వాంఛితం ఈడేరింది నలుబదేండ్ల నిరంతర కృషి ఫలితమిది.

ఆర్థికాది వ్యవహారాల పరిశీలనకుగాను నియమింపడిన రాజస్థాన్ ప్రధాన న్యాయమూర్తి శ్రీకైలాస్ నాథ్ వాంఛూ జనవరి 19 నుంచి 27 వరకు ఆంధ్రలో పర్యటించి ఫిబ్రవరిలో తన నివేదికను సమర్పించాడు. 1953 లో ఆంధ్ర వ్యవహారాల ప్రత్యేకోద్యోగిగా చందూలాల్ త్రివేదీ నియమితుడైనాడు. ఈయన సలహావర్గంగా, తెన్నేటి విశ్వనాథం, సంజీవరెడ్డి, లచ్చన్న గార్లున్నారు.

ఇంతలో ఆంధ్ర రాజధాని ఎక్కడుండాలి? అనేది ప్రధాన చర్చనీయాంశమైనది. బహుజనాభిప్రాయం ఆంధ్రకు నడిబొడ్డుగానున్న విజయవాడ- గుంటూరు ప్రాంతం కాపిటల్‌గా వుండాలన్నది. మరి కొందరు రాయలసీమలో కావాలన్నారు. చివరకు

కర్నూలు పట్టణమును రాజధానిగా నూతన ఆంధ్రరాష్ట్రం వరించింది. ఆంధ్రకేసరి ప్రకాశం రాష్ట్రముఖ్యమంత్రి అయినారు. త్రివేదీ గవర్నరుగా నియమింపబడినారు. గుంటూరులో హైకోర్టు తాత్కాలికంగా ఏర్పడింది. ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రమునూ, నందికొండ ప్రాజెక్టునూ సాధించుకోగలిగారు.

నిర్వివాద ప్రాంతాలతో ముందు రాష్ట్రంసంపాదించుకొని, తర్వాత విశాలాంధ్ర నిర్మాణానికి ముందంజ వేయాలని రావుగారు ప్రచారంచేస్తూవచ్చారు. 1951లో ప్రసంగిస్తూ రావుగారిలాఅన్నారు:

> "విశాలాంధ్రమా, ఆంధ్రరాష్ట్రమా ? అనే ప్రశ్న మన యెదుట కలదు. ఏనాటికైనా, ఏయే భాష మాట్లాడే ప్రాంతాలు ఆయా భాషా ధారక రాష్ట్రంలోనికి చేరి తీరవలసిందే. అదే నిజమైన ప్రజా పరిపాలనకు దారి ...................ఐతే తన భాషలో తాను వ్యవహారం జరుపుకొనే జన్మస్వాతంత్ర్యం యెంత కొద్ది ప్రాంతానికి సంక్రమించినా సరే భాషాధారక రాష్ట్రం యేర్పడవలసిందనే ధోరణివాణ్ణి నేను. కాబట్టి కనిపించిన ప్రతి క్రొత్త విషయాన్ని సాధించేవరకు ఆగుతూ వుండటం నామతంగాదు. రాబట్టుకొనేది రాబట్టుకొని ఇంకా రాదగిన భాగాలను ముందుకు చేర్చుకొంటూ పోవడం మేలని నా అభిప్రాయం."

హరిసర్వోత్తమరావుగారి అభిప్రాయముల ననుసరించియే ఆంధ్ర మహాసభ తన కార్యసరళిని నిర్ణయించుకొని తీర్మానించింది. అందు ప్రధానంగా మద్రాసు స్టేటులోని నిర్వివాద ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్రం సంపాదించుట తక్షణాదర్శంగా పెట్టుకొని పని చేసింది.

## ఆంధ్ర ప్రదేశ్ అవతరణ

ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం విశాలాంధ్రకు నాందీ ప్రస్తావన అయింది. భాషాధారక రాష్ట్రాలు కోరే అశేష భారత ప్రజలకు ఆంధ్ర రాష్ట్రం మార్గదర్శకమైనది. 1946 లోనే విశాలాంధ్రను కోరుతూ, "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" పుస్తకమును పి. సుందరయ్యగారు రచించారు. అయ్యదేవర కాళేశ్వరరావుగారు విశాలాంధ్ర మహాసభనేర్పరచి, నిజాంసంస్థానాంధ్రులతో సౌహార్ద్ర సంబంధాలను పెంపొందించుటకు ప్రయత్నించారు హరిసర్వోత్తమరావుగారు గ్రంథాలయ మహాసభలు, వయోజన విద్యా ప్రచారముల ద్వారాను, శిక్షణ తరగతుల ద్వారాను, విద్యా, సాంస్కృతిక సంబంధాల మూలంగాను ఆంధ్రులలో ఐక్యతాభావనను దృఢతరంచేస్తూ వచ్చారు.

నైజాం నిరంకుశ పాలననుండి విడివడి, విశాలాంధ్ర స్థాపనకు నిజామాంధ్రమహాసభ కృషిచేస్తూ వచ్చింది. కాని ఉభయ ప్రాంత ఆంధ్రులలోను పరస్పర అనుమానాలు, భయ సందేహాలు వ్యాప్తిచేసిన నాయకులు కొందరు లేకపోలేదు. హరి సర్వోత్తమరావుగారు విశాల దృక్పథంగలవారు. స్వార్థ సంకుచిత ధోరణులకు తావిచ్చినవారు కాదు. విశాలాంధ్రావశ్యకతను గుర్తిస్తూ వారిలా వ్రాశారు :

"విశాలాంధ్ర రాష్ట్రమే మనము సాధించదగిన ధ్యేయము. ప్రజల పరిపాలనే నిజముకావలెనంటే, హైదరాబాదులోని తెలుగు ప్రాంతాలను చేర్చి వేయడమే వుత్తమ మార్గము. నైజాంగారి రాజప్రముఖత్వం కోసరం ఆ సేటును కలగూరగంపగా నుంచ నవసరం లేదు.

బ్రిటిషు రాజ్య మున్నంత కాలము హైదరాబాద్ వేరు, మనమువేరు అనే భావానికి ఆస్కారం ముండినది. ఇప్పు డట్టిభావన కిక తావులేదు"

సర్కారాంధ్రులు – రాయలసీమా
తెలంగాణము – మూడూ కలిసీ
అంతా ఒకటే – ఆంధ్రుల మం చను
ఢంకా మీదా – దెబ్బ కొట్టుచు
చాటర వెడవక – ఆంధ్రుడవైతే

అనే పాటలు కవులు గానం చేయసాగారు.

"ఆంధ్రాభ్యుదయమును కోరే అన్ని ఆంధ్ర సంస్థలవారు ఏవ గింపు మాటలను, భావాలను ప్రచారం లోనికి రాకుండా అరికట్ట వల సిందని, హైదరాబాద్ సీమలోనికి మనం సేవార్థులమై యాత్రలు చేయుచూ, వారిని అదేరీతిగా రాయలసీమ సర్కారులలోనికి ఆహ్వా నించుచు, దిన దిన ప్రవర్ధ మానమగు ప్రేమబంధాన్ని బలపరుచు కొంటే, తెలంగాణా ఆంధ్రదేశా లేకబంధంగా, ఏకభాషా ప్రయుక్త రాష్ట్రంగా ఏర్పడటము ఎంత దూరమో వుండబోదు."

అని దూర దృష్టితో ఆంధ్ర నాయకులను, ఆంధ్ర సంస్థలను అభ్య ర్థించారు రావుగారు.

దక్షిణ దేశంలో భాషా రాష్ట్రాలు కోరుతున్న ప్రముఖుల సమావేశ మొకటి బెంగుళూరులో జరిగింది. దీనికి హరిసర్వో త్తమ రావుగారు హాజరైనారు. ఈ సమావేశంలో మద్రాసు రాష్ట్రమును ఆంధ్ర, కర్నాటక, కేరళ, తమిళ రాష్ట్రాలుగా పునర్నిర్మించాలని తీర్మానించారు. ఇందులకై ఆ సంస్థలు కృషి చేస్తూ వచ్చినవి. విశాలాంధ్రం, ఐక్య కేరళం, సంయుక్త కర్నాటకం, మున్నగునవి దక్షిణ దేశ ప్రజల ముఖ్య నినాదా

లైనవి. ఇలానే సంయుక్త మహారాష్ట్ర, మహా గుజరాత్ వాంఛలు ప్రబల మైనవి. ఈ విధంగా యావద్భారత దేశంలోను మరొక మారు భాషారాష్ట్ర విభజన సమస్య ప్రధానంగా ముందుకు వచ్చింది.

భారత దేశంలో వచ్చిన ప్రజాభిప్రాయాన్ని గమనించి, కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర పునర్నిర్మాణ విచారణకు ఫజల్ అలీ కమీషన్‌ను నియమించింది. వీరి నివేదిక ఆధారంగానే జాతీయోద్యమం ఏండ్ల తరబడి కోరుచున్న భాషారాష్ట్రాల నేర్పాటు చేయటం జరిగింది. ఆంధ్ర - తెలంగాణాలు సంలీనమై నేటి "ఆంధ్ర ప్రదేశ్" అవతరించింది. ముక్కోటి ఆంధ్రులం మరల ఒక్కటైనాము. ఆంధ్రులుకన్న మధుర స్వప్నాలు రూపురేఖలు ధరించినవి.

## మన సరిహద్దు సమస్యలు

మన సరిహద్దు ప్రాంతాల నిర్ణయ విషయంలో ఆంధ్ర దేశానికి న్యాయం చేకూరలేదని అసంతృప్తి వ్యాపించింది. జె. వి. పి. రిపోర్టులో రాష్ట్రం ఏర్పడునాడు "తర్వాత దశలో కొన్ని మార్పులు, చేర్పులు చేయుట కున్న అవకాశమును మేము కాదనటం లేదు" ( We do not rule out the possibility of changes or additions at a latter stage. ) అని వున్నందున, తర్వాత చూచుకోవచ్చుననే ఉపేక్షాభావం వచ్చింది.

ఆంధ్రులు స్వరాజ్యోద్యమంలో నిమగ్నులై యున్నప్పుడు పర్లాకిమిడి రాజా, బ్రిటిష్ ప్రభుత్వంతో మంతనాలాడి,

తమ నాయకత్వం కోసం ప్రత్యేక ఒరిస్సా రాష్ట్రాన్ని సృష్టించుకొన్నాడు. ఆసందర్భంలో ఆంధ్ర ప్రాంతాలైన గంజాం, కోరాపుట్ జిల్లాలలోని ఛత్రపురం, బరంపురం, పర్లాకిమిడి, ఏజెన్సీ, జయపురం ఎస్టేటు మున్నగు వాటిని ఒరిస్సాలో చేర్పించు కొన్నాడు. ఆయన కాలగర్భంలో కలిసి పోయినా, ఆనాడు ఆంధ్రదేశానికి కలిగిన అన్యాయం ఇప్పటికీ శాశ్వతంగానే వుండిపోయింది.

1921 లో ప్రభుత్వం నియమించిన 'కేల్కార్ కమిటీ'లో హరిసర్వోత్తమరావుగా రొక మెంబరు. ఆంధ్రులు అత్యధిక సంఖ్యాకులుగా వున్న బళ్లారి, ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలను, వెనుకటి కేల్కారు అవార్డును త్రోసిరాజని, కర్నాటకంలో చేర్చారు. బళ్లారి పట్టణం సంగతిలోను, తుంగభద్రా ప్రాజెక్టుకు సంబంధించిన ప్రాంతంలోను ఆంధ్ర ప్రయోజనాలకు తీరనినష్టం వాటిల్లింది.

మద్రాసు సరిహద్దున వున్న చెంగల్పట్టు జిల్లాలోని పొన్నేరి, తిరువళ్ళూరు తాలూకాలు; సైదాపేట, పెరంబుత్తూరు భాగంలోని తెలుగు ప్రాంతాలు, సేలం జిల్లాలోని హోసూరు, క్రిష్ణగిరి తాలూకాలు; ఉత్తర ఆర్కాటు జిల్లాలోని అర్కోణం, గుడియాత్తం, వాలాజీపేట,ప్రాంతాలు ఆంధ్ర రాష్ట్రంలోకి రావాలని ఆంధ్ర మహాసభ కోరింది.

పూర్వం కారణాంతరములచే సెంట్రల్ ప్రావిన్సెస్‌లో కలిసిపోయిన తెలుగు భాగాలైన చాందా జిల్లాలోని సిరివంచ

ప్రాంతాలు, బస్తరు ఎస్టేటు నూతన ఆంధ్ర రాష్ట్రంలోకి రావాలని కోరింది. కాని యీకోర్కె లేమీ ఫలప్రదం కాలేదు.

హరిసర్వోత్తమ రావుగారు ఈసరిహద్దు తెలుగు ప్రాంతాలన్నీ ఆంధ్ర మహాసభా కార్యకర్తలతో కలిసి తిరిగి, అనేక లెక్కల వివరాలు సేకరించి మెమొరాండములు తయారు చేశారు. వీటిని ఫజల్ అలీ కమీషన్‌కు సమర్పించారు. సరిహద్దు నిర్ణాయక సంఘాలు, అధికారులు వచ్చినప్పుడు ఆంధ్ర మహాసభా పక్షమున వారితో కలిసికొని చర్చించారు. నాలుగు సరిహద్దు కమిటీల నేర్పరచి పనిచేశారు.

కాని ఏకభాష, సంస్కృతి, వరుస భూభాగాలు అనే ప్రధాన ప్రాతిపదికలపై గాక, తదితర కారణములు పని చేయడం వల్ల, న్యాయంగా ఆంధ్రరాష్ట్రం లోకి రావలసిన ఆంధ్ర భూభాగాలు రాకుండా పోయినవి. సంస్కృతి విషయం గాను, పరిపాలన సౌలభ్యం దృష్ట్యాను చూచినా సరిహద్దు విషయాల్లో ఇది సోద రాంధ్రులకు జరిగిన తీరని అన్యాయ మనక తప్పదు.

స్వరాజ్యం వచ్చిన తర్వాత గూడా 'ద్విభాషా' ప్రాంతాలలో ప్రభుత్వ విద్యావిధానం సక్రమంగా లేదనే విమర్శనలు విన వచ్చినవి. కొన్నిచోట్ల తెలుగు పాఠశాలలు ఎత్తివేయడం, మరి కొన్నిచోట్ల బడులలో తెలుగు సెక్షనులు తీసివేయడం జరిగిందని తెలిసికొని హరిసర్వోత్తమరావుగారు చెంగల్పట్టు, సేలం, ఆర్కాటుజిల్లాలు పర్యటించారు. మద్రాసునగర పరిసర ప్రాంతాలుగూడా తిరిగి విచారించి,నివేదికలు తయారుచేసి ప్రభుత్వ దృష్టికితెచ్చారు. సత్యవీడు, పొన్నేరు, తిరువళ్ళూరు మున్నగు

ప్రాంతాలలోని ఆంధ్రవిద్యాలయములను సందర్శించి, స్థానికుల మాతృభాషఅయిన తెలుగుబోధనకు తగువసతులు కలుగజేయుటకు తోడ్పడినారు.

చెన్నపురి ఆంధ్రమహాసభలో రావుగారొక యావజ్జీవ సభ్యులు. దీని ప్రారంభకులలో హరిసర్వోత్తరావు, కాశీనాథుని నాగేశ్వరరావు, కాళ్లకూరి గోపాలరావుగార్లు ముఖ్యులు.

రావుగారు అనేక 'ఆంధ్రాభ్యుదయ వారోత్సవాలకు' హాజరై రాష్ట్రావశ్యకతనుగూర్చి, మాతృభాషాభివృద్ధిని గురించి అనేక ఉపన్యాసాలిచ్చారు. ఆంధ్రవిద్యావేత్తలలో నొకరైన హరిసర్వోత్తమరావుగారి ప్రసంగాలు అధ్యాపకులలోను, విద్యార్థులలోను నూతనచైతన్యం కలిగించినవి.

## ఆంధ్ర మహాసభ భవిష్యత్తు

ఆంధ్రరాష్ట్రం ఏర్పడగానే, ఇకఆంధ్రమహాసభ రద్దుగావటమేనా? అను ప్రశ్న రాసాగింది. దీనికి సమాధానంగా ఆంధ్రమహాసభయొక్క భవిష్యత్కర్తవ్యాన్ని గురించి రావుగారిలాఅన్నారు:

> "రాష్ట్ర సాధనాసమస్యలో దృక్పథభేదాలుండి ఏర్పడిన తాత్కాలిక సంస్థలు రద్దుఅయిపోవునేగాని, ఆంధ్రమహాసభ చిరస్థాయిగా నిలువగలదు. ఆంధ్ర రాష్ట్ర సాధన ఆంధ్రమహాసభ యుద్దేశ్యాలలో ఒకటి ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధి, దీనితో సమమయిన వుద్దేశం గాని తక్కువదిగాదు. కులమతభేదబుద్ధితో రాజకీయరంగంలో పనిచేసే సంస్థలుగాక, తక్కిన ఆంధ్ర సంస్థలన్నింటి సమన్వయ సముద్ధరణ ప్రయత్నము ఆంధ్రమహాసభను చిరస్థాయిగా చేయగల కార్యకలాపాలు....

....ఈ కార్యకలాపాలను ఆంధ్రమహాసభ తగినంతగా తలపెట్టక పోవడం యిదివరలో జరిగిన లోపమన్నా తప్పుగాదు. కులమత రాజకీయ వివక్షతలకు, కక్షలకు పాత్రముకాని ఆంధ్రాభ్యుదయ కార్యక్రమాన్ని చేపట్టి యితరత్రా ఎంతభేదములువచ్చినా, ఆంధ్రమహాసభ వేదికమీద సోదరులుగా మనమందరము వ్యవహరించుటకు యిదివరలో చేసినట్లే క్రమక్రమంగా ఆంధ్రమహాసభ కృషిచేయగలదని నా విశ్వాసము. సర్వాంధ్రుల ఏకీభావానికి ఆంధ్రమహాసభ తీర్చిన స్వరూపంగా వుండగలదని నే నెదురుచూచుచున్నాను. నా సాధ్యమైన సేవ ఆ మార్గంలో చేయడానికి యెల్లప్పుడూ సంసిద్ధుణ్ణి."

ఐతే రాష్ట్రావతరణ తదుపరి, విశాలాంధ్ర నిర్మాణంలో గానీ, ఆంధ్రసంస్థల సమన్వయ సముద్ధరణలోగాని తర్వాతఆంధ్ర మహాసభ సముచిత పాత్రను నిర్వహించినట్లు కనుపించదు. ఇందులకు కారణం రావుగారికి శరీరస్వస్థత లేకపోవటం, మరొకరు ఆ కార్యభారం వహించు పెద్దలలోనుండి ముందుకు రాకపోవటంగా తోస్తుంది.

ఆంధ్ర మహాసభ వ్యవహారాల్లో అప్పుడప్పుడు కొన్ని అభిప్రాయభేదాలు పొడసూపకపోలేదు. ఒకటిరెండుసారులు వేరే పోటీ మహాసభలు జరుపుటకుగూడా సన్నాహాలు జరిగినవి. హరి సర్వోత్తమరావుగారి వ్యక్తిత్వకారణంగాను స్థాయీసంఘ సభ్యుల సహకార సమైక్యతల మూలంగాను, వాటికంతగా బలంచిక్కక, ఆరంభంలోనే అవి ఆగిపోయినవి.

"లేనిపోనిచిల్లర తగాయిదాలకు, పోరాటాలకు, స్పర్ధలకు యిది సమయంకాదు. స్పర్ధలుకాదు కావలసింది. పని." అని

భేదాలుంటే ప్రజాస్వామికపద్ధతిని పరిష్కరించుకొందామని విజ్ఞాపనలుగావించి సౌమ్యంగా అప్పట్లో సమయింపజేసినారు రావుగారు.

'ఆంధ్ర సరిహద్దు సంఘం' అనేపేరుతో 1948-49 ప్రాంతాల్లో ఒక సంఘం కొన్నాళ్ళు పనిచేసింది. దీనికి బులుసు సాంబమూర్తిగారధ్యక్షులుగా వుండేవారు. టి. సుందరరావునాయుడు, యం.కె.వి. రెడ్డి గార్లు కార్యదర్శులుగాను, టి. ప్రకాశంగారు సభ్యులుగాను వుండేవారు. బౌండరీ కమీషన్ వచ్చినప్పుడు, వారిప్రశ్నావళికి సమాధానాలు వ్రాసి యీ సంఘంవారు మెమొరాండములిచ్చారు. అనుదిన కార్యక్రమంలో యీ సంఘ కృషి అంతగా కన్పట్టలేదు. ఎట్టి భేదాభిప్రాయాలువచ్చినా, రావుగారు సామరస్య సాధనకే ప్రయత్నించారుగాని, భేద భావాల నెక్కువ చేసుకొనుటకు, ఘర్షణలకు సిద్ధంగానట్లు స్పష్టపడుతుంది.

1945-46 లో సర్ విజయా అధ్యక్షులుగానున్నప్పుడు ఆంధ్రమహాసభ స్థాయీసంఘ సభ్యులలో కొన్ని భేదాభిప్రాయాలు తలయెత్తినట్లు కనిపిస్తుంది. ఆయన దూరప్రాంతాల్లో (కాశీ) నున్నా హరిసర్వోత్తమరావుగారే దగ్గరవుండి కార్యభారమును సమర్ధవంతంగా నిర్వహించుకొంటూవచ్చేవారు. సర్ విజయాకు రావుగారియెడల అపారమైన అభిమానం, గౌరవం వుండేవి. వారు వ్రాసిన అనేకలేఖల్లో ఆప్రేమ వ్యక్తమవుతుంది. ఒకజాబులో,

* ప్రియమైన శ్రీ హరిసర్వోత్తమరావుగారూ, ఎం. ఏ.

మీశుభాకాంక్షలే నన్ను ఉత్తమస్థానంలో నిలబెట్టినవని చెప్పక తప్పదు. నావిజయం మీవిజయమే. మీదయకు పాత్రుడనని నిరూపించుటకు నిరంతరం ప్రయత్నం చేస్తాను.

తమనిర్ణయాల విషయంలో మరికొందరు సంకుచితంగాను, చెడ్డగాను ఉన్నప్పటికీ మీ విశాల హృదయము, ఉన్నతభావము మరొక విధమైన ఆలోచనను మీకు కలిగించినవి.

విజయానంద్

నవంబరు 9, 1945

---

* My Dear Sri Harisarvottama Rao garu, M. A.

Need I say that it was your good wishes that had stood me in good stead. My success is yours. It shall be my constant endeavour to prove worthy of your kindness...........

Whilst some others were uncharitable and malicious in their conclusions, your broadmindedness and high thinking made you feel differently.

*Vizayanand*

NOV. 9—1945

# ౨౪

# గ్రంథాలయ, వయోజన విద్యారంగాలు

గ్రంథాలయోద్యమ ప్రారంభం – ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం పుట్టుక – గ్రంథాలయ శిక్షణశిబిరాలు – గ్రంథాలయ యాత్రలు – గ్రంథాలయ పత్రికలు – గ్రంథాలయ శాసనం – గ్రంథాలయ మహాసభలు – ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షపదవి – తెలంగాణా గ్రంథాలయోద్యమము – రావుగారి సంచారం.

వయోజన విద్యాకృషి – దక్షిణభారతంలో – ఆంధ్రదేశంలో – వయోజనవిద్యా గౌరవడాక్టరు పదవి – బోధనా తరగతులు – అఖిలభారత పర్యటనలు, గోష్ఠులు – నాగపూర్ మహాసభాధ్యక్షత – యునెస్కో సమావేశాలలో ప్రాతినిధ్యం.

## ౫

# గ్రంథాలయ, వయోజనోద్యమాల నిర్మాత

ఒక దేశంయొక్క నాగరికతా సంస్కృతులకు ఆదేశంలో నున్న విద్యా విజ్ఞానాభివృద్ధులే చిహ్నాలు. అవిద్యతో, అజ్ఞానాంధకారంలో క్రుమ్మగ్గిపోతున్నంతకాలం, ప్రజలు నాగరికతగల జాతిగా పరిగణింప బడరు. అందుకనే ఎందరో మహనీయులు తమ జీవితాలను ప్రజల విద్యావ్యాప్తికై ధారపోశారు. అట్టి వారిలో హరిసర్వోత్తమరావుగారొకరు. రావుగారు సరస్వతీ దేవి నారాధించారు. అపారవిజ్ఞానం గణించారు. తనశక్తిని, విజ్ఞానాన్ని పామరజనశ్రేయస్సుకోసం, వారి విద్యా విజ్ఞానాభివృద్ధుల కోసం వినియోగించారు, గ్రంథాలయోద్యమానికి రెండుదశాబ్దాలకుపైగా తమజీవితాన్ని అంకితం చేశారు.

ఈనాడు అఖిలభారతదేశంలోను 'ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం' ఒక విశిష్టస్థానాన్ని ఆక్రమించు కొనుటకు సూరి వెంకట నరసింహశాస్త్రి, అయ్యంకి వెంకటరమణయ్య, మారేపల్లి రామచంద్రశాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహం, కాశీనాథుని నాగేశ్వరరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిలాంటి గ్రంథాలయోద్ధారకులు ప్రారంభంలో చేసినకృషియే కారణమని చెప్పక తప్పదు. *

---

* 'ఆంధ్ర ప్రదేశ్‌లో గ్రంథాలయోద్యమ ప్రగతి: పాతూరి నాగభూషణం గారి రేడియో ప్రసంగం. తేది 24-2-1962.

'గ్రంథాలయోద్యమ చరిత్ర' : అయ్యంకి వెంకటరమణయ్యగారి వ్యాసం కృష్ణాజిల్లా ప్రథమ గ్రంథాలయ సదస్సు ప్రత్యేక సంచిక, 1963 ఆగస్టు 31

ఆంధ్రభాషామతల్లికి గ్రంథాలయములు అలంకార భూషణములు. ఆంధ్రుల చైతన్యాని కివి బీజాంకురాలు. రావుగారు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ అధ్యక్షులుగా, అఖిల భారత గ్రంథాలయ సంఘ ఉపాధ్యక్షులుగా, సార్వజనిక గ్రంథాలయాల స్థాపనకు, వయోజనవిద్యా వ్యాప్తికి ఎంతగానో కృషి చేశారు. దక్షిణభారత వయోజనవిద్యా సంఘాధ్యక్షులుగాను, అసంఖ్యాకమైన వసంత పాఠశాలలు నిర్వహించిన్నీ, గురువులకు గురువులైనారు. రంగాగారన్నట్లు నిజంగా 'ప్రజల పండితు' డీయన. వయోజనవిద్యా పిత మన హరిసర్వోత్తముడు.

'వందేమాతరం' కాలంలో ప్రజ్వరిల్లిన ఉద్యమంనుండి, ఆంధ్రదేశంలో ఆంధ్రోద్యమం, ఆంధ్ర గ్రంథాలయోద్యమా లుద్భవించినవి. ఈరెండు ఉద్యమాలలోను యావద్భారతానికి ఆంధ్రులు ఆదర్శప్రాయులైనారు.

1890 ప్రాంతంలో విశాఖపట్నమున, కడపజిల్లా పులివెందలలోను 'సరస్వతీనిలయములు' స్థాపించబడినవి. దాదాభాయి నౌరోజీపేరిట 1895 లో ఉండిగ్రామంలో మరొక గ్రంథాలయం వెలసింది. 1899 లో కుముదవల్లిలో వీరేశలింగకవి సమాజము పేరిట యింకొకటి ఏర్పడింది. ప్రముఖ సంఘ సంస్కర్తయయిన వీరేశలింగంగారి ప్రభావం గ్రంథాలయవ్యాప్తిపై ప్రసరించింది. 19వ శతాబ్దారంభంలో రాజమహేంద్రవరం, విశాఖపట్నం, నెల్లూరులలోను, హైదరాబాద్‌లోను ప్రముఖ గ్రంథాలయాలు స్థాపించబడినవి. 1911 లో బెజవాడ రామమోహన్ ధర్మ పుస్తక భాండాగారము నిర్వాహకులైన సూరివెంకటనరసింహశాస్త్రి, అయ్యంకి వెంకటరమణయ్యగార్ల కృషిఫలితముగా

1914 లో "ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం" ఏర్పడింది. సుప్రసిద్ధ కవివరేణ్యులు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ప్రథమ ఆంధ్రదేశ గ్రంథభాండాగార మహాసభ కధ్యక్షత వహించారు. అప్పటికి ఆంధ్రదేశంలో సుమారు 125 గ్రంథాలయములున్నట్లు తెలియుచున్నది.

1924 వ సంవత్సరంలో రాష్ట్ర గ్రంథాలయ సంఘాన్ని రిజిస్టరుచేయించడం జరిగింది. కాశీనాథుని నాగేశ్వరరావుగారి ఉదారస్వభావంవల్ల అనేక లైబ్రరీలకు మొదట్లో "ఆంధ్రపత్రిక" లభ్యమవుతూ వచ్చింది. కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రికల మూలంగా తెలుగుభాషాజ్ఞానంపెరిగింది. పత్రికాపఠనతో రాజకీయచైతన్యం హెచ్చుయింది. క్రమేణా అన్నిరాజకీయ ఉద్యమాలకు ఈగ్రంథాలయాలు, పఠనమందిరాలు కేంద్రాలైనవి. అసహాయోద్యమంలోను, తదితర ప్రజాఉద్యమాలలోను, గ్రంథాలయాలను నిర్వహించే దేశారాధకులు జైలుకేగుతూ, రాజకీయరంగంలో పనిచేస్తుంటే, ఇతర దేశసేవకులెందరో వారిస్థానాలాక్రమించి, గ్రంథాలయాలను సజీవంగా నడుపుతుండేవారు. వార్షికోత్సవాలు జరిపేవారు. ఇవన్నీఆనాటి పరపరిపాలకులకు కోపకారణంగావుండేవి. వీటికి ప్రభుత్వ సహకారమేమీ వుండేదికాదు. పైగా అనేకఆటంకాలు కలిగించేవారు. ఈ అవాంతరాలన్నీదాటి, నిస్వార్థ సేవాపరాయణుల వల్ల గ్రంథాలయాలు నానాట అభివృద్ధిచెందినవి. ఈగ్రామీణ గ్రంథాలయములకు స్థానిక సంస్థలుకూడా గ్రాంట్లు మంజూరు చేయరాదనే నిషేధం వుండేది. గ్రంథభాండాగారులకు జీతభత్యా లుండేవికావు. *

---

*వివరములకు పాతూరి నాగభూషణంగారి "ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమము" చూడవగును.

బరోడాసంస్థానంలో శాయాజీరావు గైక్వాడు మహారాజు ప్రోత్సాహంతో, వారిఆర్థికసహాయంతో అచ్చట గ్రంథాలయా లేర్పడినవి. ఆంధ్రదేశంలో ప్రజాసేవకుల కృషితో పట్టణగ్రామ గ్రంథాలయాలు వెలసినవి. ఇది ఆంధ్ర గ్రంథాలయాలకున్న విశిష్టత. ఆంధ్రలో సార్వజనిక గ్రంథాలయోద్యమం గ్రామీణ గ్రంథాలయోద్యమంగా రూపొందింది.

హైదరాబాదులో 1953 జూన్ నెల ప్రారంభంలో జరిగిన 10 వ అఖిలభారత గ్రంథాలయ మహాసభ సందర్భమున రావుగారు ప్రచురించిన స్టేటుమెంటులో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ విషయమై వారు చెప్పినమాటలు:

*"ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము 1914లో స్థాపించ బడింది. చాలాకాలంగా సేవజేస్తున్నది. ఈ కాలం అంతా గ్రామ ప్రజానీకపు సంస్కృతికై సేవాజ్యోతిని వెలిగేలా కాపాడింది. నిజానికి గ్రామ గ్రంథాలయాల పట్లనూ, వాటి వ్యవస్థీకరణ పట్లనూ దేశదృష్టిని ప్రసరింప జేసిన మొదటి సంఘమిది. ప్రభుత్వ సహాయం పొందుటకు, గ్రంథాలయాల అర్హతను గుర్తింపజేయుటకు పోరాడిన మొదటి సంఘమిది."

---

*The Andhra Desa Library Association was formed in 1914 and has had fairly a long career. All through this period it has kept the torch of service for the culture of our rural population burning. In fact it is the first association in India to draw attention to the rural library and its organisation. It is the first association to put up a fight for the recognition of libraries for grant - in - aid."

*Statement by* G. Harisarvottamarao
at the time of the
10th All India Library Conference
1st June 1953

గ్రంథ భాండాగారులకు శిక్షణావసరాన్ని గుర్తించిన గ్రంథాలయ పెద్దలు 1920 లో ప్రథమశిక్షణ శిబిరాన్ని నెలకొల్పి, 20 మందికి మాసంరోజులపాటు శిక్షణ యిచ్చారు. 1934 లో బెజవాడలో కొతారు రామారావు, పుణ్యమూర్తుల రాజశేఖరం గార్ల తోడ్పాటుతో వెంకటరమణయ్యగారు మరొక శిక్షణ కేంద్రాన్ని నిర్వహించారు. 1941 లో పటమటలో జరిగిన శిబిరం, గ్రంథాలయ శాస్త్రమునకు సంబంధించిన ప్రణాళికతో, హరిసర్వోత్తమరావుగారి ఆధిపత్యంకింద్ర నిర్వహించబడింది. తర్వాత మరి కొన్ని కేంద్రాలలోకూడ వీరి ఆధిపత్యాన గ్రంథాలయ సేవకులకు శిక్షణ యివ్వబడింది. ఈ శిక్షణకేంద్రాలకు వచ్చినవారు కేవలం సర్టిఫికేటుకోసంగాక, తమతమ ప్రాంతాలలో పనిచేయుటకు సేవాధర్మదీక్షతో వచ్చేవారు. కావుననే చదువులలో శ్రద్ధ, ఉద్యమవ్యాప్తికి జరిగే చర్చలలో చురుకుదనం కనబరిచేవారు.

వేటపాలెంలో అంతటి 'సారస్వతనికేతనం' ఏర్పడి అభివృద్ధి అయిందంటే ఊటుకూరి వెంకట సుబ్బరాయశ్రేష్ఠి, అడుసుమల్లి శ్రీనివాసరావు లాంటివారల కృషిఫలితం. పెదపాలెం సేవాశ్రమ అభివృద్ధికి మేళ్లచెర్వు వెంకటేశ్వర్లు, పాతూరి నాగభూషణం గార్లు కారణం. దాతలు విరాళమిచ్చేవారు. ఊరి వుమ్మడి ధనం నుంచి గ్రామస్థులు డబ్బుయిచ్చేవారు. వీరందరి సహకారంతో పల్లెటూళ్లలో గ్రంథాలయా లేర్పడినవి. ఇలానే తెలుగుదేశ గ్రంథాలయాలకు ఒక్కొక్కదానికి ప్రత్యేక చరిత్ర వుంది.

'ఇంటింటా పుస్తకాలు', 'వూరూరా గ్రంథాలయాలు' నెలకొల్పాలనే అకుంఠిత దీక్షతో నాయకులు గ్రంథాలయ

యాత్రలు సాగించారు. పడవలపై గ్రంథాలయాలు నడిపారు. గ్రంథ ప్రదర్శన లేర్పరిచారు. మాజిక్ లాంతరు ప్రదర్శనంతో, దేశదేశాల అనుభవాలను చూపుతూ ఉపన్యాసా లిచ్చేవారు. వసంతోత్సవాలు జరిపేవారు. ఇవన్నీ మారుమూలల్లోనున్న గ్రామీణ ప్రజల్లో గ్రంథాలయముల యెడల అభిరుచి గల్గించినవి. వారివారి అభిరుచులకు తగినట్లు గ్రంథప్రచురణలు ఎక్కువైనవి. దీనితో పుస్తక ప్రచురణాలయములు ఏర్పడినవి.

ఉదాహరణకు తాడేపల్లిగూడెం తాలూకా గ్రంథాలయ యాత్రను గమనించండి. 25-2-1935 మొదలు 16-3-1935 వరకు ఈ యాత్ర సాగింది. 46 గ్రామాలు తిరిగారు. 51 గ్రంథాలయములను సందర్శించారు, ఈ ప్రచారకార్యక్రమం గ్రంథాలయోద్యమానికొక నూతన జీవాన్ని, సేవకులకు ఉత్సాహాన్ని గలిగించింది. అనేక ప్రాంతాల్లో ఈ గ్రంథాలయ యాత్రలకు ఎంతో ప్రోత్సాహ మిచ్చింది. డాక్టరు తేతలి సత్యనారాయణ మూర్తిగారు కార్యదర్శిగా వుండి తదితర మిత్రుల సహకారంతో యిది నిర్వహించబడింది. రాష్ట్రగ్రంథాలయ సంఘ నాయకులు దీనిలో పాల్గొన్నారు.

ప్రత్యేకం గ్రంథాలయ సమస్యలకు ప్రాధాన్యతయిచ్చే 'గ్రంథాలయ పత్రిక' అవతరించింది. ప్రారంభంలో 3 నెలలకొకసారి వెలువడే దీనిని మాసపత్రిక చేశారు, ఈవిధంగా "గ్రంథాలయ సర్వస్వము" ఉద్యమ వ్యాప్తికి సాధనమైంది. "ఇండియన్ లైబ్రరీ జర్నల్" ను ఆంగ్లభాషలో ప్రచురించారు. క్రమేణా గ్రంథాలయములకు భవనములు, అవసర పరికరాలు

అమరుతూ వచ్చినవి. బీరువాలు, గ్రంథాలు ప్రజలు విరాళంగా యిచ్చేవారు. ప్రజాభిమానం పెరుగుతూ వచ్చింది.

అసెంబ్లీలో కీర్తిశేషులైన కొండా వెంకటప్పయ్యగారు, ప్రభుత్వంలో శివస్వామి అయ్యరుగార్ల కృషివలన, గ్రంథాలయాలకు ప్రభుత్వంవారి గ్రాంట్లు, వీటికి స్థానిక సంస్థలు ధనం మంజూరు చేయరాదనే నిషేధం తొలగింపు బ్రిటిష్‌ప్రభుత్వ హయాములోనే సాధించటం జరిగింది. 1937–38 వ సం. లో మదరాసు ప్రభుత్వం గ్రంథాలయాలకు రు 55,000 మంజూరు చేసింది. కాంగ్రెస్ మంత్రివర్గం పూర్వపు నిషేధాన్ని తొలగించింది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంలో స్థానిక సంస్థలుగూడ సభ్యులుగా చేరుట కనుమతిని ప్రసాదించింది.

1948 నాటికి, స్వరాజ్యావతరణానంతరం మదరాసు ప్రభుత్వం భారతదేశంలో తొలి గ్రంథాలయ శాసనాన్నిరూపొందించింది. ఆంధ్రప్రదేశ్ అవతరణకు పిమ్మట మదరాసు, హైదరాబాదు శాసనాలను సమన్వయంచేసి ఆంధ్రప్రదేశ్ శాసనం యేర్పాటయింది. వీటిలోని లోపాలను ఎత్తిచూపి, ఇంకా ఎక్కువ ప్రయోజనం చేకూర్చులాగున చేయుటకు, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం కృషిచేసింది, జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీలు ప్రత్యేక సదస్సులను యిందుకోసం ఏర్పాటు చేస్తున్నవి. నేడు గ్రంథాలయాల డైరెక్టరును ప్రభుత్వం ప్రత్యేకంగా నియమించింది. జిల్లా లైబ్రరీ అథారిటీలు, వీటి ఆధ్వర్యమున అనేక శాఖా గ్రంథాలయాలు ఏర్పడి పనిచేస్తున్నవి.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమునకు, స్థానిక సంస్థలకు యిందు ప్రాతినిధ్యం లభిస్తున్నది. ప్రజలు గ్రంథాలయ సెస్సును ఐచ్ఛికంగా భరిస్తున్నారు. విశ్వవిద్యాలయాల్లో శిక్షణబొందిన గ్రంథ భాండాగారులు గ్రంథాలయోద్యోగులుగ నియమింప బడినారు. ప్రభుత్వానికి గ్రంథాలయాల విషయమై సలహా యిచ్చుటకై స్టేటులైబ్రరీ కమిటీ ఏర్పడింది. ఈ రీతిగ గ్రంథాలయ సంఘ నిరంతరాందోళనా ఫలితంగా ఒక పటిష్ఠమైన నిర్మాణం రూపొందుతున్నది. ఇందుతో కొన్ని నూతన సమస్య లుదయించకపోలేదు. ప్రజలు నెలకొల్పిన గ్రామీణ గ్రంథాలయాలయు, చట్టరీత్యా యేర్పడిన పౌరగ్రంథాలయాలయు కార్యకలాపాలను సమన్వయపరచి మున్ముందు పనిని సాగించవలసియున్నది.

1918 లో అఖిలభారత గ్రంథాలయ మహాసభ యొకటి ప్రభుత్వాధికారుల అజమాయిషీ క్రింద జరిగింది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంబోటి సంస్థలకు దీనిలో ప్రాతినిధ్యం నిరాకరించ బడింది. వీరు 1919 లో అఖిల భారత సార్వజనిక గ్రంథాలయ మహాసభను మదరాసులో జరిపి,అఖిల భారత పౌరగ్రంథాలయ సంఘాన్ని యేర్పరిచారు. దీనితర్వాతనే బెంగాలు,పంజాబు, మద్రాసురాష్ట్రగ్రంథాలయ సంఘము లేర్పడి పనిచేయసాగినవి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘకృషి యావద్భారతంలోను ఉత్తేజం గలిగించిం దనవచ్చు.

1914 నుండి 1938 వరకు అయ్యంకి వెంకటరమణయ్యగారు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యదర్శిగ సేవచేశారు. 1934 లో హరిసర్వోత్తమరావుగారీ సంఘమునకు అధ్యక్షులుగా

ఎన్నుకోబడినారు. 1938 నుండి పాతూరి నాగభూషణంగారు కార్యదర్శిగావుండి, దీని అభివృద్ధికై కృషిచేస్తున్నారు. జిల్లాలలోను, తాలూకాలలోను, గ్రామాలలోనుగల ఎందరో అజ్ఞాత సేవకుల శ్రమఫలితంగా గ్రంథాలయోద్యమం శాఖోపశాఖలుగా విస్తరిల్లింది.

గ్రంథాలయాలు కేంద్రాలుగా, సంస్కృతీ ప్రచారం, వయోజన విద్యావ్యాప్తి సాగినవి. ఆయా ప్రాంతాల్లో సాంఘిక సంక్షేమ కార్యక్రమాలుసైతం విస్తృతమైనవి. ప్రతి గ్రంథాలయ మహాసభ సందర్భంలో నిర్వహణశాఖ, వయోజన విద్యాశాఖ, ప్రచారశాఖా సమావేశములు ప్రత్యేకంగా జరుపుటవల్ల, ఆయా సమస్యలను ప్రతినిధులు సాకల్యంగా చర్చించి, భవిష్యత్కార్యక్రమం నిర్ణయించుకొనుటకు అవకాశములు హెచ్చుగా లభించినవి. వస్తు ప్రదర్శనములు, వైజ్ఞానిక ప్రదర్శనములు వేలాది పరిసర ప్రాంతాల ప్రజలను ఆకర్షిస్తూవుండేవి.

మహాసభల అనంతరం సమీపములనుండే క్షేత్రములకు యాత్రలుచేస్తుండేవారు.క్యాతూరు మహాసభానంతరం అలంపురం క్షేత్రమునుసందర్శించారు. చాగలమర్రి సభలతర్వాత, 'అహోబిళ' యాత్రసేవించారు. సూర్యాపేట మహాసభానంతరం, ప్రతినిధులు పిల్లలమర్రి దేవాలయాలుచూచి వచ్చారు. మాచెర్ల సభల తర్వాత నాగార్జునకొండను సందర్శించారు. జనగాం సభానంతరం, కొలనుపాక, యాదగిరి క్షేత్రాలను చూచివచ్చారు. ఈ విధంగా జరిపిన విహార, విజ్ఞానయాత్రలు ప్రతినిధులలో నూతనోత్సాహంకల్గించేవి.

రాజకీయ విభేదములతో నిమిత్తంలేకుండా, సేవాదృష్టి గల సర్వులకు గ్రంథాలయములు, గ్రంథాలయ సంఘములు కూడలిగావుండేవి. విభిన్న దృక్పథములుగలవారికి, గ్రంథాలయ సభా, సమావేశములు ఉమ్మడి వేదికలుగా వుంటున్నవి. గ్రంథాలయోద్యమ ధర్మాన్ని ప్రాతకాలపు పండిత ధర్మంతో పోలుస్తూ శ్రీరావుగారిలా వ్రాశారు:

"గ్రంథాలయోద్యమ ధర్మము ప్రాతకాలపు పండితుల ధర్మము. విజ్ఞానము సర్వజనులకును వ్యాపింప జేయుట వారివిధి. ఆ విధియే మాయదియు. పండితుల కెట్టు లచ్చి యచ్చిరాదని లోకోక్తికలదో అట్టులే మా యుద్యమమునకు లచ్చి యచ్చిరాలేదు. రాజాశ్రయమున్న శ్రీనాథుని గతి మాదికాదు. పొలము దున్నుకొని బ్రతికిన పోతన మాకాదర్శ మయినాడు."

—'ముసలమ్మ మరణము' పీఠికనుండి

## తెలంగాణాలో గ్రంథాలయోద్యమము

స్వర్గీయులైన కొమర్రాజు లక్ష్మణరావుగారి ప్రోత్సాహంతో, రావిచెట్టు రంగారావు దంపతుల కృషిఫలితంగా హైదరాబాదులో 1901 లో 'శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయం' మొదటగాఏర్పడింది. సికింద్రాబాదులో 1905లో ఆంధ్ర సంవర్ధనీ సంస్థ నెలకొన్నది. ఆంధ్రప్రాంతంలో యీ యుద్యమం చాలముందే ప్రారంభమైనను, తెలంగాణాలోని రాజకీయ పరిస్థితుల కారణంగా దీనికి మరికొంతకాలం పట్టింది.

వామన్ నాయక్‌వంటివారి ధనసహాయం, మాడపాటి హనుమంతరావుగారి లాంటి కార్యసాధకులు, పువ్వాడ వెంక

టప్పయ్యగారి లాంటి ప్రచారకబృందం మున్నగువారి కృషితో తెలంగాణాలో గ్రంథాలయోద్యమం ప్రారంభమైనది. అప్పట్లో "22 గ్రంథాలయాలమీద నిజాం సంస్థాన పోలీసులు నిఘావేసి వుంచాల"ని ఆజ్ఞలు జారీచేయబడినవి. "గ్రంథాలయాలు- మన విద్యాభివృద్ధి" అను అంశముపై నుపన్యసించబోగా అవ్వల్ తాలూక్‌దార్ ఆటంకపరిచాడు. తిప్పర్తి గ్రంథాలయ సభలను ఆపుచేయించాడు. 1924 లో సూర్యాపేటలో జరుగవలసిన గ్రంథాలయ సభను సంస్థాన ప్రభుత్వం నిషేధించింది. దీనిపై హైకోర్టులో దావావేసి ప్రజలు గెలిచారు. భగీరథ ప్రయత్నంతో వామన్‌నాయక్ అధ్యక్షతను మరల సభ జరుపుకోగలిగారు. సంస్థానం లోపల సభలను జరపనీయక, బయటి నుంచి ఎవరినిరానీయక నిజాం ప్రభుత్వం క్రూరనిరంకుశ విధానాల నవలంబించింది.*

ఆనాటి తెలంగాణా పరిస్థితులను గురించి "ఆంధ్ర గ్రంథాలయోద్యమం" అను వ్యాసంలో హరిసర్వోత్తమరావు గారిలా వ్రాశారు:

"అప్పటి నిజాం నిరంకుశ పరిపాలనలో ప్రజలు ఒకచోట చేరి మాట్లాడుకోటానికే అవకాశంలేదు. ఏచిన్న సమావేశం, ఏ సాంఘిక కార్యక్రమం జరుపవలసివున్నా, అధికారుల వుత్తర్వులు ముందుగా పొంది జరుపవలసి వుండేది. హైదరాబాద్ సంస్థానప్రజల బహిరంగ జీవితమంతాకూడ అధికారుల పర్యవేక్షణక్రిందనే జరుగుతుండేది.

* వివరములకు శ్రీ కోదాటి నారాయణరావుగారి వ్యాసం 'తెలంగాణాలో గ్రంథాలయోద్యమము' చూడనగును.

—ఆంధ్రప్రదేశ్ అవతరణ సంచిక. 1-11-1956

హైదరాబాద్ సంస్థానానికి మాబోటివా రెవరూ పోవడానికే అవకాశాలుండేవికావు. హైదరాబాద్ యిలాకాలో రైలు నడిచినంత కాలము ప్రయాణం చేస్తూవుంటే హైదరాబాదు భూమి మీద కాలు పెట్టకపోయినా, మమ్ము హైదరాబాద్ పోలీసువారు కాపలా చేస్తూ అక్కడక్కడా మాయోగక్షేమాలు కనుక్కొంటూ వుండేవారు. ఇటువంటి పకడ్బందీకల నిరంకుశ రాజకీయ వాతావరణంలో హైదరాబాద్ సంపూర్ణస్వాతంత్ర్యం సంపాదించే వరకు అచ్చటి గ్రంథాలయములు చక్కగా ప్రజల చైతన్యానికి తోడ్పడినవి."

- ఆంధ్రప్రభ నుండి

"ఆనాడు పత్రికలనుండి తెప్పించి, గ్రంథాలయము నేర్పరిచే గ్రంథాలయ సేవకుని పోలీసులు వెంటాడుతుండేవారు. 'గ్రంథాలయములనగా విప్లవోద్యమ కేంద్రములుకావా?' అని నిజాం పోలీసు కమీషనరుగా వుండే ఆర్మ్‌స్ట్రాంగ్ అనే ఆంగ్ల అధికారి నాతో వాదించాడు" అని బూర్గుల రామకృష్ణరావుగారు సింగరేణి గ్రంథాలయ సభలో అన్నారు. అదీ ఆనాటి నిజాం ప్రభుత్వాధికారుల ధోరణి.

సంస్థానం బయటినుండి ఎవరినైనా నాయకులను ఆహ్వానిస్తే తమకేమి ముప్పువాటిల్లుతుందోనని, ఆంధ్రమహాసభల సందర్భంలోగూడా బయటినుంచి ఉపన్యాసకులను పిలిచేవారు కాదు.

'ఆంధ్ర పితామహ' మాడపాటి హనుమంతరావుగారు మా సంభాషణ సందర్భంలో ఇలా చెప్పారు:

"సంస్థానంలోనున్న మహారాష్ట్ర సోదరులు తమ సభలకు అప్పుడప్పుడు పూనా, బొంబాయిలనుండి ప్రముఖులను పిలిపించి

సభలు జరుపుకొనేవారు. కాని మేము ఉద్దేశపూర్వకంగానే సోదరాంధ్రులనుగూడా పిలిచేవారము కాదు. మా గ్రంథాలయ, ఆంధ్రసభలు జరిపేటప్పుడు ప్రభుత్వ శాఖాధికార్లను గూడా పిలిచి సందేశా లిప్పించేవారము, ఈ కారణంతో మహమ్మదీయ మిత్రులు 'ఆంధ్రోద్యమం చేతిలో మన సంస్థాన ప్రభుత్వం ఉపకరణం అగుచున్నది.' * అంటూ ప్రభుత్వాన్ని విమర్శించేవారు"

'ఒకసారి టాస్కర్ అను ఐ. సి. యస్. ఆంగ్లోద్యోగి మహారాష్ట్ర నాయకులను పిలిపించి, 'బయటివారిని ఆహ్వానించకుండా వున్న ఆంధ్రులను మీరుగూడా అనుసరించం' డని వారికి హితవు చెప్పారట. ఆంధ్రనాయకులైన బూర్గులవారు, కొండా వెంకటరంగారెడ్డి, మాడపాటి హనుమంతరావు గార్లలాంటి పెద్దలు మితవాద దృక్పథంతో వ్యవహరించి నెమ్మదిగా పనులు జరుపుకొని రావటానికి చూచేవారు.

1940 వరకు స్వల్పసంఖ్యలో గ్రామీణ గ్రంథాలయాలున్నా, ఒక ఉద్యమం ఏర్పడలేదు. కేంద్ర ఆంధ్రజన సంఘంలో గ్రంథాలయాలను ఒక శాఖగా మాత్రమే వుంచేవారు. స్వామీరామానంద్ నాయకత్వమున 1938 లో జరిగిన స్టేటు కాంగ్రెస్, వందేమాతరం వుద్యమాల తర్వాత ఆంధ్రమహాసభా కార్యక్రమాలు కొంత తీవ్రతరమైనవి. 1942 లో నిజాం రాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు ఏర్పడి సంస్థానంలో భాషాసేవ చేయుటకు పూనుకున్నది. 1942 నుండి గ్రంథాలయ వార్షికోత్సవాలు జరుప నారంభించారు. సారస్వత పరిషత్తు స్థాపకు

---

*'Our State Government is becoming a tool in the hands of Andhra Movement.

లలో నొకరైన స్వర్గీయ బిదురు వేంకటశేషయ్యగారి అధ్యక్షతను జనగామలో గ్రంథాలయ మహాసభ జరుపబోగా ప్రభుత్వాజ్ఞ లేదని సభను ఆపివేశారు. కార్యకర్తలను బెదరించారు. సంఘసేవకులు ఈ నిరర్బంధాలను ఎలాగో తట్టుకొంటూ, గ్రంథాలయాలను నిర్వహించూకుంటూ వచ్చేవారు.

25 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభను 1944 ఆగష్టు 24-26 తేదీలలో ఇల్లెందు (సింగరేణి కాలరీస్)లో అత్యంత వైభవోపేతంగా జరిపారు. ఆంధ్ర - తెలంగాణా ప్రాంతాల నుండి, 10 జిల్లాలవారు 100 మంది గ్రంథాలయ సేవకులు ప్రతినిధులుగా వచ్చి దీనిలోపాల్గొన్నారు. అధికార్ల జబర్దస్తీలకు లొంగే దినాలు పోయినవి. కార్యకర్తలు గట్టిపడ్డారు. 1946 లో క్యాతూరులోను, 1950 ఏప్రిల్‌లో సూర్యాపేటలోను మహాసభలు జరిగినవి. మహాసభల సందర్భాన గ్రంథాలయ వయోజన విద్యా ప్రదర్శనములు, వైజ్ఞానిక ప్రదర్శనలు, కవి సమ్మేళనములు, స్వచ్ఛంద సేవకుల కవాతులు మున్నగువాటితో గ్రంథాలయోద్యమం నూతన రూపురేఖలను ధరించింది. వేలాది ప్రజలు దూరప్రాంతాలనుండివచ్చి వీనిలో పాల్గొన్నారు. ఈవిధమైన సభలు - కవి సమ్మేళనాలు మూలంగా ఆంధ్ర-తెలంగాణా భేదాలంతరించినవి. సన్నిహితత్వం పెరిగింది. ఇల్లెందులో కలిసిన ప్రేమానుబంధం-నానాట బలపడుతూ సూర్యాపేట మహాసభల నాటికి విశాలాంధ్ర దీక్షను వహించింది.

1940 లో రావి నారాయణరెడ్డిగారి అధ్యక్షతను నల్లగొండ జిల్లా చిలుకూరులో 8వ నిజాం సంస్థాన ఆంధ్రమహాసభ జరుగు సందర్భంలో, వేదం వేంకటరాయశాస్త్రి, గిడుగు రామమూర్తి,

పానుగంటి లక్ష్మీనరసింహారావుగార్ల మరణములకు సంతాపం వెలి బుచ్చే ఒకతీర్మానం ప్రవేశపెట్టటం జరిగింది. రాష్ట్రీవాసులు గాని బయటి భాషావేత్తల మృతికి సంతాపం తెలుపనవసరంలేదని తిర స్కరించారు పెద్దలు. కాళోజీ, కొమరగిరి, కోదాటి నారాయణ రావులు, ఆళ్వారు స్వామి ప్రభృతులు తీర్మానాన్ని బలపరచి, మితవాదుల సంకుచిత ధోరణులను విమర్శించారు. గోల్కొండ పత్రికా సంపాదకులుగా వుంటున్న సురవరం ప్రతాపరెడ్డి గారు, ఆంధ్రపత్రికా సంపాదకులు ఈయువకుల వాదనలను సమర్థిస్తూ సంపాదకీయాలు వ్రాశారు. ఆనాటి ఆంధ్ర నాయకుల మనస్సును అర్థంచేసుకొనుటకీ చిన్నసంఘటన తోడ్పడుతుంది.

సారస్వత ప్రచారానికి పరోక్షంగానేగాక, ప్రత్యక్షంగా గూడా గ్రంథాలయాలు కృషిచేస్తూ వచ్చినవి. సాహిత్యం పట్ల అభిరుచిని గల్గించుటకు గ్రంథాలయాలు పూనుకొన్నవి. ఈసంద ర్భంలో ఖమ్మంజిల్లా "విజ్ఞాన నికేతనం" కృషి గమనార్హమైనది. వీరు1940లో సాహిత్యగోష్ఠులు ప్రారంభించి ఆంధ్ర-తెలంగాణా. ప్రాంతాల భాషాసేవకుల నాహ్వానించేవారు. తదుపరి ఈకార్య క్రమాన్ని అనేక గ్రంథాలయాలు అనుసరించినవి. 1944 లో ఖమ్మంవిజ్ఞాన నికేతనం వార్షికోత్సవ సందర్భంలో హరిసర్వో త్తమ రావు మున్నగుఆంధ్ర గ్రంథాలయ సంఘ నాయకులను సంప్రదించి, సింగరేణి మహాసభల కార్యక్రమం నిర్ణయించుట జరిగింది.

ఆంధ్ర ప్రాంతంనుండి గాడిచర్ల, చెరుకువాడ, వావిలాల వంటి దేశభక్తులు; తెలంగాణమునుండి మాడపాటి, బూరుగుల, సురవరం ప్రతాపరెడ్డి, రావి నారాయణరెడ్డి, మున్నగు తెలంగాణా

ఆంధ్ర నాయకులు గ్రంథాలయ మహాసభలకు హాజరయ్యేవారు. వేరువేరు దృక్పథాలకు చెందినవారైనా, రావినారాయణరెడ్డి, హరి సర్వోత్తమరావు గారిలాంటివారు ఒకే వేదికపైకి రావటంతో, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమం, నిజాంరాష్ట్ర గ్రంథాలయోద్యమం, నిజామాంధ్రోద్యమం, ఆంధ్ర రాష్ట్రోద్యమం అన్నీ ఒక్క చోట భాషాధారకమైన విజ్ఞాన వికాస మహోత్సవంలో పాల్గొనడం సంభవించింది. ఒక్కమాటలో చెప్పాలంటే తెలంగాణములోని ప్రజా జీవితంలో అన్నిదశలను, ఒడుదుడుకులను తెలంగాణా గ్రంథాలయాలు అనుభవించినవనుటకు సందియంలేదు. "మా గ్రంథాలయ సేవకులు అనేక నిర్బంధాలకు గురియైనప్పటికీ, వాటిని ఉత్సాహవంతంగా కొనసాగిస్తున్నారు. నిజామాంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి సేవచేస్తున్న నిజాం ఆంధ్రమహాసభకు ఈ గ్రంథాలయాలే ప్రాతిపదికలైనవి." అని ఉపన్యసించారు బూర్గుల రామకృష్ణారావుగారు.

రాజా బహద్దరు వెంకట్రామారెడ్డి గారిబోటివారు గ్రంథాలయమహాసభ అధ్యక్షోపన్యాసంలో "ఘనతవహించిన నిజాము ప్రభువరేణ్యులు నిరుపమానమగు విద్యాపోషకులు. వీరిపరిపాలనము దేశీయులకు సర్వశుభములు సమకూర్చుచున్నవి" అంటూ వేదికమీద మాట్లాడుతున్నా, ఆంధ్రనాయకులలో ఈసభలు విశాలాంధ్ర నిర్మాణావశ్యకతను గుర్తింపుకు తెచ్చినవి. మాడపాటి హనుమంతరావుగారు ఉపన్యసిస్తూ—

"ఆంధ్రులమంతా ఎక్కడున్నా ఒక్కటే. మన చరిత్ర, భాష, సంస్కృతి, సభ్యత అన్నీ ఒక్కటే. పరిపాలన రీత్యా వేరే వేరే ప్రభుత్వములకు చెందినవారం గావటంవల్ల రాజకీయ కారణము వేరైనప్ప

టికీ మిగతా అన్ని విషయములు మనకందరికీ సమానమే. గ్రంథాల యోద్యమ సాహచర్యంవల్ల మనమందరమూ విశాలాంధ్ర భవిష్యన్ని ర్మాణమునకు తోడ్పడగలమని ఆశించుచున్నాను" అన్నారు.

విశాలాంధ్ర నిర్మాణానికి దోహదమిచ్చిన గ్రంథాలయాల పాత్రనుగూర్చి హరి సర్వోత్తమరావుగారిలా వ్రాశారు:

"నిరంకుశమైన నైజాం పరిపాలనలోని భయానక పరిస్థితులను జయించడం చాలా సంతసించదగిన విషయం. ఇందుమూలంగా కలిగిన ప్రతిష్ఠలో చాలాభాగం ఈగ్రంథాలయోద్యమానికి గూడ చెందుతుందని నా అభిప్రాయం"

గంగా-యమునల సంగమంవలె ఆంధ్ర-తెలంగాణా గ్రంథాలయోద్యమములు కలిసి పోయినవి. తెలుగు దేశంలో గ్రామ గ్రామాన గ్రంథాలయాలు వ్యాపించి ప్రజోద్యమంగా పరిణమించకతప్పలేదు. ఆంధ్రప్రదేశ్ అవతరణ దీని శుభపరిణామం. ఎట్టి ఆటంకాలైనా సహజ పరిణామాన్ని అడ్డుకోజాలవనుటలో ఆశ్చర్యము లేదు.

తెలంగాణాలో గ్రంథాలయోద్యమం ద్వారా భాషాసేవకు తోడ్పడిన ప్రతాపరెడ్డిగారు "భాషా సేవయే రాష్ట్రసేవ, భాషా విజృంభణమే ప్రజాభ్యుదయ హేతువు. సారస్వతాభివృద్ధియే సంస్కృతీవ్యాప్తికి మూలం. విద్యాపోషణమే నిజమైన విఘ్నేశ్వరపూజ" అని వుద్బోధించారు.

తెలంగాణాలో ప్రథమముగా జరిగినఇరువదియైదవ ఆంధ్ర దేశ గ్రంథాలయమహాసభ ముఖ్య బాధ్యతలు నిర్వహించిన కార్య నిర్వాహకుల నభినందిస్తూ,సభలఅనంతరం రావుగారిలా వ్రాశారు:

"కచ్చితముగా మాట్లాడి, కచ్చితముగా కార్యముచేసే ఆహ్వాన సంఘకార్యదర్శి శ్రీ కోదాటి నారాయణరావు ఇందులో మొదటివాడు.

ఇంకిద్దరు నారాయణరావులున్నారు. హృదయాన్ని రెచ్చగొట్టే గేయాలు కవిత్వాలు వ్రాసేవారు కాళోజీ. కొమరగిరి నారాయణరావు రెండవవాడు. అలంపూరు, రాయచూరు జిల్లాలనుంచి వచ్చి, మహాసభను వచ్చే సంవత్సరమునకు ఆహ్వానించిన యువకవి గడియారం రామకృష్ణ శర్మ మరియొకడు. విగ్రహము చూస్తే కార్యపరునిగ కనుపించినాడు. నడవడి నిచూస్తే నమ్రమవుర్తనవాడని తోచినాడు. ఇతడు కోదాటి నారాయణ రావుతోకూడ చేరి సంవత్సరము పొడుగున పనిచేయుటయేగాక వచ్చే మహాసభను యింకా దిగ్విజయముగ జేస్తాడని నావిశ్వాసము. మరియొక వ్యక్తి నాకంటికి బడ్డవాడు సీతారాంశేట్. అసలు మార్వాడీ ఐనా తెలుగువాడయిపోయినాడు. తానెక్కువ చదువుకోలేదంటూ చాలవిషయ గ్రహణ శక్తిగల మనిషిగా కనుపించినాడు. సంస్కారాభిలాషిగానున్నాడు. మరియిద్దరుయువకుల మాటచెప్పుతాను. ఖమ్మంమెట్టు సుగ్గల అక్షయలింగంగుప్త వ్యాపారుడు. తానువెళ్ళినచోట తనఉద్యమానికిసహాయము సంపాదించడములో ప్రవీణుడు. ఆరెండవ యువకుడు [illegible]కుల లక్ష్మీనారాయణ. సభ్యులలో సభ్యుడుగా నాకు కనుపించినాడు. ఇతడు సకలాదరాభిమానములుచూపే గుణగరిష్ఠుడు, సింగరేణి కాలరీసులో ఉద్యమానికి పట్టుగొమ్మ.

సురవరము ప్రతాపరెడ్డి గారికి హరిసర్వోత్తమరావుగారంటే అమిత గౌరవభావం ఉండేది. రావుగారు జాబు వ్రాయుగా ఎక్కడకు కదలనివారు, పెదపాలెంలో జరిగిన 23వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహా సభకువిచ్చేశారు. అలంపురం తాలూకాలోని క్యాతూరులో 26వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభను జరిపించారు. ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టులోను, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘములోను బాధ్యతగల పదవులను స్వీకరించి తెలంగాణాలో గ్రంథాలయోద్యమం ద్వారా భాషాసేవకు వీరు సర్వవిధముల తోడ్పడినారు,



25 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ, సింగరేణికాలరీస్ - ముఖ్యనిర్వాహకులు

[ పుట 231 ]

రాష్ట్రంలోని అన్నిప్రాంతాలు గ్రంథాలయ సభల సందర్భ ములో అనేక పర్యాయములు రావుగారు పర్యటించారు. ఇల్లెందు, క్యాతూరు, సూర్యాపేట, జనగాం, ఖమ్మం మహా సభలలో రావు గారు పాల్గొని ఉపన్యసించారు.

అనేక స్థానిక గ్రంథాలయ వార్షికోత్సవముల కధ్యక్షతవహిం చారు.ఆంధ్రసారస్వత పరిషత్తుపక్షాన వయోజనవిద్యాశిక్షణ తరగతు లకు ప్రిన్సిపాలుగావుండి నిర్వహించారు. హైదరాబాదులో తిక్కన యుద్ధ పంచకమును గూర్చి గడియారం వెంకటశేష శాస్త్రిగారు ఉపన్యసించిన సభలకు గాడిచర్ల వారధ్యక్షత వహించారు. డాక్టరు సూరి భగవంతం, ప్రతాపరెడ్డి, దేవులపల్లి రామానుజరావు, కోదాటి, పర్సా వెంకటేశ్వరరావు గార్ల సహకారంతో 1953 లో జూన్ 1వ తేది 10వ అఖిల భారత గ్రంథాలయ, మహా సభను హైదరాబాదులో జయప్రదంగా జరిపించారు. ఖమ్మం విజ్ఞాన నికేతనం, సూర్యాపేట గ్రంథాలయం హైదరాబాదు నందలి శ్రీకృష్ణ దేవరాయాంధ్రభాషా నిలయం రావుగారి రాక పోకలకు నిలయములైనవి.

ఇక ఆంధ్రప్రాంతానికి సంబంధించినంతవరకు రావుగారు సందర్శించిన గ్రంథాలయాలు లెక్కకు మిక్కిలిగానున్నవి. అనేక పఠన మందిరాలకు, గ్రంథాలయ వార్షికోత్సవాలకు ప్రారంభో త్సవాలు చేశారు. జీర్ణ గ్రంథాలయాలను పునరుద్ధరించుటకు పూనుకొన్నారు. యాత్రలలో పాల్గొన్నారు. సారస్వత గోష్ఠుల చర్చలలో ఉపన్యసించారు, రాష్ట్రంలోని హైస్కూళ్ళు, కాలేజీలు, విశ్వ విద్యాలయముల "సాంస్కృతిక సంఘాలు"

తాము వెళ్ళిన ప్రాంతాల్లో ముఖ్యమైన స్థానిక సమస్యల మీద ఎంత గడబిడలు జరుగుచున్నా ఏమాత్రంచలించని మన స్తత్వం హరిసర్వోత్తమరావుగారిది. వయోజన, గ్రంథాలయ కార్యక్రమాలమీదనే తమ కేంద్రీకరణ అంతా. ఏదేని సంఘర్షణలలో యితరకార్యక్రమాల్లో ఇరుక్కుంటే తన ముందున్న ప్రధానమైనపని కుంటుపడుతుందని వారికి తెలుసు, హైదరాబాద్‌లో జరిగిన 'ముల్కీ ఆందోళన' సందర్భంలో అక్కడే వున్న రావుగారు తమ ప్రోగ్రాముకు పూర్తిచేసుకొని, యివతలకు వచ్చివేయుటకే ప్రయత్నించారు.

రావుగారి డైరీలో యిలా వ్రాసివుంది:

1 వతేదీ. సికింద్రాబాదు స్టేషనునుండి హైదరాబాదు చేరితిమి. శ్రీ ఇల్లిందుల సీతారామరావుగారింట్లో బస, సరస్వతీదేవిగారు ఆయన సతి. మంచి తెలుగు రచయిత. సాయంత్రం నుంచి శ్రీ కృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయ స్వర్ణోత్సవం. ఉపన్యాసాలు

2 వతేదీ. ఉ 9 గంటల నుండి గ్రంథాలయ సభ, నా అధ్యక్షత. సాయంత్రం సారస్వతసభ.

3 వతేదీ. చారిత్రకసభ పగలు 1 గంట అయినది. సాయంత్రం ముఖ్యమంత్రి ఇంట్లో మాకు పార్టీ. మహిళాసభ జరుగుతుండగా, ముల్కీ ఆందోళన విద్యార్థులు సభామండపము వద్దకు వచ్చి ముఖ్యమంత్రి కారును తగులపెట్టినట్లు- పోలీసుల కాల్పులలో యిద్దరు చనిపోయినట్లు- 15 గురికి గాయాలు తగిలి నట్లు - తెలిసింది. అంతకాలం ముఖ్యమంత్రి యింటివద్దనే వేచివుండి, ఇంటికి వచ్చి చేరితిమి. స్త్రీల సభవారు సురక్షితముగా ఇండ్లు చేరుకున్న శుభవార్త

వింటిమి. ఇంత దుండగాలవార్తలు వింటిమి. ముఖ్య మంత్రిని మరుసటిరోజు కలుసుకొన నిశ్చయించు కొంటిమి.

4 వతేదీ. అనుకొన్నట్లుగా ఉదయం 9 గంటలకు వారింటికి పోతిమి. అధికారులు గుంపులుగుంపులుగా శ్రీ బూర్గులతో మాట లకు వచ్చినారు. ఆ తరుణంలో నాకార్యం ఏమీ సాగదని చెప్పి, బసకు వచ్చి చేరితిని. నా నల్గొండ ప్రయాణం నిర్ణయమైనది. మధ్యాహ్నం 'వయోజన విద్యా సలహా సంఘము' వారిని కలుసుకొని గంటంపావు వారికి నా అనుభవాలు, సలహాలు చెప్పితిని. రాత్రి వయోజన విద్యా కార్యాలయం చూదామను కొంటిమిగాని 'కర్ఫ్యూ' విధిం చుటచే వీలుకాలేదు. విజ్ఞాన సమితి కార్యక్రమమున్నూ సాగలేదు.

అచ్చటనుంచి నల్గొండకు ఎట్లో బయలుదేరితిమి. అక్కడి గ్రంథాలయ పరంగా రాత్రి బహిరంగసభ. కలెక్టరు పర్వా వెంకటేశ్వరరావు అధ్యక్షుడు. నేను, చెరుకువాడ, సీతాపతి వుపన్యాసములు. మాసన్మానం వగైరా.

—రావుగారి డైరీనుండి

ఒకసారి జనగామలో జరిగిన 29 వ ఆంధ్రదేశ గ్రంథా లయ మహాసభలో చెరుకువాడవారి ఉపన్యాసం వింటున్న ప్రేక్షకులు బాగా నవ్వుతూ వుండినారు. నరసింహంగారు ఉపన్యాస చక్రవర్తిగాను, హాస్యానికి పేరుబడినవారు. అనర్గళ వాగ్ధాటిగల వక్త. వారివ్యంగ్యం, విమర్శన పలురీతులుగా వుంటుంది. ఆసభలోవున్న హరిసర్వోత్తమరావుగారు లేచి 'ఇదేమీ నవ్వుల సభ అనుకున్నారా? మన మాలోచిస్తున్నది ముఖ్యమైన విజ్ఞాన సమస్య' అని సభికులను మందలించారట.

అంతటితో నవ్వులు సర్దుమణగినవి. తేలిక సంభాషణలు, చలోక్తులు ఆయన కంతగా గిట్టవు. మాటల్లో, ఉపన్యాసంలో ఏకాగ్రత వుండేది.

రావుగారి మనోనిబ్బరంగూడా ఎంతో కొనియాడ దగినది. పటమట గ్రంథాలయ సేవకుల శిక్షణ తరగతుల సందర్భములో ఒకనాటి రాత్రి రావుగారికి తేలుకుట్టింది. ఐననూ, ఆనొప్పిని భరిస్తూనే, మరునాటి పాఠాలకు తయారయినారు. ఆ బాధతోనే పాఠాలు బోధించారు. ఇది గమనించిన విద్యార్థులు, మరింత ఎక్కువగా పాఠాల విషయం శ్రద్ధవహించి చదివి, పరీక్షలలో మంచి జవాబులు వ్రాశారట. గురువుల ఆదర్శ ప్రవర్తన శిష్యులలో గూడా మార్పు తెస్తుందిగదా!

మరొకసారి తెనాలితాలూకా వల్లభాపురము నుండి యెడ్లబండిమీద నాగభూషణంగారితో కలిసి దుగ్గిరాలకు ప్రయాణమై పోతున్నారట. మార్గమధ్యమున బండి బోల్తాపడి రావుగారికి గట్టి దెబ్బలు తగిలినవి. అలాగే దుగ్గిరాల చేరు కున్నారు. చీకటిలో దీనిని గమనించక గ్రామస్థులు వచ్చి ఉపన్యాసానికి వారి నాహ్వానించినారు. ఆ నొప్పుల నేమీ లెక్క చేయక బహిరంగ సభలో అర్ధగంటసేపు రావుగారు మామూలుగ ప్రసంగించినారు. అట్టిది వారి సేవాధర్మం.

## వయోజన విద్యా కృషి

అక్షరాస్యతా ప్రాధాన్యతను గమనించిన హరిసర్వోత్తమ రావుగారు యల్. టి. చదివే సందర్భంలోనే, 1907 లో రాజమహేంద్రవరమున ఒక రాత్రి పాఠశాల స్థాపించారు. పెద్ద

లను చదువుకు చేరదీసి, వారికి వందేమాతరం గీతం నేర్పారు. లింకన్ చరిత్రను వినిపించారు. అక్షరాభ్యాసం మొదలు పెట్టారు. ఈ విధంగా ఆంధ్రదేశంలో వయోజనవిద్యా పాఠశాలను ప్రారంభించి రావుగారు, వయోజన విద్యా ఉద్యమానికి మూల పురుష లైనారు.

ఈ విషయమై రావుగారు 1939 లో మదరాసులో జరిగిన దక్షిణభారత వయోజనవిద్యా మహాసభలో చేసిన ప్రసంగంలో యిలా వివరించారు:

*" 1907 లో రాజమహేంద్రవరంలో నా తిరుగుబాటు రాత్రి పాఠశాలను నడిపిన నా మొదటి అనుభవం జ్ఞాపకం వున్నది. 25-50 ఏండ్లమధ్య వయస్సుగల వారంతా నాస్కూలులో మూగేవారు. సుమారు 90 మంది వచ్చేవారు. లింకన్ జీవితం వారికి చదివి వినిపించేవాణ్ణి . లేదా వందేమాతరమ్ గీతం నేర్పేవాణ్ణి. అక్షరాస్యత వారికి

*"I remember my first experience of running my rebel night school at Rajahmundry in 1907. People between 25-50 flocked to my school. I had about 90 of them. They would have the life of Lincoln read to them or Vandemataram Song taught to them They would consider learning the letters of the alphabets secondary. But for political reasons, that centre might have proved our first literacy campaign centre through interest created in the adult."

—From the speech of sri G. Harisarvottama Rao, at the South Indian Adult Education Conference, held at Madras in 1929.

అప్రధాన మైంది. రాజకీయ కార్యక్రమాలు అడ్డురాకుండా వుంచే వయోజనులలో అభిరుచిని కల్పించిన కారణంగా అది మా మొదటి అక్షరాస్యతా ప్రచార ఉద్యమ కేంద్రంగా నిరూపిత మయ్యేది."

పాశ్చాత్య దేశాలలో వయోజన విద్యాశాఖ వేరుగా పని చేస్తుంది. ఆంధ్రదేశంలో వయోజన విద్యాలయములను గ్రంథాలయములు నడుపుతూ వుండేవి. అక్షరజ్ఞానమే లేని వయోజనులకు ముందు పత్రికలు పుస్తకములు చదువుట నేర్పుట అవసరం గదా! 1939 లో మదరాసులో జరిగిన దక్షిణభారత వయోజన విద్యా మహాసభకు రావుగారు హాజరై అందు ప్రధానపాత్ర వహించారు. తదాది అక్షరాస్యతా ప్రచారంతోపాటు, విజ్ఞాన ప్రబోధం గావించారు.

అప్పటికే గాంధీ యుగారంభంలో శనివారపు సుబ్బారావు గారు వయోజన విద్యా వ్యాప్తికి కొంతపని చేశారు. గ్రంథములు రచించారు. రంగాగారు ఆంగ్లంలో వయోజన విద్య మీద రెండు పుస్తకాలు వ్రాశారు. వయోజనవిద్యా ప్రచారానికి ఆనాడు ప్రభుత్వం అనేక ఆటంకాలను కలిగించేది.

తర్వాత యువజన సంఘాలేర్పడి, గ్రంథాలయాల ఏర్పాటు, రాత్రి పాఠశాలల స్థాపన, సాంఘిక వైజ్ఞానిక కార్యక్రమాలు చేపట్టినవి. ఉత్సాహవంతులైన విద్యార్థులు, యువజనులెందరో సంఘసేవా దృష్టితో ఈ కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం వీరందరికీ ప్రోత్సాహం గలిగించింది. భజనలు, బుర్రకథలు. సామూహిక గీతాలు, నాటికా ప్రదర్శనలతో మంచి అభిరుచి గలిగించటం జరిగింది. ఎల్లెడలా

రాత్రిపాఠశాలలు ఎక్కువైనవి. చరిత్ర, ఆరోగ్యం, శాస్త్రీయ విషయాలపై సులభ శైలిలో ఉపన్యాసాలిచ్చేవారు. గోడవార్తా పత్రికలు ఏర్పాటుచేసి, పత్రికలు చదువుతూ, అంతర్జాతీయ, జాతీయ పరిస్థితులను గూర్చి విషయ పరిజ్ఞానం కలిగించేవారు.

అప్పట్లో కృష్ణా జిల్లా యువజన సంఘం తరఫున జిల్లాలో 70 రాత్రి పాఠశాలలను నిర్వహించేవారు. వీరు 1200 మందిని అక్షరాస్యులను చేశారు. జిల్లా సంఘమునకు వేంకటదాసు అధ్యక్షుడుగాను, తాతినేని సూర్యప్రకాశరావు కార్యదర్శి గాను వుండేవారు. గుంటూరు జిల్లా యువజన సంఘపక్షాన 40 గ్రామాలలో రాత్రి బడులుపెట్టి అందు 700 వందల మందికి చదువులు నేర్పారు. జిల్లా యువజన సంఘమునకు మాదల వీరభద్ర రావు అధ్యక్షుడుగాను, లావు బాలగంగాధరరావు కార్యదర్శిగాను వుండేవారు, ఈవిధంగా ఉభయ గోదావరులలోను విస్తృత ప్రచారం సాగింది.

" నిరక్షరాస్యత నిర్మూలింపుడు
విద్యా వ్యాప్తిని చేయండోయ్.
గుడులే బడులు, గోడలె పలకల్
పాటలె పాఠాల్, మాటలె చదువు
వార్తా పత్రిక కాలక్షేపం."

అని కీ. శే. చివుకుల శేషశాస్త్రిగారు వ్రాసిన గీతం బహుళ ప్రచారంలో వుండేది. కోస్తా జిల్లాలలోని వివిధ కేంద్రాలను రావుగారు సందర్శించారు. జిల్లా మహాసభలకు

హాజరై యువకుల నుత్సాహపరిచేవారు. సులభ పద్ధతిలో ఎలా అక్షరాలు నేర్పాలో చెప్పేవారు.

ఇవన్నీ ప్రభుత్వానికి గిట్టలేదు. వయోజన విద్యకు స్థావరమైన రాత్రి పాఠశాలలను కోస్తాజిల్లాలలో నిషేధిస్తూ ప్రభుత్వం నిషేధాజ్ఞలు జారీ చేసింది. విస్తృతమవుతున్న వయోజన విద్యా కార్యక్రమానికి దీనిమూలంగా అంతరాయం కలిగింది. 1941 ఆగష్టు 24వ తేది ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము తెనాలి పట్టణములో హరి సర్వోత్తమరావుగారి అధ్యక్షతను, ప్రత్యేక వయోజన విద్యా మహాసభను జరిపింది. ఈసభవారు వయోజనవిద్యపై జారీచేసిన నిషేధపుటుత్తర్వులను రద్దుచేయాలని తీర్మానంచేశారు. ఈసభా నిర్వహణ బాధ్యత, యువజన సంఘాల తోడ్పాటుతో పాతూరి నాగభూషణంగారు వహించారు. రాష్ట్రవ్యాపితంగా జరిగిన ఈ ఆందోళన వలన, ప్రభుత్వం ఈ నిషేదాజ్ఞను తర్వాత రద్దుచేసుకొనక తప్పలేదు.

దేశానికి స్వతంత్రం వచ్చిన తర్వాత, 1948 నుండి వయోజన విద్య మరొక మెట్టు అభివృద్ధి అయింది. ప్రభుత్వ ప్రయత్నం మాత్రం చేతనే వయోజన విద్య – చదువు, వ్రాతలతో పరిపూర్ణ మవుతుందని రావుగారెన్నడూ విశ్వసించ లేదు. అయినా ఈ కార్యక్రమాన్ని కొంత విస్తారంగా చేయించే అవసరాన్ని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల దృష్టికి తెచ్చారు. మౌలానా అబుల్‌కలాం ఆజాద్ (అప్పటి విద్యా శాఖామంత్రి) తో యీవిషయమై ఉత్తరప్రత్యుత్తరాలు జరిపారు. తత్ఫలితంగా మద్రాసు ప్రభుత్వం అక్షరాస్యత నాధారంగా స్వీకరించి

వయోజనవిద్యా ప్రణాళిక నొక దానిని తయారు చేసింది. అందులో బోధకుల శిక్షణ ప్రథమంగా జరుప నుద్దేశించింది. హరిసర్వోత్తమరావుగారు ఆంధ్ర ప్రాంతానికి గౌరవ డైరెక్టరుగా బాధ్యత వహించారు. పటమటలోని శ్రీసర్వోత్తమభవనంలోను, వేటపాలెంలోని సారస్వత నికేతనంలోను, మహానంది క్షేత్రంలోను, తూర్పుగోదావరిజిల్లా అనపర్తిలోను, కడపజిల్లా నందులూరులోను, చంద్రగిరి సమీపమునున్న మంగాపురంలోను, అనకాపల్లిలోని శ్రీశారదా గ్రంథాలయంలోను శిక్షణ కేంద్రాలు నెలకొల్పి కొన్ని వందలమంది ఉపాధ్యాయులకు శిక్షణ యిచ్చారు. నూతన పద్ధతిని, లాబక్ విధానాన్ననుసరించి, రావుగారొక అక్షరాభ్యాస పటము (ఛార్టు) ను తయారు చేశారు. వయోజనుల ఉపయోగం కొరకు మొదటి పుస్తకంతో పాటు నూతనంగా అక్షరాస్యులైన వారి కుపయోగించు 2 పుస్తకాలను సులభశైలిలో రచించారు. రాత్రి పాఠశాలలకు కావలసిన పరికరాలను కొన్ని సమకూర్చారు. ఈవిధంగా శిక్షణకేంద్రాలలో బోధకులుగా తయారైన ఉపాధ్యాయులు తమసమీపగ్రామాల్లో వయోజనవిద్యాప్రచారం కొనసాగించారు.

"మీ కేంద్రములకువచ్చి, పూర్ణచైతన్యం గలిగించవలెననే ఆశతో నున్నాను. విద్యాశాఖవారు, తరిబీదుపొందిన బోధనామిత్రులు, ప్రజలూ అందరుతోడై చదువురాని గ్రుడ్డితనం మనదేశప్రజలకు లేకుండా చేస్తారని విశ్వసిస్తున్నాను. ఇది అత్యవసరసమస్య. అలసింపదగిందికాదు. కోఆపరేటివులు, పంచాయతీలు, వయోజన ఓటింగు ఫలప్రదం కావలెనంటే, ఈసమస్యను బహుత్వరగా తీర్పవలెను. లేకుంటే ఈగ్రుడ్డితనం మనజాతినే మ్రింగివేస్తుంది. కాబట్టి యిదియేదో ప్రభుత్వంవారి

పనియని యెవ్వరూ చేతులుజోడించుకొని కూర్చొన వీలులేదు. జాగ్రత్త".

అనిరావుగారు హెచ్చరికలుచేస్తూ, జాబులువ్రాస్తూ రాష్ట్రమంతటా సంచరించారు.

## దక్షిణభారత వయోజన విద్యాసంఘము

దక్షిణభారత వయోజన విద్యాసంఘముతో ప్రారంభం నుండి రావుగారికి సన్నిహిత సంబంధమున్నది. 1939 లో యీసంఘం ఏర్పడింది. రాజాజీమంత్రివర్గం వయోజనవిద్యపై సానుభూతిచూపినా, యుద్ధారంభంతో రాజీనామా యివ్వవలసి వచ్చింది. స్వరాజ్యం వచ్చినతర్వాత ఆనాటి విద్యాశాఖామంత్రి టి. యస్ అవినాశలింగంచెట్టియార్, విద్యాశాఖనుండి వయోజనవిద్యాశాఖను విడిగ యేర్పరిచారు. హరిసర్వోత్తమరావుగారిని ఆంధ్ర ప్రాంతమునకు, కె. యస్. రామస్వామిశాస్త్రిగారిని తమిళనాడుకు గౌరవడైరెక్టర్లుగా నియమించినారు. ఈసంఘం ఆఫీసు మద్రాస్ 99, గోడౌన్‌స్ట్రీట్‌లో వుండేది. ఉత్సాహపరుడైన టి. జె. ఆర్. గోపాల్ కార్యదర్శిగా వుండేవారు. రోష్ విక్టోరియా టుటికొరన్ మునిసిపల్ ఛైర్‌మన్‌గావుండి యీసంఘాభివృద్ధికి చాలాతోడ్పడినారు. ఈయన అసెంబ్లీ మెంబరైనారు. దరిమిలా ఆహారశాఖామంత్రిపదవి నలంకరించారు. విల్వరాయి ఈశాఖకు ఆఫీసరుగా నియమింపబడినారు. వీరందరికృషిఫలితముగా రాష్ట్రంలో 1949 నుండి 1952 వరకు బాగాపనిజరిగిందని చెప్ప వచ్చు.

ఈసంఘంవారు దక్షిణదేశంలోని వివిధప్రాంతాల్లో మహాసభలు, సెమినార్లు జరిపారు. పోస్టర్లు, కరపత్రాలు, చిన్నపుస్త



శ్రీ హరిసర్వోత్తమరావుగారు
(దక్షిణ భారత వయోజనవిద్యాసంఘ కార్యకర్తలతో)

[ పుట 213 ]

కాలు దక్షిణదేశపు వివిధభాషలలో ప్రచురించారు. కొన్ని జిల్లా కేంద్రాలలోగూడా సభలుజరిపారు. 'స్థానిక స్వపరిపాలనాసంస్థల' తోడ్పాటుతో రాష్ట్రమంతటా 'వయోజనవిద్యావారములు' కొన్ని సంవత్సరాలు జయప్రదంగా నిర్వహించారు. వీటిఫలితంగా నెల్లూరుజిల్లాలోను, దక్షిణార్కాటుజిల్లాలోను 200 చొప్పున వయోజనవిద్యాకేంద్రము లేర్పడి బాగా పనిచేయసాగినవి. ఈకృషిలో అధికారులు, అనధికారులు పరస్పరం సహకరించుకొన్నారు.

ఈసభాసమావేశాల సందర్భంలో హరిసర్వోత్తమరావు గారు కడప, చిత్తూరు, నెల్లూరు, తిరుచీరపల్లి, కోయంబత్తూరు జిల్లాలలో పర్యటించారు. మద్రాసునగరం, మధుర, రామ్నాడ్, నీలగిరి మహాసభలకు రావుగారధ్యక్షత వహించారు. కురంబర నాథ్, తంజావూరు వయోజన విద్యాసేవకులసభలకు ప్రారంభోత్సవాలుగావించారు. ఆయా సభలకువెళ్ళినప్పుడెల్లాఅచ్చటి ముఖ్య కేంద్రములు సందర్శించి, స్వయంగాసూచనలిచ్చి వచ్చేవారు.

జబ్బల్పూర్, ఇండోరు, బొంబాయి, హైదరాబాద్ పట్టణాలలోజరిగిన "వయోజనవిద్యా సెమినారు" లకుహాజరై రావు గారు తమ ప్రతిభావ్యుత్పత్తులనుప్రదర్శించి, వారి అపార ఆదరాభిమానాలు చూరగొన్నట్లు, అచ్చటిమిత్రుల జాబులనుబట్టి తెలుస్తుంది.

ఈసంఘాధ్వర్యముననడిచే "ఎడల్ట్ ఎడ్యుకేషన్ రెవ్యూ" (Adult Education Review) అను మాసపత్రికకు రావు గారు ప్రధాన సంపాదకుడుగవుండి తమ అశేష అనుభవాలను దేశవ్యాప్తంగా వెదజల్లారు. బోధకులనిమిత్తం తెలుగులో "వయోజనవిద్య - బోధనక్రమము" అనుగ్రంథం రచించారు.

రావుగారి సూచనలు, రచనలు, అనేకప్రాంతాలకు అనుసరణీయ ములైనవి. ఈవిధంగా ఒక్క తెలుగు దేశంలోనేగాక, మద్రాసు రాష్ట్రంలోను, యావద్భారతంలోను పర్యటించి కృషిచేశారు. గౌరవడైరెక్టరుగాను, ఆర్గనైజరుగాను ప్రభుత్వమిచ్చిన అవకాశాన్ని సద్వినియోగంచేశారు. ప్రయాణఖర్చులుగాక నెలకొక వందరూపాయలు మాత్రం రావుగారికి ప్రభుత్వం వారిచ్చేవారు.

యూనివర్సిటీ, కాలేజీవిద్యార్థులకు, అధ్యాపకబృందానికి ముందుగా శిక్షణనిచ్చి, వేసంగిశెలవుల్లో జట్లుజట్లుగా ప్రజాహితకార్యకలాపాలలో పాల్గొనునట్లు రావుగారొక నిర్దిష్టప్రణాళికను రూపొందించారు. దీనిననుసరించి ఒకముఖ్య గ్రామాన్ని కేంద్రంగాచేసుకొనేవారు.పరిసరగ్రామాలలో శ్రమదానం చేసేవారు.ప్రజారోగ్యమును గురించివివరించేవారు.మ్యాజిక్ లాంతరుసహాయంతో వివిధసమస్యలపై ఉపన్యసించేవారు. ఈవిధంగా నూతనపద్ధతులతో చదువను వ్రాయను నేర్పడంతోపాటు, గ్రామసీమలలో "సాంఘికసేవ" చేయుటకు విద్యార్థులకు చక్కని అవకాశం గల్గింది. ఈరీత్యాతెలుగునాట కొంతపనిసాగింది.

వాల్తేరు, విజయనగరం కేంద్రాలకు హరిసర్వోత్తమరావుగారు స్వయంగావెళ్ళి అధ్యాపకుల శిక్షణశిబిరాలు (camps) నిర్వహించారు. వారు తర్వాతనడుపు పాఠశాలలనుగూడా తనఖీచేశారు. అక్కడక్కడ బోధకుల సమావేశాలుజరిపి, అనుభవాలను చర్చించి సమీక్షించేవారు. తమ పర్యటనానుభవాలను ప్రతినెలా "నివేదిక" రూపంలో ప్రభుత్వానికి పంపేవారు. రావుగారి నివేదికలకట్ట నొకసారిచదివితే, యీవిషయమై వారెంతటిశ్రద్ధ వహించారో అర్థమవుతుంది. వాల్తేరులో గ్రామీణ మహిళాకళాశాలలో

విద్యాగోష్ఠికధ్యక్షత వహించారు. రావుగారు తూర్పుగోదావరిజిల్లా కాకినాడ, గొల్లప్రోలు, పిఠాపురం, వుప్పాడ, ఆలమూరు,మున్నగు చోట్ల బోధనాశిబిరాలు (camps) నడిపారు. అన్ని జిల్లాకేంద్ర ములకువెళ్ళి వయోజనవిద్యాబోధకుల సమావేశాలు జరిపారు.

ఒకసారి "ప్రారంభవిద్య" లో వై. కె. బ్రహ్మానందం అనేఆయన రావుగారి వయోజనవిద్యాప్రచారం– ప్రభుత్వ వైఖరిని గురించి ఒకవిమర్శన ప్రకటించగా దానికిప్రత్యుత్తరంగా తమ విధులనుగూర్చి రావుగారిలావ్రాశారు:

"గౌరవఆర్గనైజరు పదవిలోవుండి, విద్యాశాఖవారు చేసేపనులలో సహాయపడుటమాత్రమే నాకర్తవ్యం. నాకుతోచిన మంచిసలహాలు యివ్వటంమాత్రం నాఅధికారంలోనిది. అంగీకరించేది మానేది ప్రభుత్వవిద్యాశాఖవారి అధికారంలోనిది. నేను నడుపుతుండే "ఎడల్టు ఎడ్యుకేషన్ రెవ్యూ"ను మాసంమాసం చదివియుంటే, నేనుచేసిన సలహాలు ఏమైందీ బ్రహ్మానందంబోటివారికి తెలిసివుండేది. సంగతులుతెలియక వారు అనావశ్యకముగా నాపేరుతెచ్చి నాకేదో జవాబుదారీ అంటకిట్టుటకుప్రయత్నించుట సరికాదు."

—1952 ఏప్రిల్‌నెల 'ప్రారంభ విద్య'నుండి

1939 జనవరి 11 నుండి 14వరకు 4రోజులపాటు దక్షిణ భారత వయోజనవిద్యా మహాసభ మద్రాసులో జరిగింది. అప్పట్లో కె. వెంకటస్వామినాయుడుగారు మద్రాసుకు మేయరుగావుండేవారు. దివాన్‌బహదూర్ యస్. ఇ. రంగనాథన్‌గారు మద్రాసు యూనివర్సిటీవైస్‌ఛాన్సలర్‌గావుండేవారు. వీరందరిసహకారంతో, సభజయప్రదముగాజరిగింది.అధికార అనధికార ప్రతినిధులు విచ్చేశారు.డాక్టర్‌అరండేల్ మహాసభకు ప్రారంభోత్సవం గావించారు.

తెలుగువారిలో హరిసర్వోత్తమరావు,యన్. జి. రంగా, బి. యస్. మూర్తి, సి. ఆర్. రెడ్డి, బి. వి. నారాయణస్వామినాయుడు, మున్నగుప్రముఖులు చర్చల్లో చురుకుగా పాల్గొన్నారు. మొదటి రోజు ప్రారంభసమావేశం, రెండవరోజు మహిళావిభాగం మూడవరోజు స్థానికస్వపరిపాలనాసంస్థలు, నాల్గవరోజు గ్రంథాలయాలు - చివరకు బోధనాపద్ధతులనుగూర్చి చర్చించి అనేక సూచనలతో తీర్మానాలుచేశారు. ఈమహాసభలోనే రోష్‌విక్టోరియా అధ్యక్షులుగాను, హరిసర్వోత్తమరావుగారు ఉపాధ్యక్షులుగాను, టి. జె. ఆర్. గోపాల్ కార్యదర్శిగాను ఒక కమిటీఎన్నుకోబడింది.

డాక్టరులాబాక్ స్వయంగా ఈమహాసభకు హాజరై, దీనిలో పాల్గొని బోధనాపద్ధతులలో తమఅనుభవాలు వివరించారు. డా.లాబాక్ ఫిలిప్పైన్సుదేశస్థుడు. విద్యావేత్త. వయోజనవిద్యలో నిపుణుడు. "ప్రతిఒక్కరు మరొక్కరికి బోధించుట"(Each one Teach one) అనే ఆయననినాదం ప్రపంచం నలుమూలలా వ్యాపించింది. మద్రాసురాష్ట్రంలో వయోజనవిద్యావ్యాప్తికి ఈమహాసభ ఎంతగానో తోడ్పడింది. 5 వ దక్షిణభారత వయోజనవిద్యా మహాసభ 1946 మార్చి 9, 10 తేదీలలో రాయవెల్లూరులో జరిగింది. రావుగారు దీని కధ్యక్షతవహించారు.

ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో విద్యాశాఖమంత్రులైన అవినాశలింగంచెట్టియార్, మాధవమీనన్, యం. వి. కృష్ణారావుగార్లు వయోజనవిద్య - గ్రంథాలయముల యెడల కొంతశ్రద్ధ వహించారు. వీరుముగ్గురూ స్వయముగా మహాసభల్లో పాల్గొన్నారు.

రావుగారు ఎన్నడైనా సెక్రటేరియటుకు వెళ్ళి మాట్లాడటం సంభవిస్తేఒక్క విద్యాశాఖామంత్రులతోనేనని వారిడైరీలవల్ల స్పష్టపడుతుంది.

కాని ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తదుపరి "వయోజనవిద్యా గౌరవఆర్గనైజరు"* పదవిని రద్దుచేశామంటూ నూతనాంధ్రరాష్ట్రప్రభుత్వం ఒకతాఖీదు పంపింది. ఇదీమనవారుచేసిన ఘనకార్యం. ఇటీవల మనరాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారొకప్రసంగంలో "మన రాష్ట్రంలో సగటున 22 మందే అక్షరాస్యులున్నారనీ, ఇదిసిగ్గుచేటనీ" దుఃఖించి ప్రయోజనమేముంది? వయోజనులను అక్షరాస్యులను చేయుటకు తగుకృషి చేయకుండా, జరుగుతున్న కొ_స్తపనిని కుంటువడజేసి, రాష్ట్రంలో తక్కువశాతమే చదువరులున్నారంటే యిందుకు బాధ్యులెవ్వరు? మొత్తం మీద హరిసర్వోత్తమరావుగారిలాంటి విద్యావేత్తల సేవలను మన నూతనాంధ్రరాష్ట్ర ప్రభుత్వం సక్రమంగా వినియోగించుకోజాలక పోవడం విచారకరమైన విషయం.

1955 లో అనంతపురంలో వయోజనవిద్యాబోధన తరగతులు జరిగినవి. రావుగారీ శిబిరమును సందర్శించి ఉపన్యసించారు. అప్పటికేవారు చాలవయోవృద్ధులైనారు. ఆరోగ్యం అంత బాగాలేదు. జానమద్ది హనుమంతరావు, బౌశూరి రామారావుగార్లు (యిప్పుడు స్కూళ్ల యిన్స్పెక్టర్లయినారు) రావుగారిని కలుసుకొని "అయ్యా! తమరీ వయస్సులో ఇంతట్రిశమ వహించుట ఆరోగ్యానికి మంచిదికాదేమో" అన్నారట. దానితో రావుగారికి

* మొదట "డైరెక్టరు" అని వ్యవహరించి తర్వాత "అర్గనైజరు" గా మార్చినారు.

ఎక్కడలేనికోపం వచ్చింది. "ఐతే నన్ను త్వరగా చావమంటారా?" అని గద్దించారట. వారు నిశ్చేష్టులయి పోయినారు. "నేను ఇలాకృషిచేయకపోతే త్వరలోచస్తాను తెలుసా. ఈ కృషే -ఈసేవే నాకు పరమౌషధము, బలవర్ధకము" అన్నారట. రావుగారి సేవాసక్తి అలాంటిది. కావుననే ఆయన్ని "కర్మయోగి" అనటం.

వయోజనవిద్యనుగూర్చి, తమ అధ్యక్షోపన్యాసం వ్రాయుటనుగురించి రావుగారు ఎలా కలలుగనేవారో, ఒక చిన్న ఉదాహరణం తార్కాణంగా కనుపిస్తుంది. వారిడైరీలోఇలావుంది:

1951 సెప్టెంబరు 14 వ తేదీ-బళ్ళారి వేకువజాము 4 గంటలు

"నిన్న సాయంకాలము మాపినతల్లినిచూచి మాట్లాడినప్పుడు నాభార్య రాముడి సాంవత్సరీకం 20 వ తేదీ జరుగుతుందనే ప్రసక్తి వచ్చింది. నేడు చాల వేకువన మేల్కొన్నాను. ఏకారణం చేతనో ధ్యాస అంతా రాముడుమీదకుపోయింది. యునెస్కోవారి ప్రకటనలో 120 కోట్ల నిరక్షరాస్యు లున్నారనీ, తామేదో ప్రాతిపదిక విద్య (Fundamental education) ను నిర్వహిస్తున్నామనీ వ్రాసింది మెదడులో మసలింది. దక్షిణాదిన తిరుత్తపూడి మఠాధిపతి మాకు వయోజన విద్యకుగాను 3 వేల రూపాయలు విరాళమిచ్చినది జ్ఞప్తికి వచ్చింది. 'యునైటెడ్ మిషన్ ఆఫ్ ఇండియా' ఏర్పరచి "సత్యంవద - ధర్మంచర - అహింసా పరమోధర్మః" వగైరా సర్వమత సమరసంగల వాక్యాల తత్వాన్ని జీవిత పరమావధిగా తీర్చే వయోజనవిద్యను భౌతిక జీవితానికి జోడించి, విజ్ఞానవ్యాప్తి 120 కోట్లకు ప్రసరింపజేయవలెనను దీక్ష కలిగింది. ఈ ప్రయత్నంగా నా అధ్యక్షోపన్యాసంలో సూచితం కావలెననుకున్నాను. అపుడు నా జీవితం మా రాముడి జీవితం ధన్యమవుతవనుకున్నాను. వెంటనే లేచి ఈ వ్రాత వ్రాసినాను."

—రావుగారి డైరీనుండి

## అఖిలభారత పర్యటనలు, గోష్ఠులు

హరిసర్వోత్తమరావుగారు పేరెన్నికగన్న భారత విద్యావేత్తలలో నొకరుగా గణుతి కెక్కారు. విద్యా విషయకంగా వారు చేసిన పరిశ్రమ అలాంటిది. స్వరాజ్యావతరణ తర్వాత ముఖ్యంగా నేటి ప్రణాళికా యుగంలో ప్రభుత్వం అనేక అఖిల భారత గోష్ఠుల నేర్పరిచింది. 1948 నుండి 1955 వరకు రావు గారనేక అఖిల భారత సదస్సులలో పాల్గొన్నారు. ప్రధానంగా వయోజనవిద్య, సాంఘిక విద్య, ఆధార విద్యలకు సంబంధించిన వివిధాంశములమీద వ్యాసములను సమర్పించారు. అవన్నీ గ్రంథ రూపంలో తప్పక వెలుగులోనికి రాదగినవి. ఆసెమినార్ల చర్చా వివరాలు గమనిస్తే రావుగారెన్ని అంశములలో పండిత నిష్ణాతులో బోధపడుతుంది. గోష్ఠులు జరిగే ముందుగా అందుకు వలయు విషయసేకరణచేసి తమ ప్రతిపాదనల నందజేసేవారు. అంతేగాదు. సెమినార్ల తదనంతరం ఆ కార్యకలాపాలను సమీక్షిస్తూ వ్రాసేవారు. ఒక్కొక్క సెమినారుకు హాజరైనప్పుడు ఆయా ప్రాంతాల్లో పర్యటించి అక్కడ జరుగుచున్న కార్యవిధానాన్ని చూచి సలహాలిచ్చేవారు. వారి అనుభవాలు తెలుసుకొనేవారు. ఈవిధంగా ఒకచోటి అనుభవాలను మరొకచోటి కందించే గొప్ప 'సంచార గ్రంథాలయంగా' హరిసర్వోత్తమరావుగారు పర్యటనలు చేశారు.

రావుగారు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘం, దక్షిణభారత వయోజన విద్యాసంఘముల కృషిని వివరిస్తూ నివేదికలు తయారుచేసి యిచ్చేవారు. వీనిలో వందేమాతరం వుద్యమంనుండి

సాగుచున్న పనిని సమీక్షించేవారు. తెలుగుదేశంలోని వారి అను భవ విజ్ఞానం ఇతర ప్రాంతీయులకుకూడా మార్గదర్శకంగా వుండేది.

నాగపూర్‌లో జరిగిన అఖిలభారత వయోజనవిద్యా మహా సభకు రావుగా రధ్యక్షత వహించారు. ముందుగానే వీరొక ప్రశ్నావళిని తయారుచేసి అన్ని రాష్ట్ర గవర్నమెంటులనుండి, అనధికార సంస్థలనుండి సమాచారం తెప్పించుకొన్నారు. వారి సమాధానా లంత సంతృప్తికరంగా లేకనో ఏమో వివిధరాష్ట్రాలలో స్వయంగా పర్యటించి విషయసేకరణచేసి అధ్యక్షోపన్యాసం వ్రాశారు. అది ఎల్లరి హర్షామోదాలు పొందింది. అప్పట్లో డా॥ పట్టాభి మధ్యప్రదేశ్ గవర్నరుగా వున్నారు. పట్టాభిగారీ మహా సభకు హాజరైనారు. నాగపూర్ ఆంధ్రులు సభ జరుపుకొని, ఆంధ్ర నాయకులను సన్మానించారు.

1953 అక్టోబరు 22 నుండి 31 తేదీవరకు 8 రోజులు 4వ అఖిలభారత వయోజన విద్యాగోష్ఠి బీహారు రాష్ట్రంలో పాట్నా సమీపముననున్న 'బిక్రం'లో జరిగింది. హరిసర్వోత్తమరావు గారు డైరెక్టరుగా ఎన్నుకోబడి గోష్ఠి చర్చలను అత్యంత ప్రయో జనకరంగాను, సమర్థవంతంగాను కొనసాగించారు. అప్పట్లో బీహారు గవర్నరుగానున్న ఆర్. ఆర్. దివాకర్ ప్రారంభోప న్యాసం చేశారు. సాంఘికవిద్యకు సంబంధించిన ముఖ్య నిర్ణయా లను సిఫార్సుచేసిం దీ గోష్ఠి.

1953 ఏప్రిల్ నెలలో మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిన్ ప్రాంతాలు, మేలో హైదరాబాద్ స్టేటు, అక్టోబరునెలలో బెంగాలురాష్ట్రం పర్యటించి అక్టోబరు 14వ తేదీకే పాట్నానగరం

చేరుకొని, వారంరోజుల పర్యంతం రోజుకు 4,5 గ్రామాల వంతున రావుగారు బీహారురాష్ట్రంలోని ముఖ్యకేంద్రాలు దర్శించారు. ఆయాచోట్ల గ్రామసీమల్లో పనిచేయుచున్న సాంఘిక సేవకులను కలుసుకొని ముచ్చటించారు. హిందీలో బహిరంగ సభల్లో ఉపన్యసించారు.

వివిధరాష్ట్రాల పర్యటన, కార్యకర్తలతో చర్చలు రావుగారి కెంతగానో తోడ్పడి గోష్ఠి కార్యక్రమాలను జయప్రదంగా నడిపించుటకు దోహదమిచ్చినవి. 1. అక్షరాస్యతా కేంద్రములు 2. గ్రంథాలయములు 3. వయోజన విద్యాకేంద్రములు 4. గ్రామసేవా కేంద్రములు 5. జనతా శిక్షణకేంద్రములు 6. విద్యాపీఠములు 7, చలన శిక్షణశాఖ 8, విద్యార్థి గ్రామసేవా శిబిరములు 9. ప్రబోధ ప్రచారశాఖలు 10. గ్రామ కళాకేంద్రములు ఎక్కడెక్కడ ఏ రీతిని పనిచేస్తున్నదీ స్వయంగా తెలుసుకొని, వాటి లోపాలోపాలు పరిశీలించి తగు సూచనలు చేస్తూ వచ్చారు. రావుగారి పర్యటనాంశములను, అనుభవాలను వారు వ్రాసుకొన్న సంగ్రహమైన నోట్సునుబట్టి తయారుచేస్తే నేటి సాంఘికసంక్షేమ కార్యక్రమాల్లో పనిచేయు కార్యకర్తలకు, విద్యావిషయమందాసక్తి గలవారికి ఎన్నో నూతనవిషయాలు తెలుసుకోటానికి ఉపయోగిస్తాయి.

మచ్చునకు రెండుభాగాలు వారి నోట్సునుండి వుదహరిస్తాను. 1953 మే నెలలో తిరువాన్కూరు కొచ్చిన్‌లు, తంజావూరు వెళ్ళారు. అక్టోబరు నెలలో బీహారు – బెంగాలులు సందర్శించారు. ఆ రెండు భాగాలను క్లుప్తంగా వ్రాస్తాను.

(1) "1951 మేనెల 1వ తేదీ తిరువాన్కూరు - కొచ్చిన్ : లైబ్రరీ అసోసియేషన్ పిలుపునందుకొని, తిరువనంతపురం వెళ్ళితిని. వారితో సంభాషణలు జరిపితిని. వారికి ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యక్రమం వివరించితిని. వారికి నా సలహాలు, ఐదేండ్ల ప్రణాళికలో ఇండియా గవర్నమెంటు గ్రంథాలయాలకిచ్చే సౌకర్యాల విమర్శ తిరువనంతపురం పబ్లిక్ లైబ్రరీని చూడటమైనది. 49,000 గ్రంథాలు స్వేచ్ఛోపలబ్ధి (open access) విధానం. దర్శకులు దినానికి 400. గ్రంథ పఠనం 200. చందాదార్లు 1200. దివ్యమైన భవనం. దీనిని సెంట్రల్ లైబ్రరీగా చేసుకొందామని వారి ఆలోచన.

మే 15 తంజావూరు : సరస్వతీ మహల్ గ్రంథాలయం చూచితిని. తెలుగు 900 లోను సంగీత సంబంధమైనవి ఒక 100. ఆంధ్ర యూనివర్సిటీవారు కేటలాగు గూడా చేయలేదు, మనం చేయగలిగితే మేలు. జంతువులు, మానవుల ఆకృతుల తారతమ్య పరిశీలన. ( Comparative study of animal and human features ) బొమ్మలు 85 కలవు. ప్రచురించ (Publish చేయ) దగినవిగా నున్నవి.

1953 అక్టోబరు 13: కలకత్తా చేరితిని. వెంటనే కేశవన్‌ను నేషనల్ లైబ్రరీలో కలుసుకొంటిని. లైబ్రరీ అంతా తిరిగి చూచితిని. 7 లక్షల 50 వేల గ్రంథాలు. బహు శుభ్రము. అందమైన ఏర్పాట్లున్నవి. పరిశోధకులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క స్థలం. దిన పత్రికల ఫైళ్ల బొటలు తీరినవి. అసుతోష్ ముఖర్జీ ధర్మము 80 వేల గ్రంథాలు. వేరుగా పరిపాలితమగుచున్నవి. వాటిని ఎవరికీ బయటికి యివ్వరు. రబ్బరు చక్రాల మీద రాకులు చక్కగా అమర్చినారు. ఆచూకీ గ్రంథాలకు తప్ప స్వేచ్ఛోపలబ్ధి ఏర్పాటు లేదు. ఏ పుస్తకమయినా తెచ్చి యివ్వడానికి దరఖాస్తు యిచ్చిన పది నిముషములకంటె ఎక్కువ పట్టదట. కలకత్తాకు, బంగాళమునకు బయటి చందాదార్లు, లైబ్రరీలు వగైరా 300. కలకత్తా చందాదార్లు 1600. పరిపాలనశాఖ విభజన బా

గుంది. క్లాసిఫికేషన్ తప్పులతో నిండిన ప్రాతవే పెట్టుకొన్నారు. మారిస్తే బహుళ సంఖ్యమీద కష్టాలు కలుగునని మార్చలేదు. బెంగాలు లైబ్రరీ అసోసియేషన్ పరీక్షలు వగైరాలు ఈ గ్రంథాలయంలోనే జరుపుతారు. 90 మంది శిక్షణ బొందుతున్నారు, స్త్రీలు చాలామంది గ్రంథాలయంలో పని చేస్తున్నారు. పరీక్షలలో చాలా బాగా నెగ్గుతున్నారు."

"ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్" ఇందులోనే ఇప్పటికి పెట్టినారు. చూస్తిని. సాయంత్రం కేశవన్ గ్రంథాలయ కార్యకర్తలను సమావేశ పరిచినాడు. ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్ ఉపాధ్యక్షునిగా నన్ను సన్మానించినారు. నేను ఆంధ్రదేశంలోని ఉద్యమ చరిత్ర చెబుతూ వయోజనులకు కావలసిన గ్రంథ సామాగ్రిని నిర్మించ డానికి, సేకరించడానికి, పంచిపెట్టడానికి కృషిచేయవలసిందనీ, గ్రామ సీమల్లో కేటలాగింగు, ఆచూకీ సేవకులకు తగిన పరిశోధనలు చేసి, తోడ్పడ వలసిందనీ, గ్రంథాలయోద్యమము ప్రజోద్యమంగా గుర్తించ వలసిందనీ హితబోధ చేస్తిని."

తుర్కీ కమ్యూనిటీ కాలేజి

1953 అక్టోబరు 14 పాట్నా చేరితిని. బేసిక్ ట్రయినింగుస్కూలు లోనే బస. ఇక్కడి వయోజన విద్యా విధానమునకు ప్రత్యేకబోర్డు, దాని కార్యదర్శి డిప్యూటీ డైరెక్టరు. సంవత్సరానికి 7 లక్షల రూపాయలు మంజూరు.

15వ తేది తుర్కీ. సర్వోదయ కళాశాల ( Comunity-College ) వుంది. ప్రిన్సిపాల్ శ్రీ చంద్రేశ్వర ప్రసాద్. ఇందులో యిప్పుడు గ్రాడ్యుయేట్లకు బేసిక్ ట్రయినింగు యిస్తున్నారు. యూనివర్సిటీ పరంగా దాని విద్యార్థులు సమగ్ర సేవకు ఈ శాఖలో యిక్కడ తరిబీదు అవుతారు. బేసిక్ హయ్యరు వారిని తీసుకొంటున్నారు. కాని యూనివర్శిటీ యింకా తీర్మానానికి రాలేదట. వారు చేయకపోతే గవర్నమెంటే గ్రామీణ విశ్వ విద్యాలయం నడుపుతుంది.

ఈ విద్యాలయానికి 'జనతా కళాశాల' అనుబంధంగా ఉంది. అచట 3విధాల పనిచేస్తున్నారు. (1) గ్రామస్థులకు సర్వోదయ శిక్షణ (మైసూర్ విద్యాపీఠ దృష్టి). (2) సంఘ విద్యా బోధకులకు శిక్షణ. (3) గ్రామ నాయకుల శిక్షణ. పంచాయతీలు, కోఆపరేటివు సొసైటీలు పంపేవారికి శిక్షణ (రామసాగర్ సాహి)."

లాల్‌గంజి శారదా పుస్తకాలయం

"16వ తేది తుర్కీ నుంచి కారులో లాల్‌గంజి చేరితిమి. అచటి శారదా పుస్తకాలయమును చూచితిని. 1914లో యిది స్థాపితమైనది. జె. పి. సా అనే పెద్దమనిషి దీనిని 1924 నుంచి నిర్వహిస్తున్నాడు. రెండంతస్థుల చక్కని భవనం, మంచి సుందరమైన తోట. ఆవరణ 7వేల గ్రంథాలు. ప్రపంచంలోని అన్ని దేశాలతో వుత్తరప్రత్యుత్తరాలు జరుపుతూ, వారినుండి పుస్తకాలు సేకరించినాడు. నూటికి 20ఇంగ్లీషువి, 80 హిందీ గ్రంథాలు.

ఈ గ్రంథాలయం మునిసిపాలిటీలో 30 వేల ప్రజల దగ్గరికి ఆరు గ్రామాలకు బైసికిళ్ళమీద పుస్తకాలు పంపుతుంది. మరి 20 గ్రామాలకు సైకిల్ సేవ వుంది. మొదటి రకానికి చందాలేదు. 2వది హైస్కూలు వగైరా విద్యార్థులకు. చదువు సామర్థ్యం చాలదని అకారాది క్రమము మీదే గ్రంథాలయ పంపిణీ ఆధారపరచు కొన్నాడు. కేటలాగు ఉప యోగము చేయడు. స్త్రీలకు పుస్తకాలు ఏరి లిస్టుచేసి వారికి ప్రత్యేక అలమరా, గది నిర్ణయించినాడు, పిల్లలకు ప్రత్యేక సేవవుంది. ఏఏజాతి గ్రంథాలు ఎంత ఉపయోగ పడిందీ ప్రతి యేడు లెక్కవేసి 5 యేండ్ల కొకసారి ప్రకటిస్తున్నాడు. 500మంది చందాదార్లు. చందా రెండురకాలు: ఒకరూపాయి, 3 రూపాయలు.

పఠనాలయం చాల విస్తారమైనది, పిల్లల పార్కుకు స్థలము సంపా దించి పరికరాలు అమరుస్తున్నాడు. మిద్దెమీద సభలు–సమావేశములు, సంగీత సభలకు పెద్ద హాలున్నది. బిల్డింగుకుగాను గవర్నమెంటువారు

15వేల రూ. యిచ్చినారు, ఇప్పుడుతుర్కీ—వైశాలీ కేంద్రీకృత కార్యక్రమానికి గాను 32 వేల రూ. గ్రాంటు మంజూరైనదట."

రావుగారి అఖిలభారత పర్యటనలను పరిశీలించినపుడు, ముఖ్యంగా విద్యా వైజ్ఞానికవిషయక మహాసభలలోను, సదస్సులలోను పాల్గొన్నట్లు కనిపిస్తుంది. ఈ సందర్భాలలోనే దేశంలోని ప్రాచీన శిల్ప, కళా, చారిత్రక, తీర్థయాత్రాస్థలా లనేకం సందర్శించారు. బొంబాయిప్రాంతం వెళ్ళినప్పుడు ఔరంగాబాద్, అజంతా, ఎల్లోరాలను, మైసూరుకు పోయినప్పుడు గోమటేశ్వర విగ్రహాన్ని, ఆంధ్రలో అమరావతి, నాగార్జున కొండలను, ఇలానే ఢిల్లీ, బెంగాలు, బీహారు, కేరళంలోని ప్రకృతి రామణీయక దృశ్యాలను తిలకించారు.

వివిధ విశ్వవిద్యాలయములను, విద్యాపీఠములను, బరోడా, తంజావూరు నేషనల్ లైబ్రరీలను చూచి, ఆయా అధికారులతోను, విద్యా సేవకులతోను సంభాషించారు. పాట్నా, ఢిల్లీ, అన్నామలై, ఆంధ్రా, మద్రాసు, ఉస్మానియా యూనివర్శిటీల ఆహ్వానాన్ని అందుకొని అందుపన్యసించారు.

మహాసభల్లోను, శిక్షణశిబిరాలు, గోష్ఠుల సమయాలలోను ఆయా ప్రాంతాలలోని సంగీత, నృత్య నాటక కళారీతులను రావుగారు రాత్రిళ్ళుకూడా ఓపికతో చూచేవారు. బెంగాలీల సంగీత ప్రదర్శనలు, మహారాష్ట్రి పంజాబీల జానపద కళారూపాలు, కేరళ కథాకళి నృత్యాలు, మైసూరులో యక్షగానాలు, శ్రీరంగపట్టణంలో తోలుబొమ్మలాటలు, మద్రాసులో భరతనాట్యములు, ఆంధ్రలో హరికథలు, బుర్రకథలు, కూచిపూడి నృత్యప్రదర్శనములు, ఉత్తరాదిన హిందీ, సంస్కృత నాటకములు మున్నగునవి చూచి

ఆనందించినట్లు అక్కడక్కడా వారు వ్రాసుకున్న డైరీల మూలంగా అర్థమవుతుంది, చిన్నతనంలో మద్రాసులో చదువు కొనేటప్పుడు రావుగారు మంచి నాటకాలకుమాత్రం వచ్చి చూస్తుండేవారని సీతాపతిగారు చెప్పారు. వీటినిబట్టి హరిసర్వోత్తమరావుగారి కళాహృదయం తెలుస్తుంది.

10-1-1945 వ తేదీ వార్ధా సేవాగ్రాంలో జాతీయ విద్యా సమావేశం జరిగినప్పుడు రావుగా రందులో పాల్గొన్నారు. ఆ ముఖ్య సమావేశంలో గాంధీజీ బేసిక్ విద్యావిధానాన్నిగురించి వివరించారు. 1938లో కాంగ్రెస్‌మంత్రులు కొన్ని ప్రయత్నాలు చేశారుగాని, తర్వాత బ్రిటిష్‌ప్రభుత్వం శ్రద్ధతీసుకొనక వదలి వేసింది. బేసిక్‌విద్యను సమీక్షచేయటమే ఆ సమావేశ ముఖ్యోద్దేశం. గాంధీజీ ఉపన్యాసాన్ని శ్రీ జాకిర్‌హుస్సేన్ చదివారు. ఆనాటి చర్చల్లో హరిసర్వోత్తమరావుగారు పాల్గొని, అఖిల భారత స్థాయిలో గుర్తించబడిరని మద్రాసునుండివెళ్ళిన డాక్టరు శర్మగారు చెప్పారు.

ఆ సమావేశమునుగూర్చి రావుగారి డైరీలో ఇలా వ్రాసుకున్నారు :

"10-1-45 జాతీయ విద్యా సమావేశమునకు వార్ధా సేవాగ్రాం చేరితిని. వార్ధాలో ఆశ్రమంమీద ఆధారపడిన బేసిక్ ఎడ్యుకేషన్ కేంద్రము ఒక నేతశాలతప్ప గాంధీతత్వము వూరికి అంటలేదు. పతాకోత్సవమప్పుడు అచట చేరినవారికి శిక్షణ చాలదని స్పష్టమయింది.

గాంధీజీ హాజరు. జాకిర్‌హుస్సేన్ చదివారు. బీహారులో బేసిక్ విద్య ఉత్తమంగా సాగుతున్నదట. బెంగాలు క్షామపు పిల్లల రక్షణకు ఈవిధానం అమలుకు తెచ్చినారు. బోధకులకు 3 నెలలుమాత్రం శిక్షణ యిచ్చినారు. దక్షిణయిండియాలో పని సున్న. 'ప్రపంచభాష ఇంగ్లీషు'

మీడియం మాతృభాష వాడవలెను' మహాసభ తీర్మానం వయోజన విద్యబాపతు కాదని నా ఆక్షేపణ. చర్చానంతరం తాల్మీ సంఘానికి నివేదించడం జరిగింది. ఇప్పటి అక్షర ప్రచారానికి, గ్రంథాలయోద్యమానికి యిది అడ్డురాదు."

—రావుగారి డైరీనుండి

1949 మే 8వతేదీ దక్షిణాదిన పెరియనాయకర్‌పాలెంలో 'వయోజన విద్యావిధానము'నుగూర్చి ముఖ్య విద్యావేత్తలమధ్య ఒక చర్చ జరిగింది. రావుగారు వెళ్ళి పాల్గొన్నారు. వారి డైరీలో ఇలా వ్రాసుకొన్నారు :

"రిపోర్టులు — విమర్శనలు. ఆర్యనాయకం.

(1) ప్రీ-బేసిక్ (Pre-Basic) విద్యా విధానం విమర్శలో తల్లికి విద్యాగంధమేలేకుంటే లాభంలేదన్న సంగతిని పురస్కరించుకొని, తల్లియొక్క అక్షరాస్యతకు ఏమి స్థానమిస్తారని అడిగితిని. ఆమెకు కొంత జ్ఞానంమీద జిజ్ఞాస కలగడంతో చదువు — వ్రాత నేర్పుతామనిరి.

(2) జిజ్ఞాసలేనిది వయోజనులకు యెవ్వరికీ అక్షరాస్యత గలుగదనీ, అక్షరాస్యతకొరకే అక్షరాస్యతఅనేది పిల్లలవిషయంలో నిజం కావచ్చునేమోగాని, పెద్దల విషయంలో నిజంకాదని చెప్పుతూ, హిందూస్థానీ తాల్మీ సంఘాభిప్రాయమేమో తెలుపమంటిని,

ఆర్యనాయకం తాము ప్రజల అక్షరాస్యతకు వ్యతిరేకముగాదనీ, సర్కారు డబ్బు పెట్టలేనప్పుడు పిల్లల చదువులకే ప్రాధాన్య మిస్తామనిరి, దానికెంత దీనికెంత అని బడ్జెటుసమస్యఅయితే యిప్పుడూ పిల్లల విద్యకు కోట్లు, వయోజనవిద్యకు లక్షలుమాత్రం కాబట్టి తగవు పనిలేదని జవాబుచెప్పితిని.

పోస్టు బేసిక్ స్కూలు (Post Basic School) మరితర విషయా లలో - చర్చలో నాకు తోచిన నాల్గుమాటలు చెప్పితిని"

—రావుగారి డైరీనుండి

'యునెస్కో' వారి సహకారంతో పనిచేయుటకు ఏర్పడిన నేషనల్ కమీషన్ యొక్క విద్యావిషయక ఉపసంఘంలో హరిసర్వోత్తమరావుగారిని సభ్యుడుగా 1953 ఆగష్టులో కేంద్ర విద్యామంత్రిత్వశాఖ నియమించింది. హుమాయూన్ కబీరు విద్యాశాఖా మంత్రిగా మదరాసు విచ్చేసినపుడు విద్యావిషయ కంగా రావుగారు చేస్తున్న కృషిని గమనించడం, స్వయంగా రావుగారి యింటికి రావటంకూడా జరిగింది.

1956 ఫిబ్రవరి 6,7 తేదీలలో న్యూఢిల్లీలో 'యునెస్కో' కు సంబంధించిన ద్వితీయ మహాసభ జరిగింది. అందు రావుగారు ఇండియాతరపున ఒక ప్రతినిధిగా పాల్గొన్నారు.

1955 అక్టోబరు 6-26 తేదీలలో ఆసియా ఖండంలో పబ్లిక్ గ్రంథాలయాల అభివృద్ధి నిమిత్తం ఢిల్లీలో ఒక ముఖ్య మైన సెమినార్ జరిగింది. అందులో రావుగారు ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్ ప్రతినిధిగా పాల్గొన్నారు. గ్రంథాలయముల అభివృద్ధికి హరిసర్వోత్తమరావుగారు అనేక సూచనలు గావిస్తూ ప్రత్యేక వ్యాసం చదివారు.

భారత విద్యార్థులకు యు. యన్. ఓ., యునెస్కో సంస్థల వల్ల లభ్యమగు స్కాలరుషిప్పులనుగూర్చి 'యునెస్కో' క్లబ్బుల ఏర్పాటును గురించి ఆ యా సంఘ కార్యాలయములతోను, యివి ఏర్పాటు చేయబడిన తిరువాన్కూరు విశ్వవిద్యాలయం మొదలగు వాటితోను రావుగారు ఉత్తరప్రత్యుత్తరాలు జరిపారు. తిరువా

న్యూయార్క్ విశ్వవిద్యాలయంలో 'యూనెస్కో-క్లబ్బు' ఒకటి ఏర్పడి పని చేస్తున్నది. ఆంధ్ర యూనివర్సిటీలో గూడా ఒక యునెస్కో-క్లబ్బును, ప్రత్యేక గ్రంథాలయమును నెలకొల్పుటకు రావుగారు కృషి చేశారు. దానికి సారస్వతం తెప్పించే ఏర్పాట్లు చేశారు.

మనదేశంలో యునెస్కోతో సహకరించి పనిచేయుటకు న్యూ ఢిల్లీలో "ఒక నేషనల్ కమీషన్" ఏర్పాటు చేయబడింది. దీనికి వేరువేరు సబ్ కమిటీలున్నవి. వీరు వివిధ రాష్ట్రాలలో సెమినార్లు, గ్రూపుచర్చలు, మహాసభలు జరుపుతున్నారు. ప్రత్యేక గ్రంథాలయములను, క్లబ్బులను స్థాపించి వాటికి సారస్వతాన్ని పంపుతున్నారు. 'యునైటెడ్ నేషన్సు దినోత్సవం' జరుపుతున్నారు. సాంఘికసేవ విషయంలో కొన్ని ప్రయోగాలు చేసి, పరిశోధనలు జరుపుతున్నారు. రావుగారు 1953 నుండి 1957 వరకు యునెస్కోకు సంబంధించి విద్యావిషయిక సమస్యలలో ప్రముఖంగా పాల్గొన్నారు. యునైటెడ్ నేషన్సు దినోత్సవ ప్రాముఖ్యతను విశదీకరించేవారు. బీహారు రాష్ట్రమునకు రావుగారు వెళ్ళినపుడు, పాట్నా అసోసియేషన్‌వారు ఆహ్వానించి ప్రత్యేక యునెస్కో సభ జరిపించారు. 'యునెస్కో' వారి సహాయం పొందుటకు ఉపాధి-విద్యార్థుల సలహా సంఘం (Employment Student Bureau)యేర్పడి పనిచేస్తున్నదని తెలుసుకొని, అలాంటి ఉపకార వేతనములు మన యూనివర్సిటీ విద్యార్థులకుగూడా వచ్చునట్లు ప్రయత్నించారు.

"ఇంతకు పూర్వం గ్రంథాలయోద్యమ ప్రచారం అంటే గ్రంథాలయాల ప్రయోజనాలను వివరించి దానివల్ల పుణ్యమూ, పురుషార్థమూ వున్నవని చెప్పి గ్రంథాలయాలను నెలకొల్పించుట, వూరూర గ్రంథాలయ సభలనూ, యాత్రలనూ చేయించుట. ఇది ఉద్యమ ఆరంభస్థితిలో చేసిన ప్రచారం, చేయవలసిన ప్రచారం కూడ.

ఈనాడు గ్రంథాలయాల ప్రయోజనాలను, దానివల్ల కలిగే ఆధ్యాత్మిక, ఆధిభౌతిక ఫలితాలను మనము వివరించ పనిలేదు. ప్రజలలో అభివృద్ధికి రావలెననే ఆకాంక్ష కలుగుతునే వున్నది. నేడు చేయవలసింది క్రమ పద్ధతిపైన గ్రంథాలయాలను నడిపించుకొమ్మని ప్రబోధించి, ప్రజలకు నిత్య జీవితంలో గ్రంథాలయంతో అవసరమూ, అభిరుచీ కలిగేటట్లూ, ఆమూలాగ్రంగా ప్రజలకూ, గ్రంథాలయాలకూ సన్నిహిత సంబంధము కలిగేటట్లూ పద్ధతుల నాలోచించి ప్రచారంలోకి తీసుకరావడం."

— గాడిచర్ల హరిసర్వోత్తమరావు

## ౬

# వివిధ ప్రజా ఉద్యమాలు

పంచాయతీ మహాసభలు–సహకార మహాసభలు–ప్రాథమికోపాధ్యాయ మహాసభలు – విద్యార్థి మహాసభలు–యువజన మహాసభలు – హిందీ ప్రచార సభలు–పత్రికా రచయితల మహాసభలు–ఆంధ్ర నాటక కళా పరిషత్తు సభలు – ఆంధ్రరాష్ట్ర నిర్మాణ కార్యకర్తల సభలు – ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ పనిముట్ల ఉత్పత్తిదార్ల మహాసభలు – చెన్నరాష్ట్ర చేనేత పారిశ్రామికుల మహాసభలు – ఆంధ్రరాష్ట్ర పశుప్రదర్శనములు – శ్రీకృష్ణదేవరాయ జయంత్యుత్సవములు – సంఘ సంస్కరణ, మహిళాభ్యుదయం– సంగీత కళాభిరుచి– రాయల సీమ క్షామనివారణ–ఐక్యక్షామ నివారణ సంఘం–కోస్తాజిల్లా తుపాను బాధితులకు సహాయం – రాయలసీమ ప్రాజెక్టు, రైతు సంఘముల మహాసభలు – రాయలసీమ సేవాసమితి – తెలంగాణా పర్యటన.

౬

# రాష్ట్ర ప్రజాసంఘాల మహాసభాధ్యక్షతలు

హరిసర్వోత్తమరావుగారు అనేక రాష్ట్ర ప్రజా సంఘాల మహాసభలకు అధ్యక్షులుగాను, ప్రారంభకులుగాను వుండి తమ అర్హతను ఋజువు చేసుకున్నారు. ఇందులో పంచాయతీ మహాసభలు, సహకార మహాసభలు; ఉపాధ్యాయ, యువజన, విద్యార్థి మహాసభలు; రాష్ట్ర హిందీ ప్రచారసభలు, రాష్ట్ర నిర్మాణ కార్యకర్తల మహాసభలు, రాష్ట్ర చేతివృత్తులవారి సభలు, రాష్ట్ర చేనేత పారిశ్రామిక మహాసభలు; రాష్ట్ర పత్రికా రచయితల మహాసభలు, రాష్ట్ర నాటక కళాపరిషత్తు మహాసభలు; రాష్ట్ర పశుప్రదర్శనములు, రాష్ట్ర ప్రాజెక్టుల మహాసభలు; శాంతి మహాసభలు మొదలగువాటిని పేర్కొనవలసి వుంది.

ఇన్ని మహాసభల కధ్యక్షత వహించగలిగిన శక్తి సామర్థ్యాలు, పరిజ్ఞానం ఆంధ్ర నాయకులలో బహుకొలది మందికి మాత్రమే వుంది. అట్టివారిలో రావుగారొకరు ప్రముఖంగా చెప్పుకోదగినవారు.

## పంచాయతీ మహాసభలు

"నేను సంపూర్ణ పంచాయతీరాజ్య వాదిని. గ్రామాల్లో మరి ఏ అధికారం చెల్లరాదనే వాడను" అంటారు రావుగారు. 'పంచాయతీ' పత్రికకు సంపాదకత్వం వహించి, ప్రజలలో పంచాయతీ చైతన్యం గలిగించుటకు పాటుపడినారు. అనేక

పంచాయతీ మహాసభల కధ్యక్షత వహించారు. 1938 లో 'మద్రాసురాష్ట్ర పంచాయతీబోర్డుల యూనియన్' స్థాపనలోను, దాని నిర్వహణలోను రావుగారు ప్రముఖపాత్ర వహించారు.

పంచాయతీపాలన కావాలని గాంధీజీ జాతీయోద్యమకాలం నుండి ఎలుగెత్తి చాటారు. సక్రమ ప్రజాస్వామ్య పరిపాలనకు గ్రామ పంచాయతీలే ప్రాతిపదిక సంస్థలని నేడెల్లరూ గుర్తిస్తున్నారు. స్వరాజ్యావతరణానంతరం కాంగ్రెస్ ప్రభుత్వాలు 'ప్రజాస్వామ్య వికేంద్రీకరణ పథకాన్ని' అమలు జరుపుతున్నవి. మొదట మన కాన్‌స్టిట్యుయెంటు అసెంబ్లీలో, రచనా సంఘంలో పంచాయతీరాజ్యమే ఆదర్శంగా ఉండాలనే సమస్యపై తర్జన భర్జనలు జరిగినవి. డాక్టరు అంబేద్కర్ దీనిని త్రోసిపుచ్చారు. ప్రకాశం, రంగా, కె. సంతానం ప్రభృతులు అంబేద్కరు వాదనల నెదుర్కొని గ్రామపంచాయతీల ప్రాధాన్యతను ఆనాడు ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. పర్యవసానంగా మన నూతన రాజ్యాంగంలో డైరెక్టివ్ ప్రిన్సిపల్సు (Directive Principles of the constitution) లో "భవిష్యత్ రాజ్యాంగానికి గ్రామపంచాయతీలను ప్రాతిపదిక సంస్థలుగా రూపొందించా" లని నిర్దేశించారు. బల్వంతరాయిమెహతా కమిటీ నివేదిక సిఫార్సుల ననుసరించి దేశంలో అమలుజరుగుచున్న (1) గ్రామ పంచాయతీలు (2) పంచాయతీసమితులు(3)జిల్లాపరిషత్తులుఅను పంచాయతీరాజ్య వ్యవస్థనుగూర్చి హరిసర్వోత్తమరావుగారు 1946 సంవత్సరంలోనే ఎంత దూరదృష్టితో ఆలోచించి విశదీకరించారో రావుగారి 2 వ తూర్పుగోదావరిజిల్లా పంచాయతీబోర్డుల మహాసభాధ్యక్షోపన్యాసం చదివితే తెలుస్తుంది:

## 1. గ్రామపంచాయతీలు

"గ్రామానికొక పంచాయతీ శాసనబద్ధంగా ఏర్పడితీరవలెను. గ్రామంలోని యుక్తవయస్కులందరి వోటుమూలకంగా ఈ పంచాయతీ ఏర్పడవలెను. స్త్రీ పురుషభేదములు, కులమత వర్ణభేదములు యిందులో కన్పించరాదు. ప్రతివోటరు పరిపాలకుడుకావడానికి అవకాశముండవలెను. వోటింగుకు రహస్యవిధానమే అవలంబించవలెను.

ఈ పంచాయతీలు నెరవేర్చవలసిన ధర్మాలేమిటీఅంటే, గవర్నమెంటులోని అన్ని ఇలాకాలకు సంబంధించిన నౌకరులు గ్రామాలలో యీవేళ యేయే ధర్మములునిర్వహిస్తున్నారో అన్నిదర్మాలను నిర్వహించడానికి సంపూర్ణాధికారముండవలెను. ఇలాకాల అధికారులు పంచాయతీలకు సలహాదారులుగా వుపచరించవలసిందేగాని, పంచాయతీలను కాదని గ్రామవ్యవహారములలో వ్రేలుపెట్టే అధికారంగలవారుగా వుండకూడదు. తుదకు గ్రామంలో వసూలుకావలసిన భూమిశిస్తువగైరాలు వసూలుచేసేఅధికారం పంచాయతీలకే వుండవలెను. లెక్కలువ్రాసే కరణాలు, వసూలుచేసే మునసబులు పంచాయతీ నౌకరులుగా ఏర్పడవలెను.

## 2. ఫిర్కాపంచాయతీలు

ఒకగ్రామంకంటే, యెక్కువప్రదేశాలకుచెందినపనులు చేయడానికి పంచాయతీల జాయంటుకమిటీలు ఏర్పడవలెను. ఫిర్కాకొక కమిటీ యిటువంటిది అవసరము. ఇదే ఫిర్కాపంచాయతీకాగలదు. ఇందులో ఆ యాగ్రామ పంచాయతులప్రతినిధులు సభ్యులుగాను, ఆయా యిలాకాల అధికారులు సలహాదారులుగాను వుంటారు. తాలూకాబోర్డుల మాట యికరాదు.

## 3. జిల్లాపంచాయతీలు

ఇప్పటి జిల్లాబోర్డులు రద్దుకావలెను. వాటి స్థానేఫిర్కాపంచాయతీల ప్రతినిధులు సభ్యులుగాను, ఆయా యిలాకాల అధికారులు సలహాదార్లు

గాను జిల్లాపంచాయతీలేర్పడి జిల్లావ్యవహారములు నడుపవలెను.....

....గ్రామపంచాయతీలకంటే ఫిర్కాపంచాయతీలకు, వాటికంటే జిల్లాపంచాయతీలకు ఎక్కువప్రాంతాలకు సంబంధించిన విషయాలలో ఎక్కువజోక్యం సహజంగానే కలుగుతుంది. జిల్లాపంచాయతుల కార్య సమన్వయం చేయడానికి కోస్తాపంచాయతులు, అఖిలభారతపంచాయతులు ఏర్పడేవరకు నేటి శాసనసభలు వగైరాలు కోస్తాపంచాయతులుగాను, పార్లమెంటు అఖిలభారత పంచాయతీగాను వుపకరిస్తాయి. ఇవి స్థూలంగా నా సూచనలు....

"ఇప్పుడు పంచాయతీలు స్తంభించిపోవడానికి అందుకుసంబంధించిన ఆఫీసర్లంతమందీ, అన్నీ తపాలాఫీసులయిపోవడం, పరిపాలన వట్టి కాగితపుపరిపాలన అయిపోవడం కారణము. ఈ స్థితిని వెంటనేమార్చవలెను. పంచాయతీ ఆఫీసరు, రెవిన్యూయిన్స్పెక్టరు, జిల్లాబోర్డు పబ్లిక్ వర్క్సు వోవర్సీయర్లు, హెల్తుయిన్స్పెక్టర్లు, వ్యవసాయడెమాన్‌స్ట్రేటర్లు, పశువులడాక్టర్లు-వీరందరూ ఎప్పటికప్పుడు సమావేశమై ఏయే పంచాయతీలకు ఏయే అవసరములున్నవో తెలుసుకొని, తమ తమ డిపార్టుమెంటులలో జరుగవలసినపనిని వెంటనే జరిగేటట్లును, వీరందరూ జట్లుజట్లుగా పంచాయతీలకుపోయి, ప్రజలుచేసుకొనవలసిన కార్యము లిట్టివియని తాము స్వయముగా, నిదర్శనపూర్వకముగా చేసి చూపడమున్నూ జరిగితే మంచిఅభివృద్ధికి నేటి పరిమిత పరిస్థితులలో గూడా అవకాశమున్నది."

—1946 డిసెంబరు 3 వ తేదీ 2 వ తూర్పు గోదావరిజిల్లా పంచాయతీ బోర్డుల మహాసభ: అధ్యక్షోపన్యాస భాగాలు.

1937 సెప్టెంబరు 30 వ తేదీ బెజవాడ జిల్లా పంచాయతీ బోర్డు అధ్యక్షుల మహాసభలో రావుగారు ప్రారంభోపన్యాసం చేశారు. అందు అప్పుడున్న "లోకల్‌బోర్డుల శాసనము - గ్రామ పంచాయతీల స్థానము" అను సమస్యపై ఉపన్యసించారు.

రాయలసీమ పంచాయతీబోర్డుల మహాసభకుకూడ అధ్యక్షత వహించారు.

1923 లో కాకినాడ కాంగ్రెస్ మహాసభ జరిగే సందర్భంలో ఆంధ్రదేశంలోని స్థానిక స్వపరిపాలనాసంస్థ సేవకుల సమావేశమొకటి జరిగింది. అప్పటినుంచీ లోకలుబోర్డు చట్టములలోని లోపాలను ఎత్తిచూపుతూ, వీటిద్వారా కొంత నిర్మాణ కార్యక్రమం సాగించుటకు తెలుగు దేశభక్తులు పనిచేస్తూ వచ్చారు. హరిసర్వోత్తమరావుగారు ఈ కృషిలో సైతం ముందుండి పనిచేశారు. "పంచాయతీలనుండి - పార్లమెంటు వరకు" అను సూచన ఆనాడు రావుగారిచ్చినదే.

## సహకార మహాసభలు

సహకార జీవనతత్వాన్ని మనసారా వాంఛించేవారిలో రావుగారినిగూడా ప్రధానంగా పేర్కొనవలసివుంది వీరు పెట్టుబడిదారీ పద్ధతులలోని చెడుగులను ఆకళింపు చేసుకొన్నారు. 'కాపిటలిజం'కు కాలదోషం పట్టిందన్నారు. డెన్మార్కు, ఐర్లెండు, కెనడా దేశాల సహకార జీవితాన్ని అధ్యయనం చేశారు. మనకు సహకారమే తరణోపాయమని నమ్మి అందుకు కృషిచేశారు.

"పదిమంది బీదలుచేరి సాహుకారిని మించవచ్చును.
పరస్పరసహాయము, త్యాగములు పరమసోపానములు.
పనికి, త్యాగమునకు తావుకావలె. డబ్బుకు సామ్రాజ్యముండరాదు."
—'ప్రతివాని జీవనమె-అందరిజీవనము
అందరిజీవనమె-ప్రతివాని జీవనము'

ఇవి రావుగారి నోట్సులో అక్కడక్కడా వ్రాసుకున్న భాగాలు. ఈ సహకార విధానమునుగూర్చి లోతుగా, వ్యవసాయ

పారిశ్రామిక దేశాల అనుభవాలను, సోషలిస్టు - కాపిటలిస్టు సమాజంలో సహకార వ్యవస్థను వీరు సమగ్ర పరిశీలన చేసినట్లు కనిపిస్తుంది. ఈ అంశాలమీద తేలిక భాషలో ఒక పుస్తకం వ్రాయ సమకట్టారు. కాని ఎందుచేతనో దానిని పూర్తిచేసి ప్రచురించజాలక పోయినారు. తాము ఏ బహిరంగసభలో ఉపన్యసించినా, సహకార పద్ధతే సర్వజన శ్రేయోదాయకమని ఉద్బోధించేవారు. పత్రికల కనేకవ్యాసాలు వ్రాశారు. వాటిల్లో మనలను మనం పరిపాలించుకొనుటకు పంచాయతీరాజ్య మెంతఅవసరమో, మన ఆర్థిక జీవనవ్యవహారములు నడుపుకొనుటకు సహకార సంస్థలంత ముఖ్యమని విశదీకరించారు. సక్రమ ప్రజాస్వామ్య పాలనకు వ్యక్తి వోటు ఎంత ప్రాధాన్యమో, సహకార సంఘాల్లో గూడా వ్యక్తి వోటు ప్రజాస్వామ్య పద్ధతికి అంత ముఖ్యమని వివరించారు.

అనేక సహకార మహాసభలకు రావుగారధ్యక్షత వహించారు. శిక్షణ తరగతులు నిర్వహించారు. ఆలమూరు కో అపరేటివుసంస్థ తరఫున కో ఆపరేటివ్ సొసైటీలవారికి క్లాసులుపెట్టి సహకార సేవకులకు, ఉద్యోగులకు పాఠాలు చెప్పారు.

11 వ ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభ పశ్చిమ గోదావరి జిల్లా భీమడోలులో 29-4-1941 వ తేదీన జరిగింది. హరిసర్వోత్తమరావుగారు ఆమహాసభాధ్యక్షత వహించారు. రావుబహదూర్ మోతే గంగరాజు జమిందారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగానుండి భీమడోలు మహాసభలను దిగ్విజయంగా జరిపించారు.

రాష్ట్ర సహకార నాయకులైన వేమవరపు రామదాసు, డాక్టరు పాలకోడేటి గురుమూర్తి, నరసింహదేవర సత్యనారా

యణ, వాడ్రేవు వియ్యన్న మున్నగు ప్రముఖులంతా దీనిలోపాల్గొన్నారు. 800 మంది రాష్ట్రంలోని అన్ని జిల్లాలనుండి ప్రతినిధులుగా వచ్చారు. దేశదేశాల అనుభవాలతో రావుగారు సహకారోద్యమ విశిష్టతను జెప్పి అభివృద్ధి కనేక సూచనలు చేశారు.

నాడు జరిగిన క్షీరసాగర మధనంలో ఆవిర్భవించిన వాటిల్లో రాష్ట్రీ మహాసభల ఏర్పాట్లకు ఉప నిబంధనలు తయారుచేయుట ఒకటి. ఉపసంఘానికి రావుగారు కన్వీనరుగా వుండి ప్రజాస్వామికమైన చక్కని నిబంధనలు తయారుచేశారు. ఆనాటి నిబంధనల ననుసరించియే, నేటికీ రాష్ట్రి సహకార మహాసభలు జరుగుతున్నవి. సహకార సమస్యలనుగూర్చి, మహాసభా నిర్వహణ చర్చలలో రావుగారు చూపిన గాంభీర్యం, సమయస్ఫూర్తి, ప్రశాంత చిత్తత ప్రశంసనీయమైనవి.

1943 ఫిబ్రవరి 20 వ తేదీ విజయనగరం కో ఆపరేటివు బ్యాంకుయొక్క రజతోత్సవ మహాసభకు హరిసర్వోత్తమరావు గారధ్యక్షత వహించారు. కాపిటలిజం, సోషలిజం, సహకార సిద్ధాంతాలను గురించి రావుగారానాడొక మహోపన్యాసం యిచ్చారు.

1932 లో తమతో సహకరించే మిత్రులతో కలిసి ది సౌత్ ఇండియన్ కో ఆపరేటివ్ ఇన్సూరెన్స్ సొసైటీ లిమిటెడ్ (The South Indian Cooperative Insurance Society LTD) అనునొక సంస్థను స్థాపించారు. కేంద్ర సహకారబ్యాంకులు, భూమితనఖా బ్యాంకులు యిందులో వాటా తీసుకొనే విధంగా సమన్వయం కుదిర్చారు. స్థానిక బ్యాంకులున్నచోటనే ఈ సొసైటీ తరఫున ఒకరు, బ్యాంకు పక్షమున ఒకరు, స్థానికంగా పలుకుబడిగల డాక్టరు ఒకరు, ఈ ముగ్గురితో బోర్డువుండి సొసైటీ పనిచేసేటట్లు

ఒక పథకం తయారుచేశారు. వేమవరపు రామదాసుపంతులుగారు ఈ కేంద్ర సొసైటీకి ప్రెసిడెంటు. మద్రాసులోని ఎస్ప్లనేడ్‌లో దీని ఆఫీసు వుండేది.

* "సౌత్ ఇండియా కోఆపరేటివ్ ఇన్సూరెన్సు సొసైటి రెండు ఆశయాలను సాధించటంలో ఉచితమైన పద్ధతి కన్పిస్తున్నది. లాభార్జనాపరుల శాఖగా గాక, తమ స్వీయయాజమాన్యంలో ప్రత్యక్షనిర్వహణలో నా ప్రాంతంలోని ప్రజలకు, వారు పొదుపుచేసి మిగిల్చిన పైకంవల్లనే భవిష్యత్తుకు ఆధారాన్ని ఏర్పాటుచేయగల్గుతారు. అందులో ఉచ్చనీచ భేదంలేకుండా, అందరికీ సమానావకాశాలుంటాయి. తోడ్తోడనే, ఇతరుల సహాయంమీద ఆధారపడకుండా ప్రజా విద్యాప్రచారం చేయగల్గుతుంది."

— రావుగారి వ్యాసంనుండి

ఈ యిన్సూరెన్సు సొసైటీని అవకాశం చేసుకొని, ప్రజల్లో పనిచేయుట కవకాశం వుంటుందని రావుగారు తలచారు, ఇందుకుగాను 1932, 33 సంవత్సరాల్లో ఆదోని, బళ్లారి, నంద్యాల, కర్నూలు మున్నగు ప్రాంతాలు స్వయంగా వెళ్ళి ఈ సహకారసంఘ అభివృద్ధికి కొంతకాలం వినియోగించారు. కాని పరిస్థితులు అంత ఆశాజనకంగా వున్నట్లు కనుపించలేదు.

---

* "The south Indian Co-operative Insuarance society offers a proper method to achieve two objects. It can help people in my area to provide for their future by thrift, not under the wings of profit - earners, but under their own direct owner - ship and management, with equal opportunities for all, high and low, and at the same time carry on popular education without depending upon others for assistence"

— Circular from Rao

ఈ సహకారసంస్థ రాష్ట్రంలో వేళ్లు పాదుకొన లేకపోయింది. తిరిగి ప్రచారం చేద్దామని స్నేహితులకు వుత్తరాలు వ్రాశారు. ఐతే ప్రచారం, ప్రజాసేవ వేరు. సహకార సొసైటీ అయినా సంస్థల నిర్వహణ, వ్యాపారసరళి వేరుగదా! అలాంటి వ్యాపార దృష్టి రావుగారిలో కానరాదు. అందుకనే ఆ ప్రయత్నం విఫలమైంది.

16-5-1931 వ తేదీ మడకశిరలో వెనుకబడిన ప్రాంతాల సహకార సంఘముల మహాసభకు రావుగారధ్యక్షత వహించి, వేదాంతానికి - సహకారపద్ధతిని జోడించి ఉపన్యసించారు:

"సహకార సిద్ధాంతం - మన వేదాంత సిద్ధాంతముల ననుసరించి యున్నది. 'మనది అని ఒక్కటిని తలంపగూడదు. పదిమందికోసరం బ్రతికిన బ్రతుకే బ్రతుకు'. ప్రాచీనకాలంలో మనవారు ధర్మములను గూర్చి చెప్పిరేగాని. హక్కులనుగూర్చి చెప్పలేదు. నేను అంటే అహంకారం. అహంకారము కలహమునకు కారణము. ఇది నైతికోద్యమముగూడా. ఇకముందు సహకారమనునది ఒక మతము కాగలదు. ఇకముందన్నిటికీ సహకారమే ఏకైక సాధనము కాగలదు."

"....విద్యావంతులైనవారు తమ మంచి గుణములను అభివృద్ధి చేసుకొని దేశసేవకై నడుముకట్టి, సహకారోద్యమమును చక్కని పద్ధతులలో నడుపవలెనని కోరుచున్నాను."

— రావుగారి అధ్యక్షోపన్యాస భాగాలు ('కామోదకి' పత్రికనుండి)

## ప్రాథమికోపాధ్యాయ మహాసభలు

మద్రాసు కౌన్సిలులో ప్రభుత్వము ప్రాథమికోపాధ్యాయ విద్యా శాసనం తయారుచేయు సందర్భంలో రాష్ట్ర సంఘం 1927 డిసెంబరులో రిజిష్టరు చేయబడినది. జి. సుబ్బరామయ్య కార్యదర్శిగా వుండేవారు.

5-5-1928 తేదీన ప్రథమ అవసర రాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ మహాసభ గుంటూరులో హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను జరిగింది. గవర్నమెంటు ప్రవేశపెట్టు బిల్లు చాల అసంతృప్తికరంగా నున్నదిగాన దీనిని వెంటనే ఉపసంహరించుకోవాలని ఈ సభలో తీర్మానించారు. ఒకవేళ అలాంటి చట్టమును తేదలచినయెడల ఉపాధ్యాయులకు, మేనేజ్‌మెంటువారికి గూడా జిల్లా స్కూళ్ళ కమిటీల్లో ప్రాతినిధ్య మివ్వవలెనని కోరారు. బిల్లును మెరుగుపరుచుటకు రావుగారు అనేక సూచనలు చేశారు. కౌన్సిల్లోగూడా ఉపాధ్యాయుల కోర్కెలకై కృషి చేశారు.

మహాసభలో ఆనాడు వారు కోరిన జీతాల స్కేళ్ళు ఎలా వున్నవో గమనించితే యిప్పుడు ఆశ్చరంగా వుంటుంది. "ప్రాథమిక పాఠశాలలలో ఉపాధ్యాయులజీతము వెంటనే పెంపుదలచేయవలయుననీ, కడపటిదర్జా ఉపాధ్యాయునికి నెలఒకటింటికి రు 20/ లు, లోయరు సెకెండువారికి రు 254/ లు, హైయరు సెకెండువారికి రు 30/ లు, సెకండరీ సెకెండు ఉపాధ్యాయునికి రు 40/లు ఉపక్రమణ వేతనములుగా నియమితము చేయవలయు" నని తీర్మానించారు. వీరికి సెలవులు, పెన్షను, ప్రావిడెంటుఫండు విషయములలో ఏ మేనేజ్‌మెంటు సర్వీసులో నున్నప్పటికీ నాన్ గజెటెడ్ ఆఫీసర్లలోని ఆయా దర్జాకు చెందిన ఉద్యోగస్థులకు వున్న హక్కులన్నియు ఈ ఎలిమెంటరీ స్కూళ్ల ఉపాధ్యాయులకుగూడా అన్వయించునట్లు శాసనబద్ధము చేయవలెనని కోరారు. ఆనాడు నెలకు రు 30/ ల జీతంతోనే సంతృప్తి పడేవారు. కాని దీనికిప్పుడు 3, 4 రెట్లు జీతం పెరిగినా, ప్రాథమికోపాధ్యాయుల

ఆర్థిక పరిస్థితులు అధ్వాన్నంగా వుండిపోయినవి. కృత్రిమంగా జీవితావసర వస్తువుల ధరలన్నీ 4, 5 రెట్లకు పైగా పెరుగుటమే దీనికి కారణం.

హరిసర్వోత్తమరావుగారు మొదటినుండీ ఉపాధ్యాయుల సమస్యల యెడల, వారి ఉద్యమం యెడల ప్రత్యేక శ్రద్ధ తీసుకొంటుండేవారు. రాష్ట్ర ఉపాధ్యాయ సంఘమునకు అండగా వుండేవారు. ప్రథమ ఫెడరేషన్ మహాసభకు రావుగారు ప్రారంభోపన్యాసకులు. తర్వాత జిల్లా, తాలూకా సంఘము లేర్పడి శాఖోప శాఖలుగా విస్తరించింది. ఉపాధ్యాయుల సమస్యలకోసం కృషి చేయుటకు 'ఉపాధ్యాయ' పత్రిక నొకదానిని స్థాపించుకొన్నారు. చెన్నుపాటి లక్ష్మయ్య, సింగరాజు రామకృష్ణయ్యగార్లు రాష్ట్ర సంఘమును పటిష్ఠం చేయుటకు పాటుపడినారు. తెలంగాణాలో రాఘవాచార్యులు కృషి చేశారు. ప్రాథమికదశలో అధికార్లనుండి అనేక ఆటంకాలు వచ్చినా, క్రమేణా ప్రభుత్వం దీనిని గుర్తించక తప్పలేదు. కౌన్సిలు ఎన్నికలలో ఉపాధ్యాయుల సంఘ ప్రతినిధులే అత్యంత మెజారిటీతో ఎన్నుకోబడి శాసనసభా రంగంలోగూడా ఉపాధ్యాయుల కోర్కెలకై కృషిచేస్తూ వున్నారు. రాష్ట్ర ఫెడరేషన్ నాయకులు ఉపాధ్యాయ వృత్తిలో చిరకాలం విశేషానుభవం గడించి సంఘసేవలో తలలు నెరసిన వారగుటవలన, ఉపాధ్యాయుల సాధక బాధకాలు మాత్రమేగాక, వర్తమానకాల విద్యావిధానంలోని లోటుపాట్లను సైతం సవరించుటకు ప్రయత్నిస్తూ వున్నారు. రావుగారికి విద్యా సమస్యలయెడ

గల శ్రద్ధయే వీరిని సన్నిహితులను చేసింది. అనేక ఉపాధ్యాయ ఫెడరేషన్ సభలకు వెళ్ళి సందేశాలిచ్చారు. 5 వ రాష్ట్ర ఫెడరేషన్ మహాసభ 1954 మే 3,4,5 తేదీలలో నెల్లూరులో జరిగింది. రావు గారిని ఆప్యాయంగా ఆహ్వానిస్తూ "ఆర్యా! మీరే మా ప్రథమ మహాసభను ప్రారంభించారు. తదాది ఉపాధ్యాయుల సేవలో రాష్ట్ర సంఘం బలం ఎంతో పెరిగింది. మొదటినుండీ మీరు సానుభూతి సహకారము లందజేస్తున్నందులకు మీకెంతగానో ఋణపడి వున్నాము. మహాసభల 3 రోజులు హాజరుకా ప్రార్థన. మహాసభకు ప్రారంభదినాన అధ్యక్షత వహించగోరు చున్నాము" అని వారు జాబు వ్రాశారు. రావుగారు నెల్లూరు సభలకు వెళ్ళి సభాకార్యక్రమాల్లో పాల్గొన్నారు.

6 వ ఫెడరేషన్ మహాసభ గుంటూరులో 1956 మార్చిలో జరిగింది. సభానిర్వాహకులు ఈ సందర్భంలో ఒక 'సింపోజియం' ఏర్పాటు చేశారు. ప్రముఖ విద్యావేత్తలు ప్రత్యేకాంశాలపై వ్యాసపఠన చేశారు. రావుగారు "వయోజనవిద్య" నుగూర్చి ఒక పత్రాన్ని చదివారు.

కేంద్రప్రభుత్వ విద్యాశాఖ తరపున నూతనంగా చదువరులైన వయోజనుల ఉపయోగార్థం, పుస్తకపోటీలు నిర్వహించేవారు. ఈ విధంగానే బాల వాఙ్మయాన్ని ప్రోత్సహించేవారు. వివిధ ప్రాంతీయభాషలలో పోటీలుజరిపి, ఎన్నికయిన గ్రంథములకు బహుమతులిచ్చే పద్ధతిని ప్రవేశపెట్టింది ప్రభుత్వం.

1954-55-56 సంవత్సరాల్లో తెలుగుభాషలో నూతన అక్షరాస్యుల, బాలల సాహిత్య కమిటీలలో హరిసర్వోత్తమరావుగారు సభ్యుడుగాను, నిర్ణయాధికారిగాను, గ్రంథ సమీక్షకుడుగాను వుండేవారు, మంత్రి హుమాయూన్‌కబీరు అధ్యక్షుడుగాను, బహుశః విద్యాశాఖలో ఉన్నతోద్యోగి కావచ్చు- కులభూషణ్ కమిటీ కార్యదర్శిగాను వుండినారు. రావుగారి కమిటీలలో ఎంతటి ప్రాధాన్యత వహించేవారో ఒక్క విషయాన్నిబట్టి తెలుసుకోవచ్చు. రావుగారి డైరీలో "ఈరోజు హుమాయూన్ కబీరు రాలేదు. నేనే రాత్రంతాకూర్చొని పోటీలనుగూర్చి అంత్యనిర్ణయం చేశాము" అని వ్రాసుకొన్నారు. వయోజన,బాల,జానపద వాఙ్మయానికి సంబంధించిన అనేక విషయాలపై పలుమార్లు విద్యాశాఖ రావుగారి సూచనలను, సలహాలను కోరుచుండినట్లు తెలుస్తుంది.

ఒకసారి 9-1-1949వ తేదీ రాజంపేట ఎలిమెంటరీ స్కూళ్ళ ఉపాధ్యాయుల మహాసభకు రావుగా రధ్యక్షత వహించారు. 'ఉపాధ్యాయ సోదరులు రాజకీయములలో పాల్గొనరా'దని తీర్మానంచేశారు, కాని రాజకీయములలో పాల్గొనవచ్చు అనే అర్థము స్ఫురించునట్లు పత్రికలలో ప్రచురితమైనది. దానిపై విద్యాశాఖ డైరెక్టరు రావుగారికొక దీర్ఘలేఖ వ్రాశారు. రాజంపేట తీర్మానం, ఉపాధ్యాయులు ఏ రాజకీయసంస్థలోను సభ్యులుగా వుండరాదనే నియమ నిబంధనలకు భిన్నంగా వుందనీ, ఇక ముందు తాము మాట్లాడబోవుముందు ఆ సంఘాలనుగురించి డి. ఇ. ఓ. లతో సంప్రదించగోరుతానని ఆక్షేపణ తెలియజేశారు, రావుగారు దానికి దిగువరీతిగా జవాబిచ్చి, ప్రెసులో జరిగినలోపం విశదీకరించారు. (అప్పట్లో రావుగారు వయోజనవిద్యా గౌరవ డైరెక్టరు.)

* "ఉపాధ్యాయుడు ఒక నిర్మాణ కార్యకర్త. అతడు రాజకీయా లైనా, మరేదైనాసరే వివాదగ్రస్తమైన విషయాలలో పాల్గొనరాదు. ఇది నా దృఢవిశ్వాసము. ఈ విషయాన్ని ప్రతి ఉపాధ్యాయునికి అవకాశం దొరికినప్పుడల్లా నొక్కి చెపుతాను. ఏదెట్లయినా సంఘముచేసిన తీర్మానము మీకు తెలిసినదానికి పూర్తి వ్యతిరేకముగా నున్నది. రాజకీయ పక్షాలలో వారు పాల్గొనటంలేదని, పాల్గొనరాదనీ చెప్పారు. టైపిస్టు, లేదనే (not) పదాన్ని వదలివేశాడు"

అంతటితో ప్రభుత్వ విద్యాశాఖ మరెప్పుడూ జోక్యం కలిగించుకోలేదు.

## విద్యార్థి మహాసభలు

ఆంధ్రరాష్ట్ర విద్యార్థిమహాసభ కాకినాడలో 1946 డిసెంబరు 21, 22, 23 తేదీలలో వైభవోపేతంగా జరిగింది. హరి సర్వోత్తమరావుగారీ మహాసభను ప్రారంభోత్సవం చేశారు. బెంగాలు విద్యార్థినాయకుడైన గౌతమ చటోపాధ్యాయ ప్రధాన ఉపన్యాసకులు. రావుగారు తన ప్రారంభోపన్యాసంలో లోపభూయిష్ఠమైన విద్యావిధానాన్ని ఖండించారు. సర్వతోముఖమైన అభ్యుదయదాయకమైన విద్యావిధానం స్వతంత్ర భారత రిపబ్లిక్

---

* "I strongly hold that the teacher is a constructive worker and should not take part in any controversial matters, political or otherwise. I loose no opportunity to urge this on every teacher. I am to inform you, however that what the Association resolved upon was quite the opposite. They said they have not or shall not have part to play in political parties. The typist omitted 'not'.

లోనే సాధ్యమగుననే నమ్మకాన్ని తెలియజేశారు. "బ్రిటిష్ ప్రభుత్వం, వారి తెల్లసైన్యాలు మన దేశాన్నుండి తొలగిపోనిదే మనకు స్వేచ్ఛావాతావరణం లేదు. అప్పటివరకు స్వాతంత్ర్య సిద్ధికి మనంచేసే ప్రయత్నాలను విఫలంచేయడానికి సామ్రాజ్య వాదులు అనేక కుతంత్రాలు పన్నుతునేవుంటారు. అందువలన హిందూ-ముస్లిము ఐక్యత, ప్రజల సఖ్యత, బలంమీదనే మనం ఆధారపడవలసి వుంటుం"దన్నారు. రావుగారిలా ఉపన్యసించారు:

"కారల్‌మార్క్సుకంటే మన గాంధీమహాత్ముడే తన అహింసాయుత ప్రేమ సందేశంద్వారా ఒక అడుగు ముందుకు వేశాడని నా విశ్వాసం. ఆయన విజయం పొందగలడని నా దృఢ విశ్వాసం. కాని యువకులైన మీమీద నా అభిప్రాయాలను రుద్దదలచలేదు. మీరంతా గాంధీజీ ప్రేమ సందేశం ఆచరణయోగ్యమా ! మార్క్సు కమ్యూనిష్టుసిద్ధాంతం ఆచరణ యోగ్యమా ! అని చర్చించి నిర్ణయించుకోండి' ... .... యువకులైన మీరు రాజకీయంగా ఎన్ని భేదాభిప్రాయాలున్నా కలిసి ఐక్యతతో స్వాతంత్ర్య సిద్ధికి కృషి చేయండి. జన సామాన్యాన్ని అక్షరాస్యులుగా చేయండి. ప్రజల విజ్ఞాన వికాసాలను పెంపొందించండి. అప్పుడు ప్రజలే నాయకులకుకూడా బాట చూపెట్టగలరని నా నమ్మకం"

రాష్ట్రంలో అనేక జిల్లా విద్యార్థి మహాసభలకు రావుగారు వెళ్ళి స్వరాజ్య వుద్యమాన్ని గురించి చెప్పి దేశభక్తిని ప్రబోధించారు

## యువజన మహాసభలు

1944 లో విజయవాడలో కృష్ణాజిల్లా యువజన మహాసభలు జరిగినవి. హరిసర్వోత్తరావు, రావి నారాయణరెడ్డి, అయ్యంకి వెంకటరమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు విచ్చేసి తమతమ సందేశాలిచ్చారు. ఈ యువజన మహాసభను

ప్రారంభిస్తూ రావుగారిలా ఉపన్యసించారు, "1907 లో రాజమండ్రిలో మొదటగా రాత్రిబడులు చెప్పటం ప్రారంభించితిని. అయినా కొలదిమంది మాత్రమే దీని పాముఖ్యతను ఆరోజుల్లో గుర్తించితిరి. కాని ఈ రోజున అనేకవేల మందిచే ఈ ప్రచారం గుర్తించబడి, ఒక్క మీ కృష్ణాజిల్లా యువజన సంఘాధ్వర్యానే 90 కేంద్రాలలో వీటిని బ్రహ్మాండంగా జరుపుట అభినందించదగిన విషయము..."

రావుగారు యువకులపైనున్న బాధ్యతలను వివరిస్తూ "మాలో కొలదిమందిలోవుండే అభిప్రాయాలను బహుజనాభిప్రాయంగామార్చిన మీ యువకశక్తికి ఎదురులేదు. మావలె పట్టణాలనుండి, కేవలం కాలేజీలనుండిగాక, పల్లెలనుండి వచ్చుట, నిత్యమూ ప్రజలతో దగ్గర సంబంధము కల్గివుండడం మూలంగా ఈ కార్యక్రమం ఇంత జయప్రదంగా నిర్వహించేశక్తి యువజన సంఘాలు కలిగియున్నవి. ప్రత్యక్షంగా పనిచేయుయింతమంది యువతీయువకులను, వర్కర్లను కలుసుకొన్నందుకు చాల ఆనందపడుతున్నా" మని తమ సంతోషం వెలిబుచ్చారు.......

...లాబక్ఛార్టు ఆధారంగాగొని, పేరు ఎలా చెప్పాలో అరసున్నలతో అక్షరములు ఎలానేర్పాలో మొదలగు విషయాలు ఆనాడు దీర్ఘంగా 4 గంటలసేపు హరిసర్వోత్తమరావుగారుపన్యసించారు.

"వయోజనవిద్య నిర్మాణ కార్యక్రమాలన్నిటికంటే మొదటదిన్నీ, ముఖ్యమైనదీని. దీని వ్యాప్తికి మీ యువశక్తిని జోడించి అక్షరాస్యతా ప్రచారమునకు ముందుకు సాగిపోదాము.

ఈ విషయాల్లో అన్నివిధాల నా సహాయం మీకు లభించుతుం" దనికూడ చెప్పారు.

ఈ విధంగా విద్యార్థి యువజన సంఘ సభా సమావేశాల్లోను, మహాసభల్లోను అనేకచోట్ల రావుగారు పాల్గొన్నారు. తమ స్వీయానుభవాలను వివరించుతూ, యువజన్నాన్ని ఉత్సాహపరిచేవారు.

'అన్నా చదువుకొనగ రావన్నా', 'నిరక్షరాస్యత నిర్మూలింపుడు' అనే వయోజనవిద్యా గీతాలు ఆనాడు బహుళ ప్రచారంలో వుండేవి. యువతీయువకులు ఐక్య కంఠంతో పాటలు పాడుతూ, బారులుదీరి వూరేగింపులు చేసేవారు. రాత్రిపాఠశాలలు, పఠనమందిరాలు, గోడ వార్తాపత్రికలు, గ్రంథాలయాలు నిర్వహిస్తుండేవారు. ఈ సాంఘిక సేవలు, క్రమశిక్షణ, హరిసర్వోత్తమరావుగారిలాంటి పెద్దలను సంతోషభరితులను చేస్తుండేవి. వారువచ్చి ప్రోత్సహిస్తుండేవారు.

సంఘంలో విద్యార్థి - అధ్యాపకుల జీవిత పద్ధతులలోని వ్యత్యాసం పోవాలని నీతిబోధచేస్తూ రావుగారొక వ్యాసం వ్రాశారు. "ప్రజల విద్యా విధానమునకు రెండు ప్రథమ సూత్రాలు" అను దానిలో ఇలా వ్రాశారు:

> "విద్యార్థులకు అందుబాటులో వుండటం కాకుండా, సంఘం ఆ విద్యను ఉపయోగించుకొనడానికి విద్యనేర్చుకొన్న విద్యావంతులు సంఘానికి అందుబాటులోవుండే వైనం ఏర్పడవలె ........ విద్యావంతుడైనవానిదొక దర్జా, సంఘానిదొక దర్జా. సంఘంలోని ఒకవ్యక్తికి నెలకు జీవితానికి 5 రూ. సరిపోతే, విద్యార్థికి రు 50/ లు కావలె. ఆ దర్జాలో తయారైన విద్యార్థి తరువాత సంఘంలో ఇమడలేడు. ఈ ఇమిడికను కుదిర్చే శిక్షణ విద్యార్థికి ఆరంభంనుంచీ కలిగితీరవలె.

దానికి విద్యాబోధకుడు ముందుమార్గదర్శకుడుగా వుండవలె .... సర్ సి. వి. రామన్, సర్. రాధాకృష్ణన్, సి. ఆర్. రెడ్డి యంతటి వారలు తమ దర్జా విద్యార్థులకు నేర్పవలెననక, విద్యార్థుల దర్జాలో అనగా ప్రజాసామ్యపు దర్జాలో, తాముకూడా జీవితము నడుపువారు కావలె ......

... ఈ తత్వమెరుగక విద్యావిధానమునతీర్చే ప్రభుత్వాలు ప్రజలను పీడించి తిని, పరాపకారజీవులు కాగల ఉద్యోగాలను తయారుచేయ వచ్చును; పండితులను తయారు చేయవచ్చును. వీరందరును ప్రజల మేలునకు తోడ్పడువారు కాజాలరు. లోకశాంతిని, కళ్యాణమును సమ కూర్చజాలరు. తాము భోగలాలసులైన ధనవంతులై,ధనవంతుల రాజ్య మునకు యంత్రనిర్మాతలై అనుదినలోక ప్రళయమునకు పనికివత్తురు."

—'గ్రంథాలయ సర్వస్వము' 10 వ సంపుటము, 4 వ సంచికనుండి

ఆహా ! ఇదెంత అత్యుత్తమ నీతిబోధ !

## దక్షిణ భారత హిందీ ప్రచారసభలు

జాతీయోద్యమకాలంలో గాంధీజీ హిందీయే రాష్ట్రభాష కావలెనని ప్రచారం చేశారు. దక్షిణదేశంలో మోటూరి సత్యనారా యణగారు హిందీ వ్యాప్తికి చాలా కాలంనుండి కృషిచేస్తూ వచ్చారు. దక్షిణభారత హిందీ ప్రచారసభ మద్రాసు కేంద్రంగా ఏర్పడి, హిందీ భాషావ్యాప్తి గావించింది. పరీక్షలు నిర్వ హించింది.

1927 లో డాక్టరు సుబ్బరాయన్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా నున్నప్పుడు హిందీని ఐచ్ఛికంగా పాఠశాలలలో నేర్చుకొనుట కవకాశం కల్గించారు. 1937 లో రాజాజీ అధ్వర్యాన కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడినప్పుడు హిందీని 2, 3 ఫారములలో ప్రవేశ

పెట్టారు. పాఠ్య గ్రంథములు వ్రాయించారు. నేడు స్కూలు ఫైనల్ వరకు 'హిందీభాష' నిర్బంధంగావుంది.

భాషావేత్తగా రావుగారు హిందీ నభిమానించారు. హిందీ ప్రేమీమండలులద్వారా హిందీ భాషా ప్రచారాన్ని ప్రోత్సహించారు. గుంటూరులో 1953 మార్చి 18, 19 తేదీలలో జరిగిన 20 వ ఆంధ్రరాష్ట్ర హిందీ మహాసభకు హరిసర్వోత్తమరావు గారధ్యక్షత వహించారు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగావుండి సభలు జరిపించారు. ఆ మహాసభలను మద్రాసు గవర్నరుగా వుండిన శ్రీప్రకాశ్ ప్రారంభించారు.

1937 మార్చిలో మద్రాసులో అఖిలభారత హిందీ సాహిత్య సమ్మేళనము, భారతీయ సాహిత్య సమ్మేళనము, దక్షిణభారత హిందీ ప్రచారసభ స్నాతకోత్సవము వైభవంగా జరిగినవి. పురుషోత్తమదాసు టాండన్, జమ్నాలాల్ బజాజ్‌గార్లు ఆ రెండు సభల కధ్యక్షత వహించారు. మద్రాసు మహాసభల్లో రావు గారు పాల్గొన్నారు.

ఆంధ్రదేశంలో అదేసమయంలో ఆంధ్రసాహిత్య పరిషత్తు రజతోత్సవ సభలు జరిగినవి. బహుభాషా సంకీర్ణమైన భారతదేశంలో ఈ భాషా సమస్య ప్రధానమైన చర్చనీయాంశంగా వుంటుంది. పార్లమెంటు, భాషావేత్తలు ఆమోదకరమైన పరిష్కారమార్గానికి నేటికీ ప్రయత్నిస్తున్నారు. ఆనాటి సాహిత్య సభలో రావుగారు "దేశభాషల ప్రాముఖ్యము – భారతజాతీయైక్యత" అను విషయంపై వ్యాసం చదివారు. ప్రామాణికంగా భాషా సమస్యలనుగూర్చి ప్రస్తావించారు. హరిసర్వోత్తమరావు గారు హిందీని రాష్ట్రభాషగా అంగీకరిస్తారు. కాని మాతృభాషల

ప్రాధాన్యతల నేమాత్రం కించపరచరాదనే తత్వంవారిది. రాష్ట్రి భాషకు సంబంధించిన పై వ్యాసంలోని రావుగారి అభిప్రాయ ములు క్లుప్తంగా ఉదహరిస్తాను :

"ముప్పదియైదుకోట్ల భారతీయులలో పదికోట్లమంది భారతీయులకు స్పష్టంగా అర్థమగునదియు, ఇతర సర్వ భారత భాషలతో పదసామాగ్రి యందు సంస్కృతపదముల మట్టుకైనను సామ్యము కలదియు, బంగాలీ, గుజరాతీ, మహారాష్ట్రి, ఓఢ్రములతో కొంత వ్యాకరణ సామ్యము కలదియునైన హిందీభాషను, అథవా హిందూస్థానీ భాషను, సర్వేంద్రియ వ్యవహారములకు వాడుట మిక్కిలి సమంజసమనియు, న్యాయమనియు నంగీకరింపక తప్పదు..... ..... .....

.... హిందీవలన దేశమునకు మహాపచారము కలుగదను వారలలో నేనును నొక్కడనే. కాని జబర్దస్తీ తోసివేతలు మాత్రము తగవని నమ్రుడనై నేచేయు మనవి..... ..... .....

.... ఇంతచక్కగా పెరిగిన మాతృభాషల నీరీతి తుదియవస్థకు తెచ్చుచున్నారనే భావము, ఏ భాషాపుత్రున కేనాడు తోచినను హిందీ మీద గట్టి తిరుగుబాటు కలిగి వెగటు పుట్టుననుట నిజము. ....

.... దేశభాషలనిన మాతృభాషలు. వీనిని తప్పించి మరియే భాషలో విద్యాబోధచేసినను పిల్లలకు విజ్ఞానము సక్రమరీతి అభివృద్ధి కాజాలదు. ఇది యంగీకృతమైన సిద్ధాంతము. కావునవిద్యాబోధ జరుగు నప్పుడు హైస్కూలు అంతస్థు దాటువరకును దేశభాషాధారకబోధయే ప్రచారమునం దుండవలెను. మాతృభాష లన్నిటికీ బునాది. అందు పరిశ్రమ బాగుగా జరిగిన పిదప, తక్కిన భాష లభిమాన భాషలుగా ఐచ్ఛికముగా నేరువ వచ్చునన్న యెడల విద్యాప్రచారమునకు నష్టము లేదు. అట్లుగాక హిందీ నిర్బంధము, ఇంగ్లీషు నిర్బంధము, సం స్కృత నిర్బంధము అని చిన్నతనములో యిన్ని నిర్బంధములయ్యేనా, మన పిల్లల మెదడులు పెద్దవైనను ప్రథమావస్థలోనే యుండక తప్పవు. కాబట్టి ఐచ్ఛికముగా యిదివరలో జరిగిన రీతిగా హిందీ

ప్రచారము జరుగుటయందు దోషముండదుగాని ఆవేశముచేత దానికి బాలబాలికల జీవితములో నిర్బంధస్థానము కల్గినా, దేశభాషలకు, పిల్లల విద్యాభివృద్ధికీ రెంటికినీ నష్టమగునని హెచ్చరింపక తప్పదు."

భాషా సామరస్యానికినీ, జాతీయైక్యతకును వీలుగా రావుగారు కొన్ని ముఖ్య సూచనలు గావించారు :

"మనదేశ భాషలన్నిటియందునుగల పదజాలమున చాల విశేష భాగము సమమయినది కలదు. దానిని పరిశీలించి, విమర్శించి ప్రత్యేక పదముల యర్థము వ్యవహారమున భిన్నభిన్నమైపోని తెరంగున ఇట్టి సాహిత్య పరిషత్తులవారు నడుపగలరేని, దేశభాషల సౌభ్రాతృత్వ స్థిరీకరణమునకు తోడ్పడిన వారగుదురు."

రావుగారు ఆ వ్యాసంలోనే వివరించిన మరికొన్ని అభిప్రాయాలు :

"భారతీయ సాహిత్య సమ్మేళనమువారు ప్రకృతి శాస్త్రములు, అర్థ శాస్త్రములు, న్యాయశాస్త్రములు ఇత్యాది శాస్త్రములలో ప్రయోగితమగు పదములకును, పరిపాలనలోని అన్ని శాఖలలోను ప్రయోగితమగు పదములకును, అన్ని దేశబాషల పండితుల సహాయములతో నిఘంటువు లేర్పరచి దేశమంతటనూ వీనిని ఏకార్థ ప్రతిపాదకములొనర్చ కలిగియున్న యెడల ఎన్నటికైనను దేశమునకంతటికినీ, ఏకభాష యేర్పడుటకు పునాది వేసినవారగుదురు.....

.........అన్ని భాషలలోను ప్రయోగము పొందుచుండు, సంస్కృత, అరబ్బీ, పర్షియన్ పదములకు సంభవించియుండు అర్థభేదములను వివరించి ఏకపదమున కేర్పడిన నానార్థముల నన్నిభాషలవారును గ్రహించునట్లు ఒక పత్రికను, అన్ని భాషలలోను ఏకకాలములో నడుపుటయో, ఏ ఒక గ్రంథమును అన్ని భాషలలోను ప్రకటించుటయో జరుపవలసియుండును.....

.... ఈ కార్యములు సాగినయెడల అన్ని భాషల నైఘంటిక కార్యములను ఒక యాధారభూమి మీదికి తెచ్చినవారమగుదుము అన్ని

భాషలను దగ్గరి చుట్టములని ఒండొంటిని సమీపించుటకు సహాయము చేసినవార మగుదుము.....

.... ఈ కార్య నిర్వహణములో ఎంతదనుక ఏకలిపి ప్రయోగింప వచ్చునో అంతవరకు లిపి సాధనము చేయవచ్చును. అప్పుడు హిందీ అన్ని భాషలకును దగ్గరి చుట్టమయిపోయి దేశమున సామాన్యభాషగా పరిణమించును. అట్లుగాక ఇది ప్రత్యేక పరిశ్రమచే నేర్పదగిన నాల్గు భాషలలో నొక భాషగా బలవంత పెట్టబడునెడల దేశభాషలకిది పోటీ యను భావము తప్పించుట సులభసాధ్యముకాదు"—

— ఆంధ్రసాహిత్య పరిషద్రజతోత్సవ సమయమున రావుగారు చదివిన వ్యాసభాగములనుండి

## పత్రికా రచయితల మహాసభలు

1939 లో ఆంధ్రరాష్ట్ర జర్నలిస్టు అసోసియేషన్‌కు హరిసర్వోత్తమరావుగారు అధ్యక్షులుగా వున్నారు. తాపీ ధర్మారావు, కోలవెన్ను రామకోటేశ్వరరావు మున్నగువారు ఉపాధ్యక్షులు గాను, జి.వి.పున్నయ్యశాస్త్రిగారుకార్యదర్శిగాను ఉండేవారు. ప్రథమ ఆంధ్ర దినపత్రికకు ప్రముఖ సంపాదకుడుగా నున్ననాటి నుండి రావుగారి జీవితం పత్రికా వ్యాసంగంలో గడిచింది. ఆంగ్లాంధ్రభాషల్లో పెక్కు వ్యాసరాజములు రచించారు. ప్రారంభ దినాల్లో, చదువులు అంతగా అభివృద్ధిగాని రోజుల్లో విలేఖరులు దొరకటమే కష్టమయ్యేది. ఇక సంపాదకుల విషయం చెప్పనవ సరంలేదు. అట్టి స్థితిలో రావుగారు అనేక పత్రికలకు సంపాద కత్వం వహించారు. పత్రికల నిర్వహణ అసిధారావ్రతం లాంటిది. పరప్రభుత్వం అనేక ఆటంకాలు కల్గించేది. వాక్సభా, పత్రికా స్వాతంత్ర్యాదులు అడుగడుగున అరికట్టబడుచున్న తరుణంలో, దేశ దాస్య విముక్తికోసం కలంబట్టి పరప్రభుత్వం పెట్టిన కష్ట

పరంపరల నెదుర్కొన్నారు. 'నేషనలిస్టు' వారపత్రికకు డిక్లరేషన్ రావటానికే ఒక ఏడాది పట్టింది. ' ప్రెస్ చట్టాలతో నా అనుభవాలు' "(My Experiencees with Press Laws") అనే శీర్షికక్రింద మొదటి సంచికలో తానుబడ్డ కష్టాలను వివరించారు. రావుగారు 1906 నుండీ పత్రికారంగంలో ఎట్టి బాధలకులోనైనా, దివంగతులయ్యేవరకు చేపట్టిన కలం దించ లేదు. వారి రచనల్లో సత్సాంప్రదాయాలు నెలకొల్పారు. మార్గ దర్శకులైనారు. జర్నలిస్టు మహాసభల కధ్యక్షత వహించడమే గాక, 1950 మే నెల 25 నుండి వేటపాలెంలో జరిగిన గుంటూరు జిల్లా జర్నలిస్టు తరగతులకు హాజరై క్లాసులు తీసుకొన్నారు. శిబిర నిర్వాహకులుగా వావిలాల గోపాలకృష్ణయ్యగారుండేవారు. ఆ తరగతులలో పత్రికారచయితకు వుండవలసిన ఉత్తమ లక్షణాలను రావుగారు బోధించారు.

'పత్రికా రచయిత, పాక్షికత్వమునకు దూరంగావుంటూ వాస్తవాన్ని ప్రపంచానికి తెలియజేయడానికి జంకరాద' న్నారు. 'తాను నమ్మిన ఆదర్శాలను, తాను చెడ్డది అనుకొన్నవాటిని గురించి తన అభిప్రాయాలను ప్రకటించాడానికి, తన కలానికి స్వాతంత్ర్యం లేనప్పుడు దానిని విరమించడమే ఆదర్శ పత్రికా రచయిత ధర్మ' మన్నారు. 'పత్రికా రచన అనేది ఏ ఒక వ్యక్తి కొరకో, లేక కొందరి స్వార్థం కోసరమోగాక సమాజ శ్రేయస్సు కోసం, జాతీయాభ్యుదయం కోసం ఉపయోగించినప్పుడే పత్రికా రచన సార్థక్యం కాగల' దన్నారు.

ఆయన జీవితపర్యంతం పత్రికా రచయితగా, దానికొక విశిష్టత చేకూర్చిన ధన్యజీవి.

## ఆంధ్రనాటక కళా పరిషత్తు సభలు

1939 లో నాటక కళా పరిషత్తుకు హరిసర్వోత్తమరావు గారు ఉపాధ్యక్షులుగా ఎన్నికైనారు. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు అధ్యక్షులుగాను, కొత్తపల్లి లక్ష్మయ్య, డాక్టరు చిలుకూరి నారాయణరావుగార్లు కార్యదర్శులుగాను వుండేవారు. రావుగారు కళాపరిషత్తు కార్యక్రమాల్లోగూడ కొంత శ్రద్ధ తీసుకొన్నారు. 1939 డిసెంబరు 17 వ తేదీ మహానందిక్షేత్రంలో కార్యవర్గ సమావేశములు జరిగినవి. రావుగారు స్వయంగా తగు ఏర్పాట్లు గావించారు. 1937 మార్చి 27 వ తేదీ ఆంధ్ర నాటకకళా పరిషత్తువారి 6 వ వార్షికోత్సవం బెజవాడలో పింగళి లక్ష్మీ కాంతంగారి అధ్యక్షతను జరిగినది. హరిసర్వోత్తమరావుగారు నటులకు శిక్షణావశ్యకతనుగూర్చి ఇలా వ్యాఖ్యానించారు:

"మనదేశమున వృత్తులకైనను కొంత శిక్షణ యంగీకరించు నాచారము కలదుగాని, కళలకు అసలు శిక్షణయే కోయనట్లు కన్పించదు.

.... ప్రజల రుచులు మన యధోగతికి కొంత కారణము గావచ్చు గాని ప్రజల రుచులను దిద్దు ధర్మము కవిది, నటులది యనుమాట మరువదగదు. షేక్స్పియర్, కాళిదాసులు తమకాలపు రుచులను దిద్దిన వారుగాని, వారి ననుసరించినవారు కారు. కవియు, నటులును సుశిక్షితులై 'ప్రజాప్రబోధము' తమ ధర్మమని తెలిసికొనిననే నాటక కళవలన ప్రయోజనముండును. అది నాటకకళ యగును. కావున సుశిక్షిత కవులను, సంగీత సాహిత్య నాట్యశాస్త్ర కుశలులగు నటులను తయారు చేసుకొను భార మాంధ్రావనిపై నున్నదని తెలుసుకొనదగును."

## ఆంధ్రరాష్ట్ర నిర్మాణ కార్యకర్తల సంఘ సభలు

2-10-'53 వ తేదీన కర్నూలులో ఆంధ్రరాష్ట్ర నిర్మాణ కార్యకర్తల సమావేశమొకటి జరిగింది. తదుపరి 1954 లో హిందూపురం సేవామందిరములో మరొక మహాసభ ఏర్పాటు చేశారు. వాటిల్లో హరిసర్వోత్తమరావుగారు పాల్గొని సంఘ ఉద్దేశములను, సభ్యత్వార్హతలను నిర్ణయిస్తూ ఒక వివరణ పత్రమును తయారు చేశారు.

"నిరంతర కృషిద్వారా, అహింసాత్మక జీవనపథమును, నిర్మాణ కార్యక్రమమును ప్రచారంచేస్తూ అమలులోకి తెచ్చుట" ముఖ్యోద్దేశములుగా పేర్కొన్నారు. 'నిర్మాణ కార్యక్రమంలో ఏదేని ఒక కార్యక్రమమునైనను జరుపువారుగా వుండాలి. అస్పృశ్యతానివారణ, త్రాగుడు నిరోధము, ఖద్దరు ధారణ మొదలగునవి జీవితమునందు అనుష్ఠించువారుగా వుండాలి. స్వంతంగా సంవత్సరంలో 3 చిలపలు చందాగా యివ్వాలి,' ఇలాంటివారు సభ్యులుగా చేరుటకు అర్హులుగా నిర్దేశించారు, ఈ రాష్ట్ర సంఘం అఖిల భారత సర్వసేవా సంఘమువారిచే ధ్రువ పత్రము పొందినది.

తదాది ఏటేటా ఆంధ్రదేశంలోని నిర్మాణ కార్యకర్తలు సమావేశమవుతూ చేసిన కార్యక్రమమును సమీక్ష చేసుకొనేవారు. కడపజిల్లా ఆనందాశ్రమం సంఘ కేంద్రంగా వుండేది. రావుగారు మైదుకూరు ఆనందాశ్రమమునకు వెళ్లుతూ, యథాశక్తి వారిపనికి తోడ్పడుతుండేవారు.

## ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ పనిముట్ల ఉత్పత్తిదార్ల సంఘ సభలు

ఈ సంఘం వడ్రంగం, కమ్మరం పనిచేసే వృత్తులవారి కోర్కెలకై కృషి చేస్తుండేది. 23-4-'50 న చాపాడు గ్రామంలో కడపజిల్లా మహాసభ జరిగింది. 2-12-51 వ తేదీన మైదుకూరు ఆశ్రమంలో మహాసభ జరిగింది. వీటన్నిటికీ హరిసర్వోత్తమ రావు గారధ్యక్షత వహించారు. చిత్రావూరు నాగభూషణాచార్యులు, యర్రోజు మాధవాచార్యులు, వి. వీరబ్రహ్మం (కార్యదర్శి) హాజరైనారు. ఆయా జిల్లాలలో వ్యవసాయ పనిముట్లుచేసే వృత్తిదార్లు జిల్లా మహాసభలకు హాజరై తమ కష్టనిష్ఠురాలను చర్చించుకొని, పరిష్కార మార్గముల నన్వేషించేవారు. వీరికి ప్రధానంగా ఇనుము దొరకటం అప్పట్లో దుర్లభంగా వుండేది. దీనినిగూర్చి ప్రభుత్వదృష్టికితెచ్చి, ఇనుము కోటాలు సంపాదించుటకు ఈ సంఘం కృషిచేస్తూ వచ్చింది. ఫలితంగా 1951-52-53 సంవత్సరాలలో 8 జిల్లాలలో వీరు సిఫార్సుచేసిన కేంద్రములకు హోల్‌సేల్‌స్టోర్సు, మార్కెటింగు ఫెడరేషనుల నుండి ఇనుముకోటా యిప్పించవలసిందిగా, మద్రాసు కోఆపరేటివు రిజిస్ట్రారుద్వారా సర్క్యులరు జారీచేయడమైనది. ఆవిధంగా ఈ సంఘంద్వారా కమ్మరం, వడ్రంగంచేసే వృత్తిదార్లకు సహాయం చేయుటకు రావుగారు తోడ్పడినారు. వీరబ్రహ్మంగారు పై రెండు సంఘములకు కార్యదర్శిగావుండి కార్యక్రమములు కొనసాగిస్తూ వుండేవారు.

# చేనేత పారిశ్రామికుల మహాసభలు

ప్రథమ మద్రాసురాష్ట్ర చేనేత పారిశ్రామికుల మహాసభ గుంటూరులో 1938 జులై 16 వ తేదీన హరిసర్వోత్తమరావు గారి అధ్యక్షతను జరిగింది. అప్పట్లో రాష్ట్ర ముఖ్యమంత్రిగా నున్న రాజాజీ మహాసభా ప్రారంభకులు. రామనాథం రామదాసు ఆహ్వాన సంఘాధ్యక్షులుగానుండి, తోటి పారిశ్రామికుల సహకారంతో సభలను జయప్రదంగా జరిపించారు. చేనేత పరిశ్రమకు సంబంధించిన అనేక విషయాలను అవగతం చేసుకొని, పత్రికలకు వ్యాసాలు వ్రాసి రావుగారు చేనేత పారిశ్రామికుల ఆదరాభిమానాలు చూరగొని యున్నారు. వారి అధ్యక్షోపన్యాసంలో యిలా అన్నారు :

"ఈ మహాసభకు నన్నేల యధ్యక్షునిగా పిలిచిరాయన్న ప్రశ్న మొదట నాకు గలిగినది. కారణము ఆలోచించుకొంటిని. మీరు పారిశ్రామికులు. అనగా కూలిచేసుకొని జీవించువారు. నేనును కూలిచేసుకొని జీవించువాడను. కాని నేను నేతగాడనుకానే ? అయినా నేత పరిశ్రమను గురించి నాకేదో యెక్కువ తెలిసినదని మిత్రులూహించిరా ? కాదుకాదు. భోజనమువలెగుడ్డ ప్రతిమానవునకునుఅవసరము.అందుచేత తిండికి పంటలను పండించు వ్యవసాయదారుని సుఖదుఃఖము లంవరకు నెట్లు హృదయావేదన కలిగించునో మానము కాపాడుటకును, ఆరోగ్యమును సమకూర్చుటకును గుడ్డ నేసియిచ్చు నేతగాని సుఖదుఃఖములును దేశములో జన్మించిన ప్రతివ్యక్తియొక్క హృదయమును ఆకర్షింపదగినది. అయినప్పుడు అంతొయింతో దేశసేవ జేయదలపెట్టిన వారికి వ్యవసాయదారుని యందెంత గౌరవాదరములున్నవో, నేతగాని యందును అంత గౌరవాదరము లుండవలెను. ఈ యర్థము నాకు - నాకుగాదు నాబోటి దేశసేవకులందరకును - బోధించుటకే మీ

యాహ్వాన సంఘమువారు నన్నీ పదవికి పిలచిరని నిర్ణయించుకొని అంగీకరించితిని."

రాష్ట్రి చేనేత పరిశ్రమకు సంబంధించిన లెక్కల వివరములతో, రావుగారు అనేక ముఖ్యసూచనలు ప్రభుత్వదృష్టికి తెచ్చారు.

"వస్తువు ఉత్పత్తిచేసేవాడు మన చేనేతపారిశ్రామికుడైనా ఉత్పత్తి క్రమంలో ఏడెనమండుగురు అమ్మకచర్యలో యితరులు యితనికష్టము మీద ఆధారపడి జీవించేవారున్నారు. ఇందులో కొందరు మన పారిశ్రామికుని అజ్ఞానాన్ని పేదరికాన్ని తమ లాభానికుపయోగించుకొని, యతనికి గంజిదొరకకపోయినా తాము మృష్టాన్నభోజనముచేసి గ్రున్రతేపేవారున్నారు."

అనితేల్చినారు. కావున

"పెట్టుబడి దారులను అదుపులోపెట్టే" శాసన నిర్మాణము కావలెను.

(1) ఈ పారిశ్రామికులు తమఇండ్లలో పనిచేయడముచేత ఎందరివద్ద పని చేయించుకొనినా వీరు, పెట్టుబడిదారు ఫ్యాక్టరీయాక్టుక్రిందికి రావడము లేదు.పారిశ్రామికులకేర్పడినఇతర రక్షణములును వీరికి కలుగడములేదు. ఇతర పారిశ్రామికులతోజేర్చి వీరికి కనీసకూలి గిట్టుబాటయ్యే మార్గమన్వేషింపవలెను.

(2) వ్యవసాయదారుల అప్పులనుతగ్గించే దీక్షతో కాంగ్రెస్ ప్రభుత్వమువారు శాసనము చేసినతీరుగానే, చేనేత పారిశ్రామికుల సంరక్షణకును శాసనము చేయవలసియుండుననుట స్పష్టము.

(3) సహకార సంఘవిధానమే శరణ్యమని చెపుతూ పైరక్షణలు మధ్యవర్తులు కొట్టుకొనిపోవు లాభభాగము నతనికి నిలువజేయడానికిగాని, అతనికి చౌకగా వస్తువులు సరఫరాచేయడానికిగాని, అతడుత్పత్తిచేసిన వస్తువులనుఅతనికి లాభకరముగా విక్రయించి

ఋవ్వడానికిగాని ప్రయోజనపడవు. అందుకు సహకారసంఘాలు స్థాపించుటేమార్గము. యంత్రాధారక పరిశ్రమను పెట్టుబడిపద్ధతి వలన ఏజెంట్లపద్ధతులవలన ప్రయోజనముంటే ఉండవచ్చుగాని గ్రామ పరిశ్రమలకు, గృహపరిశ్రమలకు ఆపద్ధతి పూర్తిగా పనికి రాదు.

(4) మద్రాసు అసెంబ్లీ ఓటి శాసనసభ విషయమున చేనేత పారిశ్రామికులకు ప్రత్యక్షంగా అన్యాయం జరిగిందనడానికి సందేహంలేదు. నేతవృత్తిలోని కర్మకారకులకని ప్రత్యేకించిన 2 స్థానములకు వోటుచేసేవర్గములలో చేనేతకర్మకారులకు స్థానములేదు. ఈ విషయం ప్రభుత్వమాలోచించి మార్పుచేయాలి.

ప్రాతినిధ్యము మాటవచ్చినప్పుడు చేనేత పారిశ్రామికులు ఏదోఒకకులానికి చెందినవారని కులప్రాతినిధ్యం అడుగుచున్నారని భ్రమపడినట్లున్నది. చేనేత పారిశ్రామికులలో మిల్లుపారిశ్రామికులలోవలెనే అన్నికులాలవారునూ వున్నారు. ప్రాతినిధ్యము ఇట్టికులాలకుగాదు. ఈవృత్తికి."

చేనేతలో యాంత్రికమగ్గాల ప్రస్తావనతెచ్చి

(5) "క్రొత్తగాఏర్పడే సౌలభ్యాలు మన చేనేత పనిలోవుండే మానవ బలమును కొరవడజేసేవి కాకూడదు. నిరుద్యోగము తెచ్చేవి కారాదు. యంత్రప్రాబల్యమును కలుగజేసేవి కారాదు. చేనేత పారిశ్రామికపని చేతిలోని సృష్టిశక్తిని అపహరించి, అతనినే యంత్రముగా చేసివేసేవిగాను పరిణమింపరాదు."

అన్నారు. *

## ఆంధ్రరాష్ట్ర పశుప్రదర్శనములు

ఏటేటా జరిగే ఈ పశుప్రదర్శనము ఒంగోలుతాలూకా కరవదిలో 1946 ఏప్రిల్‌లో జరిగింది. ఆ మహాసభకు

* వివరములకు చెన్నరాష్ట్ర, చేనేత పారిశ్రామికుల మహాసభ-గుంటూరు 1938 జులై 16 గా. హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షోపన్యాసం చూడవలెను.

నెల్లూరునుండి బి. రామచంద్రారెడ్డి, గుంటూరుజిల్లానుండి జాగర్ల మూడి కుప్పుస్వామిచౌదరి, బెజవాడనుండి చుండూరు వెంకట రెడ్డి మున్నగువారు విచ్చేశారు. ఆ సందర్భంలోనే వ్యవసాయ పారిశ్రామిక చిత్రకళాప్రదర్శనముగూడా నిర్వహింపబడింది.

'ఆంధ్రరాష్ట్రం-ఆంధ్రాభ్యుదయం' అను సమస్యపై జరిగిన సభకు హరిసర్వోత్తమరావుగా రధ్యక్షత వహించారు. ఒంగోలుజాతి మేలుపశువులు, ముఖ్యంగా కోడెలు, అఖిలభారత పశుప్రదర్శనములోగూడా ప్రథమ బహుమానాలను పొందటం అందరెరిగిందే రావుగారా పశుప్రదర్శనమును తిలకించి, రైతుల కృషిని శ్లాఘించారు డాక్టరు యేజెళ్ల శ్రీరాములుగారు బహుమతి ప్రదానం గావించారు. ఈ సందర్భమున ఏర్పాటైనసభకు రావుగారు అధ్యక్షతవహించారు.

## శ్రీకృష్ణదేవరాయ జయంత్యుత్సవములు

శ్రీకృష్ణదేవరాయల జయంత్యుత్సవములు రావుగారు, రాయలసీమలోని నంద్యాల, పెనుగొండ, మున్నగుచోట్ల వైభవోపేతంగా జరిపించుటకు కృషిచేశారు. 3 రోజులు ఒక్కొక్కచోట మహాపండితుల నాహ్వానించి ఉపన్యాసాలిప్పించేవారు. ఆ సందర్భంలో 'కౌమోదకి', 'సాధన' మున్నగు పత్రికలు ప్రత్యేక సంచికలు ప్రచురించేవి.

పెనుగొండ సభలో రావుగారు విజయనగర సామ్రాజ్య వైభవమును కొనియాడుచూ ఇట్లు ఉపన్యసించారు :

"రామరాజ్యమును ఆదర్శంగాపెట్టుకొని రాయలవారేలిరనియు, రామరాజ్యమున రాజునకును ప్రజలకును నిరాడంబరజీవనమూలంగా సాధింపగల జ్ఞాన విజ్ఞాన వికాసముల యానందమే పరమావధియనియు,

ఆశలు పెంచుకొని భౌతిక నాగరికమున మునిగితేలుచున్న నేటి పాశ్చాత్య రాజ్యముల యానందమెచ్చటనున్నదని వెదకి ఏథెన్సునగరమున ప్రజా సామాన్యము విజయనగరసామ్రాజ్యములోవలె, అనుదినమనుభవించిన కావ్య, సంగీత, శిల్పవైభవమునందే కలదని విశ్వసింప నారంభించి నారు."

తెలుగుదేశంలో ఎన్నోగ్రామాలు వివిధసందర్భాలలో రావుగారు చుట్టివచ్చారు. జిల్లా తాలూకా విద్యాసంస్థలు, సాంస్కృతికసంఘాలు, ఆది ఆంధ్రాభ్యుదయవారోత్సవాలుగావచ్చు లేదా, ప్రముఖుల వర్ధంత్యుత్సవాలుకావచ్చు, ఏదోసందర్భములో రావుగారి నాహ్వానించి సభలుజరిపినవనవచ్చును. గ్రంథాలయ,యువజన, విద్యార్థి, ఉపాధ్యాయసంఘాలు, సహకార, పంచాయతీలు, హరిజన, మహిళాసేవాసంస్థలు జరిపిన అనేక సభాసమావేశములకు హాజరై రావుగారుపన్యసించారు.

నిర్మాణకార్యక్రమములందు శ్రద్ధవహించు కావూరి వినయాశ్రమం, గోపన్నపాలెం,కొమరవోలు కేంద్రాలు, హిందూపురం సేవాశ్రమం, మంగళగిరి తత్వానంద శిల్పాశ్రమం, మైదుకూరు ఆనందాశ్రమం, సీతానగరం గౌతమీ ఆశ్రమం మున్నగునవి ఎన్నియో హరిసర్వోత్తమరావుగారి సేవల నందుకొన్నవి,

ఈ విధంగా తిరుగుతూ వివిధతరగతుల ప్రజలయిబ్బందులను వారు గమనిస్తూ వీటిని తీర్చుటకై కొంతకృషిచేస్తూ వుండేవారు. ఈ విషయాన్ని వారిడైరీలలోని దిగువమాటలు ఋజువుచేస్తాయి.

## త్రాగడానికే నీళ్లులేవు

జనవరి 19 "అనంతపురం జిల్లాలలోనుంచి గాండ్లపెంటచేరితిమి. గ్రంథాలయంచూచితిని. నాఉపన్యాసం. అక్కడినుండి నంబుల

పులికొండ. అచ్చటిప్రజలకు త్రాగటానికి నీళ్లులేవు. కష్టపడి 5 మట్ల దిగుడుబావి పుడిసెడునీటికై బాగుచేసుకొంటున్నారు."

## చేనేతవారి దుస్థితి

మార్చి 6 "రాజమండ్రినుంచి పెద్దాపురంచేరితిని. ప్రత్యేకం చేనేతవారి స్థితిగతులు కనుగొంటిని. నూలునేతకానికి వారం పనిలేద న్నారు. 10 రూ. లు మాత్రం గిడుతుందన్నారు. ఇతరకా లంలో కూలీపనిచేస్తారట. పట్టునేతకు నెలకుపనిఉంద న్నారు 140 రూ. గిడుతుందన్నారు. మాయపట్టువాడుఅంతే."

## ఏజెన్సీప్రజల కడుపులో బల్లలు

మార్చి 17 'కాకిచాడనుండి అడ్డుతీగల చేరితిని. అడ్డుతీగల - రామవరం - పనసలపల్లి మున్నగునవి చూచితిని. వానుపోవీలులేక నడి చివెళ్లాము.'

"కొండరెడ్లు కోయలకంటే వెనుకబడినారు, వీరుసంచులు అల్లుతారు. గోచీలు. ఆడువారివస్త్రం అందరిలోనూ చాలా తక్కువ. పనసలపల్లిలో అరటి, పనస, కొబ్బరి నీరుపెట్ట కుండానేపంట. నీళ్ళుమురుగులు. అవేత్రాగడం. కడుపులలో బిళ్ళలు బాగాపెరిగినవి. మధ్యేమధ్యేచెరువులు. కొద్దిమాగాణి వుంది. "త్రాగుడు; సోమరితనం" అచ్చటి కేంద్రాలుచూచి సామర్లకోటచేరితిమి. మలయప్పన్ దిగాడు. కలిసిమాట్లాతిము."

—రావుగారిడైరీనుండి

ఈ విధంగా వడ్రంగం, కమ్మరం, హరిజన, చేతివృత్తుల బెస్తపనివారి యిబ్బందులనెల్లా వెళ్లినచోట్లల్లా డైరీలో వ్రాసు కొన్న ఉదాహరణలనేకం వున్నవి. గవర్నర్లు, ధనికులు అప్పు డప్పుడు రావుగారిని ఆ యా మహాసభల సందర్భాన గౌరవించి ఆతిథ్యాలిచ్చినా, సామాన్యప్రజల కష్టాలను రావుగారేనాడు విస్మ

రించేవారుకాదని స్పష్టపడుతుంది. ఘరానా మనుషులను, కల వారిని ఉపేక్షాభావంతో చూచేవారు. బీదజనావళి యిబ్బందులను తన యిబ్బందులుగానే పరిగణించేవారు.

## సంఘ సంస్కరణ - మహిళాభ్యుదయము

తాను జాతీయోద్యమంలో ప్రవేశించిననాటినుండి, రావు గారు సంకుచిత మతమూఢవిశ్వాసాలకెన్నడు తావిచ్చినవారు కాదు. ఇంట్లోగాని, బయటగాని అంటరానితనాన్ని ఏనాడు పాటించలేదు. మహమ్మదీయులు, హరిజనులు స్వేచ్ఛగా ఇంట్లోకి వస్తూ పోతూ వుండేవారు. 'జాతిమతభేదాలు లేనేలేవు - మానవులంతా ఒకటే' అనేధర్మసూత్రాన్ని వారాచరణలోపెట్టారు.

సంఘంలో సగభాగంగావున్న స్త్రీలు అస్వతంత్రులుగా, అజ్ఞానంలో నున్నంతవరకు ఆదేశం, ఆజాతి సంస్కృతి, నాగరికతలు గలదిగా పరిగణించబడదని రావుగారివిశ్వాసం. అందుకే మహిళాభ్యుదయానికోసం కృషిచేశారు. ప్రత్యేకంగా మహిళాభ్యుదయానికై పత్రికనుపెట్టారు. స్త్రీల సాంఘిక, ఆర్థిక, రాజకీయహక్కులకోసం అమూల్యమైన వ్యాసాలుప్రకటించారు.

ఆ నాటి సాంఘికపరిస్థితులు గమనిస్తే స్త్రీ పునర్వివాహం వెలి. అంటరానితనం మంచిది. రాజకీయంగా ఎక్కడలేనిభయం. రావుగారు వీటన్నిటిని ప్రతిఘటించారు. సంఘసంస్కరణకు వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నంనాయుడు మున్నగుమహనీయులు తెలుగుదేశంలో కంకణంకట్టుకున్నారు. బ్రహ్మసమాజ ప్రభావం ఆంధ్రరాజకీయ నాయకులమీద బాగాప్రసరించింది. వీరేశలింగంగారితో రావుగారికి పరిచయంవుందిగూడ.

ఆంధ్రమహిళాసభలో మాట్లాడుతూ, రావుగారు "మానవ జాతిలో స్త్రీలు స్వతంత్రులు. రుద్రమదేవి రాజ్యమేలింది. మొల్ల రామాయణం వ్రాసింది. ఆమె పలుకులు తేనెసోనలు. తరిగొండ వెంకమాంబ వేదవిదుషి. పురుషులకు చదువులు దిద్దబెట్టింది" అని ఉపన్యసించారు.

ఒకసారి పాట్నా సెనేట్‌హాలులో మీటింగు జరిగింది. రావుగారి ఉపన్యాసానంతరం వైజ్ఞానిక ప్రదర్శనాలతోపాటు "వరదక్షిణ" అనేనాటకం వేశారట. దానినిచూచి తనడైరీలో ఇలావ్రాసుకున్నారు:

"వరదక్షిణ నాటకంవేసిరి. చాలాబాగున్నది. తుదకు నాసందేశం సభికులకందిస్తిని. 'కొడుకులనెట్లాపెంచుతామో అట్లే ఆడబిడ్డలను పెంచి, మగనితో సమానంగా సంపాదించుకొనేవారిని చేయడంతప్ప వేరుమందులే'దని ప్రబోధించితిని."

పాతూరి నాగభూషణంగారి 'గ్రంథాలయశాస్త్ర ప్రథమ పాఠములు' పుస్తకము పీఠికలో రావుగారిలావ్రాశారు :

"మనదేశములోని స్త్రీలు ప్రాచీనాచార శృంఖలాబద్ధలై బయటికే రాక మన పురోగమనాన్ని నిరోధిస్తున్నారు. దీనికి వారే కారణభూతులనడానికి వీలులేదు. చదువుకొన్న పురుషులు, దేశాభిమానము ప్రకటించు మగవారు. విదేశాలలో ఐ. సి. యస్. పరీక్షలతోకూడా చదివి ఉత్తీర్ణులై పెద్దహోదాలనాక్రమించుకొని యుండు అఖండ ప్రజ్ఞాధురీణులు స్త్రీలను యింకా గడపదాటకుండా, సంఘంలో స్వతంత్రంగా మెలగకుండా నిరోధించి, యిప్పటి దుష్ఫలితాలకు కారకులవుతూ వుండటం శోచనీయము. ఎంతత్వరగా వీరీ విషయాన్ని గ్రహిస్తే అంతత్వరగా మనదేశంలో సక్రమవిజ్ఞాన ప్రచారానికి అవకాశం కలుగుతుంది."

16-4-1948 వ తేదీన శ్రీ వీరేశలింగ శతజయంత్యు త్సవము మద్రాసులో జరిగింది. ఆనాటి మహాసభకు హరిసర్వో త్తమరావుగా రధ్యక్షత వహించారు. రావుగా రానాడిచ్చిన ఉప న్యాసం భాష, భావముల ప్రాధాన్యతనుబట్టి ముఖ్య భాగాలు యథాతథంగా వారి మాటల్లోనే చూచుటవసరం :

"నేను మీ అందరిలో ఒకణ్ణి. ప్రత్యేకత్వంలేని ప్రజానీకంలో సామాన్యనికి సాపకాశంలివ్వవలె. దీనికి వీరేశలింగం పునాదులు వేసి నారు. సామాన్య మానవుని పెంపు అతని యుద్దేశం. అది సూచించ డానికే నన్నీ సభకు వరించారనుకుంటా."

19 వ శతాబ్దారంభములోని పరిస్థితులు చెపుతూ

"పంధొమ్మిదవ శతాబ్దంలో యెట్లున్నాము ? పారతంత్ర్యంలో పడి యున్నాము. అజ్ఞానంలో చిక్కుకొని యున్నాము. అంధకారములో మునిగియున్నాము. పురుషుడు పడవ ఎక్కితే దోషం. స్త్రీ అక్షరం నేర్వడం దోషం. పసిగందుల పెండ్లి చేయడం పావనం. మొగుడు చస్తే ముండనం తప్పదు. మారు పెండ్లిమాట అనుకోరాదు.

అంటరానితనం ఆచారం. పడుపువృత్తి పాపం కాదు. దేవునికే ఇది ప్రీతికరం. పెద్దలకిందు పెత్తనం. మారెమ్మ, మంగమ్మలు దేవ తలు. ఆత్మారాముడు అరణ్యావాసం చేస్తున్నాడు" అన్నారు.

ఆంధ్ర వికాసానికి ఆది కారకుడు వీరేశలింగం అని చెపుతూ :

"దురాచారాల నెదిర్చి తీరవలె. ప్రాణం పోయినా సరే నిలవవలె. కర్తవ్యం నెరవేర్చవలె. సంకల్పం చేసినాడు వీరేశలింగం. అడ్డు ఎరు గడు, ఆటంకం ఎరుగడు. ముందుకు సాగవలసిందే. పురోగమించి నాడు విమర్శనలకు జడవలేదు. పరుషవాక్కులకు బెదరలేదు. మాటకు మాట చేతకు చేత బదులిస్తూ బలపడినాడు. రాలవర్షా లతనికి పూలవర్షాలైనవి.

ప్రహసన పరంపరలు కురిపించినాడు. నాటకాలు వ్రాసినాడు. చిట్టి కథ లల్లినాడు. నవలలు రచించినాడు. శాస్త్రాలు చర్చించినాడు. పత్రిక లారంభించినాడు. ప్రకటనలు వెలువరించినాడు.

బాల్య వివాహాలు బహిష్కరించినాడు. వితంతు వివాహాలు జరిపించినాడు. స్త్రీలకు విద్య నేర్పించినాడు. బళ్ళు పెట్టించినాడు. సమాజాలు నిర్మించినాడు.

వీరేశలింగంగారిది విప్లవహృదయం. అది యేకదేశం కాదు. సమాజం మేలుకు సాదా సంస్కారం చాలదనిపించింది. మతం పిచ్చి పోవలెనన్నాడు. పెక్కు దేవులపేర్లు మాన్పించినాడు. ఒక్క దేవుని కొల్వనేర్వమన్నాడు. ఏకేశ్వరోపాసన వరించినాడు. బ్రహ్మ మతం స్వీకరించినాడు. తన జీవితంలో అమలు పరిచినాడు.

భాషలోనూ మార్పుతెచ్చినాడు. భాషకు ప్రయోజనం బహుజన ఉపయోగమన్నాడు. మహాజనులకు అర్థంకావడమే దాని పరమావధి. సంధి విగ్రహ భాష సంస్కృత దాస్యం. అది కృతక భాష. దాన్ని మానివేసినాడు. లలితం, సులభం, జాతీయంగా రచనలు సాగించినాడు. కాలాన్ని, పరిస్థితినిబట్టి గ్రామ్యమూ వ్రాయవచ్చునన్నాడు. ప్రజాస్వామిక రచనకు పాదుపెట్టినాడు.........

........తాను సాంఘిక తీవ్రవాది. రాజకీయ తీవ్రవాదులు తన బోటి వారే. తుది దినాలలో యిది ఆయనకు గోచరించింది. దేశ భక్తులను తూలనాడిన వారిని ఏవగించుకొన్నాడు. ఇంకా బ్రతికియుంటే గాంధిజీతో చేరి యుండునేమో!.... ......... ...

ఇతని రచన లితనికిస్మారకం. నేటి 'హితకారిణి' యితని స్మారకం. పునర్వివాహమాడిన సుఖజీవు లితనికి స్మారకం. ఇతడు ధన్యజీవి. చచ్చియు బ్రతికినవాడు. సర్వము విండినవాడు. యుగపురుష డయినవాడు.

ఇట్టి వాని శతవార్షిక జయంతినేడు. ఆయనను స్మరించి మనమూ ధన్యులమవుదాం. డాంబికాలను తగుమ గొడ్దాం. నడవడులను దిద్దు కొందాం. అతని ఆత్మను తృప్తి పరుస్తాం.

వందేమాతరం"

— 'గ్రంథాలయ సర్వస్వము 12 వ సంపుటము, 4 వ సంచిక' నుండి

# సంగీత కళాభిరుచి

హరిసర్వోత్తమరావుగారు సంగీత విద్వాంసులుగాకున్నా, వారికి ప్రాచీన కళారీతులు, శాస్త్ర సంగీతంతోపాటు, జానపద గీతాల యెడలగూడా ప్రీతి యెక్కువ. చిత్రకళా ప్రదర్శనము నందు సైతం శ్రద్ధవుండేది. తమ పర్యటన సందర్భంలో రావు గారొకసారి శ్రీరంగపట్నం వెళ్ళారు. అచ్చట తోలుబొమ్మ లాటను చూచి తమ డైరీలో ఇలా వ్రాసుకొన్నారు:

"శ్రీరంగ పట్టణంలో బొమ్మలాట ప్రదర్శనము చూస్తిని. సాదా బచ్చల బొమ్మలు ఆడుట. సూత్రధారుడి చేతిలో పాటలు, మాటలు నారివే. బొమ్మల కండ్లు తీర్చడంలో చాలా ప్రతిభవుందని నాకు గోచ రించింది. అన్ని సందర్భాలకు సరిపోయే చూపులను బొమ్మకంటిలో సృష్టించడం, పొగడదగిన సంగతి"

"16—10—53 వ తేదీ బీహారు రాష్ట్రంలోని 'తుర్కి' మహా విద్యా లయంలోని మిత్రులతో సంప్రదింపు. ముఖ్యంగా నాటక శాఖ బోధకు డైన శ్రీ వత్సవాతో సుమారు గంటసేపు పైగా గ్రామీణ నాటకాలు, తోలుబొమ్మలు, ఆటలు, పాటలు వగైరాలను గురించి ముచ్చటించి తిని. అతను యునెస్కో ట్రయినింగు సెంటరులో నేర్చిన, తాను స్వయంగా ఆలోచించి అమలు జరుపుతున్న సంగతులను చెప్పినాడు. మంచి మెదడుగలవాడు. గ్రామం, నాటక పరికరాలలోకూడా స్వయం

సంపూర్ణంగా వుండవలెననేవాడు. ఆకులు, పూలు, రెమ్మలు, తడకలు. నులక మంచాలతో సర్వమూ తీర్చపచ్చుననేవాడు."

—రావుగారి డైరీనుంచి

ఒకసారి నంద్యాలలో స్థానం వారి నాటకం వేస్తున్నారు. ఆ సాయంత్రం బహిరంగ సభలో ఉపన్యసించిన తర్వాత రావు గారిని స్నేహితులు నాటకానికి పిలుచుకపోయి ముందు వరుసలో కూర్చోపెట్టినారట. ఇది చూచి, స్థానం నరిసింహారావుగారు సత్యభామ వేషధారిగా కృష్ణుని చూచి, "ఓ హరిసర్వోత్తమా ! నమస్కారములని" సమయ స్ఫూర్తిగా అనగా ముందువరసలో కూర్చున్న వారంతా ఫక్కున నవ్వారట. అప్పుడప్పుడు నాటకములాడే ప్రసిద్ధ కళాకారులైన బళ్ళారి రాఘవ, స్థానంవారు రావుగారింటికి వస్తూపోతూ వుండేవారని చెపుతారు.

తమ కుమార్తె, అల్లుడు సంగీత విద్వాంసులగుటచేత, వారు సంగీత విద్యాలయమును నడుపుచుండుటచేత, వచ్చినప్పుడల్లా విని ఆనందిస్తుండేవారు. త్యాగరాజ కృతులు, తరంగాలు రావుగారి కభిరుచిగలవి. 'శాంతమూ లేక – సౌఖ్యమూ లేదు', 'చక్కని రాజమార్గం', 'నిధి చాల సుఖమా !' మున్నగు కృతులను పాడించుకొని ఆసక్తితో వినేవారని వారి కుమార్తె ద్వార శాబాయిగారు చెప్పారు.

క్షణం తీరికలేని నిరంతర పర్యటనలో నిమగ్నులైయుంటున్నా ఇంటికి వచ్చినప్పుడు రావుగారు సంగీతం, రేడియో వినుచుండేవారట, విద్యాలయంలో ఫ్లూటు, వీణ, ఫిడేలు, మృదంగం, గాత్రసంగీతం నేర్పబడుతున్నవి. మన భారతీయ సంగీత శాస్త్రమునందాసక్తిగల విదేశీయ యువతులు గూడా వచ్చి ఈ సంగీత

విద్యాలయంలో విద్యనభ్యసిస్తున్నారు. 'ఈ కళాశాల కర్నాటక సంగీత సరస్వతికి గొప్ప పూజాకైంకర్యంచేస్తూ వున్న' దన్నారు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, ద్వారం వెంకటస్వామి నాయుడు, ఫెడరల్ కోర్టుజడ్జి టి. యల్. వెంకట్రామయ్యర్, రాజమన్నారు మున్నగు సంగీత సాహిత్య విద్వాంసులెందరో విద్యాలయమునకు వస్తూపోతూ వుండటంవల్ల, రావుగారి అభిరుచికి తగిన వాతావరణం గూడా ఇంట్లో ఏర్పడింది.

* "ఈ సంస్థ నా బిడకు బిడ్డ కావున ఈ మదరాసు సంగీత కళాశాల కార్యకలాపాల ప్రశంస తాత ప్రశంసగా వుంటుంది."

అని తన కుమార్తె ముద్దుబిడ్డయైన విద్యాలయమునకు తమను తాతగా వ్యవహరించుకొన్నారు.

పశ్చిమ గోదావరిజిల్లా గ్రంథాలయ మహాసభ కధ్యక్షత వహిస్తూ రావుగారు సంగీతం, కళలయొక్క సాంఘిక ప్రయోజనాన్ని గూర్చి యిలా ఉపన్యసించారు :

## శ్రవణేంద్రియ ఆధారము

" మనపెద్దలు విజ్ఞాన వికాసమునకు మార్గము వేయుచు శ్రవణ, మనన, ధ్యాన ఇత్యాది సాధనములను సూచించిరి. ఇందులో శ్రవణ మార్గ ప్రయోజనమును సాధించుటకు వేనవేల యుపాయములను నిర్మించిరి. త్యాగరాజువోటి భక్తుడు సంగీతమును పాడెను. నటరాజువోటి దేవుడు నృత్యము జేసెను. పురాణశ్రవణము, హరికథ, భజన,

---

* "My appreciation of the activities of this 'Madras Sangeeta Kalasala' can only be the appreciation of a grand father for the Kalasala is a child my child."

జంగముకద, వీధినాటకము ఇత్యాదులు వాడవాడలకు ప్రాకినవి. రామాయణపు పాటలు, భారతపు పాటలు, కృష్ణలీలలు, వైరాగ్యపు పాటలు, తుదకు గణితపు పద్యములు ఇన్నియును అక్షిరమురాని అధముదుసులల రక్తములో జీర్ణమైనవి.

.... శబ్ద బ్రహ్మము నుపాసించి, ఫలమందుటకొరకు మనపెద్దలు మానవుని హృదయ తంత్రులను ఆయా రసానుభవమున కనువగు రీతిని మీటనుద్దేశముతో సంగీతమును, సాహిత్యమును, విజ్ఞానమును మేళవించి, శ్రవణేంద్రియము నాధారముజేసి సర్వకాల సర్వావస్థలకును, సులభముగ పనికివచ్చు సుబోధక మార్గములను సిద్ధపరిచిరి.

.... మానవుడు సాధారణముగ ఇతరకార్యాసక్తుడై యున్నప్పుడు, దృక్కులా కార్యముపై కేంద్రీకృతములగుట సహజము. శ్రోత్రములు మాత్రము అట్టి కేంద్రీకరణమునకు పాత్రములుగావు.

ఓడను నడపుచు, పాటపాడు బెస్త తనపాటచే తానే వీనులవిందొనర్చుకొని, శ్రమను పరిహరించుకొన జూచుచున్నాడు.

'గంగమ్మ తల్లికి చెంగల్వపూదండ జోర్సేయ్, బార్సేయ్
గోదారి తల్లికి గొజ్జంగి పూదండ జోర్సేయ్, బార్సేయ్' అని పండితులైన వేదము వేంకటరాయ శాస్త్రులవారు ఈ అభ్యాసమును ఛాయామాత్రముగ కనుబరచినారు. వేణువూదికొనుచు పసులకాపరి తన పనిని నిర్వహించుట లోకప్రసిద్ధము. అడవులలో చెట్లు నరకు బోయ మహత్తరమైన కాయకష్టము చేయుచు సంగీతము పాడుకొనుట అడవులలో తిరిగిన వారెరుంగుదురు.

.... మహత్కార్యములలో నిమగ్నులైన విద్యావంతులుగూడ ఏ ప్రాంతమునుండియో 'నానాగాయనగాయనీమణుల గానం బుర్వి నాలించి' ఆనందించువారు గలరు. ఇట్లుండ విజ్ఞాన సాధనకే సంగీత సుధానిష్యందనము ఆధారము చేయుటచేత కలుగునట్టి ఫలము అద్వితీయము.... .... .... ....

.... ....సంచార గ్రంథాలయ విధానమును నడుపుచు, దాని వెంబడి సుశిక్షితులైన గ్రంథాలయ సేవకులను పంపి, భజన, కీర్తన, పురాణ

శ్రవణ, ఇత్యాది పద్ధతుల ఛాయను నవీన జ్ఞానసంపదను వ్యాపింప జేయుటకు వినియోగించిన యెడల, మితవ్యయముతో వ్యాప్త కార్యమును సాధించుటకు రాచబాటవేసిన వారమగుదుము ... ఇంకను బహుకాలమువరకు పూర్తిగ అక్షరాస్యులు కాలేని మనదేశ ప్రజలకు శ్రోత్రేంద్రియ వికసనము ద్వారా విజ్ఞానవ్యాప్తి జేయు ప్రయత్నములు చేయుటయే నేడు తరణోపాయమని ఎవ్వరికైనను గోచరించగలదు ........ ......."

— 3-5-1936 తేదీన పాందువ్వలో జరిగిన పశ్చిమ గోదావరి జిల్లా గ్రంథాలయ మహాసభ అధ్యక్షోపన్యాసం నుండి (గ్రం. సర్వస్వము సంపుట 10- సంచిక 2)

## రాయలసీమ క్షామ నివారణ

హరిసర్వోత్తమరావుగారు మొదటినుండి రాయలసీమ సమస్యలను గూర్చి లోతుగా పరిశీలించి, వాటి నివారణకు శక్తికొలది కృషిచేస్తూ వచ్చారు. క్షామ నివారణకు నిరంతరం పనిచేశారు.

1927 లో కౌన్సిలు మెంబరుగావున్నప్పటి నుంచి, శాసన సభారంగంలోను బయట ప్రజలలోను ఆందోళనచేసి, కరువు పరిస్థితులను ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. ప్రభుత్వం నిర్ణయించిన 'ఫామిన్ కోడ్' ననుసరించి రాయలసీమ క్షామ ప్రాంత పరిస్థితులు, ప్రభుత్వ కర్తవ్యాలను గురించి హెచ్చరికలు చేస్తూ ఎప్పటికప్పుడు అనేక పత్రికలకు వ్యాసాలు వ్రాశారు. 'కర్నూలు మండల క్షామ సూచనలు' అను శీర్షిక క్రింద 4 సమగ్రమైన వ్యాసాలు ఆంధ్ర పత్రికకు వ్రాశారు. ఐంద్రావతి, మాతృసేవ, కౌమోదకి పత్రికలలో స్థానిక స్థితిగతులనుగూర్చి వివరిం

చారు ఆ వ్యాసాలలో అప్పటి క్షామపుకోడ్, కాలమాన రిపోర్టులలోని వ్యత్యాసాలు, వర్షపాతం, పంటల ధరలస్థితి, మున్నగు విషయాల నెన్నింటినో పేర్కొని, క్షామపు సూచనల యెడం ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని విమర్శించేవారు.

సర్కారు వారు క్షామపుకోడ్‌లో కరువు రానున్నదనుటకు కొన్ని సూచనలు నిర్ణయించి యున్నారు. మొదటి సూచన వానలు లేకుండుట. రెండవసూచన ధరలుపెరుగుట. ఇందులో సామాన్య రేటు (Normal), హెచ్చరిక రేటు (Warning), కరువు పరిస్థితి రేటు (Scarcity rate) ఇలా 3 వరుసల ధరలునిర్ణయించినారు. 1914 సంవత్సరమునకు పూర్వము ఈ వేరు వేరు ధరలు ఒక్క రీతిని నిర్ణయించి పెట్టబడినవి. అప్పటిలో జొన్నలు 20 శేర్లు అమ్మిన యెడల మామూలు 15 శేర్లు అమ్మిన జాగ్రత్త పడవలసిన కాలము; 12 శేర్లు అమ్మిన క్షామపు సూచనలు. ఈ రేట్ల నిర్ణయమును గురించి తర్వాత పునర్విమర్శన జరిగింది. మనకు అనుదినము ధరలు పెరుగుటచేత ఈమితులింకను తగ్గించినారు. బియ్యము 6, జొన్నలు 12, సజ్జలు 10 అమ్మిన యెడల అది హెచ్చరిక పడవలసినకాలము బియ్యము 5, జొన్నలు 10, సజ్జలు 8 శేర్లు అమ్మినయెడల అవి క్షామ సూచనలని నిర్ణయించినారు. 3 వ సూచన కూలికై ప్రజలు తమ ప్రాంతం విడిచి మరొక ప్రాంతమునకు వలసలు పోవుట. వీటిననుసరించి ఆనాటి పరిస్థితులను సమగ్రంగా రావుగారు వివరిస్తుండేవారు. 'క్షామ భయములకు కారణము లింత స్పష్టముగ కనుపించుచున్నను మొత్తముమీద స్థితిగతులను గురించి వ్రాయుటలో ఒక్కచే రొకటి పాటగా 'సుమారుగా నున్నదనుట' గవర్నమెంటు అధి

కారులు ప్రకటించు రిపోర్టులకు ఆచారమయినట్లు తోచుచున్నది" అని విమరిస్తుండేవారు. ఇట్టి దుస్థితిలో కొద్దిగా పండిన చోట వున్న నాలుగుగింజలమ్మి సర్కారుపన్ను చెల్లించినంతమాత్రము చేత అధికారులు రైతు సుఖముగా నున్నాడనుకోరాదు. బయటికి కానరాని గొప్ప రోగములలో చేరదగిన 'పేదరిక రోగమును అధికారులు కనిపెట్టు ప్రయత్నముచేయకున్న రాజనీతియే క్రుంగి పోవుననుట మరువరాదు' * అని తీవ్రంగా రావుగారు మంద లిస్తుండేవారు. స్వయంగా అన్ని స్థలాలు పర్యటించి, స్థానిక పరిస్థితులకు తగినట్లు కార్యక్రమం రూపొందించేవారు.

1936 లో ఏర్పడిన క్షామ నివారణకు, అంతకు పూర్వపు సంఘ కోశాధిపతియయిన కె. ఎస్. రాఘవాచార్యులు గారివద్ద నుండి మిగిలిన డబ్బును తెప్పించి, గంజి కేంద్రాలు స్థాపించారు. గ్రామాలలో ప్రత్తినూలు తీయటం, బట్టలు నేయడంతో పాటు, వూలుదారం తీయటం గూడా కొత్తగా ఏర్పాటు చేశారు. ధాన్యం రూపేణా మజూరీలు యివ్వాలని ఆంధ్ర మహాసభ నిశ్చ యించింది. పనులలో పాల్గొనలేని ఆడువారికి, ఒకపూట తిండి పెట్టే పద్ధతి చేశారు.

## రాయలసీమ కేంద్ర క్షామ నివారణ కమిటీ

27–1–35 వ తేదీ గుంతకల్లులో కేంద్ర క్షామ నివారణ నేర్పాటు చేయటం జరిగింది. కడప కోటిరెడ్డి (యం. యల్. సి.) అధ్యక్షులుగాను, బి. భీమారావు (బళ్ళారి), రావుబహదూర్ బి. పి. శేషారెడ్డి (యం. యల్. సి., కర్నూలు), టి. సుబ్బారావు (అనంత

* 1926 డిసెంబరు, 1927 జనవరి ఆంధ్ర పత్రిక నుండి

పురం), టి. రామకృష్ణారెడ్డి (చిత్తూరు) ఉపాధ్యక్షులుగాను,అనంత పురం వకీళ్ళు వి. రామచంద్రరావు, యం. నారాయణరావు గార్లు కార్యదర్శులుగాను ఎన్నుకోబడినారు. హరిసర్వోత్తమరావు, యం. అనంతశయనం అయ్యంగార్లు కార్యవర్గంలో మాత్రం వుండి తిరిగిపనిచేశారు. హరిసర్వోత్తమరావు, కల్లూరి సుబ్బారావు, కలచ వీడు వేంకట రమణాచార్యులు గార్లతో ఒక కేంద్ర ప్రచారక సంఘం ఏర్పడి, ధనధాన్య వసూళ్ళ రూపేణా క్షామ నివారణకు పూనుకొన్నారు.

ఈ కేంద్ర కమిటీ అప్పుడప్పుడు సమావేశమవుతూ, పంటలు పోయినచోట్ల శిస్తురెమిషనులు యివ్వాలనీ, పుల్లరి తగ్గించాలనీ, కరువు ప్రాంతాల్లో ఇర్రిగేషన్ పనులు ప్రారంభించా లనీ, రోడ్లునిర్మాణంచేస్తూ కూలీలకు పనులుచూపించాలనీ ప్రభు త్వమువద్దకు రాయబారంవెళ్లుతూ, క్షామనివారణకై ఆందోళన చేస్తూవచ్చింది. ఆనాడు క్షామనివారణ సహాయార్థం రాజేంద్ర ప్రసాద్ అచ్చటి మార్వాడీలచేత 4 వేల రూపాయలు విరాళ మిప్పించారు. జి. వి. మవలాంకర్ అప్పట్లో అహమ్మదాబాద్ మేయరుగా వుండేవారనీ, అహమ్మదాబాద్ 87 మిల్లుల యజ మానులు 2 సార్లుగా గుడ్డలను పంపించి సహాయం చేశారనీ మా సంభాషణలో కల్లూరి సుబ్బారావుగారు చెప్పారు. ఇతరచోట్ల నున్న సంఘ సేవకులు, కాంగ్రెస్‌వారు, దయార్ద్ర హృదయులు తోడ్పడుతుండేవారు. పొణకా కనకమ్మగారు కొంత డబ్బువసూలు చేసి, ప్రత్యేకంగా గర్భిణీ స్త్రీలకు, పిల్లలపాలకు వినియోగించ మని పంపింది. మరికొన్నిచోట్ల కృష్ణా, గుంటూరు జిల్లాలవారు పశుగ్రాసమును పంపుటకు రైల్వే చార్జీలు మినహాయించాలని

కోరారు. ఇతరచోట్లనుండి వచ్చే సహాయాన్ని సద్వినియోగం చేయుటకు గాను 'స్థానిక కమిటీలు' ఏర్పాటు చేయబడినవి. 'అవుకు' ప్రాంతంలో క్షామ పరిస్థితు లేర్పడినప్పుడు నంద్యాలలో దేశపాండ్య సుబ్బారావుగారు అధ్యక్షులుగా క్షామ నివారణ సంఘం 1935 ఫిబ్రవరిలో ఏర్పడి పని చేసింది. అలవకొండ రామ సుబ్బయ్య (అడ్వొకేటు), నివర్తి వెంకటసుబ్బయ్య, కోడి నర సింహాం ప్రభృతులు ఆ సందర్భంలో కృషి చేశారు. ఇలా ఎక్కడికక్కడ సహాయక సంఘా లేర్పడినవి.

రాయలసీమ క్షామ నివారణ ప్రణాళిక నొక దానిని తయారు చేయుటకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం వెంకట గిరిలో 12-8-1938 న సమావేశమై ఒక ఉపసంఘమును నియ మించింది. ఇందులో హరిసర్వోత్తమరావు, కల్లూరి సుబ్బారావు, కోటిరెడ్డి, నీలం సంజీవరెడ్డి గార్లు మెంబర్లుగావుండి నివేదికను తయారు చేశారు.

## ఆంధ్ర మహాసభ పక్షమున కృషి

1943 లో రాయలసీమ క్షామ నివారణ కోసం ఆంధ్ర మహాసభ కృషి చేసింది. ఆ సందర్భంలో సోదరాంధ్రుల సహా యార్థం బొంబాయి నగరంలో మంచి పలుకుబడి గలిగిన సహా యక కమిటీ ఏర్పడింది. ఆ కమిటీ వారికి ఆంధ్ర మహాసభా పక్షమున దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు బొంబాయి వెళ్ళి తోడ్పడినారు. కమిటీ కార్యదర్శిగా చావలి నాగేశ్వరరావుగారు (ప్రముఖ ఆంధ్ర చిత్రకారులు) వుండేవారు. నగరంలోని ఆంధ్రే తరులు గూడా ఆర్థిక సహాయంచేశారు. మొత్తం రు 1,30,000లు

వసూలుచేసి రాయలసీమ క్షామ నివారణార్థం పంపారు 3, 200 చీరెలు, 1 వెయ్యి ధోవతుల చాపులు, పిల్లల గుడ్డలు లభ్యమైనవి. 1944 ఫిబ్రవరి నెలలో చావలి నాగేశ్వరరావు, భైరవరసు హను మంతరావు (జర్నలిస్టు - పత్రికా సంపాదకులు) గార్లు తెనాలి మున్నగు పట్నాలకు వచ్చినప్పుడు ఆంధ్రులు తమ కృతజ్ఞతను తెలియజేశారు.

అప్పట్లో హరిసర్వోత్తమరావుగారు ఆంధ్ర మహాసభకు కార్యదర్శిగా వుండేవారు. బొంబాయికి వెళ్ళిన కొండా వెంక టప్పయ్యగారు 1943 - నవంబరు 12 వ తేదీన ఇలా జాబు వ్రాశారు :

ప్రియమిత్రమా ! బొంబాయి

12-11-'43

మీరు ఆంధ్ర మహాసభకు ప్రధాన కార్యదర్శి పదవి నంగీకరించి నందులకు ఎంతో సంతసించుచున్నాను. ఇక ముందు ఆంధ్ర మహాసభా కార్యక్రమములు చురుకుగాను, సక్రమముగను నడువగలవని నమ్ము చున్నాను.

ఇచ్చట వసూళ్ళు చేసినవి లక్షరూపాయలకు కొంత మించుననియే నా విశ్వాసం. కాని ఈ సొమ్ము వినియోగం మిక్కిలి కష్ట సాధ్యమైన పని. నేను అక్కడికి చేరిన పిమ్మట మీతోటి సంప్రదింతును. ఇందుకు మీ సహ కారం కావలసి యున్నది. శ్రీ సాంబమూర్తిగారి కుశలం అడిగితినని చెప్పగోరుచున్నాను. చిత్తగించవలెను

(సం.) కొండా వెంకటప్పయ్య

'ఆ ఫండ్సు' ను ఈ యిరువురు నాయకులు ఆంధ్ర మహా సభ స్థాయీ సంఘ సభ్యుల సమావేశంలో చర్చించి అన్నార్థులకు సక్రమ వినియోగం చేయుటకు పూనుకొన్నారు.

ఇదివరలో సర్ విజయా అధ్యక్షతను వసూలు చేసిన 'కరువు నిధిలో' మిగిలియున్న 13 వేల రూపాయలను ఉపయోగించి, క్షామప్రాంతాల్లో సహాయ కేంద్రాలు స్థాపించుటకు రావుగారు కృషిచేశారు. ఇందుకోసం కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలు, కార్యదర్శితోగూడా కలిసి హరిసర్వోత్తమ రావు గారు పర్యటించారు. అనంతపురం జిల్లాకు 7 వేలు, కర్నూలు జిల్లాకు 5 వేలు, కడప జిల్లాకొక వెయ్యి వినియోగించారు. ధర్మవరం ఏరియాలో ఓబులాపురం, తాడిమర్రి, కుంటిమద్ది గ్రామాల్లో 3 క్యాంపులు. పెనుగొండ, అనంతపురం తాలూకాల్లో 2 క్యాంపులు నెలకొల్పారు. బొంబాయి 'నేషనల్ కౌన్సిలు ఆఫ్ విమెన్' రు 10,000 లు, కరువు ప్రాంతాలలో ఖద్దరుత్పత్తి కోసం పంపారు. రామనాథ గోయంకా, రు 5,000 ల చెక్కు అందజేశారు. సర్కారు జిల్లా రైతాంగం పశుగ్రాసం పంపింది. ధాన్యం ఉచితంగాను, తక్కువ ధరలకు సప్లయి చేశారు. ఈ విధంగా అనధికార సంస్థలు, వ్యక్తులు, రాయలసీమ సోదరులకు అనేకవిధాల ధనం, ధాన్యం, గుడ్డలు వసూలుచేసి పంపారు. సహాయ కేంద్రాలలో పనిచేయుటకు "రాష్ట్ర రైతు సంఘం" సేవాపరాయణులైన రైతుకార్యకర్తలను గూడా రాయలసీమ పంపింది. వర్కర్లు అనేక కష్టములకోర్చి అచ్చటి సేవా కార్యక్రమంలో పనిచేశారు.

కడపజిల్లాలో కె. కోటిరెడ్డి, రామ సుబ్బమ్మ, ఆదినారాయణరెడ్డి గార్లు, ప్రొద్దుటూరు పురపాలక సంఘాధ్యక్షుడు పి. యర్రమునిరెడ్డి, జిల్లా ఆంధ్ర మహాసభా కార్యదర్శి వి. వీరబ్రహ్మంగార్లు, అనంతపురం జిల్లాలో కె. యస్. రాఘవాచారి, మునిసిపల్ చైర్మన్ పప్పూరి రామాచారి, యస్. నాగప్ప, ఆంధ్ర మహాసభ కార్యదర్శి డి. భీమయ్యశెట్టిగార్లు కృషిచేశారు. తరిమెల నాగిరెడ్డిగారు హరిసర్వోత్తమరావు గారిని కలిసి క్షామ నివారణ కార్యక్రమాలలో పాల్గొన్నారు.

"ప్రభుత్వంవారు చేస్తున్న పనులకు, ఆంధ్ర మహాసభ తలపెట్టిన పనులకు పోటీలేదనీ, తాము నెలకొల్పదలచిన సహాయ కేంద్రాలను ప్రకటిస్తున్నామనీ, ప్రభుత్వంగాని, యితర సంస్థలు గాని యిట్టి పనులు చేయదలిస్తే వానికి తోడుగా చేయగలం - లేదా యింకోచోట సహాయ కేంద్రాలు స్థాపించగలం - అంతే గాని పోటీగా భావించరా"దనీ రావుగారు ప్రకటించారు.

తోడి మిత్రు లనేకమందితో కలిసి, రాజకీయ విచక్షణలను పాటించక, హరిసర్వోత్తమరావుగారు క్షామ నివారణ కొరకు అహర్నిశలు పనిచేశారు.

## రాష్ట్రి ఐక్య క్షామ నివారణ సంఘం

1953 లో "ఆంధ్ర రాష్ట్రి ఐక్య క్షామ నివారణ కమిటీ" పేరుతో ఒక కేంద్ర సంస్థ ఏర్పాటైనది. దీనికి టంగుటూరి ప్రకాశంగారు అధ్యక్షులుగాను, గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు ఉపాధ్యక్షులుగాను, వై. వి. కృష్ణారావుగారు కార్యదర్శిగాను వుండేవారు. ఈ సంఘం రాయలసీమ, ఉత్తర విశాఖ కరువు

ప్రాంతాలకు చాలా సహాయం అందజేసింది. ఈ సందర్భంలో ముఖ్యంగా పేర్కొనవలసిం దేమంటే, రాయలసీమ క్షామ ప్రజల సహాయార్థం, ఈ ఐక్య క్షామ నివారణ సంఘానికి (United Famine Relief Committee) సోవియట్ రష్యాదేశంనుండి గూడా పాలపొడి డబ్బాలు, డబ్బు మున్నగునవి లభించినవి. సంఘ పక్షమున హరిసర్వోత్తమరావుగారు ఉత్తర విశాఖ కరువు ప్రాంతాలు పర్యటించి, వారి సహాయానికి కృషి చేశారు.

## తుపాను బాధితుల సహాయం

1936 – 37 సంవత్సరంలో కోస్తా జిల్లాలకు తుపాను వల్ల అపార ధనధాన్యనష్టం వాటిల్లింది. ఆ సమయంలో 'ఆంధ్ర సేవా సంఘం' ఏర్పడింది. ఈ సంఘ నిర్ణయానుసారం, హరి సర్వోత్తమరావుగారు బయలుదేరి బెజవాడ, రాజమండ్రి,ఏలూరు, కాకినాడ, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం పట్టణాలన్నీ తిరిగి సభలు, సమావేశాలు జరిపారు. అప్పట్లో జవహర్‌లాల్ నెహ్రూకు, ఆంధ్రదేశానికివచ్చి తమసంచారంలో తుపాను నిధిని ప్రోత్సహించండని, వ్రాశారు. విరాళములకై విజ్ఞప్తి కర పత్రములను ప్రచురించి, నిధి వసూళ్ళకు గాను కృషిచేశారు. తమ పర్యటన వివరాలను, అనుభవాలను గురించి ఒక నివేదికను తయారుచేశారు.

ఈ విధంగా రాయలసీమ, పల్నాడు, ఉత్తరవిశాఖ కరువు సమయాలలోను, తుపాను సందర్భముననుు బాధితుల సహాయార్థం కృషి చేయుటలో రావుగారు ముందుండి, అనేక విధాలుగ సహాయ పడుతుండేవారు. ఇది వారి నిర్విరామ కృషిని, సేవాధర్మాన్ని తెలియజేస్తుంది.

## రాయలసీమ సేవా సమితి స్థాపన

1924 లో రావుగారు ఆంధ్ర రాష్ట్రీ సభల కధ్యక్షత వహించినపుడే రాష్ట్రీమున కొక సేవా సమితి యేర్పడవలెనని వ్రాకుచ్చారు, ఇందును గూర్చి కొన్ని ఆలోచనలు జరిగినవి. కాని అది ఆచరణ రూపం ధరించలేదు. కాని చైతన్యవంత మగు కోస్తా జిల్లాలలో అనేక ఉద్యమాలు విజృంభించి పనిచేయు చున్నందున అట్టి సమితి లేనిలోపము అంతగా గోచరించలేదు. కాని గట్టిగా ఏ యుద్యమము వేరూనని వెనుకబడిన ప్రాంతాలైన రాయలసీమలో ఈ ఆవశ్యకత మెండుగా కనుపించింది. ఈ అవసరాన్ని గుర్తించిన పెద్దలు నంద్యాలలోను, ప్రొద్దుటూరు మొదలగు పట్టణాలలోను కొన్ని సభలు, సమావేశాలు జరిపారు. "అణచి పెట్టబడి దీనస్థితి యందుండు ఈ జిల్లాలలో జీవితమును పునరుజ్జీవింప జేయుటకు తమ యావజ్జీవితమును సమర్పణ చేసుకోదలచిన యువకుల కత్యవసరమయిన శిక్షణ, శీలములను సమకూర్చుట" పనిగా పెట్టుకోవలె నన్నారు. అప్పటికే జస్టిసు పార్టీ 'కులతత్వ' ప్రభావం కొంత కనుపించింది. కులమత తత్వ ధోరణులకు తావివ్వకుండా, నిర్మాణ కార్యక్రమాలకు ప్రాముఖ్యమిచ్చి పనిచేయాలన్నారు * నంద్యాల రాయలసీమ

---

* To induce the people of the Rayalaseema not to think, in terms of caste and creed and to consider them not only through legislatures and power, but through constructive works also outside.

సమితి రూపొందించిన కార్యక్రమంలో ఈ ప్రధానాంశం గూడా వుంది.

1928 నాటికి రాయలసీమ సమితి ఒక రూపం ధరించింది. వీరు సమావేశమై రాయలసీమ సమితికి సంబంధించిన ప్రధాన సమస్యలను గూర్చి సమాలోచనలు జరిపి తీర్మానాలు గావించే వారు. అందుచేసిన కొన్ని ముఖ్య నిర్ణయము లిందుదహరిస్తాను :

(1) చరిత్ర పరిశోధన : రాయలసీమలో చరిత్ర పరిశోధన కెక్కువ అవకాశము లుండియు, ఆ ప్రయత్నము లేవియు జరుగకుండుటకై చింతిల్లుతూ, చరిత్ర పరిశోధన మండలి నొకదాని నచిర కాలంలో స్థాపించవలసినదిగా, రాయలసీమలోని విద్యావంతులను ధనవంతులను కోరడమైనది.

(2) పత్రికలు : రాయలసీమ కంతటికి ఒక ద్వైవారపత్రికయైన నుండు టత్యవసరమని భావిస్తూ అట్టిదానిని సక్రమ మార్గములో నెలకొల్పినడుపుటకు ప్రయత్నమును గావించుటకు శ్రీ హరి సర్వోత్తమరావుగారిని కార్యదర్శిగా, కడపకోటిరెడ్డి, శివశంకరం పిళ్లె, రంగనాధ మొదలియార్, టి. యన్. రామకృష్ణారెడ్డి, పాణ్యం రామచంద్రయ్యగార్లతో ఉపసంఘమును నియమించడమైనది.

(3) చేతిపనులు, కళలు : రాయలసీమలోని ప్రతిమండలములో చేతి పనుల యభివృద్ధి కొక్కటి, కళల యభివృద్ధి కొక్కటివంతున సహకార పద్ధతులపై సంఘముల నెలకొల్పునట్లు ప్రోత్సహించుటకు ప్రబోధక సంఘమును ఏర్పాటు చేయవలెనని, సీమ లోని ప్రముఖులెల్లరకు విజ్ఞప్తి చేయడమైనది.

వీటనిబట్టి వెనుకబడిన రాయలసీమ ప్రజలకష్టములు, కరువు పరిస్థితులను, నీటి వనరులు కల్పించుటను గూర్చి

మాత్రమేగాక, చరిత్ర పరిశోధన, కళలు, విద్యా విషయములు, దేశభక్తిగల యువకులకు శిక్షణకై శ్రద్ధ వహించారనీ పత్రికల స్థాపనకు పూనుకొన్నారనీ స్పష్టపడుతుంది. వివిధ మండలములు తిరిగి రావుగారు కృషిచేశారు. ఐతే ఈ కృషి ఎంతవరకు సఫలీకృతమైనదో తెలుసుకొనుటకు వివరములంతగా లభించలేదు. కాని మండలములలో సంఘము లేర్పడినవి. కృష్ణదేవరాయ వర్ధంత్యుత్సవములు జరిపారు. కొత్త పత్రికలు వెలసినవి. అన్ని డివిజనులలో సేవా బృందములు తిరిగి పనిచేసినవి.

## రాయలసీమ ప్రాజెక్టు మహాసభలు

రాయలసీమజిల్లాలు అనాదినుండి కరువులకు గురియవుతూ వచ్చినవి. బ్రిటిష్ పరిపాలనలో 1946 నాటికి, రాళ్ళుగొట్టి రోడ్లు పోయడానికని వెచ్చించినది సుమారు 30 కోట్ల రూపాయలని లెక్కలు తేలుతున్నవి. కాని శాశ్వత కరువు నివారణకు, ఇరిగేషన్ ప్రాజెక్టుల నిర్మాణానికి ప్రభుత్వం పూనుకోలేదు. అందుకోసమే తుంగభద్ర, సంగమేశ్వరం, పెన్నారు, గండికోట, సగిలేరు, మున్నగు ప్రాజెక్టుల నిర్మాణం కోసం రాయలసీమ రైతాంగం ఎంతగానో ఆందోళన చేస్తూ వచ్చారు.

మొదటినుండీ వీటికై కౌన్సిలులోను, బయటను కృషి చేసిన హరిసర్వోత్తమరావుగారు తర్వాత దశలో జరిగిన ప్రాజెక్టు మహాసభలలో పాల్గొని సంతోష భరితులైనారు.

13—10—1946 వ తేదీన నంద్యాలలో "రాయలసీమ ప్రాజెక్టు మహాసభ" హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను జరిగింది. వావిలాల, టి. నాగిరెడ్డి ప్రభృతులు ఉపన్యసించారు.

పదివేలమంది ప్రజలు వచ్చారు. వై. స్వామిరెడ్డి అధ్యక్షులుగా, కోడి నరసింహం కార్యదర్శిగా ఆహ్వాన సంఘమేర్పడి మహా సభను జయప్రదం గావించారు.

ప్రాజెక్టు మహాసభలు - కడపలో గూడా జరిగినవి. ఈశ్వరరెడ్డి మున్నగువారి తోడ్పాటుతో సభలను నిర్వహించారు. ఈ మహాసభలు రాయలసీమ రైతాంగంలో గొప్ప సంచలనాన్ని కల్గించినవి. ఈ ఆందోళన ఫలితంగా తర్వాత కాంగ్రెస్ ప్రభుత్వాలేర్పడినప్పుడు. తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణం త్వరితం గావించబడింది. చిరకాలంగా ఈ ప్రాజెక్టులకై కలలుగన్న హరిసర్వోత్తమరావుగారీ మహాసభల కధ్యక్షత వహించి, యువకుల్లో యువకుడై, రైతులో రైతై ప్రజాచైతన్యానికి సంబరపడినారు.

1948 డిసెంబరు 12 వ తేదీ రాయలసీమ ఎరుకల మహాసభ 'కల్యాణ దుర్గం'లో జరిగింది. రావుగారీ సభ కధ్యక్షత వహించారు.

## రాయలసీమ రైతు సంఘ మహాసభలు

రావుగారు 1934 ప్రాంతంలో నంద్యాలలో 'తాలూకా రైతు సంఘము' నొకదానిని స్థాపించి కర్నూలు జిల్లాలో మొదటి రైతు సంఘ ప్రచారం కొనసాగించారు. ప్రొఫెసరు గోగినేని రంగ నాయకులు, హరిసర్వోత్తమరావుగార్లు కలిసి రాయలసీమ ప్రాంతాలు పర్యటించారు. రైతాంగసమస్యలకై ఆందోళన గావించారు. రైతు యాత్రలు నడిపి, శిస్తు రెమిషన్‌ను సాధించారు. రోజుకు 3 చోట్ల బహిరంగ సభల నేర్పాటు చేస్తూ, కార్యక్రమం సిద్ధం చేశారు. హరిసర్వోత్తమరావుగారు రైతులను పెట్రోలు ఖర్చులు భరించండని విజ్ఞప్తి చేస్తూ కరపత్రం ప్రకటించారు.

"ఇంతటి కార్యక్రమం పెట్రోలు, యితర ఖర్చులు లేక జరుగదు. కాబట్టి పెట్రోలు జతపెట్టగలవారు అధమపక్షమున ఒక డబ్బాయైనను జతపెట్టి, రైతు లందరు ఏదో కొంత పైకము వసూలుచేసి వుంచ ప్రార్థితులు. మిగిలిన మొత్తం వుంటే, జిల్లాల్లో రైతు అభివృద్ధి కార్య ములకు వినియోగమగును."

అన్నారు.

తమ పర్యటన కార్యక్రమ సందర్భాల్లో తాలూకా రైతు సంఘముల నేర్పరుస్తూ రంగా, హరిసర్వోత్తమరావుగార్లు సంచా రం చేశారు. ఆనాటి వీరి ప్రచారం, రాయలసీమ రైతాంగంలో నూతన చైతన్యాన్ని, సంచలనాన్ని కలిగించి, సంఘ శక్తిని పెంపొందించిం దనవచ్చును.

## దత్తమండలాలు కాదు - 'రాయలసీమ'

ఆంధ్ర దేశమునంతా ఒకే నామముతో పిలువకుండా కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాలను "దత్త మండలా"లని పిలుస్తుండేవారు. ఈ పేరు పౌరాణిక, హిందూ, మహమ్మదీయ యుగాలనాటిది కాదు. ప్రాచీన కాలంనుండి ఈ పేరులేదు. నైజాము పరిపాలనలో ఈ ప్రాంతము బ్రిటిష్ రాజ్యపాలన క్రిందకు వచ్చింది. ఈ మార్పును ఆంగ్ల భాషలో 'సీడెడ్' అన్నారు. సీడెడ్ అనగా తెలుగున 'దత్తత' అని పిలువసాగారు. హరిసర్వోత్తమరావుగారికీ పేరు సరిపడలేదు. రాయలేలినసీమ గాన 'రాయలసీమ' అంటే సముచితంగా వుంటుందని రావుగారు ప్రథమంగా సూచించారు. 1928 లో అప్పుడు నంద్యాలలో రాధా కృష్ణన్ అధ్యక్షతను ఆంధ్ర మహాసభలు జరుగుచున్న రోజులవి. ఈ రాయలసీమ పేరును, ఆంధ్ర మహాశయులెల్లరూ, రాయల

సీమ ప్రముఖులు సహా అంగీకరించారు. తదనంతరం రాయల సీమ పేరు వాడుకలోకి వచ్చింది.

ఈ నంద్యాల మహాసభలోనే చిలుకూరి వీరభద్రరావు గారికి "చరిత్ర చతురానన" బళ్ళారి రాఘవాచార్యులుగారికి "నాట్య కళాప్రపూర్ణ", దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారికి "బౌద్ధ వాఙ్మయ బ్రహ్మ" బిరుదుల ప్రదానం జరిగింది.

ఆ రాయలసీమ ప్రముఖుల సభలో టి. వి. సుబ్బయ్య, బి. ఏ., బి. యల్ గారు దత్తమండలాల పేరును యిలా పరిహాసించారు: "ఈ దత్తత ఎంతవరకు శాస్త్రీయమో యోచించండి. మహమ్మదీయు డిచ్చువాడట; అంగ్లేయుడు పరిగ్రహీతయట; శిశువు హైందవ దేశపు ఆంధ్ర వనితయట - ఎంత విడ్డూరమో చూడండి."

ప్రజల సమ్మతి యనంతరం, తర్వాత ఈ జిల్లాలను ప్రభుత్వ రికార్డులలో గూడా రాయలసీమయని పేర్కొనుట జరిగినది.

ఇటీవల గుమ్మడిదల వెంకట సుబ్బారావుగారితో సంభాషించునప్పుడు, హరిసర్వోత్తమరావుగారికి రాయలసీమప్రాంతీయ తత్వం వున్నట్లు కొందరిలో అనుమానా లున్నట్లు నాకు స్ఫురించింది. బహుశా 'పశ్చిమాంధ్ర సభా' నేర్పరచుట, 'రాయలసీమ సమితి' స్థాపనలు ఈ అనుమానాలకు కారణమైయుండనోపు. ఆంధ్రరాష్ట్రంనుండి రాయలసీమ వేరుపడాలనే స్వార్థ సంకుచిత ధోరణులను ప్రతిఘటించిన వారిలో ఆనాడు హరిసర్వోత్తమరావు గారగ్రగణ్యులుగా నిలిచారు. ఒకరిమీద ఆధారపడకుండా స్వశక్తి

మీద విశ్వాసం వుంచాలని రాయలసీమ ప్రజల నాయన మేల్కొల్పారు.

"నేను ఆంధ్రరాష్ట్రవాదినగుట ముమ్మాటి నిజము. కాని ఇతరులు మన నెత్తిమీద కిరీటము పెట్టుదురని నేనాంధ్ర రాష్ట్రమును కోరుట లేదు. ఆంధ్ర మహాజనుల కందరకు దానిపై ప్రయోజన మున్నదనే విశ్వాసముగల వాడను నేను.... ....మరియొకదు పెట్టు భిక్ష, అది తండులాల భిక్షగాని, జ్ఞాన భిక్షగాని మనకెంతో ప్రయోజనకారికాదనీ, మన బలము మనం నిర్మించుకొని తల యెత్తుకొని నిలుచు మార్గము చూచుకొన వలసిందనీ ఎల్లకాలము నేపెట్టిన ఘోషే. కాని ఇతరులతో కలియుటని పరుగెత్తి పోవువాడు లోకమున కనచ్చుటని నా నమ్మిక."

అని ఉద్బోధించారు రావుగారు.

## తెలంగాణాలో పర్యటన

1947 — 1950 సంవత్సరాలలో తెలంగాణా ప్రాంతంలో ముఖ్యంగా నల్లగొండ, వరంగల్లు జిల్లాలలో తీవ్ర ఉద్రిక్త పరిస్థితు లేర్పడినవి. ఆంధ్ర మహాసభ తరఫున హరిసర్వోత్తమ రావుగారు, కార్యదర్శితో గూడా కలిసి 1947 ఫిబ్రవరి 20—24 తేదీలలో పర్యటనచేశారు. 6 జిల్లాలలో, 280 మైళ్లు, 7 కేంద్రాలు స్వయంగా చూచి, తమ అభిప్రాయాలను నివేదిక రూపంలో యిచ్చారు. దానిలో సంస్థానంలోని ఈ దుస్థితికిగల కారణాలు ముఖ్యమైనవి మూడని విశదీకరించారు. (1) ప్రజల హృదయ విదారక కష్టాలు, ఆర్థిక దారిద్ర్య బాధలు, (2) అధికార వర్గానికి సామాన్య ప్రజల భాష తెలియక, ప్రజలతో సంబంధాలు లేక పోవటం, (3) బీదరికంతోను, అజ్ఞానంతోను వుండే ప్రజలకు—ప్రభుత్వానికి నడుమ అనేక రకాల దళారీలు (ఉర్దూ భాష

మాత్రమే తెలిసిన) వుండి కొల్లగొట్టటం, స్థానికాధికారులను లంచగొండితనంతో బాగా వశపరచుకొని తమ స్వార్థలాభా లకు వినియోగించడం ఈ మూడున్నూ ప్రధానకారణము లన్నారు.

రావుగారీ సందర్భంలో కొన్ని సూచనలు గూడా చేశారు. జాతీయ కాంగ్రెస్ చేయవలసిన పని ఒక్కటే. సంస్థానాధీశుడు మిగతా ప్రపంచపోకడ ననుసరించి నడుచుకొనేటట్లు సలహా యివ్వాలన్నారు ప్రజల్లో నిర్మాణ కార్యక్రమం ఎక్కువగా వ్యాప్తి చేయాలనీ, రాజకీయంగా మాత్రమేగాక ఆర్థిక, సాంఘిక మత సామరస్యానికి కృషి చేయాలనీ విశదీకరించారు.

"సంపూర్ణ స్వాతంత్ర్యానికి ప్రజా ఉద్యమాన్ని సాగిస్తూనే, ప్రజల యిబ్బందులను తొలగించుటకై వీలైనంత పరిపాలనాధికారములను రాబట్టుటకు స్థానికంగా ప్రయత్నాలు జరుగునట్లు రాష్ట్రంలోని ప్రజానాయ కులు శ్రద్ధవహించాలి." *

అని గూడా ఆ నివేదికలో వ్రాశారు.

---

* "Peoples leadership in the state, should aim at local action to secure as much executive power as possible, to set right people's grievances while carrying on the popular movement for complete freedom"

ప్రాథమిక మధ్యమ ఉత్తమ విద్యాలయాలలోను, కళాశాలల లోను వైద్యము, ఇంజనీరింగు ఇత్యాది ప్రత్యేక విద్యాలయాలలోను సంసారంలోకి ప్రవేశించడానికి పూర్వం పురుషులు, స్త్రీలు నేర్చుకొనే విద్యను మాణవిక విద్యయని వర్ణించవచ్చును. అట్లుగాక జీవితంలోకి ప్రవేశించిన తరువాత చదువను వ్రాయను నేర్చుకోడానికై తేనేమి, అంతకు ముందు నేర్చుకున్నది మరచిపోకుండా ఉండడానికై తేనేమి, తీరిక కాలంలో క్రొత్త విషయాలు నేర్చుకొనడానికై తేనేమి, ప్రత్యేకము తాను అవలంబించు వృత్తి వ్యాపారాదులకై అధిక కృషిచేసి నవీనశక్తిని సంపాదించుటకై తేనేమి, ఉబుసుపోకకు సంతోషంగా కథలు నాటకాలు చదువుకోడానికై తేనేమి, మానవుడు కూర్చుకొనే ఏర్పాటులన్నీ వయోజనవిద్యయని వ్యవహరింపవచ్చును.

— గాడిచర్ల హరిసర్వోత్తమరావు

౨

# షష్టిపూర్తి ఉత్సవాలు
# శ్రీ సర్వోత్తమ భవనం

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి స్థలసేకరణ – హరిసర్వోత్తమ రావుగారి షష్టిపూర్తి ఉత్సవాలు – ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు స్థాపన – గ్రంథాలయ సంఘ స్థలములో ట్రస్టుచే భవన నిర్మాణము – దీనికి రావుగారి గౌరవార్థము శ్రీ సర్వోత్తమ భవనమని నామకరణముచేయుట–శ్రీ సర్వోత్తమ భవన ప్రవేశమహోత్సవము–శ్రీ సర్వోత్తమ భవనముపై 'బాపూజీ మందిరము' పేరుతో హాలు నిర్మాణము – దీని ప్రవేశమహోత్సవము.

## 8

# షష్టిపూర్తి ఉత్సవాలు : శ్రీ సర్వోత్తము భవనం

ఒక వ్యక్తియొక్క జీవితగమనంలో 60 ఏండ్లతో ఒక ముఖ్యఘట్టం ముగిసినట్లు. కావుననే వారు చేసిన సేవలకు అభినందనలు తెలుపుతూ, షష్టిపూర్తి ఉత్సవములు చేయటం. హరి సర్వోత్తమరావుగారికి షష్టిపూర్తి ఉత్సవములు జరుపుతూ, గ్రంథాలయ ప్రచారమును వాడవాడల కొనసాగించి వారి సందేశమును ప్రజలకు వినిపించవలెనను సంకల్పం నాగభూషణం గారిలో కలిగింది. దీని ద్వారా ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి స్వంత భవన నిర్మాణం చేయగలమనే విశ్వాసంతో ఆ కార్యక్రమమున కుపక్రమించారు.

అప్పటికే పటమటలో కొమ్మా సీతారామయ్యగారి పట్టుదలతో ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘమున కొక ఎకరం స్థలం అమరింది. బెజవాడలో 28–5–1939 వ తేదీన 1800/రూ. వెచ్చించి, పటమట గ్రామ సమీపమున ఒక ఎకరం స్థలమును కొన్నారు. ఈ మొత్తంలో రు 1000/లు కొమ్మా సీతారామయ్యగారిచ్చారు.

హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్త్యుత్సవముల నిర్వహణ విషయమై వారితో నాగభూషణంగారు చెప్పినప్పుడు వారు

మొదట సమ్మతించలేదు. ఈ కార్యక్రమం ద్వారా సంఘానికి ఉపయోగం కలుగుతుందనగా అట్లయిన తమ కభ్యంతరముండ దన్నారట. ఈ విషయాన్నే సూర్యాపేట మహాసభలో హరి సర్వోత్తమరావుగారిలా తమ ప్రసంగంలో చెప్పారు :

"నా షష్టిపూర్తి ఉత్సవములుచేసి అందువల్ల వచ్చిన నిధిని గ్రంథాలయోద్యమానికి చెందింప జేసుకొంటామని శ్రీ నాగభూషణంగారనగా అంగీకరించాను. దీనివలన ప్రపంచానికేమైన లాభంకలిగితే నా కభ్యంతరంలేదు. అందుకని లక్షలు యిచ్చినా పుచ్చుకొంటాను. కాని నా స్వంతానికి మాత్రం చిల్లిగవ్వ వద్దు."

10–1–1946 వ తేదీన మొదటి సభ పటమటలంకలో వైభవోపేతంగా జరిగింది. ఆనాడు రు 2,600/లు వసూలైనవి. కానుకలు వారికి సమర్పింపబడినవి. దీనిలో మరల రు 2000 లు శ్రీ సీతారామయ్యగారిచ్చినదే. తదుపరి బుర్రిపాలెం, సూర్యాపేట, చాగలమర్రి, కుముదవల్లి మున్నగుచోట్ల గ్రంథాలయ సభలు, సమావేశాల సందర్భంలో రావుగారి షష్టిపూర్తి ఉత్సవములు జరిగినవి. ఆయా ప్రాంత ప్రజలు విరాళములిచ్చి రావుగారి దేశ సేవయెడల గౌరవాభిమానాలు వెల్లడించారు. 23–3–1948 వ తేదీన పటమటలంక వాస్తవ్యులు శ్రీ వల్లూరు కేశవరావుగారు భవనమునకు శంకుస్థాపన చేశారు. దీని నిర్మాణ, నిర్వహణల బాధ్యత 'ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు' కు అప్పగించారు. ఈ ట్రస్టును 9 వేల రూపాయలు కిమ్మతుచేయు 3 ఎకరముల తోటను దానముచేస్తూ శ్రీ సీతారామయ్యగారేర్పాటుచేశారు. ట్రస్టు 'స్థాపకులు' సీతారామయ్యగారి కృషిఫలించింది తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం తాలూకా కొండెవరం వాస్తవ్యులు, స్వయంపోషక

కృష్ణాశ్రమ స్థాపకులునగు గోటేటి జోగిరాజుగారు వ్యవసాయ శాస్త్ర సంబంధమైన 20 ఉద్గ్రంథముల ప్రకటన హక్కులను ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టువారికి స్వాధీనపరుస్తూ, విరాళంగా రు 2,500/ రొక్కముచేర్చి యివ్వచ్చునట్లు, ఈ పుస్తకాలలోచేర్చ వలసిన బ్లాకులను తమ ఖర్చుతో చేయించియిచ్చునట్లు ఒడంబడిక చేసుకొన్నారు.

గ్రంథాలయ సంఘ భవన నిర్మాణం పని బెజవాడలోని రాంప్రసాద్ లిమిటెడ్ వారికి కంట్రాక్టు కివ్వగా వారు దీనిని మంచి పునాదులమీద శ్రద్ధగా కట్టినారు. ఈ నిర్మాణానికి సుమారు 28 వేల రూపాయలు ఖర్చు అయినది. దీనిలో రు 5000/లకు పైగా శ్రీ హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్తి కానుకల ద్వారా లభించినది. దిగువ పేర్కొన్న దాతలు ఒక్కొక్క గది నిర్మాణానికి మూడేసివేల రూపాయలు విరాళముగ నిచ్చినారు.

1. శ్రీ వాసిరెడ్డి శక్తీశ్వరుడుగారు, పెదపాలెం, తెనాలి తాలూకా.
2. విజయవాడ ఉత్పత్తి కొనుగోలుదారుల సంఘమువారు.
3. శ్రీ పాములపాటి బుచ్చినాయుడు, శ్రీమతి పాములపాటి వెంకట సుబ్బమ్మగార్లు, నిడుబ్రోలు, గుంటూరుజిలా.
4. శ్రీ నాగినేని వెంకయ్యగారు (వారి అన్న శ్రీ నాగినేని ఆదినారాయణగారి జ్ఞాపకార్థము) ధేనువకొండ, ఒంగోలు తాలూకా.
5. శ్రీ వాసిరెడ్డి నాగయ్యగారి కుమారుడు వెంకటప్పయ్య గారు, పెదపాలెం, తెనాలి తాలూకా.
6. శ్రీ రామినేని అప్పయ్యగారు, పటమట, కృష్ణాజిలా.

ఈ భవనములలో 2 గదుల పై శాల్యముగల మధ్యహాలును శ్రీ కొమ్మా సీతారామయ్యగారు వారి అన్నగారైన శ్రీ కొమ్మా పున్నయ్యగారి పేరట కట్టించినారు.

గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు గ్రంథాలయోద్యమానికి, వయోజనవిద్యా ప్రచారానికి చిరకాలం నుండి నిర్విరామముగ చేయు కృషికిని, నలుబదేండ్లకు పైగా వివిధ రంగాలలో ఆంధ్ర జాతికి వారొనర్చుచున్న సేవలకును ప్రతిఫలముగ వారిని గౌరవించు సంకల్పంతో ఈ భవనమునకు "శ్రీ సర్వోత్తమ భవన"మని నామకరణం చేయబడింది. శ్రీ సర్వోత్తమ భవన ప్రవేశమహోత్సవము, స్వస్తిశ్రీ విరోధినామ సం. జ్యేష్ఠ శు ౫ బుధవారం (1–6–1949) నాడు పాములపాటి వేంకట కృష్ణయ్య చౌదరి గారిచే జరుపబడింది. ఈ విధంగా ఆంధ్ర గ్రంథాలయోద్యమావతరణానికి దాదాపు అర్ధశతాబ్దానంతరం పటమటలంకలో కొమ్మా సీతారామయ్యగారు నెలకొల్పిన ఆంధ్ర గ్రంథాలయ ట్రసువారి కృషితో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి స్వంత భవనం ఏర్పడింది.

శ్రీ సర్వోత్తమ భవన ప్రవేశమహోత్సవ సందర్భ శుభ సమయాన పూజ్యులు హరిసర్వోత్తమరావు గారిలా ఉపన్యసించారు :

"శ్రీ సర్వోత్తమ భవనమని పేరు పెట్టుటచేత, నా పేరు లోకము మరచినను ఇందు సర్వోత్తమమైన కార్యక్రమము నడుచుచో, నా యుద్దేశము ప్రకారము నడుచుచున్నదని తలచి నేను సంతోషింపగలను. ఈ కార్యక్రమమును నడుపుకొనవలసిన విధి ప్రజలది. నా యెడల ప్రేమగలిగి ఈ భవనమునకు నా పేరు పెట్టినను. ఇది అంతయు నా

ప్రభావముచేతనే కలిగెనను అభిప్రాయము నాకు కలుగకుండా దైవము నన్ను రక్షించుగాక!

నా దృష్టిలో ధర్మమే ఈశ్వరుడు. సత్యమే ఈశ్వరుడు. మనుగడయే ఈశ్వరుడు. మన జీవితమునకు సంబంధించిన దానిలో ఒక్కొక్క జీవి అణువు. అణుమాత్రమైన ఒకని గొప్పతనముచేత ఈ బ్రహ్మాండమైన కార్యక్రమము నడువదు. మానవునకు గర్వము ఏ మాత్రము పనికి రాదు. తన కార్యక్రమము ననుసరించి, ప్రజాసేవ చేయుచున్నచో, మన సున కొక విధమగు సంతోషము కలుగును. మనయొక్క విధి నిర్వ హణమువలన లోకమునకు ఉపకారము కలుగును. పేరాశను పొందక నమ్రతతో నిర్మాణ కార్యక్రమమును సాగించవలెను.

అన్నారు.

ఈ ప్రవేశ మహోత్సవంతోపాటు. కృష్ణాజిల్లా గ్రంథా లయ మహాసభ, గ్రంథాలయ పట్టప్రదానోత్సవము, ఆంధ్ర వైజ్ఞానికులలో వ్యవసాయధురీణ గోటేటి జోగిరాజు, అభినవ సహదేవ యేజెళ్ళ శ్రీరాములు, విజ్ఞానకోవిద కాశీపట్నం కొండయ్యగార్ల సన్మానము, వయోజనవిద్యా ప్రదర్శనము, మహిళా సమావేశములు గూడా జరుపుటచే శ్రీ సర్వోత్తమ భవనమున కామూడు రోజులు వన్నెదెచ్చినట్లయినది. భవన ప్రవేశోత్సవ కమిటీ పక్షమున వల్లూరు కేశవరావుగారు స్వాగ తోపన్యాసమిచ్చి, కార్యక్రమాన్ని జయప్రదం చేయుటలో తోడ్పడినారు.

ఆనాడు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు ఉపన్యసిస్తూ

"వేలమంది శిష్యులకు విద్యాదానము చేయించుచున్న వారిని పూర్వం 'కులపతి' అనేవారు. అటువంటి వారిలో కణ్వుడు ఒకడు. ఆ స్థానము నేటికి శ్రీ హరిసర్వోత్తమరావుగారికి చెందింది. వీరు అనేక భాషా

విశారదులు. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారితో మన హరిసర్వోత్తమ రావుగారిని పోల్చవచ్చును"

అన్నారు.

## బాపూజీ మందిర నిర్మాణం

శ్రీ సర్వోత్తమ భవనముపై 'బాపూజీ' మందిర నిర్మాణమునకు నాగభూషణంగారు పూనుకొన్నారు. గాంధీస్మారక నిధి, కేంద్ర ప్రభుత్వముల ఆర్థిక సహాయములతోను, కొంత అప్పు చేసి దీనిపైన 60×30 అడుగుల వైశాల్యంగల పెద్దహాలును నిర్మించగలిగారు. 1-2-57వ తేదీన పచ్చవ పాపయ్యగారిచే శంకుస్థాపన చేయబడిన ఈ హాలును 1958 జనవరికల్లా పూర్తిచేయగలిగారు. ఈ 'బాపూజీ మందిర' ప్రవేశోత్సవము భారత జాతికి పర్వదినమగు 1958 జనవరి 26 వ తేదీన చెన్నుపాటి రామకోటయ్యగారిచే వైభవంగా జరుపబడింది.

దీని నిర్మాణం నిమిత్తం కేంద్ర ప్రభుత్వం రు 8375 లును, గాంధీ స్మారకనిధివారు 5 వేల రూపాయలును ధనసహాయం చేశారు. దీనికి 20 వేల రూపాయలకు పైగా ఖర్చయినది. ఈ 'బాపూజీ' మందిరంలో 'ఆంధ్రప్రదేశ్ గాంధీ సాహిత్య నికేతనం' (కేంద్ర గ్రంథాలయం) వెలసింది. ఈ గ్రంథాలయానికి పుస్తకాల నిమిత్తం గాంధీస్మారక నిధివారు దాదాపు రు 2000 లు విరాళ మిచ్చారు. క్రమేణా శ్రీ సర్వోత్తమ భవనంలో, ఆంధ్ర ప్రదేశ్ గ్రంథాలయ సంఘ కార్యాలయంతోపాటు ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు, గ్రంథాలయ పుస్తకశాల, సర్వోదయ ముద్రణాలయం, గాంధీ తత్వప్రచార కార్యాలయము మున్న




శ్రీ సర్వోత్తమ భవనము, విజయవాడ

[ పుట 329 ]

గునవి ఏర్పాటు చేయబడినవి. కొంతకాలము పాతూరి నాగభూష ణంగారు గాంధీ స్మారకనిధి పక్షాన విజయవాడలో గాంధీ తత్వ ప్రచారకులుగ పనిచేశారు.

బాపూజీ మందిర ప్రారంభోత్సవ సమయమున "గాంధీజీ సిద్ధాంతాలను ప్రశాంతంగా అధ్యయనం చేయడానికి, పరిశోధించ డానికి తగిన అవకాశములను ఈ సంస్థ త్వరలో సమకూర్చుకొ నగల"దని ఆశిస్తున్నానన్నారు రావుగారు. "ఈ బాపూజీ మంది రంలో నెలకొననున్న గాంధీ సాహిత్య నికేతనమువంటి సంస్థలు ముందుకువచ్చి జ్ఞానజ్యోతిని చల్లారిపోకుండా కాపాడవలసిన అవ సరం ఎంతైనా ఉన్న"దని చెరుకువాడ నరసింహంగా రుపన్య సించారు.

ఈ శుభసమయంలో "కవితాగోష్ఠి" జరిగింది. విశ్వనాథ సత్యనారాయణ, తుమ్మల సీతారామమూర్తి, గురుజాడ రాఘవ శర్మ, పురిపండా అప్పలస్వామి, జాస్తి వెంకటనరసయ్య, శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం మున్నగు కవిపుంగవులు గాంధీ జీపై తాము వ్రాసిన పద్యాలను, గేయాలను చదివి వినిపించారు. గాంధీ సిద్ధాంతాలపై గోష్ఠి, ఉపన్యాసాలు జరిగినవి.

ఈ సందర్భాన్ని పురస్కరించుకొని, వివిధ జిల్లాలలోని ఆంధ్ర గ్రంథాలయోద్యమ సేవకులను ఇద్దరు శాలువలతోను, పుష్పగుచ్ఛములతోను హరిసర్వోత్తమరావుగారు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం, ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టులపక్షాన స్వయంగా సత్కరించారు. విద్యాదాతలు, సంఘసంస్కర్తలు, దేశారాధకు లగు ఉన్నవ లక్ష్మీనారాయణగారికి సన్మానం జరిపారు. లక్ష్మీ నారాయణగారు వ్రాసిన మాలపల్లి ఆంధ్ర వాఙ్మయానికే శోభ

తెచ్చింది. ఆ దంపతులు స్థాపించిన "శారదా నికేతనం" సంఘ సంస్కరణాభిలాషులందరికీ కేంద్రమైనది. ఆంధ్రదేశంలో స్త్రీవిద్యా వ్యాప్తి కెంతో తోడ్పడినది. రాజకీయ, సారస్వతరంగాల్లో బహుముఖకృషిచేసిన ఉన్నవ లక్ష్మీనారాయణగారికి సేవాంజలి సమర్పించిన పవిత్ర సన్నివేశాలు ఎన్నటికీ మరువరానివి. ఆ సందర్భంలో విశ్వనాథవారిలా ప్రసంగించారు :

"ఆంధ్రదేశానికి భీష్మ ద్రోణులవంటివారు శ్రీయుతులు గాడిచర్ల వారు, ఉన్నవవారు. శ్రీ హరిసర్వోత్తమరావుగారు యౌవన దశలో తమ భవిష్యత్తును సంపూర్ణంగా త్యాగంచేసి, ఆంధ్రభూమిలో సింహగర్జనచేసి విహరించిన రోజులు జ్ఞాపకం వస్తున్నవి ......దేశభక్తాగ్రేసరులు, వయోవృద్ధులు, పండితులు అయిన హరిసర్వోత్తమరావు గారి మార్గదర్శకత్వంలో ఆంధ్ర గ్రంథాలయోద్యమం, గ్రంథాలయ సేవకులు ముందుకుసాగుతూ వుండటం ఎంతో ప్రశంసనీయం."

"రోము మహానగరం ఒక్క రోజులో నిర్మాణంకాలేదు" అన్నసామెతవలె, శ్రీ సర్వోత్తమ భవనం, "బాపూజీ మందిరం" ఒక్క రోజులో నిర్మాణంగాలేదు. 10, 15 సంవత్సరాల నిరంతర కృషిఫలితాలివి. వీటికెందరెందరో దాతలు ఉదుతాభక్తి విరాళాలిచ్చి తోడ్పడినారు. ఏ సుముహూర్తాన కొమ్మా సీతారామయ్యగారు స్థలంకొని గడ్డనెత్తారో పాతూరివారి సేవ, శ్రమ వృథాగాలేదు. సత్సంకల్పాలు, సత్ఫలితాలిచ్చుట సహజంగదా!

రావుగారి షష్టిపూర్తి ఉత్సవాలను పురస్కరించుకొని, గ్రంథాలయ మహాసభ సందర్భంలో సూర్యాపేటలో సభ జరిగింది. రావుగారిని నూతన వస్త్రాలంకృతులనుచేసి, సన్మాన పత్రాలిచ్చి-పంచరత్నాలు చదివారు.

అయ్యదేవర బాలాత్రిపుర సుందరమ్మగారు

"వీరిది పటాటోపమెరుగని నిరాడంబర జీవితం. శ్రీవిద్యాభిమానం అపరిమితం. అందుకు త్రిలోకం ఎల్లకాలం ధన్యవాదా లర్పిస్తుంది" అని ప్రస్తుతించారు.

రావుగారు నమ్రతతో సమాధానమిస్తూ

"నా గౌరవార్థం షష్టిపూర్తిఉత్సవం విషయమై హెచ్చుగా ప్రస్తావించడం నాకిష్టంగాదు. సర్కారు-తెలంగాణా-రాయలసీమలమధ్య సామరస్యాన్ని నెలకొల్పుటకు కార్యక్రమం ఉపయోగపడగలదని నా యువక మిత్రులు చెప్పినారు. నాద్వారాగాని, నా సేవద్వారాగాని ఈఫలితం ఏమాత్రం సిద్ధించినప్పటికీ నా జీవితం వృథాకాలేదని భావిస్తాను. నాయెడల ఘూర్యాపేటపట్టణ పౌరులు చూపించిన ప్రేమను నాజీవితంలో మరువజాలను" అన్నారు.

రావుగారి షష్టిపూర్తి ఉత్సవముల సందర్భములలో ఆంధ్రదేశం నలువైపులా గ్రంథాలయోద్యమ చరిత్రను వివరించి రావుగారి సందేశాన్నిగూడా వినిపించుటకు అవకాశం గల్గింది. నిర్మాణ కార్యకర్తలలో ఉత్సాహం ప్రబలింది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు "శ్రీసర్వోత్తమభవనం" అమరింది. సర్వోత్తముని పవిత్రాత్మ లోలోన సంతసించింది.

ర

# రావుగారి అభిప్రాయాలు

కర్మయోగి-సుప్రసిద్ధ ప్రజాస్వామికవాది-ఆర్డినెన్సుల విమర్శకుడు-శాంతి కాముకుడు - గాంధీ అనుయాయుడు - ఫ్యూడల్ సాంప్రదాయాలకు వ్యతిరేకి.

## కర్మయోగి

ఒక ఆశయాన్ని, ఆదర్శాన్ని జీవిత పరమావధిగా కలిగి యుండటం గొప్పవారి లక్షణం. హరిసర్వోత్తమరావుగారి కొక లక్ష్యం వున్నది. అదే మాతృదేశారాధన. అందుకై కీర్తికాంక్షా రహితుడై, అధికారపదవులకై తహతహలాడక, నిస్స్వార్థంగా తదేకదీక్షతో ప్రజాసేవచేశారు. నిరంతరం కర్మ చేయడమే రావుగారి ఆదర్శం.దానిఫలంతో వారికినిమిత్తంలేదు. ఒకరి మెప్పుకోరి ఆయన ఏ పనీచేయరు. ఇతరులను సంతృప్తిపరచడానికి తనకున్న విశ్వాసాలనేమాత్రం సడలించుకోరు. విద్యాధికుడైనందున ఉద్యోగాల కాశిస్తే ఆర్జనకేమీ లోటు వుండేదికాదు. కానిదేశభక్తి, ప్రజాసేవలముందు ద్రవ్యార్జనను తృణప్రాయంగా ఎంచినారు. అందుకనే ఆ మహానుభావుడు జీవితంలో సుఖమంటూ అనుభవించలేదు. అయినా చలించినవారుకాదు. అదీ ఆయన దీక్ష. గాంధీజీ "దేశసేవ యొనర్ప దలచినయెడల ముందు స్వార్థమును బరిత్యజింపుము. కీర్తికాంక్షతోడ, స్వదేశసేవ నభినయింపవలదు. అందువలన దేశముద్ధరింప బడదు"అన్నారు. నిస్స్వార్థ సేవాధర్మమే రావుగారి జీవిత పరమావధిగా కన్పిస్తుంది.

రవీంద్రకవి చెప్పినట్లు "ఉపాధ్యాయుడు తానింకా నేర్చుకొంటూ వుంటేతప్ప యథార్థంగా చదువు చెప్పలేడు. దీపం తాను

వెలుగుతూ జాజ్జ్వలంగా వుంటేతప్ప మరొక దీపాన్ని వెలిగించ లేదు." *

తన నిత్యకార్యక్రమంలో తీరిక చేసుకొంటూ స్వీయాభి వృద్ధికోసం రావుగారు అనేక గ్రంథాలు చదివేవారు. వివిధ శాస్త్రాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసేవారు. అవసానదశ వచ్చేవరకు ఆయన విజ్ఞానతృష్ణలో స్తబ్ధతరాలేదు. ప్రాచీనవాఙ్మయంతోపాటు, అధునాతన సారస్వతాన్నికూడా చదివి ప్రాతక్రొత్తలను సమన్వయం చేసుకొన్నారు. ప్రాక్పశ్చిమ నాగరికతారీతులకు, ఆధ్యాత్మిక భౌతికశాస్త్రాభివృద్ధిని జోడించి సాటిలేని మేటివిజ్ఞానాన్ని సాధించినారు.

సత్యం కేవలం పైపై మాటలకు, పదాలకు సంబంధించినది మాత్రమేకాదు. అదొక జీవితమార్గం. హరిసర్వోత్తమరావుగారు మనోవాక్కాయ కర్మలయందు శుద్ధిగలవ్యక్తి. ఒక స్పష్టమైన జీవిత తత్వం (philosophy of life) ఉండబట్టే రావుగారు చెప్పేమాటలకు, అనుసరించే ఆచరణకు వ్యత్యాసమేమీ వుండేదికాదు.

గీతాధర్మమందు అమితవిశ్వాసమున్నట్లు అప్పుడప్పుడు వారుచెప్పిన మాటలు, చేసినప్రసంగాలు, వ్రాసిన రచనలనుబట్టి బోధపడుతుంది. వారు ఆస్తిక నాస్తిక వాదవాగ్వివాదాల జోలికి ఎన్నడూ పోలేదు. భగవంతునిగూర్చి శుష్కవేదాంత గోష్ఠులు,

---

* A Teacher can never truly teach unless he is still learning himself. A lamp can never light another lamp unless it continues to burn its own flame.

సంభాషణలు జరపడానికి పూనుకోలేదు. దేవాలయాలకు వెళ్ళి పూజా పునస్కారాలు చేయటానికిగూడా ప్రయత్నించలేదుకాని రావుగారి హృదయంలో నిగూఢమైన భగవద్భక్తి వుండేది. అది బయటివారి కెవరికి అంతు చిక్కుతుంది ? భగవద్గీతలో చెప్పినట్లుగా ఫలితాన్నిగూర్చియోచించక కర్మచేయటమే తనధ్యేయం అన్నారు రావుగారు. •

"నీపాదకమల సేవయు, నీపాదార్చకులతోడి నెయ్యమును, నితాంతాపారభూతదయయును తాపసమందార నాకు దయసేయగదే" యన్నదివారిప్రార్థన 'మానవసేవయేమాధవసేవ'యనివారు తమ ప్రసంగములలో చెబుతూవుండేవారు. స్వామి వివేకానందుని విశ్వకల్యాణాదర్శమును వివరిస్తూ, ఆయన ప్రబోధించిన

---

• సీ॥ పువ్వులగొనితెచ్చి పూజింపనేలొకో
విరులగుంపున నిన్ను నరయువాడు
పుణ్యవాహినులలో బోయిమ్రుక్కంగనేల
హ్రదగీతముల నిన్ను వెదకువాడు
వర్ణాశ్రమములంచు పరితపింపగనేల
బుధులందు నినుజూచి పొంగువాడు
కల్లవిగ్రహముల కరుణవేడుటయేల
ఘనకార్యముల నిన్ను గనెడువాడు

గీ॥ సృష్టియెల్లను నీవయై చెలగుచుంట
గాంచి యుప్పొంగి కార్యంబు కడకదీర్చి
తనదు మనమున నినుగొల్చికొనెడుగాని
మాయలోబడి సత్యంబు మరచునొక్కొ॥

— రావుగారి స్వదస్తూరీలో వున్న ఒక చీటీముక్క

దేశాభిమానాన్ని, త్యాగదీక్షను అలవరుచుకోవలెనని వారు వ్రాశారు.

"నీవు ప్రయత్నం మానుకోడం. నిరంతరకృషి చేయకుండా మిన్నక కూర్చోడం – నీబోటి అణువుల ప్రయత్నంచేత తీరుతూవుండే ప్రపంచ జీవసుందర విగ్రహాన్ని వికారపరచడానికి కారణభూత మవుతుంది; అందుచేత నీవు నీప్రయత్నము నిలిపితివా? పతితుడవౌతావు. పడిపోయినవాడవై పోతావు. కాబట్టి సూర్య చంద్రాదులెట్లోకరొకరు కోరక, తమతమ ప్రయత్నాన్ని నిలుపక చేస్తున్నారో, అట్లునీవు నిలుపక నీప్రయత్నాన్ని చేయవలె. నీవెన్నిదేహాలెత్తినా, ఎన్నిరూపాలు మారినా, నిరంతర ప్రయత్నమనే నీగుణం – దీనినేకర్మఅన్నా అనవచ్చు– అది నిన్ను విడువదు. నీవు దాన్ని విడువరాదు. అదే ప్రాణము; అదే మోక్షము; అదే సర్వము; అదే దైవము; అదే ఈశ్వరుడు...."

—రావుగారి భగవద్గీత వ్యాసమునుండి

క్రొత్తగా ఆంధ్రప్రాంతానికి స్టేటుకౌన్సిలు సభ్యులస్థానాలు ఎక్కువ వచ్చినవి. ఆ సందర్భంలో మిత్రుల వత్తిడితో–ఆనాటి ముఖ్యమంత్రిగారికి హరిసర్వోత్తమరావుగారొక లేఖ వ్రాశారు. అందులో,

"నేను బీహారు, బెంగాలు రాష్ట్రములలోని గ్రామసీమల్లో పర్యటిస్తున్నాను. మిమ్ముల స్వయంగా కలుసుకోలేకపోతున్నాను. మీరు, నేను కావాలనుకొంటే నా నామినేషన్‌ను దాఖలు చేయించండి. ఒకవేళ మీరు నన్ను సెలెక్టుచేయక పోయినా నేనేమాత్రం అసంతృప్తి చెందువాడను కాదని మీకు తెలుసు."

అని వ్రాశారు. ఈ విధంగా రావుగారు తన ధోరణిలో తాను పని చేసుకొంటూ పోయేవారు.

హరిసర్వోత్తమరావుగారు 1927-30 దరిమిలా, శాసన సభలలో మరల ప్రవేశించే అవకాశంరాలేదు. దానికోసం ఆయన మంత్రుల వెంట తిరిగినట్లు కానరాదు. తనదారినితాను కార్యక్రమంలో పనిచేసుకొంటూ వెళ్ళేవారు. తమ సహచరుల ప్రోద్బలంతో, అప్పుడప్పుడు ఎన్నికల సందర్భాల్లో లేఖలు వ్రాసినా, అవేమీ ఫలితానికి రాలేదు.

## ఎన్నికల దరఖాస్తును పెట్టేతీరు

1947 జనవరి 7 వ తేదీ: నంద్యాలలో కాసరబాద నరిసింగ రావు కలిసినాడు. రేపు 8 వ తేదీనుండి ఆంధ్రి పార్లమెంటు బోర్డు వారితో కలిసిమాట్లాడి పోవచ్చునన్నారు. నా జవాబు - "వారికి నేను కావలిసివస్తే నే నుండనక్కరలేదు. వారికి నేను కాబట్టకపోతే నేనుండీ ఫలంలేదు. వారి నిర్ణయం వారిని చేయనీ" అని నేను గుంటూరుకు బయలుదేరి వెళ్ళినాను.

—రావుగారి డైరీనుండి

ఇదీ రావుగారి ధోరణి. ఎన్నికలలో ఒక్కొక్క అభ్యర్థి తన సెలెక్షన్ విషయంలో ఎన్నెన్ని ప్రయత్నాలు చేస్తూంటాడో, ఎంతెంత ఖర్చుచేసి తనవాళ్ళందరినీ చేర్చి పార్లమెంటరీ కమిటీముందు సాక్ష్యమిప్పిస్తుంటాడో చూస్తూన్నవిషయాలే కాని రావుగారి కివేమీగిట్టవు. ఆయన ఈ తరానికి చెందిన మనిషికాదు. ముక్కుకు సూటిగాపొయ్యే ధోరణి ఆయనది

సంఘంలోవ్యక్తిస్వాతంత్ర్యం-సంఘ స్వాతంత్ర్యాలకుండే సంబంధాలను హక్కులు - బాధ్యతలను గూర్చి తెలుపుతూ

"అనాదికాలం నుంచి నేటివరకు లోకంలో పుట్టిన మహావేత్తలందరూ, మహాత్ములందరూ వ్యక్తి స్వాతంత్ర్య, సంఘ స్వాతంత్ర్యాలకుండే సంబంధాలను చక్కదిద్దే ప్రయత్నం చేసినారు...

'సత్యంవద - ధర్మంచర' అన్న వేదాంతాలుగాని, ఆత్మ పరమాత్మల పరస్పర సంబంధాలను నిరూపింపజూపిన వేదాంతంగాని, 'నీవు నీ ధర్మం చేయి-ఫలము పరమాత్మాధీనం' అని ఆదేశించిన గీతగానీ, శత్రువు ఒక చెంపగొడితే రెండవ చెంపజూపమన్న క్రీస్తుగాని; సబర్ సిద్ధాంతాన్ని లోకానికి చాటిన మహమ్మద్‌గాని; దయాశీలములే ముక్తిమార్గములని ప్రబోధించిన బుద్ధుడుగాని, ఒక్కొక్కరూ ఈప్రయత్నాన్నే చేసినారు. గాంధీజీ అంధకారంలో చిక్కుకొన్న మన దేశానికి తన సర్వస్వం సమర్పిస్తున్నా డంటే యీ యుద్దేశంతోనే చేస్తున్నాడు....

ఇంత ప్రయత్నానికీ కీలకం మానవుని మనస్తత్వం. నా హక్కులేమిటి? నా జవాబుదారీలేమిటి? (Rights and responsibilities) అనేది నిర్ణయించుకొని మానవుడు సంఘంలో ప్రవర్తించే మన స్తత్వంమీదనే ప్రపంచకల్యాణమో, పతనమో ఆధారపడుతుంది." అన్నారు.

ఒకచోట ఉపన్యసిస్తూ "మననెట్లామనము ప్రేమించుకొంటామో, అట్లా యితరులను ప్రేమించడం అలవరుచుకోవాలి. దీనినే సోదరభావం, భూతదయ అంటాను" అన్నారు. రావుగారి మహోన్నతాదర్శాలను తన ముందిడుకొని, జీవిత యాత్రను సాగించారనవచ్చు. మానవసేవ, సంఘసేవ పరమార్థంగా భావించి, తమ సేవాధర్మంతో జీవితం ధన్యం చేసుకొన్నారు ఒకనాడు సింగరేణి కాలరీస్‌లో జరిగిన గ్రంథాలయ మహాసభలో ఎక్బాల్ వ్రాసిన ఒక చక్కని గేయాన్ని యువకవి మధుర కంఠంతో పాడాడట. అది బ్రాహ్మణుని సంబోధించి వ్రాసినది. "దేవాలయంలోని విగ్రహములలో దేవుని జూచే ఓ బ్రాహ్మణుడా! ప్రజాహిత జీవనములో దేవుడున్నాడు చూడు" మన్నాడాయన. అదే సందేశమును హిందూ ముసల్మాను సోదరుల

కిచ్చాడు. వెభాస్ అన్నారు రావుగారు. మరలమరల ఆ గేయాన్ని పాడించుకొని సంతోషించారు.

1. "ఓవెర్రివాడా: ఎందుకెక్కడికోపోయి ప్రాకులాడెదవు? సందేహముకలిగినప్పుడు ఇతర ధర్మాలనన్నిటిని వదలిపెట్టి నన్ను మాత్రం శరణు పొందవలసినది"
2. "ప్రయత్నం నీపని; ఫలము నాయధీనము."
3. "ఎల్లకాలం ప్రయత్నం నీవు చేయటం మానవద్దు. మానితివా మోక్షము నీకు లేదు.

ఈ మూడు గీతాబోధలు రావుగాకి వేదవాక్కులుగా తోచినని "గీతాధర్మం" గూర్చి రావుగారు వ్రాసిన వ్యాసాల్లో ఈ ముఖ్యవిషయాలను విశదీకరించారు.

భగవద్గీతలో వైశేష్యమేమి? అను శీర్షికతో రావుగారొక గేయం వ్రాశారు. దీనిలోని కడపటి భాగమును చూడండి. వీరు దీనిలో వర్ణించిన సమతను సాధించుటలో కృతకృత్యులైనారని చెప్పవచ్చును.

"స్నేహము — వైరము,
శీతము — నుష్ణము,
కలిమియు — లేమియు,
కష్టము — సుఖమున్,
నిలుకడ నొందక
కలుగును; అడగును.
ఇవి యెల్లను జడ
భవమగు గుణముల్
వీనిని సమతను
వీక్షింపంగల
జీవికె నిజమగు
చిరగతి యమరున్."

— గ్రంథాలయ సర్వస్వము 1937 జనవరి సంచికనుండి

## సుప్రసిద్ధ ప్రజాస్వామిక వాది

హరిసర్వోత్తమరావుగారు ప్రసిద్ధ ప్రజాస్వామికవాది. వాక్సభాపత్రికా స్వాతంత్ర్యాదులు కావాలని వాంఛించే వ్యక్తి. అంతర్జాతీయ రాజకీయాలలోగూడా వీరికి మంచి ప్రవేశంవుంది. గ్రంథాలయ సర్వస్వంలో "లోకవార్తాలహరి" యను శీర్షికను పెట్టి ప్రపంచ సంఘటనలమీద వ్యాఖ్యలు వ్రాస్తుండేవారు. ముఖ్య అంతర్జాతీయ సమస్యలమీద హిందూ, ఆంధ్రపత్రికలలో ప్రముఖవ్యాసాలు వ్రాశారు.

ద్వితీయసంగ్రామములో, మిత్రరాజ్యసైన్యాలు గెలుపులో నున్న తరుణమది. "యుద్ధంలో సామ్రాజ్యవాదులు బలపడుతున్నారని మీఅభిప్రాయమా?" అనిఒక విలేఖరి అడిగిన ప్రశ్నకు 1944 లో రావుగారిలా జవాబిచ్చారు :

> "ఈ రోజున చర్చిల్ ప్రధాని ఫాసిస్టు వ్యతిరేకకూటమిలో వున్నప్పటికీ విజయంమాత్రం అతనిదికాదు. యూరోపియన్ ప్రజలది. యుద్ధానంతరం యూరప్‌లో సామ్రాజ్యవాదులు తమ పలుకుబడిని తిరిగి స్థాపించు కోడమనేదికల్ల. యూరప్‌లోనేగాదు; ఇంగ్లండులో సైతం పెత్తనం సామ్రాజ్యవాదుల చేతుల్లో ఉండదు."

ఇది ఎందువల్లనో విశదీకరించమని కోరగా రావుగారిలా అన్నారు :

> "యుద్ధంలో శిథిలమైన ఆర్థిక నిర్మాణాన్ని తిరిగి బాగుపరచాలంటే ప్రజలసహకారం తప్పనిసరిగా తీసుకొనవలసివుంటుంది. అందువల్ల కొత్తమంత్రివర్గంలో ఇప్పటికంటే ఎక్కువగా ప్రజాప్రాతినిధ్యం వుంటుంది. ప్రజాస్వామ్య పద్ధతులు అమల్లోకివస్తాయి. సామ్రాజ్యవాదం నేడు శిథిలమైపోతూంది. సోషలిస్టు సిద్ధాంతాల ప్రాబ

ల్యం తప్పనిసరిగా ఎక్కువవుతుంది. అంతిమదశలోనున్న సామ్రాజ్య వాద ప్రభుత్వాలు ఈ ప్రజావెల్లువను ఆపజాలవు."

—6-9-1944 'ప్రజాశక్తి' (విలేఖరితో హరిసర్వోత్తమరావుగారి వివరణ)

సరిగ్గాఇలానే జరిగింది. యుద్ధానంతరం ఇంగ్లండులో లేబరుపార్టీ గవర్నమెంటు ఏర్పడింది. అట్లీప్రభుత్వం 1947 లో భారతదేశానికి స్వరాజ్యం ఇవ్వక తప్పిందిగాదు. రావుగారు దూరదృష్టిగల రాజకీయవేత్త. కనుకనే పీరీ అంచనావేయగలిగారు.

1935 లో గూడా మనకు సంక్రమించిన నూతన రాజ్యాంగ చట్టాన్ని, ఫెడరేషన్‌ను తీవ్రంగా విమర్శిస్తూ అనేక వ్యాసాలు వ్రాసి ప్రచారంచేశారు. ఈవ్యాసాలలో వారు "మనకు డెమాక్రసీ రాలేదు. మనకిప్పుడు చేతికి వచ్చిన డెమాక్రసీ నేతిబీరకాయ, మృగతృష్ణ, గగనపుష్పము' అన్నారు.

1932 లో "ఒట్టావా సమావేశము-బ్రిటిష్‌సామ్రాజ్య రాజకీయ స్వరూపం"అను వ్యాసంలో వలసతత్వ విధానంలోని చెడుగులను చక్కగా వివరించారు. బ్రిటిష్‌వారి భారతరాజ్యాంగ చట్టములోని లోటుపాట్లను విమర్శించుతూ అనేక వ్యాసాలను వ్రాశారు.

## ప్రభుత్వ ఆర్డినెన్సుల విమర్శన

పరప్రభుత్వంపోయి, కాంగ్రెసు ప్రభుత్వము ఏర్పడినప్పుడు, వారుచేసే మంచిపనులను హృదయపూర్వకంగా బలపరిచారు. కాని ప్రజాస్వామ్య ప్రతికూల పద్ధతుల నవలంబించినప్పుడు తీవ్రంగా విమర్శించారు. ఇది రావుగారిచ్చే పత్రికా ప్రకటనలలోను, ఉపన్యాసాలలోను స్పష్టంగా గోచరిస్తుంది.

1946 లో ప్రకాశం మంత్రివర్గం, "ఫిర్కా-డెవలప్‌మెంటు స్కీము" నొకదానిని తలపెట్టినది. ఖద్దరుమున్నగు నిర్మాణ కార్యక్రమములను కొనసాగించుటకు జిల్లాకొక ఫిర్కాను నిర్ణయించినారు. ఈఉద్యమాన్ని గాంధీజీ ఆశీర్వదించినారు. ఆ సందర్భంలో ఈస్కీమును జయప్రదంచేయుట ప్రజల ప్రధానకర్తవ్యమని రావుగారు విజ్ఞప్తిచేశారు. అందుకోసం వీరు కృషిచేశారు.

1947 ఫిబ్రవరిలో ప్రకాశంగారి హయాములోనే ప్రజాశాంతిరక్షణ ఆర్డినెన్సును జారీచేసి అనేక అరెస్టులు నిర్బంధాలు సాగించినప్పుడు, ఈఆర్డినెన్సు స్వభావమును తీవ్రంగా ఖండిస్తూ రావుగారు పత్రికాప్రకటన చేశారు.

1945 ఆగస్టు 4,5 తేదీలలో బెంగుళూరు స్టూడెంట్సుఫెడరేషన్ మహాసభకు హరిసర్వోత్తమరావుగారిని అధ్యక్షత వహించుట కాహ్వానించినారు. మిసెస్ సోఫియా వాడియా ప్రారంభకురాలు. డాక్టరు హెచ్. జె. భాభా, కమలాదేవి మున్నగువారుపన్యాసకులు. ముల్కా గోవిందరెడ్డి ఆహ్వాన సంఘాధ్యక్షులుగా వుండి ఆబెంగుళూరు మహాసభకు సర్వసన్నాహాలు చేశారు.

రావుగారు మద్రాసునుండి ప్రయాణమై పోతుండగా, పోలీస్ కమీషనర్‌నుండి టెలిగ్రాంవచ్చింది."బెంగుళూరు విద్యార్థి మహాసభ నిషేధించబడింది. దయచేసి మీరధ్యక్షత వహించడానికి వెళ్ళవలదని కోరుచున్నాము" అని వారు తెలియజేశారు. ఈమహాసభ జరిగినందువలన, ఇంతలోనే తుంగభద్ర-కావేరీ నదులేమీ పొంగిపొరలి పోవనీ, మైసూరుప్రభుత్వం చాలాహ్రస్వదృష్టితో వ్యవహరించి, వాక్సభా స్వాతంత్ర్యాల విషయంలో అనవసరజోక్యం కలిగించుకొన్నదనీ రావుగారు ఇలా విమర్శించారు :

"ప్రపంచ విశాలజీవితంలోను, దేశభవిష్యజ్జీవితంలోను విద్యార్థులు యథోచిత స్థానాన్ని ఆక్రమించాలి. ప్రతి మానవుడు తన సోదరుని ప్రేమించి ఆప్రేమను ఆచరణలో చూపించాలని ప్రజలు ఉవ్విళ్ళూరు చున్నారు. చాలాకాలంనుంచీ విచక్షణారహితంగా పశుబల ప్రయోగం జరుగుతునే వున్నది. ఆ మారణహోమం జరిగినతర్వాత నయినప్పటికీ, ప్రతి స్త్రీ, పురుషుడు శుభ్రమైన ఆహార వస్త్ర గృహవిద్యావసతులు కల్గివుండాలనే తక్షణాశయాన్ని అభ్యుదయకర ప్రభుత్వాలన్నీ వొప్పు కుంటున్నాయి. మానవునికీ - మానవునికీ మధ్య, దేశానికీ - దేశానికీ మధ్య పశుబలము పరిష్కారమార్గం కాజాలదనీ, దీనిని చిత్తశుద్ధితో అందరూ విరోధించాలనీ, ఇంగితజ్ఞానమున్న మానవులు ప్రయత్నిస్తు న్నారు. ఒకవ్యక్తి మరొకవ్యక్తిని దోచుకొనుటకు వీలులేని, తనమనో వికాసాన్ని చక్కగా ప్రకటితం చేయడానికి వీలైనటువంటి పరిస్థితులే నిజమైన ప్రజాస్వామ్య జీవితానికి పునాదులనే చైతన్యం క్రమేణా ప్రజలలో వ్యాపింప మొదలైంది. అయితే అనేకాభిప్రాయాల, విభిన్న ఆదర్శాల సంఘర్షణలలో ఈ జ్ఞానోదయం ఉద్భవించింది. ఈ సమ యంలో ఛాందసపు తత్వాలనుంచి, మూర్ఖపు విశ్వాసాలనుంచి విద్యార్థు లను తప్పించ వలసియుంది. వారిహృదయాలలో సత్యాహింసల జ్యోతిని వెలిగించి, దేశసేవా తత్పరులుగా, మంచినిర్మాణ కార్యకర్త లుగా వారినుత్సాహపరచాలి. ప్రపంచ సంఘటనలు, మాతృదేశానికెలా సంబంధించి వున్నాయో తెలిసికొంటూ, మనదేశం ప్రపంచ మానవాళి సమస్యాపరిష్కారంలో ఏమిపాలు తీసుకొనగలదో వారు తెలుసుకో వాలె. ఈ మార్గాన్ని అన్వేషించడానికిప్పుడు నిషేధించబడిన మహాసభ లాంటిది చాల సహాయకారి కాగలదని నావిశ్వాసం.

ఈవిషయంలో మైసూరు ప్రభుత్వం వారు చాలా హ్రస్వదృష్టి ప్రద ర్శించారని చెప్పటం నాకు తప్పనిసరి అవుతున్నది. ప్రపంచంలో శాంతి యుత జీవితంవర్ధిల్లాలనే వెల్లువ పెరుగుతున్న ఈరోజులలో స్వేచ్ఛాభి ప్రాయ ప్రకటనలను, ప్రచారాన్ని, తమ అధికారాలను నిలుపుకోవాలనే

మూర్ఖపు పట్టుదలలతో నివారించే ప్రయత్నాలను ప్రజాస్వామిక ప్రభుత్వాలు మానుకొనుట ఉచితము."

—'హిందూ' లోని రావుగారి పత్రికా ప్రకటనకు అనువాదం

## బంగనపల్లి నవాబు ఆర్డినెన్సు విమర్శన

1933 సెప్టెంబరు 1. బంగనపల్లి స్టేటులో నవాబు ఒక ఆర్డినెన్సుజారీచేశాడు. అది ఏండ్లతరబడి అలాగే అమల్లోవుంది. ఆనాడున్న నిర్బంధ పరిస్థితులలో ఆర్డినెన్సును వ్యతిరేకిస్తూ సంస్థాన ప్రజలు నోరుమెదల్పలేకపోయినారు. పన్నులభారం విపరీతంగా వుంది. లంచాలు నజరానాల పేరుతో నవాబు ప్రజలను కొల్లగొట్టవాడు. 10 ఏండ్ల అడ్మినిస్ట్రేషన్ నివేదికలు, బడ్జెటులు చదివి, సంస్థాన ప్రజలతో రాకపోకలు పెట్టుకొని, రావుగారు అచ్చటి యథార్థవిషయాలన్నీ అర్థం చేసుకొన్నారు.

1800 సంవత్సరంలో నైజాం కర్నూలు జిల్లాను ఈస్టిండియా కంపెనీవారికి ధారాదత్తం చేసినతర్వాత బంగనపల్లినిగూడా కొన్ని కుటుంబాలవారికిచ్చాడు. మహాయితే జటప్రోలు, వనపర్తి, గద్వాల, భద్రాచలం మొదలగునవి నైజాముక్రింద ఎలా జాగీర్లుగా వుంటున్నవో అలానే బ్రిటిషు గవర్నమెంటు స్టేటుక్రింద బంగనపల్లి ఒక జాగీరుగా వుంటున్నదేగాని స్వతంత్రమైన స్టేటు కాదని రావుగారివాదన. కావున నవాబుయిచ్ఛవచ్చినట్లు ఆర్డినెన్సు రాజ్యంతో ప్రజలను పీడించడానికి వీలులేదనీ, తక్షణం ప్రభుత్వం జోక్యం కల్గించుకొని అదుపులోవుంచాలనీ అన్నారు. ఈ సందర్భంలో అనేకరాజ్యాంగ సంబంధమైన చారిత్రక సాక్ష్యాధారాలతో పరిశీలనగావించి, మెమొరాండంరూపంలో రావుగారు ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. ఆ ప్రజలను మేల్కొల్పారు. "తీగ కదిలిస్తే

దొంకంతాకబిలిన" సామెతవలె, నవాబు జారీచేసిన ఆర్డినెన్సును పురస్కరించుకొని అసలు బంగనపల్లి జాగీరు నవాబుకున్న రాజకీయాధికారాన్నే ప్రశ్నించారు రావుగారు.

## శాంతి కాముకుడు

రావుగారిలో శాంతివాంఛ గాఢంగావుంది. శాంతిమహాసభలకధ్యక్షత వహించారు. 1952 అక్టోబరు 25, 26 తేదీలలో బెంగుళూరులో జరిగిన శాంతిమహాసభకు హాజరైనారు. గాంధీజీ సత్యాహింసలతో ప్రభావితులైన హరిసర్వోత్తమరావుగారు, శాంతిసందేశాన్ని వ్యాపమేగాక, శాంతిసైనికులకు శిక్షణయిచ్చుటకు పూనుకొన్నారు.

1939, 40 సంవత్సరములలో ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ సంఘమువారు ఏలూరులో సమావేశమై, ఆంధ్రదేశంలో 10 వేల మంది శాంతిసైనికులకు శిక్షణ యిచ్చుటకు ఒక ఉపసంఘాన్ని నియమించారు. హరిసర్వోత్తమరావుగారీ ఉపసంఘానికి కన్వీనరుగా వుండేవారు. శ్రీ మంతెన వెంకటరాజు ప్రభృతులు సభ్యులు. అహింసావ్రతులైన శాంతిసైన్య శిక్షణావశ్యకతను గూర్చి రావుగారిట్లు వివరించారు:

"గాంధీజీనాయకత్వమునకువచ్చినతరువాత మనమవలంబించిన సత్యాగ్రహసాధనముచేతనే లోకప్రఖ్యాతి, లోకప్రతిష్ఠలు గడించి బ్రిటిషు వారిని కొంతకు కొంత లొంగదీసినాము. ఈసత్యాగ్రహ సాధనానికి బునాది అహింస. .. మానవహృదయములో ఇమిడివుండే పరస్పరప్రేమ తత్వాన్ని వినియోగించి శత్రువును వశపరుచుకోవలె ఇది సులభమైన పనికాదు మందుగుండు, ఫిరంగీలు, నావలు, విమానాలతో పోరాడే వారికిగలవిజ్ఞానమంతటి విజ్ఞానమూ,వారికిగల ధైర్యస్థైర్యాలూ మనకూ

వుండవలసిందే. అంతకంటే ఎక్కువ గుణశీలాలు మనకు కావలసి వస్తాయి. ద్వేషము, రోషములతో పైబడిపోయి బడితెలో మోదడానికి ఎక్కువశిక్షణ, తెలివి తేటలు అక్కరలేదు. కాని ఎదుటివాడుచేయు అధర్మాలను సహించకుండా,మన సౌమనస్యంచేత, మన ప్రేమచేత అతనిని లోబరుచుకోవడము,అతని దౌర్జన్యాన్నికూడ అరికట్టడము సులభమైనపనికాదు... ... పశుబలయుద్ధానికీ—అహింసాయుద్ధానికీ గొప్ప భేదమున్నది. పశుబలయుద్ధానికి కావలసిన సామాగ్రి అనగా మందుగుండులను సైనికుడు తయారుచేయుడు. ఇతరులు తయారుచేసి అతని చేతికందిస్తారు. అహింసాయుద్ధములో సామాగ్రిని సైనికుడు తానే సిద్ధముచేసుకొనవలెను. ఈ సామాగ్రి ఏమంటే తనవ్యక్తిత్వము- తానుమీటు ప్రేమశ్రుతితో మేళవించి కంఠముమీద కత్తిపడునప్పుడు కంఠమెత్తి అనురాగ గీతికలను పాడు సోదరబృంద వ్యక్తిత్వమూ-ఏకవిపంచికమీద సిద్ధము చేసికొనవలెను. దీనికి కర్మాగారములతో పనిలేదు. తన్నయితర మానవశ్రేణికి జతపరచు నిరంతర నిర్మాణ కార్యక్రమ మావశ్యకము. ఈ కార్యక్రమము చూచుటకు సాధారణముగా తోచినను నిజమున అనంత విజ్ఞానముమీద అపారమైన సహనముమీద, అప్రతిమానమైన శీలముమీద ఆధారపడవలసి వుంటుంది."

30-7-1939 న హరిసర్వోత్తమరావుగారు అధ్యక్షతవహించిన "మార్కాపురం రాజకీయ మహాసభ" లో గూడా ఈ విషయాన్నే వివరించినారు.

బెంగుళూరు శాంతిమహాసభకు అభినందన సందేశం పంపుతూ, దేశీయులకు రావుగారిలా విజ్ఞప్తి చేశారు:

"వ్యక్తులు, దేశాలు వొకరినొకరు అనుమానిస్తూన్నందువల్లనూ, శాంతికావాలని మాటలుమాత్రం చెపుతూ నిజంగా శాంతినికోరడం లేదనకోవటంవల్లనూ శాంతి ప్రపంచంలో లేకుండా పోతున్నది. కాబట్టి చిత్తశుద్ధితో శాంతిని కోరేవారందరూ, యితరుల ననుమానించుట మానాలి. శాంతిని వాంఛించుట మానవస్వభావం యొక్క ప్రధానలక్షణ

మనీ, సంఘంలో ప్రతిఒక్కరూ ప్రేమవాదిగా జీవించ ప్రయత్నించాలనీ గుర్తించాలి. హింసకాని, హింసిస్తామనే బెదరింపులు కాని ప్రేమను, శాంతిని నెలకొల్పజాలవు. హింసయే ప్రధానంగా పెట్టుకొన్న నేటి ప్రపంచంలో అహింసాచరణ ఎట్లు సాధ్యమనే సమస్య తలెత్తుతున్నది. శాంతి సభకు హాజరవుతున్నవారికెవరికైనా ముఖంమీద కొట్టినట్లు ఈసమస్య ఎదుర్కొంటున్నది. ఇందుకు మనం సమాధానంయివ్వవలసి వుంటుంది........

మీరు చావంటే భయాన్ని ముందువదలిపెట్టండి. శాంతిపేరిటకూడా హింసాయుత దౌర్జన్య స్వభావంగల చర్యలలోపాల్గొనకండి. కోట్లమానవుని అణచివుంచి, నవీన నాగరిక భోగలాలస జీవితాన్ని, కేంద్రీకృత పద్ధతులకు దోహదకారులైన హేతువులను తొలగించండి. నిరక్షరాస్యతను, అజ్ఞానాంధకారాన్ని నిర్మూలించండి. గ్రామంలో ప్రాథమిక పరిపాలనాదశమొదలు పైఅధికార స్థానాలవరకు సహకార జీవితాన్ననుసరించే రాజకీయార్థిక సాంస్కృతిక సంస్థలను స్థాపించి, పోషించి, ప్రోత్సహించండి. సంఘం భరించే సంస్థలన్నిటినీ సహకార పద్ధతుల మీదనేనడిపించండి. పోటీలు, అధికారాలు అనే పునాదులువద్దు. కేవలం సూత్రబద్ధంగా గాక, ఆచరణలో ప్రభుత్వ శాసనస్థానాన్ని క్రమానుగతంగా ప్రేమ జయించాలి. శాంతియుత జీవితంద్వారా దీనిని సాధించడానికి మీచేతనయినంత కృషిచేయండి. ప్రకటనలు, అసమ్మతులుగాక, ఆచరణే మన ప్రధానోద్దేశంగావాలి."

## గాంధీజంపై భక్తి విశ్వాసాలు

హరిసర్వోత్తమరావుగారు గాంధీజీ సిద్ధాంతముల యెడల అత్యంతభక్తి విశ్వాసములుగల మనీషి. ఇది వారి వ్రాతల్లో, చేతల్లో, ప్రసంగాలన్నిటా అనేక రూపాల్లో ప్రతిఫలిస్తూవుంటుంది. తదనుగుణ్యంగానే తమ జీవితవిధానాన్ని మలచుకోటానికి రావుగారు ప్రయత్నించారు.

"నిర్మాణ కార్యక్రమానికి మూలపురుషుడైన గాంధీమహాత్ముడు ప్రాచీనయుగానికి చెందిన పాతమనిషి కాదు. అతడు మహావిజ్ఞానవేత్త. మన మూఢాచారాలను గూడా పటాపంచలు చేయడానికి జన్మించిన మహనీయుడు. ఆయనలో కాలస్వరూపం ప్రతిఫలించింది. ఆయన దేనినీ గ్రుడ్డిగా అనుసరించేవాడుకాదు. పరిశోధన చేసిగాని ఏదనినీ చేబట్టడు" అనివ్రాశారు.

గాంధీజీ నిర్యాణమునాడు ఉపవాసం ప్రకటించి, ప్రార్థనా సభలో పాల్గొన్నట్లు రావుగారు వ్రాసుకొన్నారు. మరెప్పుడూ ఆయన నిరాహారదీక్ష, ఉపవాసవ్రతాలు పూనినట్లు కానరాదు. గాంధీజీ అస్థికలను సముద్రంలో కలిపేరోజున మద్రాసు సభలో రావుగారు పాల్గొని యిలా డైరీలో వ్రాసుకొన్నారు.

"మనం దోపిడీదారులము కారాదు. మనం నిజమైన సహకారవాదులగుదముగాక! మన రాజకీయార్థిక సాంఘికసిద్ధాంతాలను సవరించుకొని కొత్తజీవిత పంథాను అలవరచుకొందముగాక! సాంఘిక క్షేత్రంతోసహా జీవితానికి సంబంధించిన సకల క్షేత్రములలోను పనిచేసి విప్లవమును సాధించనెంచిన గాంధీజీ అభిమతానికి విరుద్ధమైన చర్యలకు పూనుకొనుటకు గాంధీజీమరణమును మనం వినియోగించుకొనకుందుముగాక!"*

—1948 ఫిబ్రవరి 12 వ తేదీ సాయంత్రం 6 గంటలకు మద్రాసు సభ

రావుగారు నిర్మాణకార్యక్రమాన్ని గాంధీ యుగారంభానికి ముందునుంచిచేబట్టినవారు. తర్వాత గాంధీజీయొక్క నిర్మాణకార్య

* "Let us not be expluiters. Let us become real co-operaters. Let us cultivate the way of life, revieing our Political, Economic and social theories. Let not Gandhijis death be utilised to set up reactions against the revolution he expected, to work in all spheres of life, including the social"

క్రమాన్ని పూర్తిగా అనుసరించిన వారు. చేతిపనులనుగూర్చి 1918 లోనే వారిలా వ్రాశారు:

గాంధీజీ భావనలో రాట్నమంటే భారత జాతియొక్క నిరాడంబర మయిన నిత్య నిర్మల జీవనమే. లోకమును ఆవరించియున్న యంత్ర నాగరికములో మునిగిపోకుండా భారతభూమి తన స్వతంత్రజీవితాన్ని పరంపరానుగతముగా వచ్చిన చేతిపనులచేత నిలవబెట్టుకొని, తన ప్రజలను వృత్తి కౌశలముగల గౌరవజీవులుగా తీర్చగలశక్తి ఈ రాట్నమునకు గలదు."

ఈవిధంగా గాంధీజీ సిద్ధాంతముల పట్లను, నిర్మాణ కార్య క్రమమందును, సత్యాహింసల యందును హరిసర్వోత్తమ రావుగారు సంపూర్ణ భక్తివిశ్వాసములుగలిగి చివరిదాకా వాటినే హృదయపూర్వకంగా అనుసరించారు.

## ఫ్యూడల్ సాంప్రదాయాల పై ఏవగింపు

రావుగారికి ఆడంబరాలంటే గిట్టదు. జాతీయోద్యపు గాంధీ యుగారంభపు రోజుల్లో చొక్కాగూడాతీసివేసి, పైన వుత్తరీయం మాత్రం వేసుకొని తిరిగేవారట. మరికొన్నాళ్ళకు ఖద్దరులాల్చీ మాత్రం ధరించేవారు. వారి 'స్పిరిచ్యువల్ స్వదేశీ' అనే గ్రంథంలో "దుస్తులలో, తిండిలో, మర్యాదలలో, మాటలలో, ఆలోచనలలోకడకుఆత్మలో సహితము స్వదేశీతత్వముండాలి."* అని వ్రాశారు.

రావుగారికి పాతకాలపు జమీందారీ సాంప్రదాయాలుచూస్తే ఏవగింపు. 1954 అక్టోబరు 12 వ తేదీ మైసూరులో నేషనల్

* "There shall be swadeshi in dress, in food, in manners, in speech and thought and in spirit also"

సెమినార్ ప్రారంభోత్సవమునకు వెళ్లారు. వారి డైరీలో యిలా వ్రాసుకున్నారు :

* "మైసూరు సెమినార్ ప్రారంభోత్సవం. రాజప్రముఖ్ ప్రాతకాలపు దుస్తులు, మర్యాదలు యింకాపోలేదు. రాజప్రముఖ్‌కు పూలమాలలు వేయటంగూడా జరిపిలు వేసినారు. సెమినార్ డైరెక్టరు అతనితో మాట్లాడటానికి వీలులేదు. జరీ తలపాగాలు, పిల్లకోట్లు, జరీ అంగ వస్త్రాలు బ్రహ్మాండంగా మెరిసినవి. వంగివంగి మాట్లాడటంగూడా ఉంది."

ఇలాంటి రాజరిక సాంప్రదాయాలు ఎక్కడలేని ఆధిక్యతను తెచ్చిపెట్టి తోటివారి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, సమానత్వాన్ని హరించినవి. 1954 మైసూరురాజ్యంలో యిది చూచిన రావుగారు వ్యంగ్యాత్మకంగా తన 'డైరీ' లో పైవిధంగా వ్రాసుకున్నారు.

"నా మతంలో పరిపాలించేవారు వేరు పరిపాలితులు వేరు అను భావమే లేదు. ప్రజలందరూ స్వయంగా తాము పరిపాలించుకొనేవారు కావలెననడమే నా మతం. కాబట్టి ఎవరికో భయపడి, ఎవరో పాలించడమనేది నా విధానంలో వుండదు. ప్రజాస్వామ్య అధికారం కాదా ప్రేమ సూత్రాలను అనుసరించవలసి వుంటుందనేదే యిప్పటికీ నా ధోరణి."

అన్నారు రావుగారొక సందర్భంలో.

# ౬

# కుటుంబ విషయాలు

వివాహం – భార్య రామాబాయిగారు రావుగారి ననుసరించినతీరు – భార్యాభర్తల అనురాగం – కుమారుల వియోగం – 'ద్వారకీబాయి' జననం, విద్యాభ్యాసం – రామాబాయిగారి మరణం – శ్రీ పార్థసారధి గారితో ద్వారకీబాయి వివాహం – ఈ దంపతులు మదరాసు సంగీత కళాశాలను నిర్వహించుట – వీరి సంతానం వివరాలు–రావుగారి ఆర్థిక బాధలు – కుటుంబ పోషణకు వారు పడ్డపాట్లు – ధీరత్వమును వీడని జీవిత ఘటనలు – మరణశయ్యపై నుండగా కేంద్ర హోంశాఖా మంత్రినుండి సమయానికి లభించిన ఆర్థిక సహాయం



శ్రీ హరిసర్వోత్తమరావుగారు, వారి సోదరీసోదరులు, వారి కుటుంబాల సభ్యులు

[ పుట 355 ]

## కుటుంబ విషయాలు

రావుగారికి 18 వ ఏటనే వివాహమైనది. భార్య రామా బాయిగారు. వీరిది చిత్తూరుజిల్లా మదనపల్లి దగ్గరనున్న 'పెరికల పెంట' గ్రామం. తల్లి వేణుబాయిగారు, ఈమె తండ్రి తాతలు చిన్న ప్రభుత్వోద్యోగం చేస్తుండేవారట. వీరి పూర్వీకులు మహా రాష్ట్ర ప్రాంతానికి చెందినవారు.

హరిసర్వోత్తమరావుగారు విద్యాధికుడయ్యు, ఏ ప్రభుత్వో ద్యోగానికీ ఎన్నడూ ఆశపడినవారు కాదు. ఏ లాభసాటి వ్యాపా రాల్లో దిగినవారూకాదు. వందేమాతరం ఉద్యమంలో దుమికి జీవి తాంతంవరకు ప్రజాసేవలో నిమగ్నులైనవారు. ఐతే ఏ వృత్తి ఉద్యోగాల్లోనూ దిగకుండా కుటుంబపోషణ భారం ఎలా? అందు చేతనే సాధారణ కుటుంబాలుపడే కష్టాలన్నీ, రావుగారి కుటుం బము ఇంకా అదనంగా అనుభవించింది. ఈయన సహధర్మ చారిణికూడ అష్టకష్టాలు భర్తతోపాటు భరించింది.

భార్య 14 ఏండ్ల వయస్సులో నున్నప్పుడే రావుగారివి ప్రభుత్వం అరెస్టుచేసి కఠిన శిక్ష విధించింది. అప్పుడామె 7 మాసముల గర్భిణి. జైలులో దూరంగావుండి మాత్రమే చూడ నిచ్చేవారు. రావుగారిని చూపుటకు బంధువులామెను తీసుకొని వెళ్లారట. ఖూనీలుచేసి జైలుకొచ్చినవారి సరసన, గోచీగుడ్డతో నరకబాధ ననుభవిస్తున్న భర్తనుచూచి ఆ అమ్మాయిగుండె నీరై పోయిందట. ఆ దుఃఖ సముద్రంలో కొమర్రాజు లక్ష్మణరావు

గారామె నోదార్చి ధైర్యంచెప్పి పంపినారట. హరిసర్వోత్తమరావు గారి అరెస్టుతో, మామగారి పెన్షన్‌నుగూడా తీసివేసింది ప్రభుత్వం. వారి జీవితాంతం వరకు అమ్మాయికి చీరె సారెలు పెడుతూ, కొంత సహాయపడుతుండేవారు రావుగారి మామగారు.

రావుగారి సతీమణి పెద్దలయింట్లో నున్న ఆచార సాంప్రదాయాల్లో పెరిగింది. స్నానంచేసి 'తులసిపూజ' చేసుకొంటుండేది. దైవభక్తిగల సాధ్వీమణి. భర్త జైలునుంచి బయటికొచ్చిన తర్వాత, ఆమెగారిలోను క్రమేణా సంస్కరణాభిష పెరిగింది. ప్రజాహిత జీవిహితమునందు భర్తకు తోడునీడగా వుండేది.

కులమత విచక్షణలేమీ పాటించక అత్యంతాదరంతో ఆతిథ్యం యిచ్చేవారు. ఆ రోజుల్లోనే క్రైస్తవ, హరిజన, మహమ్మదీయ, బ్రాహ్మణ, అబ్రాహ్మణ భేదంలేకుండా మిత్రులంతా సహపంక్తి భోజనాలు చేసేవారని వింటుంటే సనాతనాచార సాంప్రదాయాలనుండి వచ్చిన రావుగారి కుటుంబం ఎంతటి సంస్కరణాభిలాషులో ద్యోతకమవుతుంది. గూడూరి రామచంద్రుడు యం.బి., బి. యస్. చదవటానికి వచ్చినప్పుడు మద్రాసులో వీరింట్లోనే వుండేవారట. యామినీపూర్ణతిలకం కుమార్తె రామతిలకం వీరింట్లోనే పెరిగింది. శ్రీ గిరిగారిభార్య కూడ పెండ్లికిముందు యుక్తవయస్కగా వీరిఆశ్రయంలో వుండి చదువుకొన్నది. వీరు ఇంటా - బయటా అంటరానితనం పాటించేవారుకాదు. 'ఆమె చల్లని తల్లి. ఏవేళ ఎందరువచ్చినా వంటవండి వడ్డించి ఆదరించేది. భార్య రామాబాయియెడల హరిసర్వోత్తమరావుగారు అపారమైన అనురాగం, అభిమానం చూపే

వాడు' అన్నారు కల్లూరి సుబ్బారావుగారు. 'రాముడూ!' అని వారామెను ప్రేమగా పిలుచుకొనేవారు.

తల్లిదండ్రులు గతించిన తదుపరి ఆమెకు పుట్టిల్లయినా, అత్తగారిల్లయినా యిదే అయింది. రావుగారికిద్దరు మగపిల్లలు జనించారు. కాని వాళ్లు పసితనంలోనే గతించిపోయినారు. రెండవపిల్లవాడు 2 ఏండ్లు పెరిగి పోయినాడు. తల్లిగారైన భాగీరథీబాయి పేరున, పిల్లవానికి 'భగీరథ అనే నామకరణం చేసుకున్నారు. 1920 లో చింతాద్రిపేటలో నున్నప్పుడు 'ద్వారకీ బాయి' కల్గింది. ఈ అమ్మాయిని అల్లారుముద్దుగా పెంచుకున్నారు. ఈమె ఒక్కర్తయే రావుగారి సంతానం. అమ్మాయి నంద్యాల మునిసిపల్ హైస్కూలులో స్కూల్ ఫైనల్ పాసైంది. మద్రాస్ క్వీను మేరీస్ కాలేజీలో ఇంటరు మొదటి సంవత్సరం పూర్తి చేసింది. అమ్మాయిమీద వుండే అత్యంత ప్రేమవల్ల చదువువిషయంలో అనేకమంది మిత్రులతో రావుగారు సంప్రదించినట్లు వారి ఉత్తర ప్రత్యుత్తరాలవల్ల తెలుస్తుంది. అప్పట్లో మద్రాసు విశ్వవిద్యాలయంలో సంగీత డిప్లొమాకోర్సు క్రొత్తగా ఆరంభించారు. మొదటి జట్టులోనే ఫిడేలు, గాత్రసంగీతం నేర్చుకొని వీరు 3 ఏండ్లు సంగీత శాస్త్రంలో పరిశోధన చేశారు.

1937 లో రావుగారు మరల మద్రాసుకు కాపురం తరలించారు. అప్పుడే భార్య రామాబాయిగారికి జబ్బుచేసింది. తాను కాన్సర్ రోగపీడితురాలైనా ఆమె రావుగారి ప్రజాహిత కార్యక్రమాలకేమాత్రం అంతరాయం గల్గించేవారుకాదు. అమ్మాయి జస్టిసు ముత్తా వెంకటసుబ్బారావుగారిచే నగరంలో నిర్వహించబడుతున్న 'సేవాసదన్'లో 3 సం॥లు సంగీతోపాధ్యాయినిగా

పనిచేసింది. రామాబాయిగారు కొన్నాళ్ళు నంద్యాల మునిసిపల్ మెంబరుగాను, కర్నూలు జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలు సభ్యురాలుగాను వుండేవారు. సౌందర్యవల్లి పత్రికా సంపాదకురాలుగా వున్నారు. కడపలో జరిగిన ఆంధ్ర మహిళామహాసభకు అధ్యక్షురాలుగావుండి మహిళాకార్యక్రమాలు నిర్వహించారు.

ఈమెకు కాన్సర్ వ్యాధి ముదిరింది. ఆస్పత్రిలో రేడియం చికిత్స చేయించుటకు చేర్చినారు. ఇదొక నరక కూపంగా వుందని ఆస్పత్రినుండి ఇంటికి వచ్చేసింది. అవి 1941_42 రోజులు. ఆర్థిక బాధలొకవంక, భార్య రుగ్మత మరొకచెంప ఆనాటి తీవ్ర రాజకీయ సంచలనంలో రావుగారి మనసునెంతో కలచి వైచినవి. ఐనా తన కర్తవ్యాన్ని విస్మరించలేదు. సభాసమావేశాలకు హాజరవుతునే వున్నారు. సత్యాగ్రహం చేయుటకు గూడా సంసిద్ధతను వెలిబుచ్చి గాంధీజీకి జాబువ్రాశారు. "ఇంటి పనులు చక్కబరుచుకొనేదాకా, సత్యాగ్రహం లే"దని రాజకుమారి అమృతకౌర్ గాంధీగారి అనుమతితో జవాబు వ్రాశారు.

ఒకరోజు పెరంబూరు వాస్తవ్యులు వచ్చి రావుగారి నాహ్వానించి తీసుక వెళ్ళుతున్నారట. ద్వారక "నాన్నా! ఇంత ప్రమాదంగావున్న అమ్మనువదలిపెట్టి మీటింగులకు పోతున్నారే" అన్నదట, తల్లి అదివిని "ఆయనగారిని ఆపకమ్మా! వారి ధర్మాన్ని వారు నిర్వర్తించుకోనివ్వు;" అని కుమార్తెను మందలించిందట. ఆ సభానంతరం తెల్లవారుఝామున రావుగారిని ఇంట్లోదింపి పోయినారు. ఆరోజే 1942 అగస్టు 22 వ తేదీ ఉదయం 6 గంటలకు రావుగారిని పిలిచి, ఆయన ఒడిలో రామాబాయి కన్నుమూసింది. అప్పటికి ఆమె వయస్సు 50 ఏండ్లు.

భర్తను, కుమార్తెను, అసంఖ్యాక బంధుమిత్రులను వదలి రామాబాయిగారు దివంగతురాలైనది. *

తనతోపాటు అష్టకష్టాలు పడిన ప్రియమైన భార్య చనిపోయినప్పుడే ఆ మంచము మీదనే కూర్చొని రావుగారొక పద్యం వ్రాశారు. అది వయోజనవిద్య-బోధన క్రమ'మను పుస్తకంలో ప్రచురించబడింది. భార్య భక్తికి చిహ్నంగా మహానంది, లేపాక్షి దేవళములకు పదిరూపాయల చొప్పున ఆమెగారి పేరున పూజలు చేయించండని మనిఆర్డరు చేశారట. ఆ తర్వాత బంధుమిత్రులకు మరణవార్త తెలియజేశారట. తమ బంధువులలో నొకరగు నరసింహాచారి (అడ్వొకేటు) కుటుంబముతోవచ్చి చూచి పోయినారట. జస్టిసు చంద్రారెడ్డి మరదలున్నూ, ద్వారకయున్నూ సహపాఠులైనందున వారుగూడా వచ్చిచూచి, "ద్వారక చిన్నపిల్ల. భయపడుతుంది. నాల్గురోజులపాటు మా యింట్లో వుండి వస్తుంది. మాతో పంపండి బాబుగారూ!" అని అడిగారట. ఇదివిని "చూచావమ్మా! బంధువులకు-మంచి స్నేహితులకు వున్నతేడా" అని ఆనాడు రావుగారు తనతో అన్న మాటలు తలచుకొని, ఇప్పటికీ ఎంతో దుఃఖపడుతుంది ద్వారకగారు. రావుగారి స్నేహితులు పంపిన పైకం, ఆదరవచనాలతో వ్రాసిన ఉత్తరాలు కొంత వూరట కల్గించినవి. మిత్రులు పంపిన కొద్దిపాటి డబ్బుతోనే ఆమె కర్మకాండలు జరిపించవలసి వచ్చిందట.

రావుగారి భార్య చనిపోయిన రెండురోజులకే, అది తెలియక పక్క జిల్లావారొచ్చి మీటింగుకు అధ్యక్షత వహించమని

* 1911 లో హరిసర్వోత్తమరావుగారి విడుదల అనంతరం భార్య రామాబాయిగారికి కొంతకాలమునకు పిచ్చెత్తి చనిపోయిందనటం నిజంకాదు.

ఆహ్వానించినారట. వారప్పటికే సభకవసరమైన సన్నాహాలు చేసుకొన్నారు. హిందూపత్రిక సంపాదకులు కస్తూరి రంగయ్య గారి కుమారుడు నరసింహగారి పేరు ప్రకటించారట. కాని "రంగయ్యగారు చనిపోయినందున నేను రాలేనన్నా"రటవారు. దానిపై హరిసర్వోత్తమరావుగారు వెళ్ళి సభా కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగించి వచ్చారట. ఇదొక్కటిచాలు రావుగారి నిశ్చలచిత్తాన్ని, నిరంతర సేవాదీక్షను అర్థంచేసుకోటానికి. ఎంతో నిబ్బరమైన మనస్సు ఆయనది. ఎట్టి ఒడుదుడుకులువచ్చినా, ఈ షణ్మాత్రం చలించేవారు కాదు.

ద్వారకతోపాటు, యస్. సి. పార్థసారథిగారు సహవిద్యార్థిగా కలిసి సంగీత శాస్త్రం చదువుకొన్నారు. రాజమండ్రి వాస్తవ్యులు శ్రీనల్లాన్ చక్రవర్తుల శ్రీరామాచార్యులుగారు వీరి తండ్రిగారు. వీరిరువురుకలిసి రేడియో ప్రోగ్రాములలోను, సంగీత కార్యక్రమాల్లోను పాల్గొనేవారు. అనేక బహుమతు లందారు. క్రమంగా స్నేహం ప్రేమగా మారింది. దరిమిలా వివాహం చేసుకొనుటకు నిశ్చయించుకొన్నారు. రావుగారిదివిని ఆశీర్వదించారు. 1942 మే 9 వ. తేదీ మహాబలిపురం తిరుక్కాళి కుండపక్షితీర్థంవద్ద సంస్కరణ వివాహం జరిగింది. పార్థసారధిగారు కొన్నాళ్ళు ఋషీవాలీ హైస్కూలులో ఉపాధ్యాయులుగా పనిచేశారు. ప్రస్తుతం మద్రాసు యూనివర్సిటీ లెక్చరరుగా వున్నారు.

ఈ ఆదర్శ దంపతులకు శ్రీరామ్, లక్ష్మణ్, మోహన్ కృష్ణ,గీతార్థ్,సుధాకర్ అను సుపుత్రులుజన్మించారు వీరిలోగీతార్థ్ మూడవఘేట గతించాడు. శ్రీరామ్ మధుర కళాశాలలో ఇంజనీ

రింగుకోర్సు చదువుతున్నాడు. మిగతాపిల్లలు హైస్కూలు విద్య నభ్యసిస్తున్నారు.

పార్థసారధి, ద్వారకగార్లు 1945 లో 'మద్రాసు సంగీత కళాశాల' నొకదానిని స్థాపించి నిర్వహిస్తున్నారు. కర్నాటక శాస్త్రీయగాత్ర, వాద్య సంగీతాలలో కృషి సల్పుచున్నారు. ప్రామాణిక సంగీత శాస్త్రగ్రంథాలు రచించారు.

ఇంటివద్ద మిగిలిన పిత్రార్జిత భూమి నమ్మగా 6 వేల రూపాయలు వచ్చినవి. ప్రభుత్వంవద్ద కొంతపైకం అప్పుగా తీసుకొని "గోపాలపురం — మొదటి వీధి" లో స్వంత భవన నిర్మాణం చేసుకొన్నారు. ఆ విద్యాలయంలోని సాంస్కృతిక వాతావరణం, అతిథి సత్కారాలు, గురు—శిష్యుల వాత్సల్యం ఎంతయో కొనియాడదగినవి. ఈ భవనమే రావుగారికి అవసానదశలో ఆశ్రయమిచ్చింది.

హరిసర్వోత్తమరావుగారు సనాతనాచార వ్యవహారాలు పాటించేవారుకాదు. తద్దినాలకు బ్రాహ్మణుల పద్ధతి వీరికి గిట్టదు. భార్య తద్దినంనాడు ఉదయాసేలేచి, స్నానంచేసి, ఇడ్లీ కొనితెచ్చి పిల్లలకిచ్చి తర్వాత "ఇక మీయిష్టమొచ్చినట్లు ఏమైనా చేసుకోండమ్మా!"అనేవారట కుమార్తెతో. మనస్సులో ఏమి ధ్యానం చేసుకొనేవారో ఏమోగాని, బయటకు పూజలు పునస్కారాలేమీ చేసినట్లు కనుపించదు.

ఒకసారి కూడ్లిగిలో గాడిచర్లవారు ప్రచారంనిమిత్తం సభకు విచ్చేశారట. అచట విద్యాశాఖలో సీనియర్ ఇన్స్పెక్టరుగా వుండిన కె. ఆర్. మధ్వనాచార్ గారు హరిసర్వోత్తమరావుగారి బృందానికి ఆతిథ్య మిచ్చారట. ఆచార్యులుగారు పరమ నైష్ఠి

కులు, కాంపులకు వెళ్ళినప్పుడుసైతం వంటసామాగ్రితో సహా పోయ్యేవారు. అందరూ భోజనాలకు కూర్చున్నారు. వడ్డన ప్రారంభమైనది. గాడిచర్లవారికి యజ్ఞోపవీతం లేకుండింది. ఆచార్యులకు అదొక ధర్మవిరుద్ధంగా, లోపంగా తోచింది. కాని ఏమంటారు? భోజనాలైన తర్వాత హరిసర్వోత్తమరావుగారే ప్రస్తావించి, తాము యజ్ఞోపవీతాది బంధనములను ఎప్పుడో త్రెంచి వేసుకొన్నామని నెలవిచ్చారట. నిజం! రావుగారి జీవితమే ఒక మహాయజ్ఞం. "జగమెరిగిన బ్రాహ్మణునికి జందెమెందులకు?"

## ఆర్థిక బాధలు

సాధారణంగా మధ్వలు సుష్టుగా భోజన ప్రియులని ప్రతీతి. ఇంటికెవరు వచ్చినా షడ్రసోపేతంగా పెట్టి ఆతిథ్యమివ్వవలసిందే రావుగారు గూడా మంచి తిండిపుష్టిగల మనిషి. కండ పుష్టిగూడా క్రమేణా పెరిగింది. ఎప్పుడూ జ్వరపడినవారుకాదు. అందుచే మందులు పుచ్చుకొనే అలవాట్లులేవు. అనుదిన కుటుంబ వ్యవహారాలు నడుపుకోటానికి, నెలసరి ఆదాయం లేకుండా జీవితకాలంలో రావుగారెన్ని యిబ్బందులకు గురియైనారో, అది వారికే తెలియాలి. అనుభవించిన భార్యా బిడ్డలకు తెలియాలి. దరిద్ర బాధలోగూడా, స్నేహితులతో చెప్పుకొని యాచించియెరుగరు. ప్రచురణకర్తలనుగూడ తనకేదైనాపనిచెప్పమని వెళ్ళేవారటగాని, దేహిఅని ఎవ్వరినీ యాచించిన పాపాన పోలేదు.

2 ఏండ్లు విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిలోను, 3 ఏండ్లు ఆంధ్రపత్రిక ప్రధాన సంపాదకులుగాను, ఒక ఏడాది విజ్ఞాన

సర్వస్వము పనిలోను, ఒకఏడు "గ్రామపంచాయతీ" పత్రికా నిర్వహణంలోను, మొత్తంమీద ఏడెనిమిదేండ్లు మాత్రం నెల సరి ఆదాయం రావుగారికి వచ్చినట్లు కనిపిస్తుంది. వయోజన విద్యా శాఖ గౌరవ డైరెక్టరుగా రెండున్నర సంవత్సరాల కాలం నెలకొక వందరూపాయల చొప్పున వచ్చేవి. ఈ 10 ఏండ్లు మినహాయించి, మిగతా జీవితకాలమంతా పత్రికలకు వ్యాసాలు వ్రాసియో, రేడియో ప్రసంగాల మూలంగానో, "హిందూ" పత్రికకు వ్రాసిన సమీక్షలవల్లనో, అప్పుడప్పుడు ప్రచురణసంస్థల వారిచ్చిన డబ్బుతోనో, స్నేహితులుచేసిన ఆర్థిక సహాయంతోనో కాలం గడుపుకుంటూ వచ్చారని స్పష్టపడుతుంది.

ముఖ్యంగా పత్రికారచయితగానే కుటుంబపోషణకు ప్రయత్నించారు. 'స్వరాజ్య' పత్రికకు వ్యాసాలువ్రాసి, వార్తలు పంపేవారు. కాని ప్రకాశంగారు వ్రాసిన వుత్తరాలనుబట్టి అప్పుడప్పుడు బహుకొద్ది మొత్తాలుతప్ప పంపేవారుకాదు. ఆంధ్రపత్రిక, భారతి వ్యాసాలకుగాను "ఈ కాలానికి ఈ వార్తలకు రు 25 లు మాత్రమే పంతులుగారు పంపమన్నారని మనిఆర్డర్లు ఏడాదికి, ఆరునెలలకు వస్తుండేవి. ఇకపోగా 'హిందూ' పత్రిక సమీక్షలు, రేడియో ప్రసంగాలకు కొంతడబ్బు కచ్చితంగా వస్తుండేది. అదేకొంత ఆధారమైనది.

"శ్రీరామచరిత్ర", "పౌరశిక్షణ" మున్నగు గ్రంథాలను పాఠశాలల్లో పెట్టుటకు విద్యాశాఖవారు సిఫార్సు చేసినందువల్ల గూడా ఆయా ప్రచురణ సంస్థలు లాభించాయేగాని, రావుగారు గణించింది పెద్దగా కనుపించదు. ఆంధ్ర ఇన్సూరెన్సుకంపెనీ, మైసూరు అగ్రికల్చరల్ కార్పొరేషన్ మున్నగు సంస్థలలో

ఏజెన్సీలు తీసుకోటం, వారు పదేపదే 'బిజినెస్' చూపించమని ఉత్తరాలు తరచుగా వ్రాస్తుండటం కనుపిస్తుందిగాని, వాటికోసం రావుగారు తిరిగి కృషిచేసి, కమీషనులు సంపాదించి నట్లు కానరాదు.

చిన్ననాటిస్నేహితుడు కట్టమంచి రామలింగారెడ్డిగారు తాము వ్రాసిన "ముసలమ్మ మరణం" అను పుస్తకమును రావు గారికి అచ్చు వేయించుకొమ్మని యివ్వటం, దానిని ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఒకప్పుడు ఇంటర్మీడియెటుకు పాఠ్యపుస్తకంగా నిర్ణయించడంవల్ల కొంతపైకం లభించింది.

ఢిల్లీ 'హిందూస్థాన్ స్టాండర్డు', 'భారతి' పత్రికల సంపా దకస్థానాలు ఖాళీలు వచ్చినప్పుడు రావుగారు ఉత్తరాలు వ్రాశారు. కాని తామప్పటికే తగువారిని ఖాళీలలో భర్తీ చేసుకొన్నామనీ, ఇక అవకాశంలేదనీ సమాధానాలు వచ్చినవి. ఈరీతి, రెగ్యు లరుగా దినపత్రికల ఆఫీసులోలేని 'జర్నలిస్టులు' ఏ యేబాధల ననుభవిస్తున్నారో అన్నికష్టాలను రావుగారనుభవించారు.

1946లో వినయాశ్రమంలో స్థాపించిన "ఖాదీ గ్రామపరి శ్రమల శిక్షణాలయము"నకు అధికారిగా వుండమని గొల్లపూడి సీతారామశాస్త్రిగారు రావుగారిని పిలిచారు. అచట బేసిక్ విద్యా లయమునకు, మాళవ్యావన ప్రతిష్ఠాపనకు ప్రారంభోత్సవం హరిసర్వోత్తరావుగారే చేశారు. "నేను మీకుకావలసివుంటే, నా తలబిరుసుతనంతోగూడ వినియోగించుకోవలసి యుంటుం"దని అనగా 'అదీఒక సుగుణమే' నన్నారట శాస్త్రిగారు. 17-12-46వ తేదీన సీతారామశాస్త్రిగారికి వ్రాసిన వుత్తరం విషయంచూస్తే

ఉద్యోగాలు చేయటం విషయంలో రావుగారి మనస్తత్వం అర్థ మౌతుంది.

"శ్రీశాస్త్రిగారికి,

మీరు నాతోమాట్లాడిన విషయం చక్కగా ఆలోచించినాను. సర్కారులోగాని, మరియొక చోటగాని "దరఖాస్తులు" పెట్టి నౌకరీ సంపాదించి కార్యము సాధించుకొనవలెననే దృష్టి నాకెంతమాత్రంలేదు. కాబట్టి అట్టి ప్రమేయం ఏమికలిగినా నేనంగీకరించుటకు వీలుండదు.

నన్ను ఏపనికైనా ప్రజాహిత జీవితంలో వినియోగించ దలచు కొంటే వారు నాకు తెలియజేయనూవచ్చును. దానిని నేనాలోచించుకొని అంగీకరింపనూవచ్చును. ఇందుకు భిన్నమయిన పరిస్థితులలో నేనిప్పుడున్నట్లే స్వతంత్రుడనుగావుంటూ, అవకాశ మిచ్చినవారికి, అవకాశ మిచ్చినంతవరకు సహాయపడుతూ, ప్రజాసేవ జేయడమే ఉత్తమముగా భావిస్తున్నా.

మనుష్యునిమీద గౌరవము, అతని శక్తియందుండే విశ్వాసము చేత, చేసే నామినేషనయినా, లేదా యెన్నికయినా నాబోటివారిని ఆకర్షించునుగాని మరియేదీ ఆకర్షింపలేదనే సూత్రమే పైమాటలలో ఇమిడియున్న సత్యము. తామిదివరలో మొదటి విధాన మవలంబిస్తున్నందున నాకు తోచిన సహకారము జేయగల్గాను.

రెండు జిల్లుగా విద్యార్థులకు నిరంతరము నాఅభిమాన ఉద్యమాలు బోధచేసే అవకాశం మీరు తలపెట్టినట్లున్నదని గోచరించింది. గ్రంథాలయాలు, అక్షరాస్యత,కోఆపరేషన్, గాంధీజీ నిర్మాణ కార్యక్రమము, అవసరమైనట్లయిన అర్థశాస్త్రము, రాజకీయ శాస్త్రము, చరిత్ర, భూగోళము, ఇవన్నీ పాఠాలుగాను, పాఠాలుగా కాకపోతే యితర విధాలుగాను ప్రచారం చేయవచ్చును."

— గా. హరిసర్వోత్తమరావు 17-12-1946

ఐతే ఒక్కచోటనే వుండి పనిచేయటమనే సమస్య ఎదురైంది. నిరంతరం రాష్ట్రం నలుమూలలా పర్యటించే రావుగారికి ఒక్కచోటనే వుండటం ఎలానచ్చుతుంది? అందుచేతనే "వినయాశ్రమం" పనిలో అధికారిగా ప్రవేశించజాలక పోయినారు.

కట్టకడపట, "కడప–కర్నూలు ప్రాజెక్టు" ఆఫీసరుగా నియమిస్తే నాకిదివరకే బాగా సుపరిచితమైన ప్రాంతాలు గా బట్టిన్నీ, మనుషులు తెలిసినవారగుటచేతను, నాశక్తికొలది సమాభిజావృద్ధి కార్యక్రమంలో పనిచేయుట కవకాశం వుంటుందని కేంద్రవిద్యాశాఖామంత్రి హుమాయూన్ కబీరు కొక లేఖవ్రాశారు. ఆయన ఈ విషయాన్ని కమ్యూనిటీ డెవలప్మెంటు మంత్రి యస్. కే. దేతో సంప్రదించారు. "మీలాంటి వయోజ్ఞానవృద్ధులు, ఈ వృద్ధాప్యంలో ప్రాజెక్టు ఆఫీసరుగా తిరిగి పనిచేయజాలరు. తమ అమూల్యానుభవాలను 'సలహాదారుగా' వుండి సమాజ వికాసశాఖ విద్యాశాఖలకు సలహాలు యివ్వటమే సముచితంగా వుంటుం"దని రావుగారి సేవలను, దీక్షను కొనియాడుతూ కబీర్, యస్. కె. దేగార్లు జాబులు వ్రాశారు.

చివరకు మరణశయ్యపై నుండగా, అప్పటి హోంశాఖా మంత్రి గోవిందవల్లభపంత్ 2 వేల రూపాయల చెక్కును హరి సర్వోత్తమరావుగారికి పంపించారు. గాంధీస్మారకనిధి వారు నెల కొక వందరూపాయలు యిచ్చుటకు నిర్ణయించి ఒకనెల రు 100 మొత్తం అందజేశారు. రావుగారి అవసానదశలో మందులకు, మరణం తర్వాతవారి కర్మకలాపాలకుగూడా, ఈ ధనమె

పెచ్చించబడింది. అన్ని అవకాశములుండిగూడా రావుగారు ఓదరి కాన్ని సంతోషంతో కౌగలించుకొన్నారు. ప్రజాసేవలోనే ఆనం దాన్ననుభవించారు. ఎమర్సన్ నీతివేత్త నుడివినట్లు "సత్పు రుషులకు సంభవమగు దుఃఖములు, నష్టములుకూడ వారి ఆనందమునకే కారణమవుతున్నవి. దుష్టులకీర్తి సంపదలుగూడా వారికినీ, లోకమునకును కీడు, అసౌఖ్యమును కలిగిస్తాయి."

"మన ప్రజలకు విజ్ఞానము వ్యాపింప కుంటుచే మన యధో గతికి కారణము. ఎల్ల యభివృద్ధికిని విజ్ఞాన వ్యాపనయే ప్రధమాధారము. అక్షరజ్ఞత దానికి మూల సాధనము. అక్షరజ్ఞతతో గూడ విజ్ఞానము వ్యాపింప జేయుటకు ఇతర సాధనము లున్నవి. పత్రికలు, గ్రంథములు చదివి వినిపించుట, ఉపన్యాసములు. మేజిక్ లాంతరు, సినిమా ప్రదర్శనములు, భజనలు, హరికథలు, ఇట్టివి అనంతములు. వీటి నన్నిటినీ ఏర్పరచి కృషి చేయునట్టి యుద్యమము గ్రంథాలయోద్యమము. ఏ యుద్యమమునందు ఉత్సాహము కొరవడినను ఈ యుద్యమము సాగుచుండెనా ప్రజలను అంధకారమావరించదు. అంధకారమున పడిపోనంత కాలము మానవుడు తల యెత్తుకొనుటకు మార్గమున్నది. కావున జ్ఞాన యోగమునకింత ప్రాముఖ్యము. అందుచేత సరస్వతీ మందిరము సదా సేవింప దగినది దీనిని మరువవలదు."

—గాడిచర్ల హరిసర్వోత్తమరావు

## ౧౦

# నిర్యాణము - శ్రద్ధాంజలులు

అంతిమ దినాలలో అశక్తులుగ నుండికూడ సంవత్సరంలో 44 వారాల కార్యక్రమానికి ప్రణాళికను సిద్ధపరచుట–దీని నమలు చేయుటకై పడిన తాపత్రియము–1959 వ సం. డిసెంబరు 11 వ తేదీన తమ్ముడు వాయుజీవోత్తమరావుగారి మరణం – 14 వ తేదీన అకస్మాత్తుగ ఇంట్లో పడిపోయి మాటలేకుండా పోవటం–2 వారాల పాటు రాయపేట ఆస్పత్రిలో వైద్య చికిత్స – నాగభూషణంగారికి వ్రాసిన కడపటి లేఖ – 2 మాసములు మృత్యువుతో పోరాటానికి పిమ్మట 29–2–60 వ తేదీన దివంగతులగుట–వారి అవసాన కాలం లోను, పిమ్మటను లభించిన ఆర్థిక సహాయములు–ఆంధ్ర,మద్రాసు శాసన సభలు, దేశంలోని ప్రముఖవ్యక్తులు, వివిధ సంస్థలు, అనేక పత్రికల శ్రద్ధాంజలులు– గ్రంథాలయ సర్వస్వము వీరి స్మారకంగా ప్రత్యేక సంచికను ప్రచురించుట.

## నిర్యాణము — శ్రద్ధాంజలులు

హరిసర్వోత్తమరావుగారు 1957 లో శ్రీ సర్వోత్తమ భవనంపై నిర్మించబడిన 'బాపూజీ మందిర' ప్రవేశమహోత్సవమునకు హాజరై తిరిగి వెళ్ళిన లగాయతు సుస్తీచేసి మద్రాసులో కుమార్తె, అల్లుడు, మనుమళ్ళు వున్న గోపాలపురం యింటిలోనే వుంటూ వచ్చారు. ఒక యేడాదికిపైగా జ్ఞాపకశక్తిగూడా తగ్గుతూ వచ్చింది. అంత గంభీర వ్యక్తిగావుండే రావుగారు క్రమేణా శక్తిని కోల్పోసాగారు. ఆనడుమ కొంతకాలం మధుమేహానికి, రక్తపుపోటుకు గూడా గురియవుతూ వచ్చారు. దేశహితైక కార్యక్రమాల్లో గ్రంథాలయ ప్రచారంలో తిరిగి పాల్గొందామనే ఉత్సుకత చూపేవారు. కాని శరీర దార్ఢ్యత సన్నగిలుతూ వచ్చింది. దీనికి తగిన వసతులుగూడా లభించలేదు. ఈ విధంగా కొంత మానసిక చింత యేర్పడింది. స్వరాష్ట్రం వచ్చిన తర్వాత, 'ఇంకెన్నాళ్ళమ్మా మనం మద్రాసులో వుండేది' అంటుండేవారట. ఆంధ్రదేశంలోనే వుండాలని అభిలాష పడుతుండేవారు. పేరేచర్ల హైస్కూలు ప్రాంగణంలో ఒక 'ఆచార్య పీఠం' ఏర్పరచి రావుగారిని వుంచుదామనే సంకల్పం పున్నయ్యశాస్త్రిగారికి కలిగి పత్రికా ప్రకటనలు గూడా యిచ్చారు. పటమట శ్రీ సర్వోత్తమ భవన ప్రాంగణంలోనే వసతి కల్పించుదామని నాగభూషణంగారు అభిప్రాయ పడినారు. దురదృష్టవశాత్తు ఈ ప్రయత్నములు ఒక రూపంధరించే లోపుగానే రావుగారు పూర్తి అస్వస్థులైపోయినారు.

## 44 వారాల కార్యక్రమం

శరీరంలో శక్తిలేకపోయినా, రావుగారు "సేవచేస్తూచేస్తూ రాలిపోతా" ననేవారు. "నేనొక కార్యక్రమాన్ని సూచిస్తున్నాను. ఆంధ్రప్రదేశ్‌లోని 20 జిల్లాలలోను 40 వారాల సంచారము ఏర్పాటు చేతాము. హైదరాబాద్, సికింద్రాబాద్ నగరాలను 2జిల్లాలుగాపరిగణించి వీటికిగూడాప్రత్యేకక్రార్యక్రమంయేర్పాటు చేతాము. రోజుకొకఊరుచొప్పున ఒక్కొక్క జిల్లాలో 14 స్థలాలు సందర్శిద్దాము. కేంద్రం సలహాతో స్థానికులైనవారు కార్యక్రమ వివరాలను తయారుచేస్తారు. ఈ విషయంలో అభిలాష వున్న వారు నాకు వ్రాయవచ్చును. ముందుగ వ్రాసుకొన్నవారికి ముందవకాశం వుంటుంది. నేను సంతోషంతో ఈ సేవలో సహకరిస్తాను. పాల్గొంటాను. ఈ కార్యక్రమంలో గ్రామ సీమలకు సంబంధించిన ప్రధాన విషయాలనన్నిటిని గురించి ప్రచారం జరగాలి." అని హరిసర్వోత్తమరావుగారు లేఖ వ్రాశారు. లేవలేని అస్వస్థత పరిస్థితిలోకూడా రావుగారిలో ప్రజాసేవానురక్తి, ఏదోమహత్తర సందేశం గ్రామీణప్రటల కందిద్దామనే తహతహ, ఎంతగావుందో దీనినిబట్టి అర్థమవుతుంది.

కనీసం మద్రాసు చుట్టుప్రక్కల జిల్లాలలోనైనా పర్యటన కార్యక్రమం ఏర్పాటుచేసుకొని తిరుగుదామని మరొక ప్రయత్నం చేశారు. అచ్చటమున్న విద్యాశాఖాధికార్లను, గ్రంథాలయ సేవకులను తనతో సంబంధం పెట్టుకొని, తనసేవలను వినియోగించుకోమని వ్రాశారు.

ఇది యిట్లుండగా 1959 డిసెంబరు 11 వ తేదీ హరిసర్వోత్తమరావుగారి తమ్ముడు మరణించటం, ఈ వార్త 12 వ

తేదీ అందటంజరిగింది. రావుగారి శారీరక, మానసిక పరిస్థితులు సరిగా లేనందుననేమో 14 వ తేదీ రాత్రి ఇంట్లో పడిపోయినారు. మరురోజు రాయపేట ఆస్పత్రిలో చేర్పించేసరికే, మాటపడి పోయింది. డాక్టర్లు చేయగల వైద్య చికిత్సలు చేశారు. ప్రాణ వాయువునెక్కించారు. కొంత కుదటపడిన అనంతరం ఆస్ప త్రిలో 2 వారాలుంచి, 3-1-60 వ తేదీన యింటికి అంబు లెన్సులో చేర్చారు. ఒక్కొక్కప్పుడు స్పృహలేకుండా పోయింది. మరొకప్పుడు వచ్చిన బంధుమిత్రులను గుర్తుపడుతుండేవారు. "మిమ్ములను కష్టపెడుతున్నానమ్మా, నాచేతికర్ర అందివ్వండి. నేనే అవతలకి వెళ్ళివస్తాను" అని చటుక్కున లేచి వెళ్ళ ప్రయ త్నించేవారు. అస్తమానం మంచంమీద పరుండినందువల్ల వళ్ళు పుండ్లుపడినవి. ఆస్పత్రిలో వున్నప్పుడు జ్ఞాపకశక్తిరాగానే నర్సు లతోను, డాక్టర్లతోను, "ఆయామందులలోని, ఇంజక్షన్సులోని పాళ్ళు, అవి దేనికి పనిచేస్తవి?" మున్నగు వివరాలన్ని టిని పరిశీలనగా అడిగి చెప్పమంటుంటే వారాశ్చర్యపొయ్యే వారట. తనపేరు స్పెల్లింగుతోసహా, యం. ఏ. డిగ్రీతోకూడా కలిపి చెప్పేవారట. కొంచెం తేటగావున్నప్పుడు, తమ స్మృతి పథానికి వచ్చినవి రావుగారు ఏవోవ్రాయుటకు కొంత ప్రయ త్నించారు అవి స్పష్టంగా అర్థమయ్యేటట్లులేవు.

కుమార్తె అయినప్పటికీ ఒకరిదగ్గరవుండి వారిఖర్చులతో జరుపుకొనుట బహుశా రావుగారికి కష్టంగా తోచేదేమో! ఆస్ప త్రిలో చేరేముందు రావుగారు 21-12-59 వ తేదీ నాగభూషణం గారికి ఒక లేఖవ్రాసినారు. అందులో

## న న్ను సా కే దె వ రు ?

"ఈశ్వరుడు దయచేసి నాకింకా కొంత ఆయువిచ్చినాడు. నెలనెలా అంతో ఇంతో ఆదాయం వస్తేగాని రథమునడవదు. దానికి ఎవరేమిచేయ గలరు?.... నా వ్రాతనన్ను బ్రతికించవలెను. ఆల్ ఇండియా రేడియోకు గానునేనప్పుడప్పుడు వ్రాసినవ్యాసాలు ఫుల్ స్కేపు 2,500-విషయములు వివిధమైనవి నావద్దయున్నవి. అదంతాఎవరైనా చదివి వినిపించి,అచ్చుకు సిద్ధముచేసి యితరత్రావిషయంకూడ చేర్చి కొంత ప్రచారము చేసుకొన వచ్చును. ఇతరులతోడులేకుండా నేను ఏమిన్నీచేయలేను. నా కండ్లంత స్వాధీనంలోలేవు. మీరీసంగతి ఆలోచింతురుగాక; సలహాయిత్తురుగాక. సంవత్సరానికి రూ1 000/ నేను పుట్టించుకొనవలసియున్నది. ఈశ్వరుడు అనుకూలించవలసియున్నది. సర్వేజనాస్సుఖినోభవంతు."

తనస్వశక్తిమీద, తనరచనలమీద ఆధారపడదామనే రావు గారి తత్వం యిందులో గోచరిస్తుంది.

క్రమేణా రావుగారి శరీరస్థితి నీరసించింది. 2, 3 చంచా లకన్న జావ లోనికిపోవటంలేదు. చిక్కిశల్యమై పోయినారు. పుండ్లు ఎక్కువైనాయి. మాట తడబడసాగింది. నేత్రదృష్టి బాగా మందగించిపోయింది. రాయపేట ఆస్పత్రిలోనున్నప్పుడు వారి కుమార్తె, అల్లుడుగారితోపాటు తెలుగుభాషా సమితిసిబ్బంది, మేనేజరు ఓరుగంటి నరసింహమూర్తి, పాతూరి నాగభూ షణం, వీరి సతీమణి చంద్రమొలక రాజేశ్వరమ్మగార్లు దగ్గ రుండి రావుగారికి సాయపడినారు. అనేకమంది బంధుమిత్రులు హృదయ భారంతో సందర్శించి వెళ్ళుతుండేవారు. డాక్టర్లు మందులు వాడుతుండేవారు. రావుగారి ఈ ఆందోళనాపరిస్థి తులను, ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘపక్షాన ప్రముఖులకు,

# కార్యక్రమంలో పాల్గొన్న బంధు మిత్రులు

పాట (ఎడమ నుండి కుడికి)

1. శ్రీ దర్శి చెంచయ్యగారు
2. శ్రీ సి. యస్. శాస్త్రిగారు

మధ్య రావుగారి చిత్రపటము

3. శ్రీ హెచ్. అనంతనారాయణ అయ్యరుగారు
4. శ్రీ డా॥ వి. యస్. శర్మగారు
   (ప్రిన్సిపాల్ గాంధీజీ కా.లు, హైదరాబాదు)
5. శ్రీ పి. సి. సుబ్బారావుగారు
   ([illegible] స్థాపకులు)

వారు (ఎడమనుండి కుడికి)

1. శ్రీమతి కనకదుర్గగారు
   ([illegible] పూర్ణతిలకగారి కుమార్తె)
2. శ్రీమతి దర్శి సుభద్రమ్మగారు
   (శ్రీ చెంచయ్యగారి సతీమణి)
3. శ్రీమతి డా॥ కె. గులాబీబాయిగారు
4. శ్రీ చెలికాని శాస్త్రిగారి సతీమణి
   (అనంతపురం)
5. శ్రీమతి యస్. సి. ద్వారకాబాయిగారు
   (రావుగారి కుమార్తె)
6. శ్రీ యస్. సి. పార్థసారథిగారు
   (రావుగారి అల్లుడు)
7. శ్రీ గాడిచర్ల ప్రాణేశ్వరరావుగారు
8. శ్రీ హెచ్. రామచంద్రారావ్‌గారు
   (హైదరాబాదు)

స్నేహితులకు తెలియజేయడమైనది. కాని "జాతస్యమరణం ధ్రువం" గదా! 2 నెలలు మృత్యువుతో పోరాడి, కుమార్తెయింట, చివరకు డెబ్బదియేడవయేట సర్వోత్తముడు, 29-2-1960 వ తేదీన హరిలో లీనమైపోయినాడు. అర్ధశతాబ్దముపైగా ఆంధ్ర జాత్యభ్యుదయానికి కృషిచేసిన ఆంధ్ర మహాపురుషుడు ఆంధ్ర దేశాన్ని దుఃఖసముద్రంలోముంచి, దివంగతుడైనాడు.

చనిపోవుటకుముందుగా, కేంద్ర ప్రభుత్వ హోంశాఖా మంత్రి శ్రీ గోవిందవల్లభపంత్, హరిసర్వోత్తమరావుగారి దేశ సేవలను శ్లాఘిస్తూ 2 వేలరూపాయలచెక్కును పంపించటం జరిగింది. రావుగారి శ్రేయోభిలాషి, శిష్యకోటికిచెందిన కోడి నరి సింహముగారు రావుగారిచేత బలవంతంగా దరఖాస్తుచేయించి, అప్పట్లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగానున్న పిడతల రంగారెడ్డిగారిచే ప్రత్యేకంగా లెటరు వ్రాయించిన ఫలితంగా, ఈ చెక్కురావటంతో చివరిరోజుల్లో రావుగారి మందులకు, దిన వారాలకు ఎంతో సహాయకారిగా వుండింది. "గాంధీస్మారకనిధి" సంస్థ వారు నెలకొక వందరూపాయలవంతున యిచ్చుటకు తీర్మానించి, అవసానదశలో రావుగారికి తెలియజేసినారు. మరణ వార్తరాగానే "తెలుగుభాషాసమితి"వారు రు 116/లు కుటుం బానికిపంపి తమ కృతజ్ఞత చూపారు. ఆంధ్రగ్రంథాలయ ట్రస్టు, రు 200, ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘము రు 100, కుటుంబాని కందజేయుటద్వారా వీరిననుసరించారు. వారి పుస్తకముల బాపతు పైకము కొంత నాగభూషణంగా రందించారు, ఈ విధంగా ప్రభుత్వ ప్రజాసంస్థల అదరాభిమానాలతోనే రావు గారు స్వయంకృషితో తన ఖర్చులను తాను వెళ్ళబుచ్చుకొన్న

ధన్యజీవి. చరితార్థుడైన ఆయన జీవితం చిరస్మరణీయం. ఒక నిస్స్వార్థనిరాడంబర దేశసేవకుడు, ఒక మహావ్యక్తి మనల శోక సముద్రంలో ముంచి దివికేగినాడు. ఆ ఆదర్శమూర్తియొక్క త్యాగం మనకాదర్శం. నిస్స్వార్థం మనబాట. ఆయన అడుగు జాడల్లో పయనించడమే మనకర్తవ్యం.

హరిసర్వోత్తముని మరణవార్త నలుదిశలు వ్యాపించింది. పత్రికలన్నీ ప్రముఖంగా ప్రకటించినవి. దిన వార పక్ష మాస పత్రికలు చాల సంపాదకీయములు వ్రాసినవి. ఆంధ్రావనిలో అసంఖ్యాకంగా సభలు, సమాశాలలో సంతాప తీర్మానములు గావించబడినవి. ఆంధ్రప్రదేశ్ శాసనసభ, కౌన్సిలు, మద్రాసు అసెంబ్లీ, కౌన్సిలు, సమావేశములు వాయిదావేస్తూ సర్వోత్తముని సంస్మరించి, శ్రద్ధాంజలి సమర్పించినవి. కుటుంబమునకు సానుభూతు లందజేసినవి. ఎక్కడో బొంబాయిలో గవర్నరుగా నున్న శ్రీప్రకాశ్, పత్రికావార్తచూచి తమ హృదయావేదనను వారి కుమార్తెకంద జేశారు. ఆంధ్ర యూనివర్సిటీ (వాల్తేరు), ఆంధ్ర జాతీయ కళాశాల (బందరు), తెలుగు భాషాసమితి (మద్రాసు), ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం (విజయవాడ) మున్నగు సంస్థలు తమ సంతాపములను తెలియజేసినవి. వివిధ రాజకీయ పక్షములగు కాంగ్రెస్, కమ్యూనిస్టు, స్వతంత్రపార్టీ లున్నూ దేశంలోని పలువురు ప్రముఖులున్నూ దేశసేవా ధురంధురుడైన సర్వోత్తముని బహుముఖ సేవలను కొనియాడుతూ తీర్మానములు చేశారు. గేయాలు, వ్యాసాలు వ్రాశారు. ప్రత్యేక సంచికలను ప్రకటించారు.

బాల్యంలో గడచిన ఏ కొలది సంవత్సరాలనో మినహాయిస్తే ఆయనది 77 సంవత్సరాల త్యాగమయ జీవితం. ఎట్టి కష్ట పరిస్థితులలోనూ దైన్యమెరుగని, ధైర్యముడుగని ధీరోదాత్త జీవితం. పేరుకు తగినట్లు ఆయన సర్వోత్తముడే.

ఎన్ని ఉద్యమాలకు ఆయన పితృపాదుడో, ఎన్ని సంస్థలను ఆయన నిర్వహించారో ఊహించలేము.

— ఆంధ్రప్రభ

ఊరూరా, వాడవాడా గ్రంథాలయాలను స్థాపించి, ప్రజలకు విజ్ఞానభిక్ష పెట్టాలనే మహదాశయానికి తన జీవితాన్నంతా అంకితం చేసిన గ్రంథాలయోద్యమ పితామహుడు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు.

ప్రజా జీవితంలో అర్ధ శతాబ్దంపాటు ప్రముఖస్థానం వహించి అసువులు బాసిన శ్రీ హరిసర్వోత్తమరావుగారు ధన్యజీవి.

— విశాలాంధ్ర

యువకులను ప్రోత్సహించి, వారిచేత దేశసేవ, భాషా సేవలను చేయించి కార్యకర్తలను, నాయకులను సృష్టించిన గొప్పవ్యక్తి శ్రీ హరిసర్వోత్తమరావుగారు. డెబ్బది యేండ్లకు మించిన ప్రాయములోగూడ వారియందు యువకులలోని ఉత్సాహము గోచరించు చుండెడిది. త్యాగము, విజ్ఞానము, దృఢదీక్ష మూర్తీభవించిన వ్యక్తిత్వము హరిసర్వోత్తమరావుగారిదని నిస్సందేహముగ చెప్పవచ్చును.

— గోల్కొండ పత్రిక

విద్యార్థి దశలో స్వాతంత్ర్యోద్యమంలో అడుగుపెట్టిన నాటినుంచి - శాశ్వతంగా కన్నుమూసే వరకు పాకీ పనివారి సంఘానికి నాయకత్వం వహించడం దగ్గరినుంచి ఆంధ్రమహాసభను నిర్వహించడం వరకు ఆంధ్రదేశంలో ఆయన అడుగుపెట్టని కార్యరంగం లేదు. స్పృశించని సమస్య లేదు.

— ప్రజాసేవ

ఆంధ్రదేశంలో ఒక ప్రముఖుడు, గ్రంథాలయోద్యమ పితామహుడు, సాటిలేని విద్యా ప్రచారకుడు కన్నుమూశాడు. ఆంధ్రులకు ఆయనలేని లోటు తీరనిది.

— వాహిని

శ్రీ హరిసర్వోత్తమరావుగారు చిన్ననాటినుంచీ బహు స్వతంత్రులు. నిర్భయులు. తాను నమ్మిన దానిని ఖండితముగా చెప్పి చేయగల ధీరత ఆయనలో మూర్తీభవించినది. దారిద్ర్యమునే సంతోషముతో స్వీకరించి ప్రజాసేవ, భాషాసేవ చేసిన ధన్యజీవుడాయన.

— విజయవాణి

పత్రికాధిపతిగా, ఆంధ్రోద్యమ పితామహుడుగా, దేశభక్తుడుగా, జాతీయ నాయకుడుగా, గాంధీ మహాత్ముని అనుచరుడుగా, గ్రంథాలయోద్యమ సృష్టగా ఆయన ఆంధ్ర ప్రజానీకానికి నిరాడంబరముగా బహుముఖముల చేసిన సేవ అపారము.

— పంచాయతీ రాజ్యం

ఉత్తమ లక్ష్యాలతో ప్రజాసేవకు, దేశసేవకు తన జీవితమును శ్రీ సర్వోత్తమరావుగారు అంకితంచేశారు.

— గృహలక్ష్మి

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు 1900 నాటి తొలి జాతీయోద్యమములో పాల్గొని తెనుగుజాతి శౌర్యానికి వన్నెలు దిద్దిన జాతీయ నాయకుడు.

— మరోప్రపంచం

ఒకానొక ఉద్యమంలో చేరి తాత్కాలికమైన ఆవేశముతో ముందుకురికి త్యాగము చేయుటవేరు. నిత్య త్యాగయుక్తమైన సేవామయ జీవితమును నిష్కామ బుద్ధితో జీవితాంతము కొనసాగించుట వేరు.... ప్రాచీన పరిభాషలో చెప్పవలెనన్న మొదటిది క్షత్రియ ధర్మము. రెండవది బ్రాహ్మణ ధర్మము. ఈ రెండు ధర్మములును శ్రీ సర్వోత్తమరావుగారిలో మూర్తీభవించినవి. ఎం. ఏ. బిరుద ధారులు, అత్యున్నత

విజ్ఞాన ధనులునై కూడ రాజకీయముగా ఎట్టి ఉన్నత పదవులను ఆశిం పక దేశసేవయే జీవిత లక్ష్యముగా పెట్టుకొని అచంచల దీక్షతో చివర వరకు నడచిన ఆదర్శవ్యక్తి ఆయన. అందుకు వయోజనవిద్య. గ్రంథా లయోద్యమము, అభిమాన శాఖలుగా పెట్టుకొని వీరు చేసిన సేవ అపారము.

— సామ్యయోగము

ఆంగ్ల ప్రభుత్వ ఆగ్రహానికి గురియై 1908 వ సంవత్సరంలో లోక మాన్య బాలగంగాధర తిలక్ మహాశయునితోపాటు శ్రీకృష్ణ జన్మస్థానం అలంకరించిన ప్రప్రథమ ఆంధ్ర మహాపురుషుడు. గాంధియుగమునకు చాల పూర్వమునుండియు స్వరాజ్య, స్వదేశ, నిమ్నజాత్యుద్ధరణాది మహోద్యమాలకు పునాదులువేసి విశేష కృషి చేసిన ప్రముఖ నాయకుడు.

— తెలుగుదేశం

శ్రీ సర్వోత్తమరావుగారి జీవితమే ఒక మహా ఉద్యమం. జాతీయోద్య మాలలో పాల్గొన్న వీరుడుగా, ఆంధ్ర రాష్ట్రోద్యమ నిర్వాహకుడుగా చరిత్రలో వారిపేరు శాశ్వతంగా నిలచి పోతుంది.

మరణశయ్యపైనుండికూడా సేవ చేయలేక పోతున్నానని ఆవేదనపడ్డ చిత్తశుద్ధిగల ప్రజా సేవకుడు. నమ్మిన సిద్ధాంతాలకై నిర్మాణాత్మకమైన కృషి సాగించిన తపోనిష్ఠుడు.

— ఉపాధ్యాయ

మన స్వరాజ్యం సర్వాంగ సుందరమైన ప్రజారాజ్యంగా పరిణమిల్లా లంటే వయోజన విద్యయే ముఖ్య సాధనమని తమ జీవితముద్వారా సందేశమిచ్చిన సచ్చరిత్రులు శ్రీ హరిసర్వోత్తమరావుగారు.

ఆయన స్వాతంత్ర్య ప్రియత్వం, అచంచల కార్యదీక్ష అనన్యం .... సర్వోత్తమ నామాన్ని పూర్తిగా సార్థకం చేసుకొన్న మహానుభావుడు.

— ధర్మజ్యోతి

ఆంధ్ర మహాపురుషులలో ప్రముఖస్థానం వహించి తమ జీవితాన్ని పూర్తిగ దేశసేవకై అంకితం చేసినవారు శ్రీ హరిసర్వోత్తమరావు గారు, దేశాభ్యుదయ కరమైన రాజకీయార్థిక సాంఘికాది సమస్త ఉద్యమాలలోను వారు తీవ్రంగా పనిచేసి ఎంతో త్యాగంచేసి అనేక బాధలకు గురియైనను ఎన్నడు తమ ధీరత్వాన్ని వదలలేదు. రాజకీయ నాయకుడుగ, ప్రముఖవక్తగ, రచయితగ, జర్నలిస్టుగ, ఆయన అఖండ కీర్తిప్రతిష్ఠలను ఆర్జించినారు. పాకీ పనివారల సంఘాధ్యక్ష పదవిని, శాసన సభ్యత్వాన్ని సమాన దృష్టితో నిర్వహించినారు. వ్యవసాయ పనిముట్ల ఉత్పత్తిదారుల సంఘానికి, హిందూస్థాన్ సేవాదళానికి నాయకత్వం వహించినారు. ఆంధ్ర దినపత్రికకు తొలి సంపాదకులుగ విజ్ఞాన చంద్రికకు ప్రథమ సేవకునిగ, ఆంధ్రోద్యమానికి అతిరథుడుగ, ఆంధ్ర గ్రంథాలయోద్యమానికి మొదటి పెద్దగ, భారతావనిలోని వయోజనవిద్యా గురువులలో ప్రప్రథముడుగా నుండి, వారు సాగించిన విశ్రాంతి నెరుగని బహుముఖ కార్యక్రమం మరువరానిది. ఆయన మేరుపర్వతాన్ని బోలినవ్యక్తి; విజ్ఞానఖని. మూర్తీభవించిన సేవావతారం. గొప్ప ఆశావాది. మహాత్యాగి. పనిపని యని మరణశయ్యపై నుండికూడ పలవరించిన కర్మయోగి. పరాక్రమంతో పాటు సౌజన్యాన్ని పాండిత్యానికి తగిన వినయాన్ని పుణికి పుచ్చుకొన్న పుణ్యమూర్తి.

— గ్రంథాలయ సర్వస్వము

శ్రీ హరిసర్వోత్తమరావుగారు నిజానికి ఆంధ్రప్రదేశ్ కేసరి. ఆయన కాలేజీలో నున్నప్పుడే ధైర్య సాహసాలను ప్రదర్శించినాడు. తాను నమ్మిన ఆశయంకోసం తన సర్వస్వాన్నీ విడిచిపెట్టగలదిట్ట.

— యస్. ఆర్. రంగనాథన్

దేశసేవనే ఒక వ్రతముగా అనుష్ఠింపుచు, ఆ వ్రతనిష్ఠయందు మొక్కవోవని పట్టుదలతో అచంచల కార్యదీక్షతో తాను నమ్మిన సత్యపథ

మున కష్ట నష్టములను లెక్కచేయక జీవితము భాగ్యవంతముగ (ఆర్థికముగ కాదు) ఒక యోగముగ గడపిన ధన్యజీవి, ఋషిసత్తముడు సర్వోత్తమరావు.

ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము జీవించియుండువరకు ఆయనయు జీవించియే యుండును.

— అయ్యంకి వెంకటరమణయ్య

మనమీనాడు చక్కగా యెక్కగలుగుతున్న యీ దివ్య స్వరాజ్య భవనమునకు అట్టడుగున పునాదులలో నున్న పెక్కుమంది పెద్దల సంగతి నేటి తరమువారికి తెలియక పోవచ్చును. అట్టి వారిని స్మరించి, వారికి కృతజ్ఞతాంజలుల నిచ్చుట మన కనీస ధర్మము. అట్టివారిలో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారొకరు.

— మానికొండ సత్యనారాయణశాస్త్రి

మదరాసు రాజధానిలో ప్రప్రథమంగా దేశ స్వాతంత్ర్యముకొరకు కారాగార శిక్షననుభవించిన వీరాధివీరుడాయన.

దేశ కాలపరిస్థితులను తన ఆర్థిక పరిస్థితిని దృష్టిలో నుంచుకొని దేశ సేవ, మానవ సేవ చేసిన నిరాడంబరజీవి. గొప్ప రచయిత. గొప్ప మేధావి. దేశభక్తుడు. మన హరిసర్వోత్తమరావుగారు నవీనకాలపు మహాఋషి.

— దరిశి చెంచయ్య

ఆయన ఉత్సాహం, ఆవేశం, ఆవేశమునకు తగిన కార్యదీక్ష ఆంధ్రలో నెచటను కానరాదు. నిజమున కానాడు ఆంధ్రమున హరిసర్వోత్తమరావు జన్మించియుండని యెడల రాజకీయోద్యమమునకు పునాదియే లేక పోయియుండవచ్చును. ఆంధ్రములో రాజకీయమునకు ఆదిపురుషుడు హరిసర్వోత్తమరావు. ఇంతేకాక పండితుడు, రచయిత, పత్రికాధిపతి, రాజకీయవేత్త, దేశభక్తుడు, విప్లవకారుడు, స్వాతంత్ర్యయోధుడు.

— యత్రమల్లి జగన్నశాస్త్రి

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు, గ్రామపంచాయతీ సహకార ఉద్యమములకు వారిసేవ అగణితమైనది.

వారి సహృదయత, సాంఘిక సమభావము, గ్రామముల యెడల అపార అభిమానము, ఎత్తులువేయని రాజకీయ నడవడి అన్నితరములవారికి అదర్శప్రాయము....ఎం. ఏ. పట్టభద్రులయ్యు గ్రామీణుల ధోరణిని ప్రేమించెడి వారు. వారిసేవకు ఉత్సాహ పడెడివారు.

— నాగినేని వెంకయ్య

పంతులుగారు చేపట్టని ఉద్యమముగాని, వారితో సంబంధములేని ఉద్యమముగాని ఆంధ్రదేశంలో లేదంటే అతిశయోక్తి కానేరదు. రాజకీయములు మొదలు వ్యవసాయపనిముట్ల ఉత్పత్తిదారుల సంఘాలవరకు వారికి సంబంధముగలదు.

— అ. శ్రీనివాసరావు

పత్రికారచనలో నిర్భయంగా విప్లవాత్మక భావాలను పూరించి యువక హృదయాలను ఆకర్షించడమేగాక యువకులను జాతీయవీరుల నొనర్చిన గొప్ప రచయితయేగాక అంతకుమించిన సింహనాదములు గావించినవక్త.

—కవిరావు

## జో హా ర్లు

సర్వోత్తమమగు నుద్యమమ్మునకు
సర్వోత్తముడగు నేతవురా – హరి
సర్వోత్తమరాయా! నినుగోల్పడి
సర్వస్వము గోల్పడితిమిరా!

చదువును సంస్కృతి సత్యనిష్ఠయును
సడలని శీలము – సౌజన్యమ్మును
వదలని దీక్షయు వాగ్మిపుణ్యము
వచ్చి చేరిన వ్యక్తివిరా!

రాజుకు రాజుగ బంటుకు బంటుగ
వ్యాజమునేరని వ్యవహర్తవుగా
నైజములోనే సేవాభావము
నాటుకొన్న నయశాలివిరా !

నాటి పాత్రలకు తగిన ప్రతినిధివి
నేటి క్రొత్తలకు మేటి పునాదివి
కోటి కోటి సర్వోత్తముల తెలుగు
నాటిలోన వెలయింపుమురా !

— శిష్ట్లా సత్యనారాయణరాఖశేఖరం

"కన్ను, చెవి ఒకటి రూపాన్ని, ఒకటి శబ్దాన్ని మనసున కందించ టముచేత ఇవి జ్ఞాన విజ్ఞాన సాధనకు ముఖ్యమయిన ఇంద్రియాలుగాఏర్పడినవి. లలితకళలనిపించుకొన్న సంగీతము,కావ్యము, చిత్రము, శిల్పము - ఈయన్నిటి యాస్వాదనానికిని ఈ రెండంగాలే సాధనాలు. కాబట్టి మనస్సుకు ఎక్కి చిత్తవృత్తిని సంస్కరింప వలసిన ఏపని సాధింపబూనినప్పటికిని ఈరెండు అంగాలనే పరమాధారంగా మన పెద్ద లుపయోగించినారు. మనమును ఉపయోగించ వలసియున్నది."

—గాడిచర్ల హరిసర్వోత్తమరావు

# ౧౧

# ఉపసంహారం

రావుగారి రచన "అన్నయ్య లక్ష్మణరావు" నందలి భాగాలు- రాజకీయంగా వీరు తిలక్‌గారి అనుయాయులు-గాంధిగారి సత్యాగ్రహములలో ప్రత్యక్షంగా పాల్గొనకున్నా వారి నిర్మాణ కార్యక్రమం, సత్యాహింసల విధానాలు చేపట్టినారు-దేశ హితైకమైన వివిధ రంగాలలో చేసిన బహుముఖకృషి-ఇతరుల మెప్పుకోసం, తనగొప్పకోసం పని చేయకపోవడం-తాను నమ్మిన అభిప్రాయాలను స్వేచ్ఛగా ప్రకటించడం - జీవితగమనంలోని ప్రధానమగు మలుపులు - వారిని గురించి ఇతరులకు కలిగిన అపోహలు-వారి ధ్యేయం,ప్రయత్నాలసాఫల్యం-వారి జీవితంలోని సంతోష సమయాలు-వారి మరణానంతరం వారు పనిచేసిన సంస్థల పరిస్థితి-వారి కరుణార్ద్ర హృదయం, సహకార తత్వం, త్యాగ జీవనం సర్వోత్తమ నామాన్ని సార్థకంచేసి లోకానికి ఆదర్శప్రాయాలుగ నిలచిపోయిన వైనం.

# ఉపసంహారం

పంటకళ్ళాల్లో కనబడే ధాన్యపు రాసులన్నీ వానాకాలంలో కురిసిన వర్షపు ఫలితాలేగదా! వర్షపు నీరు భూమిలోనికి యింకి పోతుంది. కాని అది ధాన్యంలో యిమిడి యున్నదనే విషయం గుర్తించాలి. మహాపురుషుల సదుపదేశాలు మంచి మనుష్యుల మనస్సుల్లో సత్ఫలితాలు కల్గిస్తవి. ఇలానే హరిసర్వోత్తమరావు గారిలాంటి సత్పురుషులు చేసిన దేశసేవ, త్యాగనిరతి ఎన్నటికీ మరువరానివి.

దేశస్వాతంత్ర్యానికి, ఆంధ్రాభ్యుదయానికి అనేక మంది అనేకమార్గా లవలంబించారు. లక్ష్యసిద్ధికోసం అనుసరించే విధానాలు వేరుగావచ్చు. కాని వారి లక్ష్యం ఒక్కటే.

పేరెన్నికగన్న మొట్టమొదటి ఆంధ్ర రాజకీయ నాయకులలో 'ఆంధ్ర భీష్మ' న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, డా॥ పట్టాభి, ప్రకాశం, కొండా వెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, కాశీనాథుని నాగేశ్వరరావు, కాళేశ్వరరావు, హరిసర్వోత్తమరావు, రంగా, మున్నగువారి పేర్లు ఎవరికైనా చటుక్కున స్ఫురణకు వస్తాయి. తెలుగునాట తొలి రాజకీయ బీజాలునాటిన వారిలో న్యాపతి, మోచర్ల వారు ముఖ్యులు. డాక్టరు పట్టాభి కాంగ్రెసు చరిత్ర కారుడుగా, మేధావిగా, గాంధి సిద్ధాంతాల భాష్యకారుడుగా గణుతికెక్కారు. ఆంధ్ర బ్యాంకు, ఆంధ్ర

ఇన్సూరెన్సు కంపెనీలస్థాపన ఆయన దూరదృష్టికి తార్కాణాలు. ఇవి ఆంధ్రలో పెట్టుబడిదారీ సమాజ పరిణామానికి ప్రాతిపదిక లైనవి. ప్రకాశంగారి జీవితం త్యాగానికి, సాహసానికి పెట్టింది పేరు. ఆంధ్రకేసరి నిజంగా త్యాగి-భోగి-చివరకు జోగిగూడ. ఆంధ్రుల హావభావాలకు ప్రకాశం ప్రతిబింబ మనవచ్చు. వీరి రాజకీయ వైఖరులలో చివరిరోజుల్లో భిన్నరీతు లగుపించినా, అర్ధశతాబ్దం ఆంధ్రుల హృదయాల్లో గాఢంగా పీఠం వేసుకొన్న వ్యక్తి. 'ఆంధ్రరత్న' అంధకారాకాశంలో నక్షత్రంలాగా తళుక్కున మెరిసి అకాలమరణానికి గురియైనవారు. ఆయన రామదండు నిర్మాణం, రామనగర్ స్థాపన, విమర్శనాత్మక చాటువులు వారి సాహస కృత్యాలకు ఉదాహరణలు. పట్టాభి మేధస్సు, ప్రజ్ఞా ప్రకర్షణలు, ప్రకాశం త్యాగం, దుగ్గిరాల సాహసం, దేశోద్ధారకుని వితరణ, కొండా వెంకటప్పయ్యగారికి లేకున్నా, ఈ దేశభక్తుని సౌశీల్యం, నిర్మాణదృష్టి ఆంధ్రుల నాకర్షించి, అత్యంత గౌరవ స్థానం కల్గించిం దనవచ్చు. ఈయన తనకున్నది పోగొట్టుకోలేదు. ఇతరులను చేయి జాచలేదు, రాష్ట్రోద్యమానికి, హిందీ భాషా వ్యాప్తికి, శారదా నికేతనం స్థాపనకు మూలపురుషులైనారు. నాగేశ్వరరావు అమృతాంజనంవల్ల లక్షలుగడించి, శాశ్వతంగావుండే పత్రికలు స్థాపించి, దానధర్మాలుచేసి, దేశోద్ధారకుడుగా, విశ్వదాతగా కీర్తిప్రతిష్ఠలు బొందారు.

ఇలానే మహర్షి బులుసు సాంబమూర్తి, అయ్యదేవర కాళేశ్వరరావు, మద్దూరి అన్నపూర్ణయ్య, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం మొదలగు స్వరాజ్య వీరులెందరో ఉద్భవించి మన తెలుగు దేశాన్ని పునీతం చేశారు. ఆచార్యరంగాగారి దొక

ప్రత్యేక వ్యక్తిత్వం. అనేక పార్టీల మార్పులు ఆయా సందర్భాలలో జరుగుతూవున్నా, రైతాంగ బాంధవుడుగా, ఆంధ్ర రైతుల్లో గణుతికెక్కినవారు. విమర్శనాజ్ఞాన సంపదలుగల గ్రామీణ విజ్ఞానవేత్త. ఒక్కొక్కరూ ఒక్కొక్క విధంగా దేశసేవకు జీవితాల నంకితం చేసిన మహనీయులు. ఆంధ్ర దేశంలో 'వందేమాతరం' ఉద్యమ బీజాంకురాలునాటిన ప్రముఖుడు మన హరిసర్వోత్తమ రావుగారు. తెలుగు దేశంలోనేగాక, దక్షిణాదినే అనుపమాన త్యాగాలకు మార్గదర్శకుడైన ధీరోదాత్తుడు. తెలుగునాటి ప్రథమ రాజకీయ ఖైదీ. ఆంధ్ర ప్రథమ విద్యావంతుల్లో నొకరు. ఆదికాల ఆంధ్రోద్యమ నిర్మాతల్లో ముఖ్యులు. ప్రథమ ఆంధ్ర దినపత్రిక ప్రధాన సంపాదకులు. విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి, జాతీయ కళాశాలల స్థాపనలో ప్రధానపాత్ర వహించినవారు. ఈ రీతి రాజకీయ, సాంస్కృతిక, విద్యారంగాల్లో ప్రధాన పునాదులువేసిన అగ్రశ్రేణి ఆంధ్ర నాయకులలో హరిసర్వోత్తమరావుగా రొకరు. 1906 నుండి 1920 వరకు ఆంధ్ర దేశంలో రాజకీయ మహానాయకుడుగా, ఆదర్శ దేశారాధకుడుగా రావుగారు చరితార్థులైనారు.

ఆరంభదశలో జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ఆంధ్రనాయకుల ఆర్థిక పరిస్థితులను గమనిస్తే ఆగర్భ శ్రీమంతులెవ్వరూలేరు. 'ఆంధ్రుల దేశసేవ, త్యాగం తదితరులకు ఆదర్శప్రాయ'మని గాంధీజీ ఏనాడో చాటి చెప్పాడు. రాజకీయ చైతన్యమున్న ప్రాంతాల్లో తెలుగు దేశానికి పెట్టిందిపేరు. స్వరాజ్య సంరంభంలో ముందుండి పోరాడారీ తెలుగు వీరులు.

కాని ఒండొరుల మధ్య సఖ్యతాలోపకారణంగానో, లేక నాయకత్వంలోని వ్యక్తిగత వైషమ్యాలవల్లనో అఖిల భారత దేశంలో వహించవలసిన అత్యున్నత స్థానాలను ఆంధ్ర నాయకులు అందుకోలేక పోయినారేమో ననిపిస్తుంది. వీరిలో వివిధ దృక్పథాలలో సమన్వయదృష్టి కొరవడడంమూలంగాగూడా హరి సర్వోత్తమరావుగారిలాంటి అత్యుత్తమ దేశభక్తులు, రాజకీయంగా తర్వాత దశలో సముచిత పాత్రను నిర్వహించజాలక పోవటానికి కారణంగా తోస్తుంది. రావుగారు తీసుకొన్న రాజకీయ వైఖరికి వారి మనస్తత్వం (Temperment) మరొక ముఖ్యకారణం గావచ్చు. ఇందులో వ్యక్తుల హెచ్చు తగ్గుల సమస్య ఉత్పన్నం కారాదు. కందుకూరి వీరేశలింగంగారిని–కొమర్రాజు లక్ష్మణరావుగారిని పోలుస్తూ, "అన్నయ్య లక్ష్మణరావు" అన్న వ్యాసంలో హరిసర్వోత్తమరావుగారిలా చెపుతారు :

"విజ్ఞాన సర్వస్వం తలధరించడంచేత ఈయన యితర రచనలు కొరవడినవి. లేకుంటే ఆయన రచనల విస్తారంలో వీరేశలింగంగారికేమీ తగ్గేవాడుకాడు. అన్ని రచనలు తీసుకొంటే, ఇప్పుడూ తగ్గుతాడనుకోను.................వీరేశలింగంతో పోలుస్తున్నానంటే లక్ష్మణరావుకు వీరేశలింగమును వరరాయి చేస్తున్నాననుకోరాదు. మహావ్యక్తులు ఎవరికి వారే సమానులు. వారి నొకరితో వొకరినిపోల్చి తారతమ్యాలెంచడం పొరబాటు. వీరేశలింగం లక్ష్మణరావుకంటే ముందు యుగంవాడు. అరవైయేండ్లకుపైబడి జీవితావకాశాలు అనుభవించినవాడు............

............మా లక్ష్మణరావు ఎట్లయినా తరువాత యుగంవాడు. నడి వయసులోనే పరమపదించినవాడు. అరవైయేండ్ల వయసు ఆయనకుంటే అది ఎంత ఎక్కువ పేరాయనకు కలిగించేదో మనం చెప్పలేం, కాలం, అవకాశం, పరిస్థితుల విభేదాలలో పనిచేయడం మానవ సమాజంలోని

పెద్దలకు తప్పదు. కాబట్టి ఆ పెద్దలలో ఒకరి నొకరికి పోటీలుపెట్టి పరీక్షింపరాదు. ఎవరికివారు మనకెట్లా ఆదర్శ పురుషులో నిర్ణయించుకొని వారి జీవితాన్ని మన జీవిత పురోగమనానికి ఆధారం చేసుకోటం మన ధర్మం.

........లక్ష్మణరావు తనకుతానే సాటి. అన్ని విధాల తీక్ష్ణ పరివర్తన కోరేవాడు. నిరంతర కార్యదీక్షాపరుడు. విజ్ఞాన రంగమున తనువునర్పించినవాడు, సాంఘికముగా కార్యరూపంలో అన్ని సంస్కారాలను తన జీవితంలో ప్రవేశపెట్టినవాడు. అతనిని స్మరించుకొందాం. ముందుకు నడుద్దాం."

—'అన్నయ్య కొమర్రాజు'నుండి

కావుననే పేరెన్నికగన్న ఆంధ్ర నాయకులలో హరిసర్వోత్తమరావుగారి జీవితాన్ని, వారి విశిష్ట గుణగణాలను మాత్రం మన ముందుంచుకొనుటయే సముచితంగా వుంటుంది. అదే మన పురోగమనానికి తోడ్పడుతుంది.

ఇక రావుగారి రాజకీయ వైఖరులు పరిశీలిస్తే, వీరు బాల గంగాధర తిలక్ అనుయాయులలో ముఖ్యులు. గాంధీ యుగారంభానికి పూర్వం భారత రాజకీయాలలో తిలక్ మహాశయునిదే ప్రాబల్యం. ఆనాటి రాజకీయ సిద్ధాంతాలకు తిలక్‌గారే గురువు, నాయకుడును.

కీ. శే. శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారి స్మరణము పురస్కరించుకొని, తిలక్ - గాంధీ తత్వములను గూర్చి హరిసర్వోత్తమరావుగారిలా వివరించారు:

"మానవ ప్రకృతి శుద్ధ సత్వముగాదు. రాజసతామసములలో మేళవించినది. సత్యమాత్ర ప్రాధాన్యము. ఆ కారణముచేత జీవితము మిధ్య. ఒండొరులు సహించుకొని బ్రతుకువరకు సర్వమును సాధింపవచ్చును.

పరస్పర సహనము మృగ్యమైనచోట పరస్పర సహకారము మృగ్యమగును.. .....కాబట్టి భారత రాజకీయములలో గూడా ప్రభుత్వముతో హీన సహకారముగాని, పూర్ణ అసహకారముగాని ఈ కారణముచేత సిద్ధింపవు. గౌరవప్రదముగా సహకారము సాధ్యమైన జరుపదగును. అట్లు గానిచో ఎదుర్పాటు, అసహకారము తప్పని విధి. ఇది తిలక్ విశ్వాసం. తరచిచూచిన తుదకు గాంధీ తత్వమును ఇంతే యగును. కాని గాంధీ తత్వమని ప్రత్యేకించువారు ఈ సమన్వయము నొప్పుకొనరు....."

రావుగారికి తిలక్ రాజకీయ సిద్ధాంతంపై ప్రగాఢ విశ్వాసం వుండేది. ఆంధ్ర- మహారాష్ట్ర మత సాంఘిక విషయాలలో అనంత వ్యత్యాసాలుండేవి. మత విశ్వాసాలకు వ్యతిరేకంగా రావుగారు సాంఘిక సంస్కరణలకే హెచ్చు ప్రాధాన్యమిచ్చారు. సనాతనాచారపరుల ప్రతిఘటనను ఆనాటి ఆంధ్ర జాతీయ నాయకత్వం ఎదుర్కోవలసి వచ్చేది. నూతన ప్రపంచ పరిస్థితులను హేతువాద దృష్టితో గూడా ఆకళింపు చేసుకొంటున్న రావుగారు సంకుచిత మితవాద తత్వాలకు, మత ధోరణులకు ఎన్నడూ తావివ్వలేదు. ప్రాచీన సంస్కృతీ సాంప్రదాయాలను గౌరవించే రావుగారు ఆధునిక శాస్త్ర విజ్ఞానాభివృద్ధులను ఎప్పుడూ విస్మరించలేదు.

తిలక్ మరణానంతరం 1919 నుంచి మన దేశంలో గాంధీ యుగం అవతరించిందనవచ్చు. గాంధీజీ అనుసరించిన సహాయ నిరాకరణోద్యమాలు రావుగారికి అంతగా నచ్చలేదు. చిత్తరంజన్ దాసు, మోతీలాల్ నెహ్రూ మున్నగువారు గాంధీగారి అసహాయోద్యమాన్ని కాదని శాసన సభా ప్రవేశం చేయాలన్నప్పుడు ఈ విధానం రావుగారి నాకర్షించడానికి కారణం అదే. తనశక్తి

సామర్థ్యాల నుపయోగించి, శాసనసభా రంగంలో ప్రతిభావంతంగా పాల్గొనే సదవకాశం గూడా రావుగారికి లభించింది. తర్వాత దాసు, మోతీలాలులు ఒక్కరొక్కరే దివంగతులైనారు. గాంధీజీ ఏకైక నాయకుడైనాడు.

గాంధీజీ నిర్దేశించిన శాసనోల్లంఘనాది కార్యక్రమములు హరిసర్వోత్తమరావుగారికంతగా నచ్చకపోయినా, ఆమహాత్ముడు ప్రవచిస్తున్న సత్యాహింసలు, నిర్మాణ కార్యక్రమాలు ఎంతగానో రావుగారి హృదయంలో నాటుకొని, జీవితాంతంవరకు అనుష్ఠింప జేసినవి. నా దృష్టిలో వారి జీవితచరిత్రను పరిశీలిస్తే రావుగారికి అటు తిలక్‌గారి రాజకీయ కార్యవిధానం నచ్చింది. ఇటు గాంధీజీ యొక్క గ్రామ పునర్నిర్మాణం, సత్యాహింసలు నచ్చినవి. ఐతే సత్యాహింసలను మానవుని అత్యుత్తమ ధర్మాలుగా త్రికరణ శుద్ధిగా అనుసరించినా, రాజకీయసాధనంగామాత్రం సహాయనిరాకరణ, శాసనోల్లంఘనాది కార్యక్రమాలను అంగీకరించలేదు.

రావుగారు శుద్ధస్వదేశీవ్రతాన్ననుసరించి, గ్రామ స్వయం సంపూర్ణతకు పాటుపడినారు. విదేశవస్త్ర, వస్తుబహిష్కరణల ప్రచారం చేశారు. అస్పృశ్యతా నివారణకు హిందూ - ముస్లిము సఖ్యతకు కృషిచేశారు. ఈ తీరున గాంధీజీయొక్క ప్రజాకార్యక్రమాల నన్నిటిని ఈయన ఆచరణలో పెట్టినవారైనారు. కాని సత్యాగ్రహాల్లో పాల్గొనలేదు. మహాసముద్రంలో వచ్చే పెను తుపానులవలె ఈ రాజకీయ సిద్ధాంత భావసంఘర్షణల ప్రభావం, హరిసర్వోత్తమరావుగారిపై బాగా పడినట్లు కనుపిస్తుంది. ఈ కారణంచేత ననుకొంటా, తన కంతగా విశ్వాసంలేని తొలి సత్యాగ్రహాల్లో రావుగారు పాల్గొనజాలకపోయినారు. 1930-33 సత్యాగ్రహోద్యమాల అనంతరం, తనకు నమ్మకమున్న శాసనసభా

ప్రవేశం చేయాలనే స్వరాజ్యపార్టీలోగాని, దరిమిలా కాంగ్రెసే శాసనసభలకు పోటీచేసిన సందర్భాలలోగాని మళ్ళీ రావుగారు ప్రధానపాత్ర వహించలేకపోయినారు. ఇందులో ఆంధ్రదేశ పరిస్థితులు, ఆంధ్ర నాయకుల మనస్తత్వాలు, కారణమేమైనా గాని వ్వండి, భారతదేశ రాజకీయ పరిణామాలను రూపురేఖలను దిద్దిన రెండు ముఖ్యసందర్భాలలోను రావుగారి స్థానం కాంగ్రెస్‌నుండి వేరైనది. తన భేదభావాలను ఎ. ఐ. సి. సి. మహాసభల్లో స్పష్టీకరించి, గాంధీగారితోగూడా "The Brave Harisarvothamo Rao" (ధైర్యశాలి హరిసర్వోత్తమరావు) అని అభినందనలందిన ఆంధ్రలో సీనియర్‌మోస్టు రాజకీయ నాయకుడుగానున్న రావుగారు 1930 దరిమిలా రాజకీయంగా సముచిత పాత్రను నిర్వహించలేకపోవటం జరిగింది.

హరిసర్వోత్తమరావుగారు స్వాతంత్ర్యలక్ష్య సిద్ధికి నిర్ణయించుకొన్నమార్గం వేరుగా కనుపిస్తుంది. శాసనోల్లంఘనాలు ఆయనను ఉద్రేకపరచలేదు. రాజకీయరంగంలో తర్వాత దశలో సాధ్యమైనంతవరకు చట్టబద్ధ పరిధిలోనే పయనించారు. అట్లని ఈయనది మితవాదతత్వమనటం సరికాదు. మితవాదుల (moderates) ను వ్యతిరేకిస్తూ తీవ్రమైన వ్యాసాలు వ్రాశారు. సైమన్ కమీషన్ బహిష్కరణలాంటి సందర్భాల్లో జస్టిసు పార్టీవారి వైఖరులను, కాంగ్రెస్‌లోని మితవాద ధోరణులను, రావుగారు తీవ్రంగా విమర్శించారు. ఐతే కేవలం భీషణ నినాదములతో నిర్మాణ కార్యక్రమము కొనసాగించలేమన్నారు. ఏపనికైనా ముందు సామాన్య ప్రజలను, విజ్ఞానవంతులను, చైతన్యవంతులనుగా చేయుట ప్రధానకర్తవ్యంగా పెటుకొన్నారు. ఎట్టి ఒడుదుడుకులు వస్తున్నా ఆ మార్గంనుండి వై.. లగలేదు.

స్పష్టమైన రాజకీయపరిశీలనలేకుంటే, స్వచ్ఛమైన రావు గారి జీవితానికి లేనిపోని కళంక మాపాదించినట్లవుతుంది. పిన్న వయసునందే ఏ ఆంధ్రదేశభక్తుడూ అనుభవించని జైలుకష్టాల ననుభవించినరావుగారు, తర్వాత ఏ భయంతోనో వెనక్కు తగ్గా రనటం ఆయన త్యాగమయమైన జీవితానికే అపచారం చేసినట్లవు తుంది. ఏ దారిద్ర్యబాధవల్లనో కౌన్సిలునుండి రాజీనామా యిచ్చి జైలుకు రాలేదనటం రావుగారనుసరించిన రాజకీయ దృక్పథాన్ని అర్థంచేసుకోకపోవటంవల్లనే.

వందేమాతరం ఉద్యమములో ప్రప్రథమంగా దూకిన రావుగారు గాంధీజీ అసహాయోద్యమాలలో తర్వాత పాల్గొనకుండ్డు టకు గలకారణాలు వారితో చర్చించి సన్నిహిత సంబంధంగల సుప్రసిద్ధ దేశభక్తులైన ఆత్మకూరి గోవిందాచార్యులుగారు మా సంభాషణలో యిలా విశదీకరించారు :

"ఆయన లోకమాన్య బాలగంగాధర తిలక్ శిష్యుడు. తిలక్ పరమ పదించినను ఆయన కార్యక్రమమందు విశ్వాసము ఇసుమంతయు సర్వోత్తరావుగారిలో పోలేదు. ఏమార్గమున, ఏకార్యవిధానముననైనను స్వరాజ్య సంపాదనయే లోకమాన్యుని కార్యదీక్ష. తిలక్ అనంతరం, కాంగ్రెస్ నాయకత్వం వహించి నడిపిన గాంధీజీ కార్యక్రమం వేరు. శాసనోల్లంఘన మార్గముననే స్వరాజ్యం సంపాదించుటకు సాధ్యపడ దని సర్వోత్తమరావుగారి విశ్వాసం. అహింస, సహాయనిరాకరణములు రాజకీయ సిద్ధాంతములుగ అంగీకరించరు. (Nonviolence & civil disobedience as a political creed) అహింసా సత్యములు ఉత్తమ మానవ ధర్మములనియు, ఎల్లరూ జీవి తంలో అలవరచుకొనవలసినదేననియు దైవభక్తిగల మన సర్వో త్తమరావుగారుకూడా కోరేవారు. కాని స్వరాజ్యసాధనకు బ్రిటిష్ప్రభుత్వ

ముతో ఎదుర్కొనుటకు మాత్రం ప్రయోజనకరముకాదని అహింస, సత్యాగ్రహములందు ఆయన సంశయం. అందువలననే గాంధీమహాత్ముని కార్యక్రమమంతయు ఆచరించి, ప్రబోధించిన వాడయ్యును సత్యాగ్రహ తత్వమును అంగీకరించినవాడు కాడు. శత్రువు రొమ్ము బద్దలుకొట్టినప్పుడే, పూర్ణ స్వరాజ్యమును స్థాపించుటకు సావకాశముండునుగాని, శత్రువు చెప్పినట్లు మారుమాటాడకుండా, వారి జైళ్ళలోకివెళ్లి వారు పెట్టే కష్టాలుపడి వారికి తలయొగ్గే కార్యక్రమం స్వరాజ్య సంపాదనకు మార్గముకాదని ఆయన వాదించేవారు. ఆంధ్ర కాంగ్రెసు సంఘమునకు కార్యదర్శిగావుండి, ప్రజాందోళన కార్యక్రమమునంతయు విధివిరామములేక అవిచ్ఛిన్నంగా నెరవేర్చుచుండియు, కారాగృహ కార్యక్రమమున మాత్రము పాల్గొనినవాడు కాదు.

సర్వోత్తమరావుగారి అభిప్రాయములు నిశ్చయములు. ఏ గొప్పకోసమో ఎన్నడూ తన ఆత్మవిశ్వాసమునకు వ్యతిరేకముగా వర్తించినవాడు కాదు. * 'నా విశ్వాసాలకు విరుద్ధముగా ప్రజల పొగడ్తలను నేను లక్ష్యము చేయును' అని మూచర్లలో అంటుండేవారు. ఇదియే యితరుల దురభిప్రాయాలకు కొంతవరకు కారణమైనది 1907 లో విద్యాధికుడయ్యు, జైలులో బాధలన్నీ పడగలిగిన సర్వోత్తమరావు దరిమిలా ఉద్యమాలలో కారాగృహాలకు రాకుండుట కిదియే కారణము.

ఆయన కారాగృహమునకు రాలేనని వూరకుండెనా? లేదు. ఆయన నిరంతర కర్మయోగి. ఆంధ్రోద్యమం. గ్రంథాలయోద్యమాలను చేబూని ఆజన్మాంతము విరామములేక, దేశభక్తిపూరితుడై దేశసేవ చేసినవాడు.

ఆనాటి ఆంధ్రనాయకులలో సర్వోత్తమరావు అగ్రగణ్యుడు. నాటి మేటినాయకుడు. ప్రజల నన్నివిధముల నాకర్షింపగలిగిన వ్యక్తి. వయ

* 'I don't care for public ovation as against my conviction.'

స్సులో ఆ రోజుల్లో యువకుడు. విద్యయందున ఉత్తమ విద్యావంతుడు. కులీనుడు. ఆంధ్రవీరులలో 'వందేమాతరం' శంఖారావమును పూరించిన ఆంధ్రయోధుడు. ఆనాడే ఆంగ్లేయ కారాగృహమున నేడూహింపజాలని కష్టపరంపరలకు గురియైనవాడు. త్యాగమునే వరించినవాడు. ప్రభుత్వ క్రోధాగ్ని జ్వాలలకు గురియై, సుప్రసిద్ధ దేశభక్తుడై, దేశసేవకు జీవితాన్నంకితముచేసిన మహనీయుడు. ఈ భావములు నాకు ఊహామాత్రములు కావు. 1921 లో జరిగిన కలకత్తా ప్రత్యేక కాంగ్రెసుకు మేమిరువురము కలిసి హాజరైనాము. నేను గాంధీ తత్వవాదిని. బహిష్కరణ వాదిని. శాసనసభల బహిష్కరణకు సర్వోత్తమ రావు వ్యతిరేకి. మేమిరువురము బహు స్నేహభావమున తరచు ఈ విషయములగూర్చి చర్చించుకొనే వారము. నన్ను ఆయనగాని, ఆయనను నేనుగాని మార్చజాలక పోయినను, ఒకరి సిద్ధాంతములనొకరము అర్థం చేసుకొనుటకు ఈ వాదప్రతివాదములు బాగా ఉపకరించినవి. తర్వాతదశలోగూడా మేమనేకమార్లు ఈ రాజకీయ విషయాలు చర్చించితిమి, ఈ చర్చా ఫలితములను నే నర్థం చేసుకొన్నట్లుగా నా డైరీలో వ్రాసుకొంటిని. ఆనాడు లభించిన ఆయన సిద్ధాంత పరిజ్ఞానమునుగూర్చియే నేనిప్పుడు చెప్పుచున్నాను."

ఆత్మకూరివారు సత్యాగ్రహోద్యమాలన్నిటిలో పాల్గొని జైళ్లకు వెళ్లి, అసెంబ్లీ సభ్యులైనవారు. "భారత రాజ్యాంగ చరిత్ర" ను రచించిన రాజకీయ శాస్త్రవేత్త. నేడు ఆధ్యాత్మిక చింతనతో "గోవింద రామాయ"ణాది గ్రంథములను రచిస్తున్న గ్రంథకర్త. వారికంటే నాబోంట్లు చెప్పగలిగిందేముంటుంది? హరిసర్వోత్తమరావుగారి రాజకీయ దృక్పథాన్ని స్పష్టంగా అర్థం చేసుకోజాలనివారు పరిపరివిధాలుగా భావించవచ్చు. కాని రావుగారి చిత్తశుద్ధిని, నిష్కళంక దేశభక్తిని సౌశీల్యవంతమైన ప్రజాజీవితాన్ని కాదనగల వారెవ్వరూ వుండరని నా

విశ్వాసం. ఈయనే కనుక ఉప్పుసత్యాగ్రహాది శాసనోల్లంఘనోద్యమాలలో పాల్గొన్నట్లయితే, ఆంధ్రలో వీరి నాయకత్వానికి ఎదురుండేదికాదు. ఐతే రావుగారు దేశసేవకు నిర్ణయించుకొన్న కార్యరంగం, మార్గాలు వేరైనవి. వారి జీవితంలో వచ్చిన ముఖ్యమైన మార్పును గమనించవలసివుంది.

ఆంధ్రపత్రికలో 31-3-1939 వ తేదీన "దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుగారి సంస్మరణ" విషయంలో హరి సర్వోత్తమరావుగారొక వ్యాసంవ్రాస్తూ స్వవిషయంగూడా ఇలా చెప్పుకొన్నారు :

"పూర్ణముగాను, ప్రకటితముగాను రాజకీయమైన సంస్థకు చెంది వుండటము నా జీవితపు ప్రశాంతిగతినుంచి భిన్నంగావటమే. కాని నా ఉన్నఉనికి, నన్నంగీకరించే సంస్థ వున్నప్పుడు నేను దాని నుపయోగించుకొని, నా కార్యక్రమమును ఉద్దీపింపజేయవచ్చునని చేరాను. ఖిలాఫత్ సందర్భమున హిందూ—ముస్లిమసఖ్యమూ, స్వదేశీ, దేశైక భాషగా హిందీ, దేశభాషాధారకరాష్ట్ర విభజనమూ, నా కార్యక్రమంలోనివి. జాతీయ పునర్నిర్మాణంలో, రాజకీయ సంస్కారముల కుండేస్థానము అప్రధానము. ఎందువల్లనంటారా? నేను సూచించిన కార్యక్రమంలో దేశోత్సాహము లీనమైతే, యెంతటి అతివాదియైనా కోరేసంస్కారము తప్పకుండా కలుగుతుంది........ ఇది పునాది శ్రీ నాగేశ్వరరావుగారి జీవితానికిగూడా అని నా అభిప్రాయం."

హరిసర్వోత్తమరావుగారు తీసుకొన్న వైఖరి వారు వ్రాసిన పై మాటల్లోనే స్పష్టపడుతుంది.

నిర్మాణ కార్యక్రమాల్లో నిమగ్నమైయున్నా, వివిధ దశలలో రావుగారు తన అభిప్రాయాలను స్వేచ్ఛగా ప్రకటిస్తూనే వచ్చారు. కాంగ్రెస్ మంత్రుల హయాములోగూడా ప్రజాభిప్రాయా

నికి, ప్రజాస్వామ్యవిధానాలకు భిన్నంగావున్న ప్రభుత్వవైఖరు లుంటే విమర్శిస్తూవచ్చారు. తనను ఎన్నికల సందర్భంలో అభ్యర్థిగా నిర్ణయించకపోయినా, ఉపేక్షాభావం వహించి, కాంగ్రెస్‌తో సహకరించారుగాని, అసంతృప్తి చెంది కాంగ్రెస్‌కు, నాయకత్వానికి ఎదురొడ్డినిలుచున్న ఉదాహరణలు రావుగారి జీవితంలో కానరావు. గయాకాంగ్రెస్ తర్వాతగాంధీజీ, దేశబంధు చిత్తరంజన్‌దాస్‌ల విరుద్ధధోరణులను, సహకారభావాన్ని గూర్చి చెపుతూ ఒక రేడియోప్రసంగంలో రావుగారిలా చెప్పారు:

"దేశభక్తుడు ఎంతటివాడైనను ఒక ధర్మమును అనుసరింపక తప్పదు. తాను నాయకత్వము వహించుటకు వీలులేనప్పుడు, నాయకత్వం వహించినవారికి తమశాయశక్తుల తోడ్పడుట పురోగమనానికి అత్యవసరం"

ఇది ఒకవిధంగాచూస్తే చాల ఉత్తమధర్మంగా కనుపిస్తుంది. మరొకవైపుచూస్తే రాజకీయనాయకత్వ లక్షణానికి యిదే ప్రబల బలహీనత యేమోననిపిస్తుంది. పోటీల్లో రంగంలో నిలుచున్నవారే రాజకీయనాయకులు కాగల్గుతున్నారు కాని రాజకీయ నాయకత్వ పోటీల్లో రావుగారెన్నడూ ముందుండి, సంఘర్షణపడి పోరాడిన ఉదంతం కనుపించదు. బహుశా రావుగారు దీన్నే చివరిదాకా అనుసరించారేమోననిపిస్తుంది. లేకుంటే వారిరాజకీయ జీవితపరిణామక్రమం మరోవిధంగావుండేదేమో!

మరొక ముఖ్యవిషయాన్నిగూడా యిచ్చట గమనించవలసివుంది. ఆనాటిచర్చలు ప్రధానంగా సిద్ధాంతరీత్యాను, ఏ కార్యక్రమం ఎలా అనుసరించాలనే దానిపైనను కేంద్రీకృతమై యుండేవి. "అధినివేశప్రతిపత్తియా? పూర్ణస్వరాజ్యమా?" అనేది

ప్రారంభదినాల్లో పెద్దచర్చనీయాంశమైనది. తదుపరి "శాసనసభా ప్రవేశమా? శాసనోల్లంఘనమా?" అనిమరి కొన్నాళ్లు ప్రాధాన్యం వహించినది. "బ్రిటిష్‌ప్రభుత్వం ప్రవేశపెట్టిన నూతన రాజ్యాంగ సంస్కరణలను అంగీకరించాలా? ప్రతిఘటించాలా? మంత్రిత్వాలు స్వీకరించాలా? వద్దా?" ఈ విధమైన కార్యవిధానముల మీద అభిప్రాయభేదాలు వచ్చేవి. సంస్థాగతంగా నిర్మాణంలో వ్యక్తులమధ్య సంఘర్షణ రాకపోలేదు. ఎట్టి భేదాభిప్రాయాలు వచ్చినా కొంతసమన్వయదృష్టి నాయకత్వానికుండేదని తోస్తుంది. ఒండొరులమధ్య గౌరవభావం లోపించేదిగాదు. చర్చలు సామరస్యపూరితంగా వుండేవి. విభేదాలేర్పడినా, సుహృద్భావంతో మరలకలిసి సమైక్యతకు కృషిచేసేవారు. అట్టి సమరసభావం, సమన్వయదృష్టి, గౌరవాభిమానాలు తర్వాతఘట్టాల్లో లోపించినవని స్పష్టపడుతుంది. సిద్ధాంత కార్యక్రమచర్చలుపోయి, వ్యక్తిగత స్వార్థపాక్షిక కక్షలు నాయకత్వంలో పెరిగిపోసాగినవి.

కాకినాడ కాంగ్రెస్ తదుపరి అఖిలభారతకాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన ఆంధ్రరత్న తనమనోవ్యధను పత్రికా విలేఖరులకు వెలువరించిన ఉదంతాన్ని మరువలేము.

"నాబోంట్లకింకను కాంగ్రెస్‌లో స్థానమున్నట్లుతోచదు. అనేక సంవత్సరములనుండి ఆచారముగ వచ్చుచున్న కాంగ్రెస్ కార్యదర్శిత్వము నాకుండకుండా చేసిన ఆంధ్రనాయకుల కుతంత్రములను నేను ఖండించుటలేదు.....

...... నాబోటి వానిని రంగస్థలమునకు లాగుటకు తగిన పరిస్థితులు దేశమం దింకను లేదని తోచును. బహుశః ఏ దూరస్థ దేశము నుండియో ఎవ్వరైన ఏ వుద్యమమునైన ప్రారంభించువరకు అట్టిస్థితి సంక్రమించదు కాబోలును."

ఆంధ్రదేశ రాజకీయోద్యమాలకు అంకురార్పణ చేసిన హరిసర్వోత్తమరావుగారిని మన జాతీయనాయకులు విస్మరించి యుండవలసినదిగాదు. నదీ ప్రవాహములకు వచ్చే ప్రతిఘటన లనుబట్టి దాని గమనం ఉంటుంది. ఒకచోట సన్నంగా, వుర వడిగా, మరొకచోట అతి విశాలంగా, కొండ మొఖిరలు అడ్డు కొన్నప్పుడు మరో విధంగా దాని ప్రవాహగమనం వుండటం చూస్తున్నాము. అలానే మానవ జీవిత ప్రయాణంగూడా నని పిస్తుంది. ఒక్కొక్క వ్యక్తిలోని ప్రత్యేకతనుబట్టి, అతని నెదు ర్కొనే అవరోధాలు, వచ్చే అవకాశాలనుబట్టి, అతని జీవిత విధానం నిర్ణయమవుతూ వుంటుంది. అందుకు తన చుట్టూవున్న పరిసరాలు, పరిస్థితుల ప్రభావం చాలావరకు కారణభూత మవు తుంది.

కారణాలు వేరవుతున్నప్పటికీ హరిసర్వోత్తమరావుగారి జీవితగమనంలోగూడా ఈ 'మలుపులు' కనిపిస్తాయి. మొదట్లో ఉన్నత విద్యనభ్యసించి విద్యావంతుడుగాను, భాషావేత్తగాను గణుతి కెక్కారు (1900-1906). తర్వాత ప్రజ్వరిల్లిన రాజకీయో ద్యమాల్లో తలమునకలుగా దిగి, ప్రయాణం చేశారు. (1907-1926) కొద్దికాలంపాటు పార్లమెంటరీ వేత్తగా రాణించారు (1926-30). దరిమిలా 1935 నుండి గ్రంథాలయోద్యమం, ఆంధ్రోద్యమాలలో పాల్గొని, నిర్మాణ కార్యక్రమాలకే జీవితాన్నంకితం చేశారు.

రావుగారితో కలిసి రాజకీయరంగంలో పనిచేసిన కొందరు పెద్దలకుగూడా కొన్ని ముఖ్య సందర్భాలు అంతగా తెలియనట్లు కనిపిసుంది. 1920 నుంచి గాంధీ ఉద్యమం. కాంగ్రెస్ నచ్చ లేదని ...ందుచేరలేదంటూరు. కాని హరిసర్వోత్తమరావుగారు

1934వ సంవత్సరమువరకు గూడా ఎ. ఐ. సి. సి. మెంబరుగా వుండేనారనీ, ఆ యేటి పాట్నా మహాసభకు హాజరైనారని వారు దాచివుంచిన ఏ. ఐ. సి. సి. సభ్యత్వ కార్డునుబట్టే రూఢి అవుతున్నది. రాజకీయాభిప్రాయ భేదాలున్నా, కాంగ్రెస్ సంస్థలోనే వుండేవారు.

కొందరు రావుగారికి గాంధీయిజమే నచ్చలేదనీ, బెంగాలు నుంచి టెర్రరిస్టు విప్లవకారులు వస్తూ వీరితో సంబంధం పెట్టుకొన్నారనీ చెపుతారు. కాని గాంధీజీ నిర్దేశించిన శాసనసభా బహిష్కారము, శాసనోల్లంఘన, సత్యాగ్రహోద్యమాలుమాత్రమే రావుగారి నాకర్షించలేదు. గాంధీజీయొక్క 'సత్యాహింసలు' మానవ జీవిత ధర్మానికి అత్యుత్తమమైనవని రావుగారి ప్రగాఢ విశ్వాసం. ఇదే మొదటినుంచీ చివరవరకు వారిరచనల్లో ప్రస్ఫుటంగా కనుపిస్తుంది. టెర్రరిస్టు యువకుల ఉత్సాహమును, త్యాగాలను అభినందించారుగాని, అవి స్వరాజ్యసాధనకు మార్గమని వాటిననుసరించినట్లు ఎక్కడా కనుపించదు.

1934-35 ఆంధ్ర స్వరాజ్య పార్టీ పునరుద్ధరణ సందర్భంలో కాంగ్రెస్‌లోనే ఉండిపోయినారు. 'గోష్ఠి' సుబ్బారావుగారు మా సంభాషణ సమయంలో "మాతో కలసివచ్చిన వెంకటపతిరాజుగారు పీపుల్సు పార్టీలో చేరటం, హరిసర్వోత్తమ రావుగారు కాంగ్రెసులోనే వుండిపోవటంతో, తర్వాత నేనొక్కడనే ఆంధ్రలో స్వరాజ్యపార్టీకిమిగిలాను" అన్నారు. దీనినిబట్టి తర్వాత దశలోగూడా రావుగారు కాంగ్రెసునువీడి, మరొకపార్టీలో చేరినట్లు ఎక్కడా కానరాదు. 1940-42 సంవత్సరాల్లో గూడా గాంధీజీకి జాబులు వ్రాస్తూ, తన అభిప్రాయాలను స్పష్టంగా విశదీకరించారు.

అప్పటికి రావుగారు మద్రాసు సిటీమండల కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడుగా వుండేవారు. "మీరు నిర్ణయించినట్లయితే సత్యాగ్రహంలో పాల్గొనుటకు సంసిద్ధుడనే. కాని రెండునెలలు టైము యివ్వండి. ఈలోగా నేను పెట్టుకొన్న బాధ్యతలను, నా రచనా వ్యాసంగాలను పూర్తిచేసి, అందు పాల్గొంటాను" అని గాంధీ గారికి తెలియజేశారు. దానికి ప్రస్తుతం పాల్గొనవద్దని గాంధీజీ సలహాతో అమృతకౌర్ సమాధానం వ్రాశారు.

ఆహ్వానించిన అన్ని ప్రజాసంఘాల మహాసభలకు ఎవరు పిలిచినా సేవాతత్పరతతో వెళ్ళడం రావుగారికిసహజగుణమైనది. ఒకసారి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గసమావేశం బెజవాడలో 'ఆంధ్రరత్నభవనం'లో జరుగుతున్నదట. అప్పట్లో అధ్యక్షుడైన రంగాగారిలాఅన్నారనిడా॥ టి.వి.యస్. చలపతిరావుగారుచెప్పారు. "హరిసర్వోత్తమరావుగారు విప్లవకర జాతీయవాది. మనం ఆయనను సరిగా అర్థంచేసుకోకుండా చిన్నచూపుచూస్తే ఆయన కమ్యూనిష్టు ప్రచారసభలకు పోయ్యేస్థితి వస్తున్నది. వారికి చేతి నిండా పనిచూపించడం మనవిధి. లేకుంటే కాంగ్రెస్ ఉద్యమానికే నష్టం కలుగజేసికొన్న వారమవుతాము. అందుచేతనే గాబోలు రంగాగారు"మునిసిపల్ ఎంక్వయరీకమిటీచైర్మన్‌గా" రావుగారిని నిర్ణయించి, రాష్ట్రమంతటా పర్యటించే ఏర్పాట్లు చేశారు. తర్వాత "కాంగ్రెస్ శాంతిసేన" కు శిక్షణ నిచ్చుటకు ఏర్పాటుచేసిన ఉపసంఘమునకు రావుగారిని కన్వీనరుగా నియమించారు. ఒక్క ఎన్నికల సందర్భంలోతప్ప కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమాల్లోను, ప్రచార సభల్లోను రావుగారి సేవలను బాగా పొందుతునే వచ్చారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘమువారిచే నియమించబడిన ఆర్థికోపసంఘంలో హరిసర్వోత్తమరావుగారొక ముఖ్యులు. ఈ ఆర్థికోపసంఘం 1939 నవంబరు 23 వ తేదీన అనంతపురం బ్రాంచి ఆంధ్ర కాంగ్రెసు సంఘ భవనములో సమావేశమైనది. ఈ ఉపసంఘమునకు అధ్యక్షులుగా రావుగారిని ఎన్నుకొని, "ఇకముందు సర్వకార్యకలాపములను జరుపుటకు, నివేదికను వ్రాయుటకు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారికి అధికార మీయడమైనది" అనే తీర్మానం చేశారు. ఆ సమావేశమునకు నీలం సంజీవరెడ్డి, యమ్. భీమసేనరావు, కల్లూరి సుబ్బారావుగార్లు కూడా హాజరైనారు. రాయలసీమ ఆర్థికాభ్యుదయమును గురించి గృహపరిశ్రమలు, ఫ్యాక్టరీ పరిశ్రమలు, పంటనీటి వసతులు, తోటపంటలు, క్షీరపరిశ్రమ, వ్యవసాయమునకు సంబంధించిన తదితర పరిశ్రమలు, వ్యవసాయ వ్యాపారమునకు సంబంధించిన అభివృద్ధి విషయాలు, సహకారము, బ్యాంకింగు మొదలగు సమస్య లనుగూర్చి సలహాలు వ్రాతపూర్వకంగా తెప్పించి, సమగ్ర నివేదికను సిద్ధంచేయుటకు హరిసర్వోత్తమరావుగారి కధికారమిస్తూ తీర్మానం గావించారు.

ఈ విధంగా 'శాంతిసేన', ఆర్థికాభ్యుదయ సంఘం, మునిసిపల్ ఎంక్వయరీకమిటీ, కాంగ్రెస్‌రాజకీయ పాఠశాలలనిర్వహణ, తదితర అనేక కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమములందు రావుగారు ప్రధానకృషి చేస్తూనే వచ్చారు. అందుచేత "ఆ తర్వాత గాంధీ ఉద్యమంతో ఈయనకు సంబంధం లేకపోయింది" అనే అభిప్రాయాలు చాలా సత్యదూరమైనవని స్పష్టపడుతున్నది.

ఇక్కడే మరొక ప్రధాన విషయంగూడా పేర్కొనుట అవసరమని తలుస్తాను. రాష్ట్ర కాంగ్రెస్ అధికార పెద్దలకు రావుగారిపై కొంత 'ఈర్ష్య' వున్నట్లు కనుపిస్తుంది. వారు వ్రాసిన కాంగ్రెస్ చరిత్ర, ఆంధ్రోద్యమ భాగాలలో సర్వోత్తమరావుగారి ప్రసక్తి అంతగా కానరాదు. భిన్నదృక్పథాలున్నంత మాత్రాన యథార్థ చరిత్రనే చెరిపివేయ జూడటం క్షంతవ్యం కాదుగదా!

గత చారిత్రక విశేషాలు సరిగా తెలియనందున సాధారణంగా తర్వాత తరంవారికి, హరిసర్వోత్తమరావుగారు గ్రంథాలయోద్యమ, వయోజనవిద్యా ప్రబోధకులుగా మాత్రమే కనుపించటంలో ఆశ్చర్యంలేదు. ఐతే ముప్పదేండ్లు ఆంధ్రదేశ రాజకీయ ఉద్యమాలతో విడదీయరాని సంబంధమున్న రావుగారి కృషిని మరుగుపరచటం ఎంతపెద్దనాయకులకైనా సాధ్యమయ్యే సంగతికాదు. ఒక వ్యక్తియొక్క యోగ్యతాయోగ్యతలు, గుర్తించడానికి ముఖ్యంగా సౌజన్యం, సౌహార్ద్రత అవసరమవుతాయి. ఇవిలోపిస్తే చరిత్రకే వక్రభాష్యాలు చేయడానికి, వ్రాయటానికి పెద్దలుగూడా సాహసిస్తారేమో ననిపిస్తుంది.

రాజకీయాలేరావుగారి జీవితసర్వస్వంకాదు. ఆయన బహుముఖకృషిలో అదొకభాగంమాత్రమే. గాంధీజీ అట్టడుగునవున్న హరిజనసోదరుడు భారతరిపబ్లిక్ అధ్యక్షుడైతే తానెంతో సంతోషిస్తానన్నారు. హరిసర్వోత్తమరావుగారు అట్టడుగునవున్న సామాన్యమానవుడు విజ్ఞానవంతుడుగావాలని మనసార వాంఛించారు. అందుకై నిరంతరం ప్రయత్నాలు కొనసాగించారు. వారి కృషి పాక్షికరాజకీయాలకు పరిమితంకాలేదు.

రావుగారిధ్యేయం ఎంతవరకు నెరవేరింది? తాము తల పెట్టిన ప్రయత్నాలలో ఎంతవరకు సఫలీకృతులైనారు? అని పరిశీలి స్తే రావుగారిలాంటి దేశభక్తులుచేసిన ఎనలేనిత్యాగాల ఫలితంగానే దేశానికి స్వరాజ్యం సంప్రాప్తమైనదని చెప్పవచ్చు. ఆంధ్రోద్యమం చాటిన భాషాధారక రాష్ట్రవాంఛ ఫలించింది. స్వరాష్ట్రమేర్పడింది. "ముక్కోటిఆంధ్రులం ఒక్కటైయుంటే నా జీవితం ధన్యమైనట్లే" అనిరావుగారు చెప్పినపలుకులు సత్యమై ఆంధ్ర–తెలంగాణములు సంలీనమై "ఆంధ్రప్రదేశ్" అవతరించింది. ఇవన్నీ కళ్ళారాచూచుకోగలిగిన అదృష్టవంతు డాయన.

కాని మరొక బాధాకరదృశ్యంగూడా ఆయన చూడక పోలేదు. తన అవసానదశలో గాంధీజీ "ఢిల్లీలో నా మాట వినేవారెవరు?" (who will hear me?) అని నిస్పృహాజని తంగా అన్నట్లు మన ప్రజాస్వామ్య పరిపాలనావిధానంలోని మంచి చెడుగులను, రాజకీయ సాంఘికపరిస్థితుల అస్తవ్యస్త ములను చూచి రావుగారు మానసికవ్యధ చెందకపోలేదు.

రావుగారిజీవితంలో ఆయనకు నిండుసంతోషమివ్వగలిగిన కాలమేది? అనిచూస్తే రెండు ప్రధానదశలు కనుపిస్తాయి. మద్రాసు కౌన్సిలుసభ్యత్వం, సెనేట్ సభ్యత్వం వహించిన మూడేండ్ల కాలం ఒకటి 1950 నుండి 1955 వరకు ఆ అయిదారేం డ్లలోను, అనేక అఖిలభారతవిద్యాగోష్ఠులలో, సాంఘికవిద్య, వయోజనవిద్యా మహాసభలలోను పాల్గొన్నకాలం మరొకముఖ్య దశగా పరిగణించవచ్చును ఈ కాలంలోనే ఆంధ్రదేశంలో రావుగారి షష్టిపూర్తిఉత్సవాలు, శ్రీసర్వోత్తమభవననిర్మాణం

మున్నగునవి జరిగినవి. అప్పట్లోగూడా దారిద్ర్యబాధలున్నా చిరకాలంగా తాముచేసిన సేవాఫలితంగా అఖిలభారతస్థాయిలో వచ్చిన గుర్తింపును, ఆంధ్రదేశంలోవచ్చిన ఆదరపూర్వక అభిమాన గౌరవాలనుచూచి,సర్వోత్తముని మనస్సు ఎంతగానో సంతసించి వుంటుందనుకొంటాను. "ప్రజలను ముందు మేల్కొల్పాలి"* అన్నారు స్వామివివేకానంద. ప్రజల్లో విజ్ఞానవ్యాప్తి కలిగించడమే ముఖ్య కార్యక్రమంగా రావుగారు స్వీకరించారు. దీనికి గ్రంథాలయ, వయోజనవిద్యలను సాధనంగా చేసుకొన్నారు. అనేకరీతుల రచనలు సాగించారు. పత్రికలు స్థాపించారు. రేడియో ప్రసంగాలిచ్చారు. అసంఖ్యాక వేసంగిపాఠశాలలను నిర్వహించారు.

అట్టడుగునవున్న సామాన్యప్రజలకు సరియైన శిక్షణనిచ్చి మంచిపౌరులుగా తరిబీదు చేయగలిగితే, మిగతాపనులన్నీ సులభతరమవుతవని విశ్వసించి పనిచేశారు. ఇందుకై మరణశయ్యపైగూడా పరితపించారు. "శిక్షణలేని మానవుడు, శిక్షణలేనిజాతి, స్వాతంత్ర్యంపడసి వర్ధిల్లజాలదు" అని పలుమార్లు వ్రాసి ప్రబోధించారు. స్వరాజ్యంకాని, స్వరాష్ట్రంకాని ఆయన దృష్టిలో కేవలం ఏస్వల్ప పరిపాలనాసంస్కరణల కోసమో గాదు. సామాన్యప్రజానీకం చైతన్యవంతులు గాకుంటే ప్రజాస్వామ్యం కలకాలం మనజాలదని రావుగారి విశ్వాసం. సామాన్య మానవునికి చదువేలేకుంటే ఇక విజ్ఞానమెక్కడసిద్ధిస్తుంది, అందుకనే వయోజనులను చదువరులను చేయటానికి ప్రధానంగా పాటుపడ్డారు.

---

* "The Masses must be awakened first"

ఏకొలదిమందినో తృప్తిపరచడానికిగాదు రావుగారు కృషి చేసింది, త్యాగంచేసిందీను. ప్రజానీకాన్ని విజ్ఞానవంతులను చేయ డానికి అహర్నిశలు కృషిచేశారు. ఆచైతన్యస్రవంతిని ఆగి పోకుండా కొనసాగించటానికి, నిస్స్వార్థ సంఘసేవాపరాయణులు పూనుకోవలసివుంది. అప్పుడే వారి కృషిఫలితాలను సద్వి నియోగం చేసుకొన్నవారమవుతాము.

వారు చేబట్టినకార్యక్రమం, రావుగారు పనిచేసిన సంస్థల విషయం వారి మరణానంతరం ఏమైనదో పరిశీలిద్దాం. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు 1934 నుండి అధ్యక్షులుగానుండి సార్వజనిక గ్రంథాలయాభివృద్ధికి వారు కృషిజేశారు. అన్నిపను లలోను అదొకపనిగా గాకుండా, గ్రంథాలయసంఘం పనుల మీదనే పాతూరి నాగభూషణంగారిలాంటి గ్రంథాలయసేవకులు కేంద్రీకరించుటవల్ల నేడు కేంద్రస్థానంగా "శ్రీ సర్వోత్తమ భవనం" అనేది ఏర్పడింది. దీనికనుబంధంగా మాసపత్రిక, ప్రచురణాలయం, ముద్రణాలయము మున్నగునవి అమరినవి. గ్రంథాలయ సాంఘికసేవకులకు యిది కొంతవరకు కూడలి స్థానంగా, సజీవ సంస్థగావుంది.

1938 నుండి బాగాపనిచేసిన దక్షిణభారత వయోజనవిద్యా సంఘానికి నేడు నామరూపాలు లేకుండాపోవటం విచారకర విషయం. రిటైర్డుజడ్జిగావుండి రావుగారితోపాటిసంఘానికి ఉపా ధ్యక్షుడుగావుండి కృషిచేసిన కె. యస్. రామస్వామిశాస్త్రి గారు 85 ఏండ్ల వృద్ధుడై పోయినారు. రోజువారీ పనులన్నీ అత్యుత్సాహంగాచేసిన ఆర్గనైజింగుకార్యదర్శి టి. జె. ఆర్. గోపాల్ చనిపోయినారు. వయోజనవిద్యా ఆఫీసరుగా వుండిపని

చేసిన విల్వరాయి గతించారు. గతంలో కాంగ్రెస్ ప్రభుత్వాలు, ప్రజల సహాయానికితోడుగ గ్రాంట్లుయిచ్చినవి. ప్రస్తుతమవి మాని వేశారు. నేడాపత్రికను నడిపే నాథుడేలేడు. సంస్థయూలేదు.

ఇలానే స్వరాష్ట్రం వచ్చిన తర్వాత ఆంధ్ర మహాసభ యొక్క కర్తవ్యం తీరిపోయినట్లే భావించారు. ఆంధ్ర - తెలంగాణాల సంలీన సందర్భంలో రాష్ట్ర ప్రభుత్వాధి నేతలు, రాజకీయ నాయకులే ముఖ్యపాత్ర వహించారు. అప్పటినుంచీ ఆంధ్ర మహాసభ నామమాత్రావశిష్టమైపోయిం దనవచ్చు. రాష్ట్రేతరాంధ్రుల శ్రేయస్సుకోసం పనిచేసిన 'సరిహద్దు ఆంధ్ర సంఘం' పూర్తిగా కుంటుపడిపోయింది. ఈ విధంగానే రాష్ట్ర నిర్మాణ కార్యకర్తల సంఘం కూడా అయింది.

ఇందులో ఒక ముఖ్య సమస్య ఇమిడివుంది. ఆయా సంస్థల మనుగడకుతగిన భౌతికపరిస్థితులు లేకనా? కాక అందుండి పనిచేసిన ప్రధాన వ్యక్తులు పూనుకోకనా ? అని పరిశీలిస్తే నేటికీ వాటి అవసరం మాత్రం తీరిపోలేదని స్పష్టపడుతుంది. నూటికి 22 శాతం మాత్రమే అక్షరాస్యులున్న మన రాష్ట్రంలో వయోజనవిద్యావశ్యకత తీరిపోయినట్లేనా? రాష్ట్రేతరాంధ్రులలో సమైక్యతను పెంపొందించుటకు సరిహద్దు సంఘావసరం తీరిపోయినట్లేనా? ఇక ఆంధ్రమహాసభకర్తవ్యం చూద్దాం. మన చుట్టూవున్నా రాష్ట్రసరిహద్దుసమస్యల నిర్ణయాల్లో జరిగిన అన్యాయాలను ప్రభుత్వదృష్టికి తేవలసిన ఆవశ్యకతలేదా? రాజకీయపక్షాలకు అతీతంగా వివిధ సాంఘిక, సాంస్కృతిక సేవా సంస్థలపనిని సమన్వయంచేసి యావదాంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి కృషిచేయుటవసరమనిగదా మనమింతవరకూ

చెపుతూవచ్చింది. ఇప్పుడీపనులు పూర్తిగా కుంటుపడిపోవటానికి కారణాలేమిటి?

ఇక్కడే హరిసర్వోత్తమరావుగారు నిర్వహించినపాత్ర, వారి వ్యక్తిత్వవిశిష్టత, నిరంతరకృషి స్పష్టపడుతుంది. ఒక నిర్దిష్ట కార్యక్రమమును నిర్ణయించుకొని, అందు శ్రద్ధగలిగిన నలుగురుకలసి ఆహ్వానిస్తే, రావుగారువాటిని కొనసాగిస్తూ వచ్చారు. వారి అండదండలు ఆయామహాసభలస్థాయిని, కార్యకర్తలలో ఉత్సాహాన్ని పెంచేది. వారి ప్రత్యామ్నాయంగా నేడు మరొకరాబాధ్యతలు స్వీకరించటం కష్టసాధ్యమైనపనే. కాని వారు నిర్దేశించిన మార్గాలననుసరించి, వారు వదలిపెట్టిపోయిన పనులను వివిధరంగాల్లో యథాశక్తి కొనసాగించవలసినవిధి వారి అనుయాయులది,అభిమానులది. రావుగారి అముద్రితవ్యాసాలను, గ్రంథాలను, రేడియోప్రసంగాలను, గ్రంథసమీక్షలను ఏరికూర్చి సంపుటాలుగా పుస్తకరూపంలో తేవటం తక్షణకర్తవ్యం.

సమాజంలో విద్యావేత్తలు, శక్తిసామర్థ్యాలున్నవారు, మహామేధావులు, శాస్త్రకారులు కొందరు లేకపోలేదు. కాని హృదయమున్న విజ్ఞానవంతులు అరుదు. ప్రజలబాధలను తమబాధలుగా చూచుకొనేవారు బహుకొద్దిమంది. దేశాభిమానము, ప్రజాశ్రేయోభిలాష కొరవడితే ఎంత గొప్ప వాళ్ళయినా, వాళ్ళ విద్యావిజ్ఞానాలు నిరర్థకమే. హరిసర్వోత్తమరావుగారు బీదలపై కరుణార్ద్ర హృదయం గలవారు. దేశసేవలో లీనమైనవారు. ప్రజాసేవకే జీవితాన్నంకితంచేసినవారు. "మనది అని ఒక్కటిని తలంపకూడదు-పదిమందికోసరము బ్రతికినబ్రతుకే బ్రతుకు" అన్నవిరాగి. ఇంతకంటే వేదాంతం, సహకారతత్వం, సోషలిజం ఏ మున్నది?

వారిత్యాగం మనకాదర్శం. వారి నిరాడంబర జీవిత విధానం ప్రతి ప్రజాసేవకుడు అనుసరించదగినది. "దీపపువత్తి క్రమేణా హరించిపోతూ, చుట్టూ వెలుగునిచ్చునట్లు" రావుగారు అనేక కష్టాలుపడుతూ, ఇతరుల సౌఖ్యంకోసం పనిచేశారు. ఏబదేండ్ల దేశసేవలో పండిన ధన్యజీవితం వారిది. అందుకే ఆయన అమరజీవి. హరిసర్వోత్తముని ఆత్మను ఆవరించిన దేహం నశించిపోయినా ఆయన పరిశుద్ధాత్మ ఎన్నటికీ నశించదు. సర్వోత్తమనామం చిరస్థాయిగా నిలిచివుంటుంది.

ఆయన దౌర్జన్య ప్రవృత్తులను హేయంగా చూచారు. శాంతియుత సామరస్యపద్ధతులతోనే సమస్యలు పరిష్కరించుకోవాలన్నారు. వారుకోరిన పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని "కంటికి రెప్పగా" పరిరక్షించుకోవాలి. రాజ్యాంగ యంత్రంలోని అవినీతిని తొలగించుకోవాలి. సామాజిక విధానంలో ఉత్తమనీతి ధర్మాలను పునరుద్ధరించుకోవాలి. వ్యక్తిగతప్రవర్తన, నడవడికల్లో శీలసంపదలను పెంపొందించుకోవాలి. అప్పుడే సర్వోత్తముని ఆత్మకు శాంతిచేకూరుతుంది. ఆనాడే దేశం సుభిక్షంగా వుంటుంది. సర్వులకు సుఖశాంతులు లభిస్తవి. ఆయన పవిత్ర ప్రజాహితజీవితం అందరికీ ఆదర్శంకావాలి. సర్వోత్తముని స్మరిస్తూ వారి మహత్తరాల సందేశాలను అనుసరిస్తూ. ముందుకు సాగిననాడు దేశంలో ఆదర్శ ప్రజారాజ్యం నెలకొంటుంది.

అవటపల్లి నారాయణరావుగారు 1940 లో "విశాలాంధ్రము" అను గ్రంథం వ్రాసి ప్రచురించారు. అందు ఆంధ్రాభ్యున్నతికై కృషిచేసిన, చేస్తున్న ఆంధ్రప్రముఖుల జీవితచరిత్రలను ఒకచోట చేర్చారు. గ్రంథకర్త 'పీఠికలో' పేర్కొన్నట్లు

అది "తారీఖులకున్నూ, జీవిత వివరాలకున్నూ సంబంధించిన జీవిత చరిత్రల పుస్తకం కాదు". ప్రముఖుల దేశహితైక జీవనాన్ని వివరించడానికిన్నీ, వారి చిత్తరువును గీయడానికిన్నీ ప్రయత్నం చేయబడింది.

ఆ "విశాలాంధ్రము"లో వారు హరిసర్వోత్తమరావుగారి చరిత్రను క్లుప్తంగా యిట్లు విశదీకరించినారు:

"హరిసర్వోత్తమరావుగారు రాజమంద్రి బోధనాభ్యసన కళాశాలలో విద్యార్థిగా వుండిన రోజులవి. బిపిన్ చంద్రపాల్‌రాక, రాజమంద్రి విద్యార్థులపై హంటరు థాక, విద్యార్థులసమ్మె, కళాశాల నిర్గమనము, క్షత్రియ మహాజన ప్రబోధము, ఆంధ్ర దేశమున యువక నాయకత్వము, స్వరాజ్ ప్రకటన, కారాగార జీవితము – అన్నీ ఆయనవే.

1906 వ సంవత్సరం నుంచి 1930 వరకు జరిగిన ఆంధ్ర చరిత్రలో హరిసర్వోత్తమరావు అంతర్యామి. 12 తెలుగు జిల్లాలలోను అధమం ఎనిమిదింటనైనా అతడు పల్లెపల్లెనా తిరిగి, వందేమాతర యుగం, ఆంధ్రోద్యమ యుగం, హోంరూలు యుగం, సత్యాగ్రహ యుగం, ఎన్నికల యుగం – అన్నిటా ప్రబోధం కల్పించాడు.

రాజకీయ విషయాలలో అతడు చేసిన సేవ అపారము. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘానికి సంవత్సరముల తరబడి అతడు సంయుక్త కార్యదర్శి. హోమ్‌రూలులీగుకు ఆంధ్రరాష్ట్ర కార్యదర్శి. అఖిల భారత కాంగ్రెస్ సంఘంలో సంవత్సరాల తరబడి సభ్యుడు. మొదటి సత్యాగ్రహ రాజధాని సభకు సంయుక్త కార్యదర్శి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు మహా సమావేశము మద్రాసులో జరిగినప్పుడు అధ్యక్షుడు. ఆంధ్ర మహా సభకు అనంతపురంలో అధ్యక్షుడు. ఖరగ్పురంలో జరిగిన రాష్ట్రేతరాంధ్ర మహాసభాధ్యక్షుడు. బొంబాయి ఆంధ్రమహా సమావేశాని కధిపతి. కాకినాడలో కాంగ్రెసు జరిగినప్పుడు కార్యవర్గంలో ఉన్నవాడు.

మాతృభాషను నిరర్గళంగా ఉపన్యాస వేదికపై ఉపయోగించి విను వారల నుత్తూతలూపడంలో అప్రతిమాన ప్రసిద్ధిచెందిన వక్తలలో సర్వోత్తములా వొకడు. మాతృభాషయందతని దెంత పటిమగలవాక్కో, ఇంగ్లీషులోనూ అంతే పటిమగలది. తమిళము, కన్నడములలోనూ నిరాఘాటోపన్యాస ధోరణి కలదు.

సారస్వతము అతనిని వలచింది. విజ్ఞాన చంద్రిక ప్రథమ సంపాదకులు. ప్రథమ గ్రంధకర్త. విజ్ఞాన సర్వస్వానికి తోడుతండ్రి. ప్రపంచ చరిత్రకు పాదుచేసినాడు. కృష్ణదేవరాయలను సాహిత్య చక్రవర్తిగా లోకానికి ప్రసాదించిన విమర్శ పటిష్ఠుడు. బహుగ్రంథ నిర్మాత. ఆంధ్ర జాతీయవిద్య కాదిమాహుతి. ఆంధ్ర జాతీయ విద్యాపరిషత్తుకు మొదటి కార్యకర్త. జాతీయ విద్యా ప్రణాళిక నిర్మాణ సంఘాధ్యక్షుడు.

బీదలనినా, మహాజనమనినా అతని కారాధనీయ మూర్తులు. చెన్న పట్టణంలో ఉండగా '18 యేండ్ల క్రిందట' పాకీపనివారి సంఘానికీ, అచ్చుపనివారి సంఘానికీ అధ్యక్షుడుగావుండి అతడు కావించిన దీక్షా బద్ధమైన సేవను నేటికీ వారు స్మరించుకొని ఆనందిస్తున్నారు. కర్నూలు జిల్లా ప్రతినిధిగా శాసనసభ యందున్న కాలంలో అతడు రైతు బిడ్డలతో పల్లెలూ, చేలూ, అడవులూ అన్నీ తిరిగి వారి కొరకు చేసిన కృషి, అప్పటి అధికారులకు కలిగించిన సత్యభీతి ఆ జిల్లాల రైతులు-ముఖ్యంగా బీద తాలూకాలవారు ఎన్నటికీ మరచునట్లులేదు. ఆరోగ్య వారాలు, కలరా నివారణ కార్యక్రమం, రామదండు, అఖిల భారత హిందూస్థానీ సేవాదళం, కో ఆపరేటివ్ ఉద్యమం, పంచాయతీ ఉద్యమం, గ్రంథాలయోద్యమం, దేశీయ వైద్య పునర్నిర్మాణం మున్నగు అన్ని ఉద్యమాలు అతని సేవను పొందినాయి.........

ఇప్పటికి ముప్పయియేండ్లు కావచ్చినాయి. రెండేండ్లు విజ్ఞాన చంద్రికలో, మూడేండ్లు ఆంధ్ర దిన పత్రిక ప్రథమ సంపాదకుడుగా, ఏడాది విజ్ఞాన సర్వస్వంలో, ఏడాది స్వరాజ్యపార్టీలో, ఏడాది గ్రామ పంచాయతీ సంపాదకుడుగా ఏకొద్ది ఉపకారభృతి పొందినాడోగాని తక్కిన

జీవితమంతా స్వయం కృషిచే 'దినబత్తెము'ను సంపాదించుకొని గడుపుతూ, కష్టాలను, నష్టాలనూ భరిస్తున్న గాఢాభిమాని యీ సర్వోత్తముడు.

అతడు ఖండితవాది. ఎంతటివారినీ లక్ష్యపెట్టని తలబిరుసువాడని కొంద రంటారు. కాని గాంధీయంతటి వాని నాక్షేపించి 'ది బ్రేవ్ హరి సర్వోత్తమరావ్' అని ఆయనచేత వ్యాఖ్యానం వ్రాయించుకొన్నవాడు. ఇతరు లడ్డుపడి రచ్చచేయుచోటు నుండి లేచిపోవడం అతని గుణము. తన లాభనష్టముల గణన అతని కంతగాలేదు. ఈ రెండు సందర్భాలూ అతనిని ప్రజాహిత జీవనపు మహా ప్రవాహం నుండి ఒక్కొక్కప్పుడు దూరస్థునిచేస్తూ వుంటాయి. కాని నిజంగా ప్రజాహిత జీవితం నుండి అతడెప్పుడూ దూరస్థుడుకాడు; కాలేడు."

—'విశాలాంధ్రము' నుండి (పేజీలు 311-314)

## రావుగారి దృక్పథం

రావుగారు "గాంధీయిజం" ననుసరించారు. కాని కాంగ్రెసేతరులను ద్వేషించలేదు. కాంగ్రెస్‌వారి సభలకూ వెళ్ళారు. కమ్యూనిష్టులేర్పాటుచేసిన సభలకూ వెళ్ళారు. అట్లని ఏయెండ కాగొడుగు పట్టలేదు. ఎక్కడిమాటలక్కడ చెప్పలేదు. గాంధీజీ సిద్ధాంతాలను, వర్గరహిత సమాజాన్ని, సత్యాహింసలను ప్రబోధించారు. ఈయన ప్రధానంగా మానవతావాది. ప్రజాస్వామ్యాన్ని ప్రచారం గావించారు. ఎవరితోకలిసి పనిచేసినా తనవ్యక్తిత్వాన్ని నిలుపుకొన్నారు.

ఈయన అధికారపదవులకోసం ఎన్నడూ తాపత్రయపడలేదు. వస్తేకాదననూలేదు. తన విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చారు. పార్టీ రాజకీయాలలో తలదూర్చలేదు. ముఠాతగాయిదాల దరిచేరలేదు. అట్లని రాజకీయాలజోలికేపోకుండా దూరంగా వుండినవారుకాదు.

తనకునచ్చిన రాజకీయాలను నిర్భయంగా చాటిచెప్పేమనస్తత్వం ఆయనది. వారు "పదవులకు వెనుక-పనులకు ముందు" వుండే వారు.

ఆయనకు ఆత్మవిశ్వాసం మెండు. తను రూపొందించు కొన్న గమ్యం గమనంపై అమితవిశ్వాసం. ఎంతటి మహానాయ కైనా విమర్శించుటలో జంకూగొంకూలేదు. ఎవరి మొగమోటా లకు లోనుగాలేదు.

బాహ్యాభేషజాలకు స్థానమివ్వలేదు. అంతశ్శుద్ధినే అధిక తరంగా వాంఛించారు. ప్రజాజీవితంలో, వ్యక్తిగత ప్రవర్తనలో నైతికవిలువలకే హెచ్చుప్రాధాన్య మిచ్చారు.

జీవితంలో అనేక కష్టాలననుభవించారు. దారిద్ర్యాన్ని సంతోషంతో ఐచ్ఛికంగా స్వీకరించారు. భోగభాగ్యాలను తృణ ప్రాయంగా తిరస్కరించారు. కష్టాలెదుర్కొన్నా నిస్పృహకు తావివ్వలేదు. ప్రజాసేవలోనే ఆనందాన్ని అనుభవించారు.

దేశమంతా పర్యటించారు, జీవితంలోని మంచి-చెడుగులు పరికించారు. నీరక్షీర న్యాయంగా మంచినే స్వీకరించి చెడుగును విసర్జించారు. విచక్షణా జ్ఞానంగల వివేకవంతులు. అనేక సభలకు అగ్రాసనాధిపత్యం వహించారు. కాని వాటిని స్వార్థం కోసం వినియోగించుకోలేదు. వారిలో ఒకరుగా మెలిగారు. విశాల దృక్పథంతో వ్యవహరించారు. అదే అందరి అనురాగానికి ఆయన్ని పాత్రుణ్ణి చేసింది.

ఆంధ్ర నాయకులలో అగ్రగణ్యులు. అన్ని అభ్యుదయ ఉద్యమాలలో ముందున్నారు. ఆదర్శ ప్రాయమైన జీవితం గడిపారు. ఆయనది అపూర్వ వ్యక్తిత్వం.

సర్వోత్తమరావుగారు సుప్రసిద్ధ దేశభక్తుడు. నిర్విరామ ప్రజాసేవకుడు. మేటియయిన విజ్ఞానవేత్త. నిష్కల్మష హృదయుడు. పరిపూర్ణ మానవుడు. కర్మయోగి.



అనుబంధము : ౧

# శ్రీ హరిసర్వోత్తమరావుగారి జీవితపు తొలిరోజులు

## ౧

మానవుడు పుట్టడంతోనే సంఘమునందు ప్రవేశించుచున్నాడు. మొదటి సంఘవ్యక్తి తల్లి. ఆ వ్యక్తి దర్శన సౌభాగ్యం లేనినాడు పుట్టిన బిడ్డడి సంఘ యాత్రలో కొంత లోటుపడక తప్పదు. నా జీవితమున యీ లోటు నన్ను యెల్లప్పుడూ వేధించుచునే యున్నది. నేను ఆరుమాసముల శిశువుగా వుండగానే నాతల్లి మరణించినదని చెప్పగా విన్నాను. ఆ విషయము నాకు తల్లియొక్క దివ్య ప్రభావమును యెల్లప్పుడూ గోచరింప జేయును. తల్లి భావము కలిగినప్పుడెల్ల మహత్తమమైన ప్రేమస్వరూపిణి నాయెదుట సాక్షాత్కరించును. కాబట్టి మాతృవియోగము ఒక విధముగ నా జీవితమున సదుద్దేశప్రబోధమునకు కారణమైనది కదా యని తృప్తినందుచున్నాను.

నా పుట్టుక 1883 వ సం. లో సెప్టెంబరు 14 వ తేదీన జరిగినది. మన పంచాంగము ననుసరించి స్వభాను సంవత్సర భాద్రపద శుద్ధ ద్వాదశి యగుచున్నది. నేను పుట్టినచోటు కర్నూలు. నేను బాలుడుగా నున్నపుడు కూడ కర్నూలు ప్రధానముగ వ్యావసాయక క్షేత్రముగానే యున్నది. ఒక వైపున జొహరాపురము, రెండవవైపున బుధవారపేట, యీ రెంటికి నడుమన పచ్చని పైరులు నాకు వ్యావసాయిక పరిస్థితిని చక్కగా స్పష్టపరచుచుండినవి. ఒక గాటిపట్టున నేను పుట్టితినని పెద్దలు చెప్పుచుందురు. గాటిపట్టున పుట్టిన క్రీస్తును తలంచుకొని నాకు అతని సుగుణములు అబ్బునా యని ఉవ్విళ్ళూరుచుందును. అతనికి కలిగిన మహర్దశ నాకోటివానికి కలు

గునని ఎదురుచూచు వ్యక్తిత్వము మాత్రము నాకు పుట్టలేదు, అంతవరకు సంతోషింపదగును.

నా తండ్రులు ఆరుగు రన్నదమ్ములు. అందులో ముకుందరావను కడపటివారు చిన్నతనముననే గతించినని వింటిని. తక్కిన ఐదుగురిలో జ్యేష్ఠుడు మాధ్వాసరావు. ఆయన మరణ నిద్రను చెందుచుండిన దృశ్యము నా కిప్పటికిని అగుపించుచున్నది. జ్యేష్ఠభ్రాత తండ్రితో సమానుడను వాక్కును ఆయన తమ్ములయెడలచక్కగా ప్రవర్తింపజేసిన మహనీయుడు. తక్కిన నలుగురిలో నా పెద తండ్రి శేషగిరిరావు, నాతండ్రి వెంకట్రావు వీ రియువురు రెవెన్యూ ఇన్స్పెక్టరు ఉద్యోగములుచేసి ఆదినములలో మంచి తనమునకు పేరు పొందినవారు. మరి యిరువురు శ్రీనివాసరావు, వాసుదేవ రావులు వకీళ్ళయి కర్నూలులో నిజమైన న్యాయవాద వృత్తిని అవలం బించారను కీర్తిని గడించినవారు

మా తండ్రులు తాతలనాడు మా వంశీకులు కడప, అనంతపురం జిల్లాల కలయిక స్థానములో చిత్రావతీతీరమున సింహాద్రిపురమునందుండెడి వారు అ ప్రాంతముననే మా వంశమునకు పెద్దిగ భూస్థితి వాడ నిన్నటి వరకు ఉండినది. చాల పెద్దిగ నేటికిని కలదు. మా నాయనమ్మ చేలకు పోయి గడ్డిమోపులు నెత్తినమోసుకొని యింటికి చేరెడిదని పెద్దలు చెప్పగా విన్నాను. గ్రామజీవితపు మేలును ఆ విధముగ కొంత గ్రహించుటకు యీ విధ వర్ణన నాకును ఉపయోగపడినదేమో?

నా చిన్న తనమున కొంతివరకు మేనమామల వద్దను, కొంతవరకు తండ్రి యింటను గడపితిని. నాతండ్రి కంభం, మార్కాపురం తాలూకా లలో రెవిన్యూ ఉద్యోగము చేసినందువల్ల నేను అచ్చట నివసించడము, అచ్చటి ప్రజలు నాయందలి ఆదరాభిమానములచే నన్ను తమవాడుగా పరిగ ణించడము సంభవించినది.

నేను కంభంతాలూకా రావిపాడు గ్రామంలో పల్లెటూరి బడిలో చదువుకున్నది యిప్పటికిని జ్ఞాపకమున్నది. ఆనాడు పిల్లలను శిక్షించు

విధానము యిప్పటికిని మరపునకు రాకున్నది. కోదండం వేయడం అప్పుడు చాల పరిపాటి. పైన వేసిన ఉచ్చునుపట్టుకొని వ్రేలాడునట్టి దోషికి క్రింద కంపకూడ పెట్టుచుండిరి. దుమికి తప్పించుకొనడానికి వీలుండకూడదని యిందలి అభిప్రాయ మనుకొందును. నేడు యిట్టి శిక్షలు లేవుగదాయని సంతోషించుచున్నాను.

తొమ్మిదేండ్ల వయసుననే ఉపనయనము జరిపి నన్ను కర్నూలు లోని మునిసిపల్ బడికి పంపడం జరిగింది. బడిలోచేరిన రెండవ సంవత్సరముననే నేను నంద్యాలలో కొంతకాలము, గుత్తిలో కొంతకాలము ప్రైమరీతరగతిలో చదివి నాటి పబ్లిక్ పరీక్షలో జిల్లాయందు మొదటివానిగ ఉత్తీర్ణుడనైతిని. గుత్తిలో లండన్ పాఠశాలలో చదువుచుంటిని. మార్లర్ అను పాదరీ పెద్ద మా పాఠశాలకు మేనేజరుగ ఉండెను. పరీక్షలో నెగ్గిన తర్వాత ఆయనను చూడబోతే ఆయన రెండు బహుమానములను నాయెదుట బెట్టెను. ఒకటి క్రికెట్ బంతి, రెండవది రూపాయి. నాకెట్టి బుద్ధిపుట్టెనో కాని క్రికెట్ బంతినే కోరుకొంటిని. తరువాత జీవితములో దీని ప్రభావము కూడ కలదేమోయని అనుమానించవలసియున్నది. ఇతర ప్రయోజనాలు ఎన్నిసమకూరినా డబ్బు ప్రయోజనం మాత్రం సమకూరక పోవడమునకు మొదటి సూచనయేమో అనిపించుచున్నది. ఈ పాదరీ పెద్దకు సంబంధించిన మరియొక విషయము ఇచ్చటనే చెప్పుట బాగుండునని తలంతును. గాంధీయుగ మారంభమై అసహాయోద్యమం ప్రబలంగా జరుగుతూవుండిన 1922–23 సంవత్సరాల ప్రాంతంలో ఈయన కడపలోనున్నాడు. అక్కడికి నేను కాంగ్రెస్ ప్రచారమునిమిత్తము పోయినాను. ఈయనను తాను కోరినప్పటికిని నేను తనదర్శనార్థము పోనేమోయని అనుమానము కలిగినది. తన అనుచరునివద్ద యీ అనుమానమును బయలుపెట్టినాడు. ఆయనుచరుడు నావద్దకువచ్చి సంగతితెలిపినాడు. వెంటనే నేసువచ్చి కలుసుకొందునని వార్త పంపితిని, నేనుపోయి పోకముందే అతడు "ఏమి సర్వోత్తమరావూ ! మమ్ము దేశమునుంచి వెళ్ళగొట్ట జూచుచున్నావా ?" అని ప్రశ్నించెను. చిన్నతనమున నాకు గురుతుల్యులుగా వుండిన ఒక వ్యక్తి యీ ప్రశ్నచేస్తే

జవాబెట్లు చెప్పుదునాయని తడుముకొనుటకు అవకాశమేలేకుండా నాకు స్ఫురించిన ప్రత్యుత్తరమును వెంటనే చెప్పితిని.

"అయ్యా! వ్యక్తులైన మీబోంట్లయెడ మాకు విద్వేషములేదు. మిమ్మును తరుమగొట్టవలయునను ఆకాంక్షకూడ లేదు. మేము తరుమ గొట్ట దలచినది మీ అధికారమునుమాత్రమే" అని నుడివితిని. దాని కా యన సంతోషించెను. గాంధీజీ ఉద్యమారంభములో యే విధమైన మనస్తత్వము విదేశీయుల కున్నదియు యీసంఘటన ఋజువుపరచుచున్నది.

నేను చదువుకొనునప్పుడు చాల చురుకు మనిషిని అనే పేరేపొంది తిని. ఆనాడు మాప్రాంతాలలో చదువు చాలా తక్కువ. చదువుకు అను కూలాలును తక్కువే. కర్నూలు జిల్లా అంతటికిని రెండు హైస్కూళ్లుం దేవి, ఒకటి కర్నూలులోని మునిసిపల్ హైస్కూల్. రెండవది నంద్యాల లోని యస్. పి. జి. మిషన్ హైస్కూల్. నేను నాలుగవ ఫారములో చదువునప్పుడు మా తరగతిలో నున్నవారము తొమ్మండుగురము. మూడవ తరగతినుంచి మెట్రిక్యులేషన్‌వరకును అన్నిటిని విద్యార్థులసంఖ్య సుమారు నూట ఇరువది. చెట్టులేనిచోట ఆముదపుచెట్టే మహావృక్షమన్నట్లు యిట్టి విచిత్ర పరిస్థితులలో నాబోటివాడు చాల తెలివిగలవాడనిపించు కొనడం ఒక గొప్పకాదను కొందును. ఉపాధ్యాయుల యెడల నేను నడచుకొన్న నడవడికే అనండి, వారి సౌహార్ద్రమనండి, ఏమైనా నా ఉపాధ్యాయులతోనూ చాల సన్నిహితమైన సంబంధం వుండేది. అల్లరిలోనూ నేను ఘాగారినే. ఒకప్పుడు మా తెలుగు పండితులు గని శేషావధానులుగారు ఏదో కోపము వచ్చి 'గడ్డితింటావా' అని గద్దించితే 'తినిచూపిస్తే తింటాను స్వామీ' అని యనిన అల్లరిపిల్లవాడను నేను. ఇట్లుండిన్నీ చదువు సంధ్యలలో కొంత మెరుగు చూపడంచేత వారికిని నాయందు దవ్యాజమైన ప్రేమ వుండేది. నా కిప్పటికిని ఒక చిత్రమైన ప్రేమ బంధము వారియెడల కలదు. ఆయన బహు సమర్థుడు. "అబ్బీ! అన్నముపెట్టువాడు లేడురా. లేకపోతే దినాని కొక శతకం వ్రాసేవాడనురా" అనేవాడు. నిజముగా ఆయన అంతటివాడే. పెద్ద సంగీత జ్ఞానము కలవాడు కాదుగాని ఆయన భాగవత పద్యము చదివి

నాకంటే హాయిగా వుండేది. నాకీనాడు తెలుగుభాషయందు కొంత ప్రవేశం వుందంటే దీనికి ప్రధానకారకుడు శ్రీ శేషశాస్త్రి. నేను జైలునందుండగా ఆయన మరణించెను. నాకు అది యెక్కువ దుఃఖకారణమైనది. నేను విడుదలైన తర్వాత 'The Neglected Emperor Poet' అను నాచిన్న రచనను 1912 లో ప్రచురించితిని. దానిని వారికి అంకితముచేసి కొంత మనస్తృప్తి పొందితిని. ఆయనవద్ద బడిలో తెలుగు చదవడమేకాక, బయట కొంత సంస్కృతాభ్యాసము కూడ చేసితిని. ఆయన మెప్పును పొందితిని.

నేను హైస్కూలులో చదువుచుండగా మా ప్రధానోపాధ్యాయుడుగ కె. ఆర్. రఘునాథాచారి అనేవారు ఉండేవారు. ఆయన బోధించే విధానము చిత్రమైనది. స్కూలు గ్రంథాలయమునుంచి యిష్టమువచ్చిన పుస్తకము తెప్పించడము, క్లాసులో చదివి వినిపించడము ఆయనకు పరిపాటి. ఒక దినము "అబ్బాయీ! రీడింగు రూముకు పోయి tit - bits పట్టుక ర"మ్మన్నాడు. తెచ్చి చేతి కిచ్చిన తర్వాత ఒక వ్యాసము చదవడ మారంభించినాడు. చివాలున ఆపి నేను చదివిన కడపటి వాక్యము వ్రాయండన్నాడు. ఎవరు వ్రాయగలరు? నేనొక్కడనే ఆ వాక్యమును వ్రాయగలిగితిని. ఇప్పటికిని నేనది మరచిపోలేదు.

"Try the experiment of eating a favourite dish in absolute darkness and you will find it does not taste half well as when you are able to please both the palate and the eye" అనేది ఆ వాక్యం. దాని అర్థమిది: మీకు అతి ప్రీతికరమైన పదార్థమును చీకటిలోతినునట్టి ప్రయత్నముచేయుడు. వెలుతురులో కండ్లతో చూచి ఆనందించి, రసనతో అనుభవించేటప్పు డుండే తృప్తి చీకటిలో తిన్నప్పుడు ఉండదనుట మీరు గ్రహింపగలరు. ఈ సంభవమును జ్ఞప్తికి తెచ్చుకుంటే యీదినము నాకును గ్రంథాలయ పఠనాలయములకును ఉండే బాంధవ్యమునకు రఘునాథాచార్యులవారే బీజావాపము చేసిరనుట స్పష్టము కాగలదు. ఆయన వట్టి పుస్తకాలు చదవడంతో ఆగేవాడుకాదు. తన యింటిలో తగిన సామాగ్రిని సమకూర్చుకొని విప్పుపుల్లలుచేయడము, గాజుమలాము చేయడము యిట్టివెన్నో చేతిపనులు చేయడములో బహు

శ్రద్ధచూపేవాడు. వాటి వివరణ మొక్కొక్కప్పుడు క్లాసులో చెప్పుతూ 'యిట్లాటిపని మీ రెవరైనా చేస్తారేమిరా?' అని ప్రశ్నించేవాడు. 'నేను చేస్తానుసార్!' అని ఒకప్పుడు నేను జవాబుచెప్పినట్లు జ్ఞాపక మున్నది. ఆ పనులు నేనే నేడు స్వయముగా చేసినా చేయలేకపోయినా, అట్టి పనుల అభివృద్ధియందు ఎక్కువ అభినివేశనము కలిగియుండుటకు నాటి నా గురు బోధయే కారణమేమో?

౨

నా హైస్కూలు చదువులో మరియొక సంగతిగూడ వివరింపవచ్చునేమో? సారస్వతసంఘాలుపెట్టడం, ఉపన్యాసా లేర్పరచడం మొదలగు విషయములందు నా కెక్కువ అభిలాష ఉండేది. నేను నాలుగవఫారములో ఉండగా ఊరిలోని పెద్దల నాహ్వానించి నా మిత్రులగు విద్యార్థులను కొంచెమించుమించుగా చెవిబట్టి లాగికొనివచ్చి హాజర్వేబెట్టి సభలు జరిపిన సందర్భాలు ఇప్పటికిని స్మరణకు వచ్చుచున్నవి ఇదియు నొక అల్లరియందురేమో? అనుకొనుడు, చింత లేదు

మరియొక సంగతి. నా విస్మృతవయములో మోటు ఆటలపై నాకు మోజు యెక్కువ. బలుగుడులు, కుస్తీలు, ఇవి నేను మెట్రిక్యులేషన్ పరీక్షలో తేరువరకు వ్యాయామ పరిశ్రమలో చేరినవి. క్లాసు తప్పక పరీక్ష యిచ్చుచుండుటచేత 1893 లో చదువారంభించినా 1900 సంవత్సరమున మెట్రిక్యులేషను పరీక్షలో నే ను త్తీర్ణుడనయితిని.

నా హైస్కూలు చదువంతటికిని ఆధారము నా పినతండ్రులలో ఒకరైన శ్రీనివాసరావుగారు. మొదటి ఒక్క సంవత్సరము మాత్రము వాసుదేవరావుగారి వద్దనుండి చదువుకొన్నాను. శ్రీనివాసరావుగారికి సంతతి లేకపోవడంచేత అన్న కుమారుడనైన నన్ను పెంచుకొనవలెనని సంకల్పించియుండినాడు. కాని మా తండ్రికి అది అంతయిష్టముగా వున్నట్లు కన్పించలేదు. నేను కొంత యెదిగిన తర్వాత సాంఘికంగాను, రాజకీయంగాను, సంస్కారపరుడుగా కనిపించుటచేత శ్రీనివాసరావుగారు వేరే దత్తుచేసు

కొనే ప్రయత్నం కావించిరి. మొదటి దత్తపుత్రుడు కొద్దికాలముననే గతిం చెను. రెండవ దత్తపుత్రుడు నేటికిని రైల్వే ఉద్యోగిగ చక్కని జీవనము గడుపుకొను చున్నాడు. ఈ విషయము సందర్భముగ కొంత వివరణ వ్రాయడం అవసరము. నేను వందేమాతరం ఉద్యమములో ప్రవేశించి 3 సంవత్సరములు కారాగారవాస మనుభవించితిని. ఆ శిక్ష అనుభవించిన తర్వాత నా సంస్కార ప్రియత్వమును మానుకొని తనవద్ద విధేయుడుగ ఉండగలనని ఆయన ఆశించెను. అది జరగలేదు సరిగదా ఆయనకు ప్రత్యక్ష విరోధమైన కొన్ని సంఘటనలు జరిగెను. నేను ఆంధ్రపత్రికలో సంపాదకుడుగ నున్నప్పుడు నా మిత్రుడు కంభం శరభారెడ్డిగారు జిల్లా సంఘ సంస్కార సభను యేర్పరచి నన్నధ్యక్షుని కావించెను. అప్పుడు నా పినతండ్రి తిరుపతి శాస్త్రిలవారి సహాయముతో సమావేశమున ఎదురు నిలిచెను. నేను పరిపూర్ణ గౌరవమును చూపి అన్ని అవకాశములనుఎదుటి పక్షమునకు ఇచ్చినను ప్రయోజనము లేకపోయెను. వారి ప్రతిఘటన ఒక్క విషయముననైనను ఫలించలేదు. దానితో వారికాగ్రహము మెండై నది. నేను మదరాసు చేరిన తర్వాత బ్రహ్మాండమైన సిద్ధాంతరాద్ధాంతములు చేయుచు నా భావముల నన్నిటిని మార్చుకొన వలసినదని ఆజ్ఞాపించిరి. నేను ప్రత్యుత్తరము వ్రాయుచు నా కర్మకు నేనే అధికారిననియు, నా కర్మ యేరీతి పరిపాకమును పొందినదో వారు గ్రహించగలరేమో ఊహించు కోవలసినదనియు, మేలో కీడో స్వతంత్రముగా నేను సాధించుకోవలసినదే కాని మరియొకరు సాధించుట కవకాశము లేదనియు ప్రత్యుత్తర మిచ్చుచు వారి పాఠము వారికే అప్పజెప్పితిని. దాని ఫలితముగ తాము దత్తుచేసికొన దలచినట్లు నాకు వ్రాసిరి. నా బంధువులు చాలమంది అనావశ్యకముగా వచ్చే ఆస్తిని పోగొట్టుకోవలదని సలహాలు చెప్పనారంభించిరి. ఆయన కష్టపడి సంపాదించిన ఆస్తి ఆయన యిష్టప్రకారము వినియోగించుకొనుటలో పరిపూర్ణ స్వాతంత్ర్యము కలదనియు, ఆస్తి కాశించి నామనస్సాక్షికి విరో ధమైన మార్గమున ప్రవర్తించుట సాధ్యముకాదనియు వారికి జవాబు చెప్పి తిని. నా పినతండ్రి దత్తుచేసికొనుట నాకే మాత్రము అసంతృప్తికరము కాదనియు, నేనే స్వయముగా హాజరయ్యెదుననియు నా పినతండ్రికి వ్రాసితిని.

వదుల వేల ఆ స్తిని యీ విధముగా పోగొట్టుకొనుటచేత నేను వెర్రిగా ప్రవర్తించితినని విమర్శించినవారును లేకపోలేదు. ప్రసంగ వశమున చెప్పిన యీ సంగతులట్లుంచి అసలుకథ సాగించవలసి యున్నది.

నేను మెట్రిక్యులేషను పరీక్షలో తేరిన తర్వాత ముందు చదువు సంగతి ఆలోచింపవలసి వచ్చినది. నాతండ్రి సావా రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగా వుండడముచేతను, ఆయనకు ద్వితీయ వివాహము జరిగియుండడము చేతను కాలేజీచదువుకు పినతండ్రి శ్రీనివాసరావుగారే నాకుసహాయముచేయు వారైరి. ఆసహాయమునకుతోడు నాకుకొంతపబ్లిక్ సహాయముకూడదొరికెను.

అప్పట్లో వెనుకబడినజిల్లాలని కర్నూలువగైరా జిల్లాలకు మదరాసు క్రైస్తవ కళాశాలవారు ప్రత్యేకము స్కాలరుషిప్పుల నిచ్చుచుండిరి. దానికి ప్రాతిపదికగా ఇంగ్లీషులో పరీక్ష పెట్టారు. ఆ పరీక్షలో మరి యొక రిద్దరు నాతోపాటే చేసిరిగాని వారి పోటీ నిలవలేదు, నా కా స్కాలరుషిప్పు సంక్రమించెను. దానివలన కాలేజీ జీత మివ్వవలసిన పని లేకుండాపోయెను. పై పెచ్చు ప్రతి వారమునకును ఒక కొంత చేతికి డబ్బందుచుండెను. ఈ విధమయిన ఉపకారవేతనము నేను క్రైస్తవ కళాశాలలో ఆరు సంవత్సరములు చదివి ఎం. ఏ, పూర్తి చేయువరకు నాకు దొరికినది. మొత్తము సుమారు రు. 2000/-ల సహాయము యీవిధముగ దొరికియుండబట్టి నా చదువు సాంతముగ సాగుటకు వీలయినది. ఈ విషయమున క్రైస్తవ కళాశాలకు నే నెంతయో కృతజ్ఞుడుగ ఉండతగియున్నది.

నేను మదరాసులో క్రైస్తవ కళాశాలలో చదివిన కాలమునందున్న మదరాసుకును, తర్వాత మదరాసు నివాసిగా నే నున్నప్పటి మదరాసుకును చాల వ్యత్యాసమున్నది. ఆ కాలమున కాలేజీ ఫీజులు, ఇంటి అద్దె, హాస్టలులో భోజనవసతి యివన్నీ కలిసి నెలకు రు 13-8-0 లలో కాలక్షేపము చేసిన సోదరులను నే నెరుగుదును. నామట్టుకు నేను పుస్తకములుకొనుట వగయిరా కార్యక్రమాలకు కొంచెము హెచ్చు ఖర్చుపెట్టువాడను. మా పిన తండ్రిగారుయెప్పుడుకూడ నెలకు రు 17-0-0 లకు మించి సహాయము పంపవలసిన అవసరముండలేదు. అదినము కాఫీహోటళ్ళు మేమెరుగము.

హోటాయకార్లు యెప్పుడో ఒకప్పుడు వీధులలో కనిపించేవేకాని యేమాత్రము విస్తారమయిన ప్రచారములో లేవు. నా కిప్పటికిని కొన్ని విచిత్రములు జ్ఞాపకమున్నవి. టవంక్యాప్, టరంమ్యాట్, టరంలైట్ అను పదజాలము నేటికిని నా చెవియందు దాడుచున్నది. ఆరుమాసములు ధరించటానికి పనికివచ్చే టోపీ వెల అయిదణాలు. ఆరు మాసము ఉపయోగింటానికి పనికివచ్చే చాప అయిదణాలు. అట్లే ఆరుమాసాలకు పనికివచ్చేదీపము అయిదణాలు. ఇంతటి నిరాడంబరమయిన విద్యార్థి జీవనము అర్ధ శతాబ్ది మారకముందే మాయమైపోయి నూర్లకొలది ద్రవ్యము ప్రతిమాసము ఖర్చుపెట్టిననే గాని గడవని కాలము నేటి విద్యార్థులకు పైబడినదేయని అప్పుడప్పుడు మనసు కలవరపడుచుండును.

— అసంపూర్ణమగు వారి 'స్వీయ చరిత్రము' నుండి

అనుబంధము : ౨ (అ)

# గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి జీవితములోని ముఖ్య ఘట్టములు

| | | |
|---|---|---|
| 1883 సెప్టెంబరు 14 | – | జననం |
| 1900 వరకు | – | విద్యార్థిదశ–గుత్తి హైస్కూలు |
| 1906 | – | మద్రాసు–ఎం ఏ. |
| | | విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి స్థాపన |
| 1906–7 | | ఆంధ్ర గ్రంథమాల సంయుక్త సంపాదకత్వము |
| | | క్షత్రియ మహాసభాధ్యక్షత |
| | | ఆంధ్రజాతీయ విద్యాపరిషత్తు సంయుక్త సంపాదకత్వము; పాలకవర్గ సభ్యత్వము |
| | | రాజమండ్రి–వందేమాతరం ఉద్యమంలో ప్రవేశం |
| | | మొదటి (రాత్రి బడి) వయోజన విద్యా కేంద్ర ప్రిన్సిపాల్ |

| | |
|---|---|
| 1907-8 | తెలుగు 'స్వరాజ్య' వారపత్రికా సంపాదకత్వము (బెజవాడ): |
| 1908-11 | రాజద్రోహనేరమునకై 3 ఏండ్లు కఠినశిక్ష |
| 1914-17 | ఆంధ్రదినపత్రిక-ప్రథమ సంపాదకత్వము (మద్రాసు) |
| 1915 | కె. వి. హెచ్. గ్రంథమాల స్థాపన. (చిలుకూరు వీరభద్రరావుగారితో కలిసి) |
| 1917 | ఆంధ్రరాష్ట్ర హోంరూలు లీగ్ కార్యదర్శి |
| 1919 | ఆంధ్ర మహాసభాధ్యక్షుడు.(అనంతపురము) |
| 1919 | ఇంగ్లీషు 'నేషన లిస్టు' వారపత్రిక ఎడిటర్ Cult of Bullet అను వ్యాసమునకు రు 2 వేల రూపాయల ధరావతు కోల్పోవుట: 'సౌందర్యవల్లి' పత్రికా నిర్వహణ |
| 1920-22 | సెంట్రల్ లేబరుబోర్డుసభ్యులు; మద్రాసు పాకీపని వారి సంఘ నిర్మాత; ప్రింటర్సు లేబర్ యూనియన్ అధ్యక్షులు: గవర్నమెంటు ప్రెస్ పనివారల సంఘాధ్యక్షులు |
| 1922 | తాడిపత్రినుండి వెలువడిన 'మాతృసేవ' పత్రిక ప్రధాన సంపాదకుడు |
| 1923 | కాకినాడ కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శి |
| 1924 | భారత హిందూస్థాన్ సేవాదళ నాయకులు<br>దక్షిణ ఇండియా సత్యాగ్రహ సంఘ సంయుక్త కార్యదర్శి<br>ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సమావేశాధ్యక్షులు<br>రాష్ట్ర రాజకీయ మహాసభాధ్యక్షులు<br>ఆంధ్ర స్వరాజ్యపార్టీ నిర్మాణం |
| 1927-30 వరకు | మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబరు, |
| మే 10, 25 తేదీలు | ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనెట్ సభ్యులు. రాష్ట్ర |

| | |
|---|---|
| | కాంగ్రెసు సంఘ సంయుక్త కార్యదర్శి; పశ్చిమాంధ్రనుబా (రాయలసీమ) కార్యదర్శి |
| 1930 | మదరాసు గవర్నరుకు కౌన్సిల్ సభ్యత్వ రాజీనామా లేఖ |
| 1930–31 | మద్రాసు గ్రామ పంచాయతీ పత్రిక ఎడిటర్ (తెలుగు తమిళం, ఇంగ్లీషు భాషల్లో) |
| 1931 | కరాచీ సేవాదళ్ బోర్డుసభ |
| 1934 వరకు | బొంబాయి (గిర్గాంలో) శిబిర నాయకులు<br>అఖిల భారత కాంగ్రెస్ సంఘ సభ్యులు (A. I. C. C. Member) |
| 1934–35 | రాయలసీమలో రైతు సంఘాల స్థాపన, రీసెటిల్‌మెంటు వ్యతిరేక ప్రచారం – రైతు యాత్రలు.<br>ఆంధ్ర స్వరాజ్యపార్టీ పునరుద్ధరణ ప్రయత్నం.<br>మడకసిర సహకార మహాసభాధ్యక్షత |
| 1936 | 'ఆంధ్రవార్త' దినపత్రికా నిర్వహణ (బెజవాడ) |
| 1935–36 నుండి | ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు.<br>'గ్రంథాలయ సర్వస్వము' సంపాదకులు.<br>అఖిలభారత గ్రంథాలయ సంఘ ఉపాధ్యక్షులు. |
| 1937 అక్టోబరు 25 | శ్రీ సి. రాజగోపాలాచారి ముఖ్యమంత్రిత్వ కాలంలో రావుగారిపై బ్రిటిష్ ప్రభుత్వం జారీ చేసిన 'డీబార్' ఆర్డర్ రద్దు.<br>దక్షిణభారత వయోజన విద్యా సంఘాధ్యక్షులు<br>South Indian Adult Education Review సంపాదకులు<br>ఆంధ్రదేశ వయోజనవిద్యా గౌరవ డైరెక్టరు, ఆర్గనైజరు |
| 1938 | ఆంధ్రరాష్ట్ర చేనేత పారిశ్రామిక మహా సభాధ్యక్షులు (గుంటూరు) |

| | |
|---|---|
| 1939 | ద్వితీయ రాయలసీమ మహాసభ అధ్యక్షులు (ప్రొద్దుటూరు) |
| | మార్కాపురం కాంగ్రెస్ రాజకీయ మహాసభ అధ్యక్షులు |
| | నాటకకళా పరిషత్తు (గుంటూరు) రాష్ట్ర జర్నలిస్టు మహాసభలకు అధ్యక్షులు. |
| 1941 ఏప్రిల్ | ఆంధ్రరాష్ట్రీయ సహకార మహాసభ అధ్యక్షులు (భీమడోలు) |
| | విజయనగరం కో ఆపరేటివు బ్యాంకు రజతోత్సవ మహాసభాధ్యక్షులు. |
| 1941 ఆగస్టు 24 | ఆంధ్రదేశ వయోజనవిద్యా మహాసభాధ్యక్షులు, తెనాలి |
| 1942 సెప్టెంబరు 22 | రావుగారి సతీమణి రామాబాయిగారి మరణం |
| 1942-43 | ఆంధ్రమహాసభ ప్రధాన కార్యదర్శి |
| 1944 | కృష్ణాజిల్లా యువజన మహాసభ ప్రారంభకులు (విజయవాడ) |
| 1946 | శ్రీ హరిసర్వోత్తమరావుగారి షష్టిపూర్త్యుత్సవముల ప్రారంభం [10-1-1946] |
| | ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ మహాసభ (కాకినాడ) ప్రారంభకులు |
| | ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు ప్రారంభం, అధ్యక్షులు [10-4-1946] |
| డిసెంబరు | ద్వితీయ తూర్పు గోదావరిజిల్లా పంచాయతీ బోర్డుల మహాసభ |
| ,, | గంజాం, కోరాపుట్ ఆంధ్ర మహాసభల అధ్యక్షులు (జయపూర్) |
| | నైజాం, బస్తరు, కర్నాటక, మహారాష్ట్ర |

| | |
|---|---|
| | ప్రాంతాల సౌహార్ద్ర సంఘ పర్యటనలు |
| | బొంబాయి ఆంధ్ర మహాసభ అధ్యక్షులు |
| '947 నుండి 50 | ఆంధ్ర మహాసభ కార్యనిర్వాహకాధ్యక్షులు |
| 1948 మార్చి 23 | శ్రీ సర్వోత్తమ భవనము శంకుస్థాపన |
| 1948 ఏప్రిల్ | శ్రీ వీరేశలింగంగారి శతవార్షిక జన్మదినోత్సవము |
| 1949 జూన్ 1, 2 | శ్రీ సర్వోత్తమ భవన ప్రవేశోత్సవము |
| | శ్రీ వీరేశలింగ గ్రంథావళి పరిచరణోత్సవము |
| 1949 సెప్టెంబరు | ఆంధ్రమహాసభ పక్షాన ఢిల్లీకి రాయబారవర్గం |
| 1950 | మదరాసు నగర లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులు |
| 1951 | ఆంధ్ర మహా సభాధ్యక్షులు |
| 1950_53 | ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ పనిముట్ల ఉత్పత్తి దారుల సంఘాధ్యక్షులు |
| 1952 | అఖిలభారత వయోజనవిద్యా మహాసభ అధ్యక్షులు (నాగపూర్) |
| .... | |
| 1953 | అఖిలభారత వయోజన విద్యాగోష్ఠి డైరెక్టరు బీహార్, (బిక్రం) |
| | మద్రాసులోని స్వతంత్రనగర్ సోషల్ సర్వీస్‌లీగ్ అధ్యక్షులు |
| | పెరంబూరు వర్కర్సు నైటు హైస్కూలు స్థాపకులు, ప్రిన్సిపాలు |
| | ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ మునిసిపల్ సూపర్వైజన్ కమిటీ అధ్యక్షులు |
| | ఆంధ్రరాష్ట్ర గ్రామోద్యోగ సంఘ ఉపాధ్యక్షులు |
| | తెలుగు భాషాసమితి - కార్యవర్గసభ్యులు |
| | తెలుగు విజ్ఞాన సర్వస్వం, I చరిత్ర - రాజనీతి II భౌతిక, రసాయనిక శాస్త్రములు సంపుటముల సంపాదకమండలి సభ్యులు |

అనుబంధం : 3

# శ్రీ హరిసర్వోత్తమరావుగారు మహాత్మాగాంధీకి, మహమ్మదాలీ జిన్నాకు వ్రాసిన లేఖలు

ప్రియమైన మహాత్మాజీ,

ప్రస్తుత దృక్పథము, మీ వాస్తవాదర్శాల ననుసరించివున్నట్లు కనుపించుటలేదు. ప్రపంచ దైనందిన వ్యవహారాల్లో సత్యా - హింసల ప్రయోగాలు చేయటానికి ఒక జాతీయ నాయకత్వాన్ని మీరంగీకరించుట సరియే. సత్యాహింసలతోగూడిన విన్నపమే, మానవ స్వభావంమీద బ్రిటిష్ సామ్రాజ్యవాదులమీద సరైన పరివర్తన తీసుకొని రాగలదని మీరు కొంత వరకు ఋజువు చేశారనుట నిస్సందేహామే. కాని నేడు ప్రపంచమే ఒక వినాశనకరమగు యుద్ధములో చిక్కుకొన్నది. అందువల్ల ఏర్పడిన విశాల వాతావరణంలో మిరీ సమయాన అడుగుపెట్టారు. మీ ఆదర్శాన్ని సిద్ధింప జేసుకోటానికి ఒక్క జాతిమీదనే ప్రయోగించుటకిది సమయం కాకపోవచ్చునేమో! ఈనాటి ప్రపంచ పరిస్థితులలో సత్యాహింసలను ప్రవేశపెడితే ఆ ఫలితాలు కేవలం బ్రిటన్, ఇండియాల మధ్యనున్న సంబంధంమీదనే గాక, యుద్ధంలో పాల్గొంటున్న వేర్వేరు దేశాలమీద పనిచేస్తాయి. మీ కొక్కరికే యుద్ధంలో పాల్గొనకుండా వుండటానికి హక్కున్నది. బ్రిటన్ శతృదేశాల్లోని ప్రజానీకాన్ని ఏమీ చలింపచేయకుండా, కేవలం మన దేశంలో ప్రజలీ పద్ధతి ననుసరిస్తే బ్రిటన్‌కు చాలా నష్టం కల్గుతుంది. దీని నివారణ మీ కనుకూలమే. ప్రచారాన్ని అదుపులోపెట్టటం దగ్గరనుంచి హింసాయుత ఎత్తుగడ లొక ప్రత్యేకమైన పద్ధతి ననుసరించి వుంటాయి. మీరీ రంగంలో నిపుణులు కాకపోవచ్చును. ఉద్యోగంలోవుండగా ఇండియన్ పీనల్‌కోడ్ 124-ఎ సెక్షన్‌ను వుపయోగించటానికేమీ వెనుకాడని సహాయ సేనాని మీకున్నాడు.

ప్రజా జీవితాన్ని పాడుచేసే యుద్ధకృషిని తగ్గించమని మీరు బ్రిటిషువారి నడుగవచ్చును. బ్రిటిష్‌వాళ్ళకొరకు నేను మీకిలా వ్రాయటం లేదు. వాళ్ల తరపున నేనెన్నడూ వాదించలేదు. ఈనాడు అట్టి అవసరం నాకులేదు. పోరాడుతున్న రెండు పక్షాలమీద మన కృషి సమానముగా పారనప్పుడు, మనం ఒకరినే కోటుపట్టుకొని లాగితే ఏ కొంచెమైనా రెండవవారి కుపయోగముందిగదా! పరస్పరము ఉపయోగించుతున్న ఆయుధాలకు గురియయినా మీరు ఇరువురిమధ్యదూకి, నాశనం కాకుండా కాపాడగలిగితే అహింసా పద్ధతి సరియైనదే అవుతుంది. నా జీవితంలో ఒక చిన్న విషయంలో ఇటువంటి ఘటనే జరిగింది. అది వేరే విషయం. అలాంటి అవకాశము లేనప్పుడు, మానవ సమాజాన్నంతా ప్రేమిస్తూ వున్నప్పుడు, ఏ కొంచెమైనా ఒక పక్షాన్ని మాత్రం ఇబ్బంది పెట్టటం సబబుగా కనుపించటం లేదు. ఏ షరతులేకుండానే, నైతికలగా సంపూర్ణ సహకారమిస్తామనే మీ మొదటి దృక్పథమే సరియైనదిగా తోస్తున్నది.

న్యాయదృష్టితో చూస్తే సత్యాగ్రహికి భౌగోళిక భాషా,జాతి,మత, భేదాలుండకూడదు. ఇది నానమ్మకం. మీకుగూడా అంతే ననుకుంటాను. ఏ ఆదర్శం కొరకైనా ప్రాథమికంగా స్థానికసాధనాలతో, స్థానికంగా పని చేయాలి. మీ రిప్పటివరకు అలానే చేశారు. మొత్తం ప్రపంచ స్వాతంత్ర్యమే ముప్పులోవున్న ఈనాడు, ఒకదేశము సాపేక్షక స్వాతంత్ర్యము కొరకు మీ కృషికి హద్దులేర్పరచటంవల్ల మీనిజ సిద్ధాంతానికి మీరేదోషము చేసిన వారవుతున్నారు. సత్యాహింసల ద్వారా అభివృద్ధిని సాధించుటే మీ ప్రధానాంశమై వుండాలి. ఈ సాధనలో మీ మాతృదేశ విముక్తిగూడా లభిస్తుందనే చైతన్యం మీకుండవచ్చును. అదివేరే విషయం.

ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌కు మీ నాయకత్వంలో విశ్వాసం వుంటే, ప్రపంచ మంతటా సత్యాహింసలు నెలకొల్పుతామనే నమ్మకం గూడా వుండాలి. ప్రపంచం అల్లకల్లోలంగా వున్నప్పుడు తాము జాతీయ స్వభావాన్ని విడనాడాలి. మీ ఉదాత్త ఆశయ సాధనలో మీతో సహకరించాలి. కాని తమ సంకుచిత భావాలను మీ మీద రుద్దకూడదు. కలకత్తా కాంగ్రెస్ 1929 లో జరిగినప్పటినుండి కాంగ్రెస్‌లో ఒక వర్గం మిమ్ము

లను ఒక వైఖరి తీసుకోవలసినదిగా ఒత్తిడిచేస్తున్నప్పటికీ. మీ ఆశయ ఔన్నత్యము, కొద్దిమంది సత్యాహింసా వాదులతో సహా మీ త్యాగ సంసిద్ధతతో మిమ్మి దరకు తీసుకొనివచ్చాయి. కాంగ్రెస్, ఆ సంస్థ నాయకులుగా మీరీ ఉద్యమంయొక్క విశాల దృక్పథాన్ని అనగా కేవలం జాతీయ దృష్టితోనేగాక, ప్రపంచ క్షేమ దృక్పథాన్ని నొక్కి చెప్పనందువల్ల కొంత మంది మహమ్మదీయ సోదరులు యిది హిందూ ఉద్యమం అనే నేరం మోపుతారేమోనని నాకనిపిస్తున్నది. మనది బానిస జాతియని వాదించి ప్రయోజనం లేదు, కావచ్చు. కాని మనమీద సామ్రాజ్యం వహిస్తున్న వారిని, వారి సహాధ్యాయులను వారి తుచ్ఛ ఉద్రేకాలనుంచి విముక్తి చేయుటకే కంకణం కట్టుకున్న జాతి మనది.

ఇండియన్ నేషనల్ కాంగ్రెస కేంద్రీ కార్యవర్గం ఇటీవల తప్పటడుగులు వేసిన తర్వాత, వారిని పూర్తిగా మీ నాయకత్వాన్ని బట్టి నడుచుకొనేటట్లు చేయటం మీకు కష్టం కావచ్చును. ఈ పరిస్థితిని పైపైన చూచి వదిలేస్తే చాలదు. మీ సన్నిహిత అనుచరులకు గూడా అహింస శాశ్వతమైన ఆయుధమనికాని, కొంతకాలము వరకైనా పూర్తిగా ఉపయోగకరమనిగాని నమ్మకం లేదు. కొద్దిమంది విశ్వాసపాత్రులైన సహచరులతో మీరు జైళ్ళకువెళ్లుతారనుట నిస్సందేహమే. ప్రజలలో పేరు సంపాదించుకొని, తర్వాత అధికారము చేతబట్టటానికి మరి కొంత మంది ఈ సత్యాగ్రహంలో పాల్గొనవచ్చునుగూడా. బ్రిటిష్ జయిస్తే సరి. కానిపక్షంలో మిమ్మందరను విడుదల చేయవచ్చును. అప్పుడు మీ సహాయంతో అధికారంలోకి వచ్చేవారు కాంగ్రెస్ విధానాలు, కార్యక్రమాల బాధ్యతలనుండి మిమ్ములను విడుదలచేసి, పరిపాలనా విధానములో హింసాయుత పద్ధతులనే ప్రవేశపెట్టారు.

ప్రస్తుతం ఏమిచేయాలనే సమస్య ఎదుర్కొంటున్నది? ప్రపంచం లోని శాంతికాముకుల నెవరినీ ద్వేషించకుండా, వారందరినీ మీ నాయకత్వం క్రింద ప్రపంచ శాంతి సంఘంక్రింద సమీకరించుటకు కాంగ్రెస సంస్థ పూనుకోవాలె. ఇది కొంచెం విపరీతంగా తోచవచ్చు. జాతిమత విచక్షణలను లక్ష్యపెట్టక శాంతి, అహింసలలో సంపూర్ణ విశ్వాసంగలవారు

ప్రపంచంలో వున్నారు, జాత్యహంకార, సామ్రాజ్యవాద విస్తరణ లక్షణాల కతీతులైన వారి సందరినీ, యుద్ధానంతరం జరిగే శాంతి సమావేశంతో పెద్దగా పాల్గొనేటట్లుగా కాంగ్రెస్ తయారు చేయాలి. ప్రపంచంలో, భవిష్యజ్జీవితంలో, మళ్ళీ ఏ రూపాలయినా సరే నాజీ రాక్షసత్వముగాని సామ్రాజ్యతత్వముగాని తలెత్తటానికి వీలులేనంత ఉధృతంగా ప్రచారం జరగాలి. ఎక్కడైనా వీటి వికృత స్వరూపం కనుపించెనో, వాటిని అహింసాయుత ప్రత్యక్ష చర్యలద్వారా మొదుర్కొని రూపుమాప గల్గాలి. ప్రపంచ రూపాన్ని ఇలా మార్చాలనే మహత్తర ఆశయం ఫలించక పోయినా, అహింసద్వారా మన స్వాతంత్ర్య ఉద్యమాన్ని బలపరచుకో గల్గుతాము. యుద్ధంలో బ్రిటిష్‌వారిని జయించనివ్వండి. అయినా, మన ఉద్యమానికి విజయం కనుచూపుమేరలోనే వుంటుంది.

ఇట్లు,

గాడిచర్ల హరిసర్వోత్తమరావు

# సోదరుడు జిన్నాకు బహిరంగ లేఖ

ప్రియ సోదరా !

బహుశా నన్ను గురించి మీరు ఎప్పుడూ వినివుండకపోవచ్చు. గత 35 ఏండ్లుగా నాకు నచ్చిన పద్ధతిలో రాజకీయాలలో పనిచేస్తున్న నేను, మిమ్ములను, మీ పేరు ప్రతిష్ఠలద్వారా స్వయంగా ఎరుగుదును. గత 5, 6 ఏండ్లుగా చురుకైన రాజకీయాలు అనుకొంటున్న వాటితో పెద్ద సంబంధం లేకుండా నా ఇంట్లోనే కూర్చొని, కాంగ్రెసుకు గాంధీజీకి సంబంధించిన మీరు వ్రాసిన రచనలను చదివి పరిశీలిస్తూనే వున్నాను.

గాంధీజీ అనుసరిస్తున్న వైఖరిని సమర్థించుకొంటూ మీకు తన దృక్పథాన్ని ఆయన ఎంతవరకు వివరించటానికి ప్రయత్నించారో నాకు తెలియదుగాని నేను పత్రికలలో చూచినంతవరకు ఆయన అట్టి ప్రయత్నం చేసినట్లుగా కనుపించలేదు. ఒకవేళ ఆయన మీ వ్యక్తిగత సంభాషణ

లలో ఏమైనా అలా చేసిఫుంటే, నేను మరు ప్రయత్నం చేసినందువలన పొయ్యేదేమీ లేదు.

నేనీ దిగువ ఉటంకిస్తున్న వాదన, గాంధీజీ వ్యక్తిత్వంతో సన్ని హిత సంబంధం వున్నట్లుగా మీరు కనుపించవచ్చును. కాని ఈ విషయా లను జాగ్రత్తగా గమనిస్తే, ఒక వేళ గాంధీజీని మీరు అంగీకరించక పోయినా, మీరీ వైఖరి తీసుకొంటే, భారతజాతిని మీతోపాటు తీసుకొని పోగలరని అర్థం చేసుకోగల్గుతారు.

ఇతరులు తనకు ఆపాదించినా, లేక తమకు తామనుకొన్నా 'సత్యా హింసలు' అనేవి ఒక్క హిందూ తత్వానికిగాని, గాంధీజీకిగాని చెందిన స్వంత ఆస్తులేమీకావు. శతాబ్దాల తరబడి వీటిని సాధించడానికి అనాది సిద్ధంగా ప్రయత్నాలు సాగుతూనే వున్నవి. వీటిని కేవలం మానవుని మత జీవిత విధానానికే సంబంధించిన విషయా లనుకోవడం, చరిత్రను వక్రంగా అర్థంచేసుకోవడమే అవుతుంది.

అన్ని తరాలలోను, అన్ని దేశాలలోను, మానవ జీవితంలోని అన్ని రంగాలలోను వీటిని లక్ష్యంగా పెట్టుకొని, ఆచరణలో సాధించడానికి ఎన్నో సత్ప్రయత్నాలు జరిగినవి. ఒక సత్యసంధుడైన అహింసావ్రతు డైన రాజు, సత్యనిష్ఠావ్రతుడైన అధ్యాపకుని వలెనే అభివందనీయుడు. బహుశా ప్రపంచ రాజకీయ జీవితంలోని పరిణామ క్రమంలో, 'సత్యా హింసలు' అనేవి ఇంతవరకు ప్రధాన పాత్ర వహించజాలక పోయినవి.

ఈ సత్యా హింసలను రాజకీయ కార్యక్రమాలకు అనువర్తింప చేయడమే గాంధీజీ చేస్తున్న ప్రయత్నం. ప్రధమతః ఈ సిద్ధాంతాలను బ్రిటిష్-భారతదేశ సంబంధాలకు వర్తింప జేయడానికి ఆయన కొంతవరకు పూనిక వహించారని చెప్పవచ్చును. ఈ అనువర్తింప చేయడంలో బలో పేతమైన పాలకశక్తులకు వ్యతిరేకంగా బలహీనమైన, అణచబడిన వారి చేతుల్లో సత్యాహింసలు ఒక శక్తివంతమైన ఆయుధమని గాంధీజీ స్పష్టీక రించినారు. ఈ కృషిలో ఆయన కొంతవరకు పాక్షిక విజయాన్ని సాధించి, కృతకృత్యులవుతున్నారని మీరుగూడా ఒప్పుకొంటారను కొంటాను.

దేశం, తన పరిపాలనా వ్యవహారాలను కొనసాగించడంలో అహింసను తన ఆయుధంగా ఎంచుకొని, విదేశ దురాక్రమణనుగూడా దౌర్జన్య రాహిత్య పద్ధతులద్వారా ఎదుర్కోవాలని, ఇటీవలి కాంగ్రెస్ చరిత్ర సుస్పష్టంచేసి వుంటుందని మీతో గాంధీ వక్కాణించే వుంటారు.

దౌర్జన్య పద్ధతులతోగల సంబంధాన్ని కాంగ్రెస్ కార్యవర్గం వ్యతిరేకిస్తూ తీర్మానించేదాకా. కాంగ్రెస్ విధానాలకుగాని, కార్యక్రమానికిగాని బాధ్యత వహించడానికి గాంధీజీ విముఖత్వం చూపినారని మీరు గమనించే వుంటారు.

దీనినిబట్టి కాంగ్రెస్‌లోవున్న వ్యక్తులు వాళ్లు ప్రధానమంత్రులు గావచ్చు, మంత్రులుగావచ్చు ఎవరేమిచెప్పినా, చేసినా కాంగ్రెస్ సంస్థ, గాంధీజీల లక్ష్యంమాత్రం భవిష్యత్ భారత ప్రజాస్వామికానికి అహింసనే ప్రాతిపదికగా నెలకొల్పుదామని గాంధీజీ అభిలషించినారని కనుపిస్తుంది.

ప్రజాస్వామికం అంటే అధిక సంఖ్యాకుల పరిపాలన అనేది నిజమే. అల్పసంఖ్యాకులు తమ జాతి, మత, భాషారక్షణకోసం న్యాయమైన వత్తిడి తెచ్చి సాధించుకొన్నారనేదిగూడా నిజమే. మతరీత్యా అల్పసంఖ్యాక వర్గాలేగాక, మొత్తం దేశానికి, రాష్ట్రాలకు వ్యతిరేకంగా ఆయా ప్రాంత స్థానిక అల్ప సంఖ్యాకులు సైతం తమ హక్కులను కాపాడుకొంటున్నారు. చిన్నచిన్న ప్రాంతాలవారు చివరకు తమ గ్రామం, కమ్యూనుల పక్షాన ఫెడరేషన్‌లో స్వయం పరిపాలిత రాజ్యాలుకోరి, విశాల ప్రాంతంలోని అధిక పరిపాలకులకు, వాటి ప్రాతినిధ్య ప్రభుత్వాలకు ప్రతిగా తిరుగుబాటు చేయడమనేది, ఒక స్వాభావికమైన అభివృద్ధి గమనంగా గుర్తిస్తున్నాం. ఇది ప్రజాస్వామ్యాన్ని అంగీకరించే అందరికీ తెలిసిన బహిరంగ రహస్యమే.

అధికారప్రాప్తి అనేది ఎక్కువమందినుండి తక్కువమందికి, కడకు అడుగుననున్న వ్యక్తివరకు సంక్రమించడం, ఇప్పుడొక అవమానకరమైనదిగా వుంటున్నది. కాని దీనిని అభ్యుదయకరంగా ప్రజాస్వామ్యం గుర్తిస్తున్నది. వ్యక్తి ఐచ్ఛికంగా ఇతర వ్యక్తులతో చేరి, ప్రభుత్వ రీతికి అందచందాలు చేకూర్చవలసి వుంటుంది. దీనిని అర్థంచేసుకొన్నప్పుడు

మానవజాతిని తద్విధంగా మలచి, ఏర్పడబోయే రాష్ట్రాలుగానూ లేక ఒకే రాష్ట్రంగానూ రూపొందింపటానికి ప్రజాస్వామికంలో దౌర్జన్యం అనేది ఒక సాధనం ఎంతమాత్రం కాదని తేటతెల్లమవుతుంది.

ప్రతివ్యక్తీ తన పొరుగువారి ఎడల చూపే ప్రవర్తన మీదను, శాంతియుత పద్ధతులతో పరస్పర సహాయం చేసుకొనే మనోతత్వంలోను మన భవిష్యత్తు ప్రజాస్వామికం ముడిపడివుంది

రాష్ట్ర కేంద్ర స్థానాలనుంచే తాఖీదులమీద గ్రామ స్వయంపరి పాలన బలాత్కారంగా అమలు జరపటం అసంగతమైన విషయం. ఇదే జరిగితే, గ్రామ స్వయం పరిపాలనగాని స్వల్పసంఖ్యాకులకు హక్కులు గాని లభ్యంకావు

కాబట్టి నిజమైన ప్రజాస్వామికంలో అంతరంగిక పరిపాలనలో అహింస అత్యంత ప్రధాన పాత్ర వహించే దశకు మనం చేరుకొంటు న్నాము. నేడు గాంధీజీ అహింసను అమలుజరిపే నాయకునిపాత్రను వహిస్తున్నాడంటే, ఆయన సత్కృషిలో తోడ్పడటం మానవతను ప్రేమించే మనందరి బాధ్యత, ధర్మం గాదా? కాంగ్రెస్ సంఘం హిందూ సంస్థ అనీ, గాంధీజీ హిందూ నాయకుడనీ, ఈ రెండింటిలోను మీకు విశ్వాసం లేదనీ పదేపదే ముస్లింలీగ్, ప్రత్యేకంగా మీరు చెపుతూ వచ్చారు.

మనదేశంలో అధిక సంఖ్యాకులు హిందువులు. గాంధీజీ హిందు వుగా జన్మించడం దురదృష్టవశాత్తు నిజమే. మనిషికీ, మనిషికీ మధ్య పరి ష్కారం చేసుకొనడంలో దౌర్జన్యం – హింసను ఒక సాధనంగా ఆలో చించడంగూడా యథార్థమే. హిందూ-ముస్లిములు ఒకరినొకరు అనుమానా లతో చూచేవిధంగా ప్రవర్తిస్తున్నారు. ఐతే గాంధీజీ, ఆయన నాయకత్వాన నడుస్తున్న కాంగ్రెస్ సంస్థ, హింసను పరిత్యజించిన తర్వాతగూడా ముస్లిం లీగ్‌మీద, మీమీద ఇలాంటి భయసందేహాల ప్రభావం పనిచేయాలా? ఒక వేళ గాంధీజీ, హిందూ సంఘ మెజారిటీకి నాయకత్వం వహిస్తున్నాడని అంగీకరించినప్పటికీ దేశపరిపాలనకు సత్యాహింసలనే పరిమాపధి.. భావించి, ఆయన కృషిచేస్తున్నారని చూడటం లేదా?

అల్ప సంఖ్యాకులందరికీ అత్యుత్తమమైన రక్షణలు గలిగించే విధంగా దేశ పరిపాలనను నిర్వహించు కోవానికి గాంధీజీ, దేశంలోని మెజారిటీ ప్రజలకు శిక్షణ నిస్తున్నారు. వివిధ సంఘీయులమధ్య స్నేహ పూర్వక పరిష్కారాలకు, శాంతియుత సహజీవనానికి వారిలో విజ్ఞానం గలిగించేందుకు, కొన్నికొన్ని సందర్భాలలో మైనారిటీలకు న్యాయంగా రావలసిన వాటికంటేగూడా హెచ్చుగా యివ్వడంగూడా అవసరమవుతుంది. మీరు గాని, ముస్లింలీగ్‌గాని గాంధీజీ, కాంగ్రెస్‌లతో సహకారాన్ని తిరస్కరించడానికి ఇది పరిస్థితి అనుకొంటున్నారా?

ప్రజాస్వామ్యం, భారతదేశానికి తగిందికాదని మీరూ, మీ ముస్లింలీగూ సిద్ధాంతీకరించిన సంగతి నాకు తెలుసు. అవును. దౌర్జన్య పద్ధతులలో పాలించే ప్రజాస్వామికం వుంటుందని మీరు ఆలోచించినంతవరకు ఆ సిద్ధాంతీకరణ సరియైనది కావచ్చును. ప్రేమ, సమన్వయాలతోగాక దేశ పరిపాలన దౌర్జన్యయుతంగా సాగించినట్లయితే ఆ ప్రజాస్వామికం, ప్రజాస్వామికమేగాదని మీ అభిప్రాయం, నా అభిప్రాయంగూడా అంతే. కాని దౌర్జన్యంతోను, హింసతోను నడిచే ప్రజాస్వామ్యాన్ని గాంధీజీగాని, ఆయన నాయకత్వాన నడుస్తున్న కాంగ్రెస్ సంస్థగాని అపేక్షిస్తున్నదా? ఆ విధంగా ఎవరైనా అనటం అంటే అది తెలుపును నలుపుగా చిత్రించడమే.

మరో ముఖ్యవిషయాన్ని స్పష్టం చేయడం ఈ సందర్భంలో అవసరం. రాష్ట్రాలలోని కాంగ్రెస్ మంత్రాంగాలను హిందూ మంత్రులుగా ఆరోపించినట్లే హిందూ సభాతత్వంలోని హిందువులు, ముస్లిం మంత్రులను, వాళ్ల అధికారంలోవున్న రాష్ట్రాలలో హిందూ సోదరులపై ఇష్టంవచ్చినట్లు ప్రవర్తిస్తున్నారని అంటున్నారు. ఈ ఆరోపణలలోగల నిజానిజాలను ఋజువు చేసుకోవలసి వుంటుంది.

రెండు విరుద్ధ కొంపులుగా వున్నట్లు భావించడానికి అలవాటుపడిన నేటి రాజకీయ పరిస్థితుల అనివార్య ప్రభావంవలన రెండువైపుల ఆరోపణలు, ప్రతి ఆరోపణలలో కొంత యథార్థంవుంటే వుండవచ్చును. ఈ వైరుధ్యం ఇలానే కొనసాగడం అధికారంలోనున్న వారికి, వారు

హిందువులు, ముస్లిములు లేక ఐరోపీయులు ఎవరికైనా ఒక కీలక అవ కాశంగా యిది ఉపయోగపడుతుంది.

ఈ రెండు జాతులమధ్యనేగాక, జాతి, మత, ఉపజాతులమధ్య మానవత్వం పునరుద్ధరించడం పైననే విజ్ఞతగల నాయకత్వ ప్రతిభ ఆధార పడి వుంటుంది. విభిన్న ఉపజాతులు మన గ్రామాల్లో, పట్టణాలలో కలిసి మెలిసి ప్రజాస్వామిక వాదులుగా ప్రక్క-ప్రక్కనే జీవించేటట్లు చేయడా నికి చైతన్య కృషి అవసరమవుతుంది.

హిందువులు ముస్లిములను, ముస్లిములు హిందువులను చూచే దానికంటే నేడు బ్రాహ్మణ మైనారిటీలను బ్రాహ్మణేతరులు మరీ విపక్ష ణగా చూడటం జరుగుతున్నదేమో నాకంతగా తెలియదు. ఆ కారణంతో బ్రాహ్మణులు పాకిస్తాన్‌ను కోరగూడదు. మన తగాదా ఏమైనావుంటే దాన్ని కూర్చొని సామరస్య పూర్వకంగా పరిష్కరించు చేసుకోవలసి వుంటుంది. దీనినే మర్యాదగానేగాక గట్టిగా బ్రిటిష్‌వాళ్ళ మీతో చెప్పింది మరొక శతాబ్దంకాలం బ్రతికివున్నప్పటికీ మీరీ పద్ధతినుంచి తప్పుకో జాలరు. అలాకాక ప్రస్తుతం మీరు అవలంబిస్తున్న వైఖరికే అంటిపెట్టు కొని వున్నట్లయితే, హిందూ, ముస్లిములకు ఉభయులకు అపార నష్టా లను కలిగించినవారవుతారు. మీతోటి సంబంధాలలో అహింసకు దీక్ష బూనిన అధికసంఖ్యాకుల సానుభూతిని సైతం మీరు సాగించే బేరసారా లలో కోల్పోయినవారవుతారు.

హిందూ ఇండియాలోగాని, ముస్లిం ఇండియాలోగాని లేక హిందూ ముస్లిం భారతదేశంలోగాని ప్రభుత్వపాలనా విధానం 'ప్రజాస్వామికం' అని అంగీకరించడానికి మీరు తిరస్కరించినట్లయితే, మీతో ఏకీభవించే అంశంలేదు.

సత్యాహింసలతో గూడిన భారతదేశాన్ని నాతోపాటు మీరూ అంగీక రించినట్లయితే ప్రజాస్వామ్యం వినా మరో మార్గాన్ని మీరు ఎంచుకోలేరు. ప్రపంచంముందు నేడు రెండే విధాల ప్రభుత్వాలున్నవి. ప్రజా

స్వామ్యం ఎంత అపరిపక్వంగా బ్రిటన్, మెక్సికోలచేత ప్రాతినిధ్యం వహి స్తున్నా అది ప్రజాస్వామికమే. ప్రపంచంలోని ముస్లింరాజ్యాలన్నీ ప్రజా స్వామికంలోనే ఉన్నాయని ఇస్లాం ప్రత్యేక సందేశంగా మీరు ప్రజాస్వామి కమునే వరించవలసివుంటుంది.

ఇలాంటి ప్రజాస్వామికం ప్రపంచంవైపు హిందువులను, ముస్లిము లను నడపడానికి శక్తి,అధికారం ఉన్నా లేకున్నా, మానవుడిని తన సోదర మానవుడితో సమాన భాగస్వామిగా ఆరోగ్యకరమైన సుఖశాంతులతో నిండిన సమాజంవైపు పురోగమింప జేయడానికి ప్రయత్నిద్దాం.

అభివృద్ధి చెందుతున్న ప్రజాస్వామిక ప్రపంచంలో ఈ సమస్య లనుగూర్చి మిమ్మలను ఆలోచింపచేయడానికి, ఈ లేఖ ఏ మాత్రమైనా మీమీద ప్రభావం కలుగజేస్తే నేనెంతో సంతోషిస్తాను.

భవదీయుడు,

జి. హరిసర్వోత్తమరావు